- డా॥ అంబడిపూడి నాగభూషణం



# బాల వ్యాకరణ సూక్తులు

MOHAN PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in



మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533 101.

# బాలవ్యాకరణసూక్తులు



అను

# బాలవ్యాకరణసముద్ద్యోతము

(బాలవ్యాకరణోద్ద్యోతసంజీవనీవిషయానుశీలనము)

## ద్వితీయ భాగము

డాక్టర్ అంబడిపూడి
నాగభూషణం

## బాలవ్యాకరణసూత్రములు



అను

# బాలవ్యాకరణసముద్ద్యోతము

(బాలవ్యాకరణోద్ద్యోతసంజీవనీవిషయానుశీలనము)

ద్వితీయభాగము

## తత్సమాచ్ఛికకారకపరిచ్ఛేదములు

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

# బాలవ్యాకరణసూక్తులు



— ద్వితీయభాగము

ప్రతులు : 1000

ప్రచురణ : మార్చి 1988

ప్రకాశకురాలు : అంబడిపూడి లక్ష్మీదేవి

మూల్యము : రూ. 58/-

మూడుభాగముల 'బాలవ్యాకరణసూక్తులు'
ముద్రణకు తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదువారిచే
రూ॥ 5,000/-ల ఆర్థిక సహాయ మందింపబడినది.

**డాక్టర్ అంబడిపూడి నాగభూషణం**
డాక్టర్ కె.వి.కె. సంస్కృత కళాశాల,
3/3, అరండల్ పేట,
గుంటూరు-2.

ముద్రణ :
శ్రీ లక్ష్మీమల్లికార్జునప్రెస్-లాలాపేట
ప్రింట్ వెల్ ప్రింటర్స్-కొరిటపాడు
గుంటూరు.



బావ : కవుతా ఆంజనేయమూర్తి    సోదరి : భ్రమరాంబ

పరులపల్కులఁ బొరపాటు వెన్నక పర
　　సమ్మ్రగా వర్తించు సహనగరిమ
పిన్నల పెద్దల మన్నన ల్వాదసిన
　　మనసు నొప్పించని మాటతీరు
సహకారమున కన్న సామర్థ్యమున మున్న
　　పొంగారు సౌహార్ద మురుతరమ్ము
బాంధవ్యమును మించి ప్రాణమిత్ర మనంగ
　　సాన్నిహిత్యముఁ బెంచు స్వచ్ఛశీల

మలరు బావకుఁ గవృతాన్వయ గణ్యున
కాంజనేయ మూర్తి కమలపతికి
సోదరి భ్రమరాంబ కాదృతిఁ జిఱుఁగాన్క
యగుచు గ్రంథ మిద్ది యలరుఁ గాత.

# కృతజ్ఞతలు



**జననీజనకు లాదిలక్ష్మీప్రసాదులకుఁ బాదాభివందనములు.**

లక్షణాక్షర భిక్ష పెట్టియాదరముతో నన్ను విద్యయందుఁ బ్రోత్సహించుచున్న మాగురువర్యులు, పూజ్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మంగారికి సదా కృతజ్ఞుఁడను.

ఇం దుదహరింపఁబడిన, ఉద్ధరింపఁబడకయు నాధారము లైనయాయాగ్రంథములకర్తలకును.

ప్రథమముద్రణముగా నాదరమునకుఁ బాత్ర మైనయీగ్రంథమిన్నాళ్లకేని మూఁడుభాగములుగా ముద్రించుటకుఁ బూనుకొనఁజేయునయిదువేలరూపాయలయార్థికసహాయ మందించినతెలుఁగువిశ్వవిద్యాలయమునకును.

ప్రూఫ్లు దిద్దుట, కొన్ని సందేహములు తీర్చుట మొద లైనవానింట సహకరించినగురువులు గురుతుల్యులు, శ్రీ బి.యస్.జి. వరప్రసాద్, డాక్టర్ కె. డి. యస్. శాస్త్రిప్రభృతు లగు డా॥కె.వి.కె. సంస్కృతకళాశాలాధ్యాపకులకును

గృతజ్ఞుఁడను.

ముద్రణమునలో మనసునం దే విసుగు విరామ మని తలఁపక తమపనిగాఁ దిరిగినమావిద్యార్థిమిత్రులు చిరంజీవులు వాలగుల్ల శ్రీనివాసరెడ్డి, పర్వం రఘురాములు, ధనకుధరం శ్రీనివాసాచార్యులు మిత్రులు శ్రీ కొండూరిసుబ్బరామయ్యప్రభృతులందఱుకృషి మఱువరానిది.

సమయానుకూలముగా నీభాగమును ముద్రించిన శ్రీ లక్ష్మీమల్లికార్జునప్రెస్ **అధినేత** శ్రీ కోటేశ్వరరావుగారికి, ప్రింట్ వెల్ ప్రింటర్స్ **అధినేత** మిత్రుఁడు సాంబశివరావుకు **అభినందనలు.**

**అంబడిపూడి నాగభూషణం**

# ముఖ్యసంకేతవివరణము



| | | |
|---|---|---|
| ఉ. | — | బాలవ్యాకరణోద్ద్యోతము |
| ఔ.వ. | — | ఔపవిభక్తికము |
| గు.ప్ర. | — | బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక, కల్లూరివేంకటరమణశాస్త్రి |
| ఛం. | — | ఛందోదర్పణము-అనంతుఁడు |
| తె.వ్యా. | — | తెలుఁగువ్యాకరణము-రావిపాటిగురుమూర్తిశాస్త్రి |
| త్రి.శే. | — | త్రిలింగలక్షణశేషము (ప్రస్తుతగ్రంథకర్తసిద్ధాంతవ్యాసము) |
| ధా.వి. | — | ధాతుజవిశేషణము |
| ప్రౌఢ. | — | ప్రౌఢవ్యాకరణము |
| బాల.(బా.) | — | బాలవ్యాకరణము |
| బా.వి.వి. | — | బాలవ్యాకరణవికాసవివేచనము |
| బా.సా.పే. | — | బాలవ్యాకరణసారస్యసర్వస్వపేటిక విద్వాన్ దూవిరామమూర్తిశాస్త్రి |
| బా.సూ. | — | బాలవ్యాకరణసూక్తులు |
| రమ. | — | రమణీయము-పువ్వూరివేంకటరమణశాస్త్రి |
| వ్యా.సం.స. | — | ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వము |
| శ.ర. | — | శబ్దరత్నాకరము-బహుజనపల్లి సీతారామాచార్యులు |
| సం. | — | సంజీవని(బాల.వ్యాఖ్య.వ్యా.సం.స.) |
| సూత్ర. | — | సూత్రాంధ్రవ్యాకరణము-చిన్నయసూరి |
| సూ.ని. | — | సూర్యరాయాంధ్రనిఘంటువు |

**మఱికొన్నింటికి చూ. బా.సూ. ప్రథమ తృతీయ**

# బాలవ్యాకరణసూక్తులు



ద్వితీయభాగము

## విషయసూచిక

సూ. 87 మొదలుకొని 105 వఱకు ఉద్ద్యోతమున సంస్కృత స్త్రీలింగప్రత్యయ
ములను వదలినవి,

సూ.25 నుండి 42 సూత్రములు బాల.ప్రకీర్ణపరిచ్ఛేదము లందలివి. 45 సూత్రము కవిశి. వివరణమునుండి గ్రహించి వీరు చెప్పిరి. మిగిలిన 43 నుండి 49 వరకు త్రిలింగలక్షణశేషలక్షణములు. 50 మొదలుగా నాయని సూరి యీ సూత్రవివరణమునకై సూత్రసంఖ్య తెచ్చిరి. అవి గ్రంథమున గుర్తింపఁదగు.

+సూ.34—=క్రి.123,124, +సూ.7.ప్రౌఢ.కార.4.

# బాలవ్యాకరణసూత్రములు

## ద్వితీయ భాగము

## తత్సమపరిచ్ఛేదము

### విభక్తులు :

"డుముపులు ప్రథమ" మొన్నగు సూరిసూత్రములకుఁ బదలు విభక్తి యను పదము చేర్చుట విశేషముగా వఝలవా రుద్ద్యోతమున (మొదటిపేజు) సూత్రములు రచించిరి.

షష్ఠిలో "కు యొక్క ది వి లోపల షష్ఠీవిభక్తి" యని ది వి యనువాని నధికముగాఁ జేర్చిరి. అందలియనౌచిత్యము తద్విధానస్థలమున గమనింపఁగలము.

"వలనకు వల్ల అనియు కంటె అనుదానికి కన్న అనియు సర్వాధీనము లగురూపాంతరము" (ఉ. 95) లనిరి. వలన - వల్న - వల్ల అనురీతిగా నిది యేర్పడియుండు ననుట యుక్తమే కాని కంటె అనుదానినుండి కన్న అనునది సాధింపఁబడుట క్లిష్టము. పైని వీరు విభక్త్యర్థాభిధాయకశబ్దములు పేర్కొనుచున్నారు కావున (వల్న అనుదానికిఁ బ్రయోగమును లేదు గావునను) వల్ల, కన్న అనునవి పంచమీవిభక్త్యర్థాభిధాయకశబ్దము లని చెప్పఁదగును.

వీరు విభక్త్యర్థాభిధాయకశబ్దముల నిట్లు నిరూపించిరి.

"మయిని, మెయిని, మైని - అనునవి చేతార్థకములుగాను. తదర్థము, నిమిత్తము, పొంటెను, కోసరము, కోసము, కునయి, కుఁగాను అనునవి కొఱకు

విభక్త్యర్థకములుగను లోను అనునది సప్తమ్యర్థకముగను మహాకవిప్రయుక్తములు గాన నిట్టివి విభక్త్యర్థాభిధాయకశబ్దములు. భక్తిమెయిన్ - భక్తితో, భక్తిచేత నీతదర్థము, నీనిమిత్తము (నీకొఱకు) గృహములోన్ = గృహమందు" (ఉ-96) మయిని-మైని అని రెంటిని ప్రత్యేకముగాఁ జూపుట యనవసరము. "అచ్ఛికంబులం దయియవులకు (క్రియా. 103) ననుసూత్రముచే అయికి వక్రతమము (ఐ) రాఁగా మయి అనుదానినుండియే మై అనునది సాధింపఁబడును గదా. కావున "మై" యను నది యిచ్చట "మయి" యనుదానికి రూపాంతరమే కాని వేఱు గాదు.

కానీ యసలు "మయి" అనునది గల దనుటయే యథార్థముగాఁ గానరాదు. (కావున మై చెప్పవలె) శ. ర. కావి, సూ. వి కాని మయి తృతీయార్థకముగాఁ జెప్పలేదు. పీ రైన నట్టిదానికిఁ బ్రయోగమును జూపలేరు. కావునఁ బ్రౌఢ. చెప్పినట్లుగను, లక్ష్యానుగుణముగను మెయి, మై అనునవె యిటఁ జూపఁబడినవి.

వరుసలవా రివి చేతార్థకము లనుటలో విశేషము గలదు. "మెయి - మయి - మై అనునవి తృతీయార్థమున వాడఁబడును. ప్రీతిమెయిన్ - ప్రీతిచేత, ప్రీతితో. జడపదంబులతోడకు మెయి మైలు వికల్పంబుగ నగు (శబ్ద. 18) అని త్రిలింగ లక్షణశేషమున నుపదేశింపఁబడెను. కాని పై రీతి గలప్రయోగములనుబట్టి చేతవర్ణకార్థములందును నవి వచ్చు నని విశద మగుచున్నది. కేవలసహార్థమున వీనికిఁ బ్రయోగము కన్పట్టదు. ప్రీతితోఁ గూడి - ప్రీతిమెయిన్ గూడి అవి వచింపరాదు." (వ్యా. సం. స. 448) సహార్థమునందు మాత్రమే కాదు. తుల్యార్థ యోగమునందలితోడకును మెయి, మైలు గానరావు. ప్రీతిమెయిం గూడి యని యుండనట్లై గోడ పర్వతము మెయిం దుల్యముగా నున్నత" మనియు నుండనేరదు.

కాని యిట్టిభేదములనుబట్టి యివి తోడార్థకము లనరా దనియు (అట్లు ప్రౌఢవ్యాకర్త చెప్పుట పొరపా టనియు) చెప్పుచోఁ జేతార్థక మనుటయు సరిగాఁ గుదురదు. గోరిచేత గీఱ నసురీతిగా నుండదు. ఇట్లై విద్యచేత యశంబు గల్గు

నని యుండుట  [illegible] ములందు [illegible] (వ్యాకరణము చేతఁ ద్రోయఁబడెను) మెయి మైని కానేరవు. అట్టియెడల నీయని చేతార్థకము లనుటయు సమంజసము గానేరదనవలయును.

కాఁగాఁ గరణార్థమందు వచ్చునవే చేతకే కొన్నియెడల మెయిమై లవు నన దగు. ఆయర్థమునఁ జేతతోడను రెండు నగును అరిచేతఁ జనుదెంచి యనువాని కంటె అరితోడఁ జనుదెంచి యనుటీతివ్యవహారమే ప్రచుర మనునుద్దేశ్యముతోఁ బ్రౌఢ. తోడకుఁ జెప్పియుండెనేమో. కాని యటఁ జేతయుఁ గలదు గానఁ జేతార్థక మనుట దోషము గాదు గాని తోడార్థక మనుటవలన నిబ్బంది యని చేతార్థక మన్నచో మాత్ర మాపత్తమును నిబ్బంది తప్పదు. కోలతోడఁ గూల నేసె నని కానరాదు. కావున సామాన్యముగా వికల్పముగా వచ్చు నని చెప్పిన ప్రౌఢ లక్షణము సమంజసముగా గుర్తింప వీలు లేదు. కావునఁ గొన్నియెడలఁ దృతీయార్థక మనుట యుచిత మనఁదగును.

ఇంకను, దదర్థము, నిమిత్తము నన్నవి ప్రయోజన మనురీతియర్థము లందుఁ బృథక్పదములుగాఁ బ్రసిద్ధములు. మిగిలినవల్లకన్నప్రభృతు లగు విభక్త్యర్థాభిధాయకశబ్దము లేవియును బదములు గావు కావునఁ దదర్థము, నిమిత్తము అనుపదములను విభక్త్యర్థాభిధాయకశబ్దములుగా నపదములుగాఁ జెప్పుట సమంజసము గాదని గుర్తింపఁదగును.

పొంటె ననునది చతుర్థీప్రత్యయముగాఁ బ్రౌఢ. "చతుర్థికిం బొంటెనర్థకంబు నగు" (కార. 4) నని విధించినది. సూరి బాల. లోఁ జెప్పలేదు విభక్తిగా నింతకు ముందు చెప్పఁబడియుండగా వీరు విభక్త్యర్థాభిధాయకశబ్దముగాఁ జెప్పుట విశేషము. కొఱకు ప్రత్యయ మగు నెల్లయెడలఁ బొంటె కానరాదు. (శ్రీ.శే)

కోసరము, కోస మనునవి యాధునికము లగుట స్పష్టము. మానుతకోసమే గమక (ఉ. రా. 8) ముక్తికోసరము (సూ. ని) ఇవి యాధునికము లనియే

ప్రౌఢవ్యాకర్త యుపేక్షించె నేమో. అయ్యకోసము ఇతి చతుర్థ్యర్థాభిధాయకో దేశ్యశబ్దః (శ.ర. 373) అని యహో. పేర్కొనియె యున్నాఁడు. అంగీకరింప వచ్చును.

వీనియెడ నొకవిశేషము గలదు. (చేత లేదా తోడ కగు నన్నను) తృతీయార్థమునం దగు మెయి, పైని చేతతోడలవలె ద్రుతాంతములు. పయులవారు మెయిని, పైని అని చూపినతుదినివర్ణము నుగాగమప్రయుతమె. కాని చతుర్థ్యర్థమునఁ గన్పించు కోసరము, కోసము అనునవి ద్రుతాంతములు గావు. కొఱకు - కయి సమానార్థకములె. తోడకు మెయి, పైఁ జెప్పిన పద్ధతినిబట్టి కయికి కోసము, కోసరము నన్నవి యగు నని తలఁపవచ్చును. కాని యిట్టి మిక్కిలి యరు దగు స్థలములనుబట్టి లక్షణము సామాన్యముగాఁ జెప్పుట యనవసరము గా దనిపించు. విశేషస్థలములుగనె గుర్తింపఁదగు.

ఇంక కునయి, కుఁగాను అనువానిని కొఱకర్థకములుగాఁ జూపుట సరి కాదు. ఇందు "కున్" షష్ఠీవిభక్తి. అయి (అగుధాతుప్త్వార్థకరూపము) కాను (అగుధాతువునఙ్యంతరూపము) అనునవి ప్రత్యేకపదములు. అట్లన్వయింపుటలోఁ గూడ నెట్టి యవరోధమును లేదు. నీకునయి - నీకుఁగాను = నీకు నగు నట్లుగా నని యర్థము గుదురుచునె యున్నది కయి యనునదియుఁ గొన్నియెడల నిట్లు సమన్వయింపవలసియే యున్నది. "అనఘ మామామ శకుని నాకై కడంగి" యనుచో కున్ + అయి = కయి కై, కునయి, కునై అనురీతిని ప్రయుక్తమయి స్వరయతి నందియున్నది. కువిభక్తిమీఁద నయి యని చెప్పుటకు నిదియే కాక యిట్టిచోఁ బ్రాతిపదికపైఁ గొన్నియెడల నగాగమము కన్పించుట కూడ నాధారముగాఁ జెప్పవచ్చును హేతువునకై శోధించి (భాగ. 1-75) పరిగ్రహించు సకునై (భాగ. 3-298) వేటకై వనంబునకై (భాగ. 9-287) ఇట్టిచోట్ల ననఁగా నగాగమము గలచోట్ల "కు" విభక్తి యనియు లేనిచో కునై యనువిభక్త్యర్థాభిధాయకశబ్ద మనియు పయులవారు చెప్పుదురు గాఁబోలును.

ఇది విభక్త్యర్థాభిధాయక మగునో మత్స్యాతికిన్ (భాగ. 3-330) అనురీతి స్థలములనుబట్టి కిన్ విభక్త్యర్థాభిధాయకము కాదా?

ఇం తేల? నాకొఱకునయి వర్తింప నేకృతులను (హర. 4-48) అస్మదీయ దేహంబుకొఱకున్ (భాగ. 6-348) మదాలసకొఱకై (కువ. 4-72) మొదలగు వానింబట్టి కొఱకయి, కొఱకై) కొఱకున్ ము న్నగునవి మఱలఁ బ్రత్యేకముగా విభక్త్యర్థాభిధాయకము లనవలయునా? ఇట "నయి" పదముతో సమన్వయము తప్పదు. కు విభక్తిపయి నట్లు సమన్వయింప కయి, కై, కునయి, కునై, కిన్ ము న్నగు రూపము లేర్పడును. చతుర్థ్యర్థమునఁ బ్రచురప్రయుక్త మపుట ము న్నగుకారణములనుబట్టి కయి, కై యనునవి ప్రత్యయములుగాఁ బెం. ప్రకృతులచేఁ జేర్కొనఁబడియుండుట కై విభక్తిగా నుదాహరణప్రబంధాదులలోఁ బ్రయుక్తమయియున్నది గదా. కానీ యంతమాత్రమున కునయి, కుఁగాను అనునవి చతుర్థ్యర్థకములుగాఁ జెప్పరాదు. అట్లే చెప్పచో వానికినయి, వానికిఁగాను అనుతీరుగా కినయి, కిఁగాను అన్నవి విడుచు టెట్లు గుదురును? వానిని వీరు చేర్కొనకుండుట యుక్తమా? ఇంక కునయి, కినయి, కుఁగాను, కిఁగాను అనురీతివి షష్ఠీకువిభక్తిపై అయి, కాను అనుపదములచేరికచే నేర్పడినవిగా నన్వయానుగుణముగను గుర్తింపఁదగును. కుషష్ఠి చతుర్థ్యర్థమునఁ దఱచుగాఁ గన్పట్టుచుండుట స్పష్టమె. (కార. 8) కావున నివి (కునయి మొ॥) కొఱకర్థమున నుండుటలో విశేషము ప్రత్యేకముగా లేదు.

"లోన" అన్నది సప్తమీవిభక్త్యర్థాభిధాయకశబ్దముగా వజ్ఝలవారు పేర్కొనిరి. "లోన లోపల శబ్దములు సప్తమ్యర్థకములు. వనములోనన్ - వనమునందు, వనములోపలన్ - వనమునందు పుట్టలో - మనసంబులో" (వ్యా. సం. స. 449) నని లోపల నన్నది గూడ విభక్త్యర్థాభిధాయకముగాఁ జెప్పిరి. కాని యిట వీరు చూపిన లోను, లోపల అను శబ్దములు లోపల యనునర్థము నిచ్చు స్వతంత్రశబ్దములు (పదములు). లోనికిఁ బోయె - లోపలికి వెళ్ళి, అందుకే వీరు వనములోనన్ అని యేకవిభక్తిక మగులోనుశబ్దమునకు సప్తమ్యత్వము

తోడిరూపమును జూపవలసివచ్చినది. మఱి "లో(ఁ)" అనునది సప్తమ్యర్థ మనుట యెట్లు? లోను సహజముగా సప్తమ్యర్థక మయినప్పుడు దానిపై సప్తమియు దాని కత్వమును విచ్చుట యెట్లు? కాక దీనినుంచి లోనన్ అనునది యేర్పడు టెట్లు? విభక్త్యర్థాభిధాయకశబ్దముపై విభక్తి చేరుట మ జెప్పుటను లేదే. (విభక్త్యర్థాభిధాయకము లెల్ల నపదములే.) షష్ఠిలో, మనసంబులో అనువానింబట్టి లోను, విభక్త్యర్థాభిధాయకమందలినువర్ణము ద్రుతము (కావుననే లోపించి షష్ఠిలో - అనురీతి నైనది) నని చెప్పుట వీరి మతమా? అయిన లోను, అనుదానితోపాటు దాని నుండి సాధింపరాని లోనను అనునదియుఁ బ్రత్యేకముగా సప్తమ్యర్థకముగాఁ జెప్పవలెను.

లోను, లోనను, లోపలను అనువానిలో లోను లోపలను అనునవి విభక్త్యర్థాభిధాయకములుగాఁ జెప్పనవసరము లేదు. షష్ఠిలో లోపల (ను) ప్రత్యయము గలదు. ఇది యధికరణార్థమునం దగు నని చెప్పనగునె కదా: నిర్ధారణమున లోపలకు బదులుగా సప్తమి యగుట కలదు. పయిరీతిని సప్తమ్యర్థమున లోపల కలదు. కావునఁ దెలుఁగున "లోపల" యనునది సప్తమివిభక్తిగానే చెప్పి నిర్ధారణమునందును (అధికరణమందును) సప్తమియే చెప్పఁదగు నను (ప్రౌఢ. తత్స. 215) నభిప్రాయమునను దోషము గానరాదు. లోపల నిర్ధారణమునఁ దప్ప వే ఱొక షష్ఠ్యర్థమున లేదు.

కావున సంస్కృతానుసారముగా నిర్ధారణమున షష్ఠియు, దానికి లోపలను జెప్పినప్పటికిని నది (లోపల)యధికరణార్థమునందు నగు నని చెప్పుట యుచితము. "లోపల" యే యాద్యక్షరశేష మయి (తత్స-10)లో అని కాఁగా నుగాగమముతో (తత్స-8) లోను అనురూప మధికరణార్థమునను సిద్ధ మగును. ఇపుడిం దాగమ నువర్ణము ద్రుత మగుటయు నుచితముగా సిద్ధించును. కా కున్న వల్ల, కన్న అనువానివలె దీనిని వీరు "లో" అని మాత్రమె చూపవలసియుండును. లోను అను పదము నుద్దేశించిన (వ్యా. సం, స. 409) నట శబ్దగతనకారము ద్రుత మనవలసి

యుండుటయే కాక యది యవసరమును. పంచమిలో వల్లను, కంటెను అని వీరు చూపలేదు గదా.

లోపల విభక్త్యర్థమున "లోన" అనునది నయిశము గలదు. వజ్ఝలవారును దీనిని గుర్తించిరి. వ్యా. సం. వ. లో లోపల, లోను, వీని యావద్విభక్తిరూపములు "లోపలన్, లోనన్." (449) అనిరి. చరిత్రనిరూపణము బాగుగ నున్నది. కాని యిందు లోపలవ్ అనునది షష్ఠీవిభక్తిగాఁ చేర్కొనఁబడినది. షష్ఠీప్రత్యయ మిది లోపల యనుశబ్దముయొక్క సప్తమ్యంతరూప మనరాదు. "లోనన్" అనునది ప్రత్యయముగాఁ జెప్పఁబడలేదు గదా. విభక్త్యర్థాభిధాయక శబ్దముగ నేని బరిగణింపవలదా? సప్తమ్యంతపదముగనె యుంచిన సమాసములుగాఁ జెప్పవలసివచ్చును. వనముయొక్క లోను = వనములోను - అందు- వనము లోనన్. కాని యిట్టి సమన్వయ మెల్లెడలఁ గుదురదు. ఇట వనమునను వనమం దన నే మర్థమో వనములో నన్నను నదియే యర్థము. మనుష్యులలోన క్షత్రియుండు శూరుం డనురీతిగా లోపల విభక్త్యర్థమున లోన నుపయోగించుట తప్పు గాదు గదా. కవిప్రయోగములం దధికరణార్థకము మాత్రమె యగుచు లోన అనునది పదముగా సమన్వయింపరాకుండుటయు గమనింపఁదగి యున్నది. వింధ్యములోన మను డించి (దశ. 6-3) భూమిలోనఁ దడవుచు (నిర్వ. 10-70) ఇట్టి చోట్ల నధికరణార్థకము మాత్రమె యగుట గమనింపవచ్చును. ఇట్లే ఉర్వీశుల లోనం బ్రసిద్ధు లిద్దఱు (హరి. ఉ. 5-71) ఉత్తమసంతతిలోనఁ బుష్పవంతములు మేలు (అను. 4-6) మొద లగుచోట్ల నిర్ధారణమునందు లోన నున్నది. ఇట్టిచోట్ల నిది పదముగా సమన్వయించుట యుచితము గాదు గదా.

వీనింబట్టి లోన విభక్త్యర్థాభిధాయక శబ్దముగాఁ జెప్పవలసియుండఁగా వజ్ఝలవా రేల చెప్పలేదో ప్రౌఢ. పద్ధతిలో తోడకు మెయిమైయు చెప్పినవిధముగా, లోపలకు "లోన"ను విధించి, లోపల నిర్ధారణాధికరణార్థములం దగుటను గుర్తింప దగును.

బాల(ప్రౌఢవ్యాకర్తలు విభక్త్యర్థాభిధాయకత్వము ననుమార్గము ననుసరింపలేదు. "ప్రౌఢవ్యాకర్త యట్టివానిని ద్వితీయావిభక్తుల కాదేశముగాఁ జెప్పి తద్విభక్త్యంతతను సాధించెను. ఈ మార్గ మ్ముచితముగాఁ దోఁచుచున్నది.

ప్రౌఢ. కంటె వీరు పల్లాదులు కొన్ని విశేషముగాఁ జెప్పిరి. అవి గ్రాహ్యములగుట నిర్వివాదము. అట్టియంశమును వివరణమునఁ గాక విధానముతో నిరూపించిన బాగుండెడి దనిపించును.

## ద్వితీయా - నుగాగమము

తృతీయాదులకు నుగాగమం బగు (8) అను సూరి సూత్రమును వీరు "ద్వితీయాదులకు నుగాగమం బగు" నని సవరించిరి. ద్వితీయకుఁ గూడ నుగాగమము చెప్పుట వీరిలక్షణమున మార్పు. దీనింగూర్చి సూరి ద్వితీయావిభక్తికి నుగాగమము విధింపలేదు. కాఁగా సీతని పక్షమున ఖాంగాసరినిన్, అనుకీర్తి గల రూపములు సిద్ధింపనేర" (● 86) వనిరి. ఇట్టిరూపములు మిక్కిలియరుదగుట గుర్తింపఁదగియున్నది. వానికై సాధారణముగ నుగాగమము చెప్పిన చిక్కులు మాత్రమె కల్గును.

ఇట్టివానింగూర్చి వ్యా. సం. వ. లో సూరి నుగాగమమును తృతీయాదులకు విధించుటచే ద్వితీయకు రామి, సత్యవతిన్, ఖాంగాసరినిన్, నన్నును గాఁగిలించు కొని, అనురూపములు బాలవ్యాకరణపక్షమున సంగ్రహింపఁబడఁజాల కున్న వనుచు వజ్ఝలవారు "బాల. సంధి 21 సూత్రము చొప్పున నిరర్థకద్రుతము చేసినం గాని పైరూపములు సిద్ధింపనేర (456) వనిరి. ఎట్లైన బాలవ్యాకరణముచే నిట్టి రూపములు సాధ్యములగుచుండఁగా సంగ్రహింపఁబడజాల వనుట యేల? బాల. సంధి 21. సూత్రముచే నగుద్రుతము నిరర్థకమె. సత్యవతినిన్ అనుచోఁ జొల్లనకారమునకుఁ గల [సూరి సాధింపని] యర్థవిశేషమేదియో నిరూపించిన బాగుండెడిది. మఱి వీరిలక్షణ మాద్రుతమును విశేషార్థకముగాఁ జెప్పుచున్నదా?

"ని" ద్వితీయకు నుగాగమ (ద్రుత) మైన దందురు వీరు ద్వితీయ కయినను కృ-ద్వితీయకంటె విశేష మగు నేయర్థము నిచ్చుచున్నది. సూరి ద్రుతము (ద్వితీయ) పై నకారమును జెప్పె నందువలన నేర్పడిన నష్ట మేమి?

ఇట్టిరూపములు చిం. చే సులభసాధ్యము లగుచున్న వని [సూరి లక్షణముచేఁ గష్టసాధ్యము లని] వీరియుద్దేశ్యము. కాని యట మాత్ర మివి కేవలము ద్వితీయాంతములుగా సిద్ధించుచున్నవా?

"నన్నను గౌఁగిలించుకొని" అనుచోట "నన్నునన్" అనుశబ్ద మున్న దనుట పొరపాటు. ఇట వీరే "ఇందలిను అనునది నన్నున్ అనుదానిస్వత్వ రూప మనరాదు. నన్నయమతమున నుస్వరూపస్వత్వమే లేదు. కాన "నన్నునన్" అనియే నన్నయ పక్షమునఁ బదచ్ఛేదము చేయవలెను" [వ్యా. సం. స. 460] దనిరి. నన్నయపక్షమున నుస్వరూపస్వత్వము లేకున్న నందుకై యతఁడు ద్వితీయకు నుగాగమము చెప్పుకొనుఁగాక. సూరిమతమున నుస్వరూపస్వత్వము గలదు గదా. సూరిమతమున నది యట్లు సిద్ధించుచుండఁగా ద్వితీయకు నుగాగమము చెప్పుమనవలసినష్ట మేమి? దీని నిటఁ బ్రస్తావింపరాదు. ఉద్యోతమున నెట్లయిన నిది పేర్కొనకుం టుచితమె.

చిం. మతమున నయినను వీరు వివరించినతీరు సరి కాదు. చిం. మతములో నుస్వరూపస్వత్వము లేదు గాన "నన్నునన్" అని యుంచినఁ బొల్లు నకారము [ద్రుతము] మీఁది పరుషము సరళ మయినది. ముందటిపొల్లునకార మేమైనది? గణభంగము గాకుండ ఖండబిందురూపమున నే నుండవలెఁ గదా. నన్నును అనుచోఁ దదినువర్ణముపై వీరు ఖండమును జూపలేదు, చూపవలె నని వారు తలంచినట్లును లేదు. అట్లైయైన నుస్వరూపస్వత్వము లే దని యిటఁ జెప్పుట యనవసరము. ఒకవేళ చిం. మతమున నుస్వరూపస్వత్వ మున్నను 'నన్నునుఁ గౌఁగిలించుకొని' యని నుస్వరూపముపై ఖండానుస్వార మున్నపుడు

కాఁగా వీరు ద్వితీయకు నుగాగమము చెప్పుట సరి కాదు. చిం.బాల.లు రెండింటిపద్ధతులను గలగాపుపుగను చేయుటచే నిర్దుష్టమార్గము లేర్పడిన దనవచ్చును. ద్వితీయయందు నిగాగమమును జెప్పుచిం.లో. ద్వితీయకు ద్రుతమాగమము చేయవలసివచ్చినది. కాని సూరి ద్వితీయయందు నిగాగమమును విధించెను. వీరు బాల. కనుగుణముగా నిగాగమమును చిం.కనుగుణముగా ద్రుతాగమమును జేసిరి. చిం. ద్వితీయైకవచనలోపము చెప్పినది. సూరియైనను వీరైనను దానిని జెప్పలేదు. అవర్ణము ద్వితీయాబహువచనముగా చిం. పేర్కొనగా సూరి నువర్ణముభయముగా నేకత్వబహుత్వముల రెంటఁ జెప్పెను. వీరు సూరి ననుసరించిరి. ఇట్లు ప్రత్యేక మగుసూరిప్రణాళికను గ్రహింపుచునే ద్వితీయకు ద్రుతాగమము చేయుచిం.మార్గము నిందుఁ గలుపుటచే వైరుధ్యము లేర్పడిన .

అనుహాత్స్థలమున చిం. నువర్ణముపై ద్రుతముతో వనమునన్ అనురీతి రూపములు సాధించిన దని తలఁచినటులో. "ప్రయోగాస్తు సర్వత్ర నువర్ణస్య లుక్యేవ బహవః శ్రూయన్తే (కవిశి.366)అని స్పష్టము చేసెను సూరి వనమును అని మాత్రమె సాధించుట లక్ష్యానుగుణము. ఎట నైన వనమునున్ అని కన్పించిన ద్రుతముమీఁద నకార మయిన(సంధి21) స్థలముగా నది గుర్తింపఁదగును.

మొత్తము మీఁద ద్వితీయకు నుగాగమము చెప్పుట యనర్థక మనియు, సూరి "తృతీయాదులకుఁ" జెప్పుట యెంతయు సమంజస మనియు స్పష్టము.

## ఏకవచనవ్యంజలు :

చేతతోడలోపలవర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు (10) ననుసూత్రము యథాతథముగా గ్రహించిరి. పిదప డుమువున లేకవచనంబు (11) లని సూరి చెప్పఁగా వరుల నారు "డుమువునది అనునవి యేకవచనంబులు" (౬.88) అని యించుక సవరించిరి. తమవిభక్తిప్రణాళిక ననుసరించి"డి" యనుదాని

నధికముగాఁ జెప్పిరి. ఇవుడు షష్ఠీప్రత్యయము లు గా వని యని స్పష్ట మగును గావున "ది" అను దాని యిందుఁ జెప్పనవసరము లేదు.

సూరిలక్షణమున "డుముపునలు" అనునవి సిద్ధద్వంద్వముగాఁ గాని లేదా యాచ్ఛికద్వంద్వముగాఁ గాని సిద్ధించును గాన డుముపున లేకవచనంబు లను సూరి సూత్రరచనలో దోషము లేదు. వఝులవారు "డుముపునవి అనునవి" యని చెప్పుట వ్యాఖ్యానప్రాయముగా సూత్రమును రచించుట యని గ్రహింపఁదగును ఇట్టి మార్పునుబట్టి సూరిసూత్రము దురుక్త మని భ్రమపడరాదు.

డుముపులు ప్రథమావిభక్తులు. వీరు "ది" షష్ఠీవిభక్తిగాఁ జెప్పిరి. నసప్తమి కావున "డుముపుదిన" అనుక్రమములో వీరు చెప్పిన నింకను బాగుండెని దనవచ్చును

## బహువచనము:

"లువర్ణంబు బహువచనంబు"(12)అనుసూరిసూత్రమును వీరు "లు = ల్-వి-లోపలవర్ణకంబులు బహువచనంబులు" అని సవరించిరి. సూరికంటె వీ రధికముగాఁ జూపిన ల్-వి-లోపలఅనునవి, ఇందు లు = ల్ అని చూపుటచే (ఇదియు సూత్ర మందే యుండుట మఱియు విశేషము ) ల్ అనునది లువర్ణమునందలియుత్వము లోపించుటచే నేర్పడిన దనియె భావింపవలెను. అట్టియపుడు దీనిని ప్రత్యేకముగాఁ జెప్పవలసినయావసర మేమి? లువర్ణమే గదా ల్ అని యైనది. చెప్పకున్నచో నుత్వలోపానంతరము "ల్" అనునది బహువచనము గాకుండఁబోవునా? లువర్ణము నుండియే యేర్పడురు-ర్ అనునవి యిందుఁ బేర్కొనఁబడలేదే. అవి బహువచనములు గావా? లు = ల్ అని పేర్కొన్నట్లే లోపం - లో అని మాత్ర మేల పేర్కొనలేదో?

కాఁగా "ల్" అనుదానిని వేఱుగాఁ జెప్పుట యనవసరము. ఉవర్ణము నుండి యేర్పడకుండ "ల్" అను బహువచన మొకటి తెలుఁగునఁ బ్రత్యేకముగా లేనేలేదు. ఉవర్ణ మేకవచనముగాఁ జెప్పిరి గదా. వనమ్ము, వనంబు అనుచో మ్ము, ంబు లేకవచనము లగుట వేఱుగాఁ జెప్పఁబడినదా?

ఇంక "వి" యనునది "ది" అనుదానివలెనే (షష్ఠీ) విభక్తియె కాదు గావున దాని నిటఁ జెప్ప నక్కఱ లేదు. (చూ. కార. 9)

ఇంక మిగిలినది లోపల. సూరి లోపలవర్ణకము బహువచనమాత్రబోధక మని పఠింపకుండుట వింత (ఉ-97) యని "రాములలోను" లోపల నిర్ధారణార్థకము. కాన నిది బహువచనమాత్రమె" (ఉ-96) యని చెప్పిరి. సూరి బహువచనమాత్ర మనకుండుట తప్పు కాదు. "తక్కినవి యుభయమునుంబు" (తత్స. 13) అను సూత్రముచే నీ "లోపల" యేకత్వబహుత్వములు రెంట నగు నని చెప్పినట్లు గుర్తింప వలసియున్నది.

నిర్ధారణమునం దయినమాత్రమున బహువచన మని చెప్పఁబడియునా? సముదాయవాచి యగుశబ్ద మేకవచనాంతము నగును. ప్రముక్కడిప్రజలో లేరు గావఁ దయోధుల్ (మౌస. 1 80) మునీశ్వర సంఘంబులో నెల్ల సత్యదర్శి (స్వర్గ 80) నృపాల కోటిలోన్ (దశ. 11.79) అమాత్యకోటిలోన్ (కేయూ. 1-39) మునికోటిలోపలఁ బ్రసిద్ధుఁడ నైతి (పంచ 2 260) మానవగంధర్వసమాజములో లెవ్వఁడయినఁ (భాగ-7-242) మున్నగుచోట్ల లోపల, లో విభక్తి లేకవచనముపై యనకతీఱదు. బహుత్వసంఖ్యను బోధించినంతమాత్రమున నిది బహువచన మగునా? అయిన, నద్దానికి లడాగమము రావలయునే. ఇట సముదాయవాచికి బహుత్వమున నేకవచన మయినది. మునీశ్వరసంఘములో నన నేకవచనాంతమె. బహుత్వార్థమం దయినది గాన నిది యేకవచన మయ్యు బహుత్వార్థమునే యిచ్చును. వీ రెవ్వరయ్య ద్రుపదమహారాజులె యనుచో ద్రుపదు లనేకు లుండిరా? బహువచన

ప్రత్యయము పూజ్యతాద్యర్థవిశిష్టమగు యేకత్వసంఖ్యనే బోధించుచున్నది. గదా క్షితియులలోపల సమకీత బహువచన మగుట ప్రసిద్ధము. కాఁగా దీని సముదాయముగాఁ జెప్పినసూరిమత మనుచితము. మఱియువారు సిద్ధాంతార్థక మగుటచేతనె సూరి తప్ప 10సూత్రమునొద్ద వచనములలో నని బహువచనము నుదాహరించె (వ్యా-సం-స-432) నని సూరి లోపల బహువచనముగాఁ దలఁచినట్లు చెప్పుట సరి కాదు బహువచనమమాత్రమె యని తలఁచి సుప్తంబు బహువచనం బనుచో "లోపల" చేర్చఁడా?

ఈలోపల (లో) అధికరణార్థమునందును గలదు. అప్పుడును వనములో, వనములోపల ననురీతిగా నేకత్వబహుత్వములు రెంట నగుచున్నది.

మొత్తముమీఁద లోపల (లో) ఉభయ మగుటచే దీనిని బహువచనముగాఁ జెప్పుట యసంగతము. కావున "సుప్తంబు బహువచనంబు" అనుసూరిలక్షణ మంతయు నసమంజస మని నిశ్చయింపఁదగును.

తక్కిన వి యుభయంబులు (13)ఓ యామంత్రణంబునం బగు(14)నను సూరిసూత్రములు యథాతథముగానెవీరు గ్రహించిరి. సంబోధ్యవాచకమునకుముందే ప్రయుక్త మవుటను సూరివచనానుగుణముగాఁ జేర్చిన "ఓశబ్దంబునకుఁ దర్వాత నితరశబ్ద వ్యవధానమును గలదు. ఉదా. ఓ వినువీధి నున్నఖచరోత్తములార!" యని (ప్రౌఢ. లక్షణమున కనుగుణముగా (శబ్ద.93) విశేషమును జేర్చినుట యుచితము గా నున్నది.

## ఓరిప్రభృతులు

"ఓశబ్దంబునకుం బురుషనీచస్త్రీపురుషామంత్రణంబులందు యుసిరివర్ణంబులు విభాష సంతాగమంబు లగు" (16) ఓరి యోసి మైత్రియందుం గలవు (16) అనుసూరిసూత్రములను యథాతథముగనె వీరు గ్రహించిరి, 15 సూత్రమున

యిసిరివర్ణంబు లనుచో వఝులవారి గ్రంథమున "వర్ణకంబులు" అని యుండుట యొకవిశేషము. కవర్ణ మధికముగా (వర్ణక) నుండుట యచ్చులోఁ బ్రమాద మని తలఁప వీలు లేకున్నది, అచ్చులోఁ గ్రొత్తగాఁ జేరవు గదా. సూరి వర్ణము లనియె చెప్పఁగా వీరు వర్ణకము లని (ప్రత్యయముగాఁ) చెప్పుటలో బ్రయోజన మెది యో నుద్దేశించినట్లు గానరాదు. ఉద్దేశించిన సూరివర్ణము లనుటలోనియనౌచిత్యమును బ్రకటించియే యుందురు గదా. వి.వి.వ్యాఖ్యలోఁ గూడ కసిప్రత్యయము లనలేదు (రిసి రిసిశబ్దములవినికి. వ్యా.సం.స.4౬౨) కాఁగా వఝులవారే ప్రమాదవశమున వర్ణకము లనియుండ నవలయును ఏ మయినను యిసిరి వర్ణము లన్న సూరి లక్షణమున నెట్టిదురుక్తియును లేదు.



ఇట విశేషముగా నిట్లు నొడివిరి, "బహువచనవిషయమునను ఓరి వాడఁబడును. ఓరోరి తొలంగిపొండు" (ఉ 9౩) ఓరి బహుత్వమునఁ గల దని యితఁడును. చెప్పిరి. "ఓరి యనెడుసంబోధన పేరునఁ బెక్కండ్ర నొకని బిలువఁగ నను వా నోరి జనులార యనఁగా నోరి జనుండా యనఁగ నుడుపతిమకుటా" (సర్వల.1.81) సూరియు నట ఓరీ దుష్టనిశాటులారా అని చూపియేయున్నాఁడు ఆయుదాహరణమును బైని సూరివచనములఁ జూపుదునే యిది క్రొత్త విషయ మన్నట్లుగా వఝులవారు చెప్పుటయే విశేషము. తెలుఁగువ్యాకర్త "ఓరి-ఓసి-ఓయి- ఈమూఁటికి ఏకవచన మునందే ప్రయోగము కడపటిది (ఓ) ఏకవచనమునందును, బహువచనమునందును (తె.వ్యా.104) ఇట్లు చెప్పుట సరి గా దనుటకే బహుశః సూరి ఓరి దుష్టనిశాటులార యన్నది యుదాహరించియుండును. ఓరి దురాత్ములార! (విక్ర.2-236) ఓరి రాక్షసులార (ర.రా,228) అనియుఁ గానవవు.

ఇంక వఝులవారు ఓరి బహువచనవిషయమున వాడఁబడు ననుటంచే ఓయి ఓసి యున్నవి ఏకవచనవిషయమునందు మాత్రమె యగు నని వారియభిప్రాయముగాఁ జెప్పవలసియున్నది. కాని వీరు తమలక్షణమున మాత్రమట్టినియమము చేయలేదు. తె వ్యా.కు భిన్నముగా నుదహరించుటయే కాక యిసిరులు

రణముచే సాధ్యము గాదు. (చూ. ప్రౌ. కే.) వ్యుత్పత్తివాదులందరకాన విలక్షణము. 
ఇయ్యది వైకృతశబ్దములపైనె యగు ననియు వి. వి. (క్వచిదామ్రేడితే కానో వైకృతాత్పరతో మతః).

బాల. లో నను క్తము లగునీయంశములయెడ దానితో వైరుధ్యము లేదు. లక్షణము సమగ్రముగను స్పష్టముగను వీరు సూత్రించిన బాగుండెడిది.

## మహదమహత్తులు

స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు నను (17) సూత్రమును యథాతథముగ గ్రహించి కొన్ని విశేషములు వివరించిరి.

"అచ్చికశబ్దములందు డుజ్వర్ణకము ప్రథమైకవచనమున వచ్చుశబ్దములు పుంలింగములు" (ఆ. 97) ఇట్లె ముఁవర్ణకము వచ్చునవి నపుంసకలింగసమము లనియుఁ జెప్పిరి. ఇది లక్ష్యస్వరూపాభివర్ణనము. మగఁడు అనుచో డుజ్జు గలదు గావున నది పుంలింగసమ మనుటకంటె నది పుంలింగతుల్యము కావున డు జ్జయిన దనుట శాస్త్రమార్గమున కనుగుణ మయియుండును. పుంలింగతుల్యము గానిదే డుజ్జు రానేరదు గదా. కాని యివి పుంలింగతుల్యములు, ఇవి క్లీబసమము లనురీతిగా నిర్ణయించుటకు లక్ష్యములే యాధారము గావున వీ రిట్లు చెప్పియుందురు. కాని యిట్లు చెప్పుటవలనఁ గొంత వైయర్థ్యము గల్గినది. "మగఁడు సాలీఁడు (సాలెపురుగు) మున్నగునవి పుంలింగ సమము లని వీరు నిర్ణయింపవలసియున్నది. సూరిమతమున పుంలింగసమ మన్నప్పటికిని (సాలెపురుగు) నమహత్తగుటచే డుజ్జు రానేరదు గదా. అట్టియెడలఁ బుంలింగ సమవిధాన మేల ? కొమ్ముకాఁడు, ఇబ్బందికాఁడు ఇత్యాదులును డుజ్వర్ణకము వచ్చినవే. వానిని బుంలింగసమము లనవలయునా ? కొమ్ముకాఁడు – సాలీఁడు – మున్నగునవి పుంలింగసమము లయినను మహద్వాచక

సులు కావు. కాన దుర్జ్ఞ ప్రాచికయు యేకార్యమహత్తులలోఁ జేర్పబడెను. [ఉ. 151] నని వీరె పేర్కొనిరి. మఱి యివి పుంలింగసమము లగు నేల ? దుర్జ్ఞ కనఁబడుటనుబట్టియే యగునా ? కయిచఁడు ఇత్యాదులును బుంలింగసమము లగునా ? పుంలింగసమత్వము లేకయుఁ బ్రత్యేక విధానముచే వీనికి దుర్జ్ఞగును. వీరివిభాగముకన్నను సూరివిధాన మెంతయు నుచితము. [మా. అచ్చ. 1]

## మిత్రాదులు :

క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబు లగు [18] ననుసూత్రము యథాతథముగ గ్రహించిరి. వివరణమున సూర్యార్థక మిత్రశబ్ద మిందుఁ జేరనేర [ఉ. 100] దనిరి. సూర్యార్థకమిత్రశబ్దము పుంలింగమే. సూత్రము క్లీబము లగుమిత్రాదులకుఁ బుంలింగతుల్యత చెప్పుచున్నది. కానఁ బుంలింగశబ్ద మిందుఁ జేరునా యనుసందేహమునకె తావు లేదు. స్పష్టతకయి యనవసరమ యయిన నిట్లు చెప్పి రని గ్రహింపఁదగును.

శేషుఁడు మున్నగునాగులు — మహత్తులుగ వివక్షింప నగును. అవి పుంలింగములె కాన వానికి ద్వైరూప్యము కవిసమ్మతము. జంగమములు– జంగములు ఉరగములు – ఉరగులు [ఉ 110] మహత్తులుగా వివక్షింపఁబడుటనుబట్టియే యివి యమహత్తు లగుట స్పష్టము. మహత్తులయెడ మహద్వివక్ష యేల ? అట్టియెడ వీరు జంగమములు– జంగము లని యుదాహరించుట సరిగా లేదు. దీనికి శివభక్తు లను రీతిగా వీరే యర్థమును జూపిరి. అయ్యర్థమున స్త్రీతిర్యగ్గణ మన్న మగు నయ్యది మహత్తే యవుటఁ జేసి మఱల మహద్వివక్ష యని చెప్పుట యెట్లు ? జంగమము అనునమహద్రూపమె సహజము. జంగమము లనునమహద్రూపము విశేషము, మహత్తుల కమహద్వివక్షవలన నమహత్కార్య మయిన స్థలమున నియది గుర్తింపఁదగియున్నది. జోగిజంగమంబులు. [హర. 2-52]

నాగులు కలుషుమున్నవి (హరి. పూ. 6.28) యని పీరు చూపినయుదాహరణము ప్రబలముగాఁ జెప్ప నక్కఱ లేనిదే. "కలుషుమున్నవి" యను సమహాదర్థక క్రియాపదము ననుసరించి 'నాగులు' అనునది యనుహార్తరూపముగను సమన్వయింపఁ దగును. మిన్నాగు ఇత్యాదులలో నాగశబ్దభవముగా నాగుశబ్దము (నీరము-నీరు. నాగము-నాగు) తెలుఁగునఁ గలదు. అట్టి త్రీసమ మగు "నాగు" శబ్దము యొక్క ప్రథమాబహువచనాంతరూపమె యిచ్చటి "నాగులు" అనుశబ్దము. "పఱుప మూచ్చిన మేటినాగువునుబోలె (భీమ-5-70) నాగువ్వెలంగి (వై ష 7-154) అనురీతిగా నాగువుశబ్దము గలదు. నాగము-నాగువు అనునవి ధర్మము-ధర్మువు అనురీతిగా నేర్పడినట్లు చెప్పవచ్చును. వర్గువు-వర్గు అనురీతిగా నాగువు-నాగు అని కావచ్చును. కాని సిద్ధసమాసాంతములం దెచటను నాగువు లేదు. నాగుశబ్దము గానరాకుండుటను బట్టియు నాగుఁబాము అనురీతిస్థలములనుబట్టియు నీమువి రెండును దత్సవములుగాఁ జెప్పుటయె యుచితము. శ, ర. సూ ని. వైకృతములుగఁ జేర్కొన్నవి మొత్తము పైఁ దద్భవ మగు "నాగు" శబ్దమునుబట్టి "నాగులు కలుషుమున్నవి" యనుచో "నాగులు" అన్నది నాగశబ్దమునకు మహద్వివక్షచే మహత్కార్యము లయినట్లుగాఁ దత్సమముగాఁ జెప్పవలసినయక్కఱ లేదు.

'శ్రేష్ఠతావివక్షయం దమహత్తునకు మహద్వివక్ష కవిసమ్మత' (ఉ101) మని వయులవారు ప్రత్యేకముగాఁ జెప్పిరి. (వి వి లో నీసందర్భమునఁ బునరుక్తులు గల వని పీరివచనములందును జోటు చేసికొన్న వనవచ్చును. ఇంతకు ముందు శేషుఁడు ము న్నాగుకొన్నింటి మహద్వివక్ష యాకారణముచేతనె యని యెన్నఁదగును.

ఉరగుల నెల్లఁ గాచిన, మహోరగనాయకుఁడు, భుజగజాల్మఁ దనురీతి నన్నయప్రయోగముల ననుసరించి యహో. "సహృదయాహ్లాదకత్వమనుసృత్యామహతో మహద్వివక్షా క్వచిత్కేవలాత్, క్వచిచ్ఛ్రేష్ఠతాప్రతిపాదకశబ్దాన్తాత్, క్వచిదశ్రేష్ఠతాప్రతిపాదకశబ్దాన్తాదపి" (కపిశ,362) యని పేర్కొనెను ఇట్లు మహద్వివక్ష

నున్నను దానివిశేషణము మహాత్మ్యార్థ్యముతో నున్నది. పురుషసింహాముల న్నిఁజేశుల నని (విశేష్యము మహాద్రూపముతో నున్నను) విశేషణ మయినపుడు నమహాత్మ్యార్థ్యము నందినది. కావున సింహాదిశబ్దాంతము లైనమాత్రమున నీయవి యమహత్తులు గావు. మహత్తులే యయ్యు నమహాత్మ్యార్థ్యము నందుటయె యిందు విశేషముగాఁ జెప్పఁదగియున్నది. కాన నీమహత్తులయెడ మహద్వివక్షప్రశ్నయే లేదు. (ఆరోపముచే సింహాశబ్దార్థము ప్రధాన మయి యమహ త్తగుట బలగర్వితమగు పురుషసింహము వచ్చుచున్నది యనురీతిస్థలముల గుర్తింపనవు.)

"స్త్రీపురుషసాధారణవాచిజనశబ్దమునకు ద్వైరూప్యము గలదు జనులు - జనములు" (ఉ. 101, వ్యా. సం. స. 469) మంత్రిజనములతోడ (ఆశ్రమ-1-58) మునిజనంబులం బుచ్చిన (ఉద్యో 1-132) మొదలగుచోట్లఁ బురుషవాచకముగను, అంగనాజనులసందడికు [ఆశ్రమ-1-168] అంగనాజనములు [విరా. 2-334] మున్నగుచోట్లఁ గేవలము స్త్రీవాచకముగను జనశబ్దము ప్రయుక్తమైయున్నది. స్త్రీసముదాయమును బోధించునపుడు "జని"శబ్దముతో సమన్వయింపఁదగు నని [వ్యా. సం. స. 470] వరుులవా రందురు. స్త్రీవాచకమైనఁ బురుషవాచకమైన నుభయవాచక మయిన నెట్లయినను జనశబ్దమునకు మహదమహాత్మ్యార్థ్యములతో రూపద్వయము సాధారణముగ నంగీకరించుటయె సక్రమముగా నుండు నని తోఁచుచున్నది.

## బిత్వం

"బిత్తు బిందుపూర్వం బగు" [19] ననుసూరిలక్షణమును 'పూర్వకం బగు' నని శవర్ణమొక్కఁ డధికముగాఁ జూపిరి. [తత్స. 22 సూత్రవివరణమునను నీ సూత్రము నిట్లు చూపిరి.] దానివలన వీరిలక్షణమునఁ బ్రయోజనము గాని, యది లేని సూరిరచనలో దురుక్తి గాని లేదు. ఇంక సూరిసూత్రమున లాఘవము గుణమనఁదగును.

సానునాసికోచ్చారణం జేత్తనుప్రాకృతవ్యాకరణజ్ఞత్వమునకు ఫల మిట వర్తిల్లదని యీసూత్రము తెల్పుచున్నట్లు [ఉ. 102] వీరు పేర్కొనిరి లాఘువాదులనుబట్టియును సూరి యీపద్ధతి [జీవనుప్వాలస్య-త్రి. శ. మున్నగు పూర్వలాక్షణికవచనములనుబట్టియు] యవలంబించియుండనవు. ముఖ్యముగా బాలసరస్వత్యహోబలులయభిప్రాయమును విమర్శించుటె యిట వీరియుద్దేశ్యము. అది తద్గ్రంథపరామర్శనమున గ్రహింతము.

## డుమంతము

"డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు" [20] నను సూరిసూత్రమును "డుజ్వర్ణకంబునకుఁ బ్రకృతి యైనది డుమంతంబు నాఁబడు"నని పదుఁడవా రక్షరములమార్పుతోఁ జెప్పిరి. మార్పువలనఁ బ్రయోజనము లేదు. యథాతథముగఁ జూపవచ్చును. మార్పువలన సూరిలక్షణమున దురుక్తి గల దని భ్రమింపరాదు.

ప్రథమైకవచనడుజ్జు లోపించినశబ్దము డుమంత మనిసించుకొన [ఉ. 102 వ్యా. సం. స. 480] దని వివరించిరి. దీనినిబట్టి యిట్టిశబ్దములపైఁ బ్రథమైక వచనమున డుజ్జు వచ్చి పిదప లోపించు నని వీరియభిప్రాయము గుర్తింపవచ్చును. కాని పిదప "రై రో శబ్దములకు ముపర్ణకమును. గ్లౌ, గ్లోశబ్దములకు డుజ్జను ప్రాప్తించుచుండఁగా వానికి ఇగ్లౌరాసూత్రముచేత లోపము గల్గు" [ఉ. 125] ననిరి. ఇట డుజ్జు ప్రాప్తించుచుండఁగా [ప్రథమైకవచనము] లోపించు ననుటవలన డుజను జేసియుండలే దని నిర్ణయింపవచ్చును.

సంజీవనిలో నిట్లే చెప్పినవీరు హరి, గ్లౌ మొదలగువానిపైఁ బ్రథమైక వచనమునకు లోప మగు నన్నచోట డుజ్జు చేసి దానికి లోపము చేసిరి. అయ్యును

ముజ్జు లోపించి వృద్ధ అనురూప ముండును. ప్రథమా బహువచనాదులయందలి ప్రాతిపదికస్థితిని డుజ్లోపవిధానసూత్రము నియమింప నేరదు. వృద్ధును(న్) అనురూపము దుష్టము. వృద్ధునివ్ అనురీతిగ మాత్రమె యగును. (సుమంతత్వాభావపక్షమును సమ్మత మైన సూరి డుజ్జునకుఁ గాక హారి మొ॥ ఇకారాంతాదులకువలెఁ ప్రథమైక వచనమునకే వికల్పముగా లోపము చెప్పియుండెడివాఁ డని గ్రహింపవలెను.)

## ప్రాతిపదికములు :

“పుంలింగం బై మహద్వాచకం బైననామంబు తుదియత్వంబున కుత్వం బగు” (21) అను సూరిసూత్రమును “పుంలింగం బయి మహద్వాచకం బయిన నామంబు తుదియత్వంబున కుత్వం బగు” అని యించుక మార్పుతో (బై-బయి) చూపిరి. సూరి సూత్రము నిర్దుష్టమె.

సూత్రవివరణమున సిద్ధ, రామ, భార్గవ, రాజపురుష యనుసంజ్ఞాకృత్తద్ధిత సమాసప్రాతిపదికలను సూరి వలెనె చూపిరి.

సంజీవనిలో “ప్రాతిపదికములపైఁ దద్ధితప్రత్యయములు నిల్పుటచేతఁ దద్ధితాంతప్రాతిపదికలేర్పడు” (వ్యా. సం. స. 481) అని వివరించుటలో నభిప్రాయ మస్పష్టముగా నున్నది. స్వార్థికములు దప్పఁ దద్ధితము లాయావిభక్త్యంతము లగుశబ్దములపయినె నిల్చును. రామునియొక్క-తన మొ॥ తద్ధితవృత్తిలో విభక్తి లోపింపఁగాఁ బ్రత్యయము చివరకుఁ బ్రాతిపదికపైనె యుండును గదా యను నుద్దేశ్యముతో నిట్లు చెప్పిరేమో. లేనిపోని వివాదములు దెచ్చుకొన నేల ? తద్ధితాంతము ప్రాతిపదిక యగుటనుగూర్చి వివరించునపుడు తద్ధితము చేరుశబ్దముఁ గూర్చి వివరింపఁబూనుటలోఁ గొంత సందేహమునకుఁ గారణ మైనది పగలాఁడు పగలాఁడి యనురీతిస్థలముల విశేషముగాఁ బ్రథమాబహువచనాంతముపైఁ దద్ధితములు నిల్చియున్నవి.

పిదప "శబ్దానుకరణం చైవ పంచవిధమ్" అనుచొప్పున అనుకరణశబ్దమును ప్రాతిపదికమె" (ఉ. 103 వ్యా. సం. స. 482) అని యొకవిశేషమును చెప్పిరి. గనగన మొదలగు ననుకరణశబ్దములు ధ్వన్యాదిబోధకము లయి యర్థవంతములే యవుటచే నితరలక్షణముల ననుసరించి యర్థవదిత్యాదిసూత్రముచేతనె ప్రాతిపదికసంజ్ఞను బొందు నని లాక్షణికులయభిప్రాయముగా దోఁచును.

## తెలుఁగువిభక్తులు :

"పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు" (22) ననుసూత్రమును వీరు "పుంలింగం బగుమహద్వాచకంబునకు డు జగు నని చూపిరి.

ఈ సూత్రము వివరణమున వీ రిట్లు వ్రేర్కొనిరి. పై రీతి గలస్థలములలో నెల్ల సంస్కృతవిభక్తి యగు "సు" ను న్నగువానిని నిల్పి వానికి డుజాదు లాదేశముగాఁ బ్రక్రియ నడపవలెను. (ఉ. 84, 103) సంస్కృతవిభక్తులకే తెలుఁగు విభక్తు లాదేశింపవలసినయవసరము గాని, తెలుఁగువిభక్తులనే సరాసరిగాఁ జేయుట వలనినష్టము గాని, వీ రిటఁ బేర్కొనియుండలేదు.

అపదం న ప్రయుఞ్జీత అను నియమము చొప్పునఁ బ్రకృతులపై ననఁగా ధాతువులమీఁదఁ దిఙ్విభక్తులును, ప్రాతిపదికలమీఁద సుబ్విభక్తులును నిల్చి వాక్యప్రయోగయోగ్య మగుపదత్వపదవి గల్గించు నని వ్యా. సం. స. లోఁ (481) జెప్పిరి. దీని ననుసరించియే కాఁబోలును, కవిశి. వివృతికర్త తెలుఁగువిభక్తులను సుప్పుల కాదేశింపనిసూరిగ్రంథమున నివి యెల్లఁ బదములే కాకుండఁబోయె నని (పుట281) నిశ్చయించెను. కాఁగా సుప్పులను జేసి వానికిఁ దెలుఁగువిభక్తుల నాదేశము చేసినప్పుడే సుబంతతయుఁ దన్మూలమునఁ బదత్వమును సిద్ధించునను మద్దేశ్యముతోనె సంస్కృతవిభక్తులకు నాదేశము చేయవలె నన్నచో నది పొరపాటె యనక తప్పదు.

తెలుఁగునామవిభక్తులను సుప్పుల కాదేశము చేయుట పదత్వమునకై యన్నచో సూరి లకారమునకుఁ జెప్పిన డున్ను (క్రియావిభక్తులు) సయితము తిఙ్ల కాదేశము చేయవలసియున్నది. అప్పుడే యవి తిఙంతములై పదత్వము నందఁగలవు. క.వి. కర్తరి ధాతువులపైని తిఙ్లను నిల్పి వానికిఁ దెల్గు ప్రత్యయములు చెప్పినట్లు పేర్కొనుట (క. వి. 281) విస్మాలము. కాని వీ రుద్యోతమునందు సయితము డున్ను దిఙ్విభక్తుల కాదేశము చేసియుండలేదు. మఱి పరులవారిగ్రంథమునను డుఙంతములు పదములు గావా? ఙ్ల కాదేశము చేయకున్నను డుఙంతము పద మగుచున్నపుడు సుప్పుల కాదేశము చేయకపోవుటవలన నామవిభక్త్యంతమునకుఁ బదత్వము లేకుండు టెట్లు?

అట్లే కృత్తద్ధితప్రత్యయములను సంస్కృతప్రత్యయములస్థానమున నాదేశింపకున్నఁ దదంతమునకుఁ బ్రాతిపదికత్వము సిద్ధించునా? ఇట్లన్నియు సంస్కృతశబ్దములస్థానమునన చెప్పవలయు ననుట యుచితము గాదు. ప్రథమాదులగు సుబ్విభక్త్యంతములవలెఁ దెలుఁగునఁ బ్రథమాదివిభక్తు లగుడుజాద్యంతములకుఁ గల్గు నని గుర్తించుట సక్రమమె కదా.

పరులవారిటఁ బదత్వమునుగూర్చి ప్రస్తావింపలేదు కాని వే ఱొకహేతు విట్లు పేర్కొనిరి. "దేవత-మున్నగుమహత్స్త్రీలింగములపైని తండ్రి, కొడుకు మున్నగు -- పైని- తెల్గుప్రథమావిభక్తికియేకవచనము సిద్ధింపనేరమిం జేసి వానిపైని సంస్కృతసుప్రత్యయమునె నిల్పి తత్ప. 67 సూత్రము చొప్పున దానికి సూరిపక్షమునను లోపము చేసికొనకతీఱదు. కావుననే నన్నయ సుప్రత్యయాదులకే డుప్రత్యయాదు లాదేశములుగ వక్కాణించియున్నాఁడు." (ఉ. 94) ఇట్టిచోట్ల సంస్కృతప్రత్యయము చేసి లోపము చేయవలసియున్నది గదా యని యితరస్థలములం దెల్ల నిట్లె చేయవలె నని నియమించుట సమంజసము గాదు. ఇది కేవలము ప్రక్రియాగౌరవము (పెద్ద ప్రక్రియ క. వి 281) సూత్రాంధ్రాదులలో సూరియుఁ జి. విధానమునే యనుసరించియు తెలుఁగువిభక్తులను సరాసరిగా నుపదేశించుటలోనిలాఘవమును గుర్తించియు శాస్త్రీయమార్గమునకు విరుద్ధముగా లేకుండుట చేతనె (క. వి 281) వాల. లో నిట్లు చెప్పెను.

ఇంకఁ గొన్నియెడలఁ బ్రథమైకవచనలోపసంబంధమున మాత్రమె సంస్కృతవిభక్తికి లోపము చేయవలసివచ్చినయది విరుద్ధముగాదు. వీ రుచిత మని ప్రశంసించిన చిం. లోఁ గ్రియావిభక్తులు తిఙ్ఙులస్థానమున విధింపఁబడలేదు. ధాతువులపై సరాసరిగాఁ దెలుఁగుప్రత్యయములు చెప్పెను. కాని "ప్రథమైకవచనలోపస్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యా" త్తని చెప్పెను. అప్పట సంస్కృతవిభక్తియె లోపింపఁజేయవలసివచ్చుట వచులవారివ్యాఖ్యయందును స్పష్టమె. బాల లో నామవిభక్తులయెడ నట్లు గ్రహింపరాదా?

చిం. సమ్మత మనుకారణముచేఁ గాకున్నను బ్రక్రియాగౌరవాదులను బరిహరించుటకును సూరి యనుసరించినయీమార్గము శ్రేష్ఠమె యని గ్రహింపఁదగును.

ఇఁక వీరు సూరిపద్ధతిని మార్చి చిం. కనుగుణముగాఁ జెప్పఁదలఁచినను దత్తద్విభక్తులవిధానము సూరిమతానుగుణమైయున్నది. చిం. మహత్యో ర్డుజ్ అని డుజ్ను సుప్రత్యయము స్థానముననె చెప్పినది. ఇట్లె యితరనామవిభక్తులును. విరమః, టాసశ్చేతః మొ॥ సూరి యీమార్గము ననుసరింపలేదు గావున సు ప్రత్యయమునకు డుజాగు ననలేదు. సూరిసూత్రమునె దాదాపు యథాతథముగా గ్రహించిన వీరును సుస్థానమున నగు నని చెప్పలేదు. ఇట్లె యితర విభక్తుల విధించునప్పుడును (చూ. తత్స. 39) సంస్కృత విభక్తులస్థానము ననె యగు ననుటకు వీరివ్యాఖ్యానమె యాధారము. కాని సూత్రములం దట్టి నియమమున కవకాశము లేదు.

ఇం తేల? వీరే యొకచో నిట్లు పేర్కొనిరి." దీనికి (దేవతా శబ్దమునకు) డుమువు అనువానిలో నేదియుఁ బ్రాప్తింపదు. కాన సంస్కృతసుప్రత్యయమునె నిల్పి ప్రకృత (తత్స. 67) సూత్రముచే లోపమును జేయవలయును. (పు. 152) ఇది వీరి పూర్వవివరణమునకు విరుద్ధముగా నుండుట గమనింప వచ్చును. డుమువులు ప్రాప్తింపవు గావున సువిభక్తి చేయవలె నన నేమి? డుమువుల నేదయినఁ బ్రాప్తించుచో సువిభక్తి చేయ నక్కఱ లేదనియే కదా

యర్థము. రామున్డు, వనము, దేవుడు ఇత్యాది (గాం (ప్రథమైకవచనలోపము లేని) స్థలములందు 'సు' విభక్తి చేయ నక్కఱ లేదు. అట్లే యితర సంస్కృత విభక్తులును జేయనక్కఱలేదు. అనఁగా పైరీతి వివరణమునుబట్టి తెలుఁగుప్రత్యయముల ప్రాప్తి కవకాశము లేనపుడే యగతికముగా సంస్కృతవిభక్తిచేయవలెనన్నమాట.



మఱి యింతకు ముందు వీరు పేర్కొన్నట్లుగాఁ దెలుఁగువిభక్తులు సంస్కృతవిభక్తుల స్థానమునఁ జేయవలసియున్నచో డుముపుల నేవి ప్రాప్తించినను ప్రాప్తింపకున్నను ముందు సంస్కృతవిభక్తి చేయవలయునే. అవు డీచట ముందే సువిభక్తి యుండఁగా డుముపులు ప్రాప్తింపమి నదియె (సు) లోపించు నని చెప్పవలసియుండఁగా డుముపులు (తెలుఁగువిభక్తులు) రానికారణమున సంస్కృతవిభక్తి (సు) చేయవలయు ననుట విరుద్ధము గదా, ఇది ప్రమాదముచేఁ జెప్పినదనియును సూరిమతమును గొంతవఱ కనుసరించియున్నది. ప్రథమైకవచనలోప మంతనెల్లయెడల 'సు' విభక్తియె లోపించుట సూరిమతము. అది సక్రమము.

ఏ మయినను సంస్కృతవిభక్తులను జేయక తెలుఁగువిభక్తులను జేసినఁ బదత్వము సిద్ధింప దనుట యసంగతము గావున సూరిప్రణాళికయం దెట్టిదురుక్తియు లే దనియు, ననఁగాఁ ప్రకృతిపై నిటఁ దెలుఁగువిభక్తులే చేయుట యుచిత మనియు గుర్తింపఁదగును.

## డుజ్ఞు :

ఈసూత్రమున (తత్స. 22) మహద్వాచకమునకు డు జ్ఞగు ననుచోఁ బ్రాతిపదికస్థానమున డుజ్ఞగు నని యర్థ మగును గావున మహద్వాచకముకంటె నని పంచమి ప్రయోగించినఁ బదముగా ననుసర్థము సిద్ధించు నని పేర్కొన్నగు. ప్ర.వ.ను విమర్శించుచు వరుఖలవారు పంచమ్యర్థమున షష్ఠి వచ్చుటను నిరూపించి, పరశబ్ద

మధ్యాహార్య మగుట నంగీకరించుటు ప్రతిపేధవాదిరాంగికి జాతాద్యాదులలోఁ జింతా


మణియందు నిష్టే యని చెప్పిరి. (వ్యా సం స 486, 487) కాని ఈ ముప్పులు ప్రథమ మొదలగు సూత్రముల ననుసరించి యీడుజాడులు ప్రథమాదివిభక్తులు. ప్రత్యయములు గదా. (డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది. ప్రత్యయంబు వర్ణకంబు) అయినపుడు ప్రత్యయః, పరశ్చ, యనులక్షణమునుబట్టి ప్రత్యయము లగుడుజాదులు విధించినదానికంటెఁ బరముగా వచ్చును గదా ! మఱలఁ బరముగా ననుసర్గమును వేఱఁ దెచ్చికొనవలయునా ? యని సందేహము.

## రామునినిన్ :

'డుమంతఁబునకు ద్వితీయాద్యేకవచనఁబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు" (23) ననుసూత్రసూత్రమును యథాతథముగా గ్రహించిరి. కాని యుదాహరణములలో "రామునినిన్" అని సూరికి భిన్నముగాఁ జూపిరి. వీరు సూరికి భిన్నముగా ద్వితీయకు నుగాగమము చెప్పియున్నారు గావున నీరూప మిట్లయినది. అవసానమున ద్రుతస్వరలోపము చేసియుందురు. లేనిచో నాగమముగాఁ జెప్పినది నువర్ణము గావున రామునిచేతను అన్నట్లుగా నిట నికారాంతముపై "రామునినిని" అని యుదాహరింపవలసియున్నది. తత్స. 8 సూత్రమునొద్దఁ గూడ "రామునిని" అని చూపిరి. అది నిగాగమము రానిరూప మనుకొందము, కాని యిట నిగాగమవిధి కుదాహరణ మగుటచేఁ దప్పక "రామునినిన్" అని యుదాహరించియుందురు, నకారంబు ద్రుతం (సం, 11) అను సూత్రమునొద్ద సూరి నన్నున్ అనిపొల్లనకారము నుదాహరింపఁగా నది తగ దని వీరు "నన్నును" అనురీతి చూపిరి (ఉ, 14) గదా. అట్టి వీరిట రామునినిని అని యేల చూపలేదో ? ఇట్టి రూపములు భాషలో నుండవు.

ఇట్లే యేర్పడునపరూపములను వారించుటకు వరుసలవా రిచ్చట విపుల మగువివరణ మీరూపములనుగూర్చి కూర్చిరి.

ఈసూత్రమందలివిభాషను వ్యవస్థితవిభాషగ నంగీకరించి ద్వితీయైకవచన నువర్ణకమునకు యథాప్రయోగముగ (బహుళముగ) లోపమును జేయవలయును. (చ 104) కొన్నిం బ్రయోగములందు లోపము తఱచుగాం గల దన్నయహో. అభిప్రాయమును వజ్ఝలవారును గుర్తించి రన్నమాట. సూరి ద్వితీయాప్రత్యయమును విర్చెను. నుగాగమమును వారించెను. (చెప్పలేదు) వీరు నుగాగమమును నిత్యముగా నుంచి నువర్ణకమె బహుళముగా లోపించు ననిరి. విభక్తిప్రత్యయము నుంచి యాగమమును బరిహరించుట యుక్తమా ? ఆగమము నుంచుకొని విభక్తిని తొలంగించుట సూరిప్రణాళికను మార్చు టనిరర్థక మైన ట్లంగీకరించినట్లు కదా. ఇంతకును నువర్ణకము బహుళముగా లోపించునన్నం బ్రవృత్త్యాదిస్థలము లున్నవా? "వనమునును" అనుచేరుగా నెచ్చట నుండదు గదా! ఇంక వనమునున్ అను దానికై ద్వితీయానువర్ణకము లోపింపనిపక్షమునందు మీఁదినుగాగమద్రుతమున న్వదిలోపము నిత్య మనియు న్వత్వస్థితి యెప్పుడు నుండ దనియు నింకొక నియమము చేసికొనవలయును. ఇది యన్యకార్యము గావచ్చును. ఈ లక్షణ మందలిసహజత్వ మూహ కందదు.

అసలు వజ్ఝలవారు నులోపమునకై నియమము చేసినపద్ధతియె యసంగతము.

బహుళముగ నేని నువర్ణకము లోపించు నని గుర్తించిన వీ రాయంశమును ప్రత్యేకముగా విధించుట యుక్తము. "నిగాగమంబు విభాష నగు" నని నిగాగమము చెప్పుసూత్రములోనివిభాషకును, ద్వితీయానువర్ణకలోపమునకు నేమి సంబంధమో స్పష్టము గాదు. అచ్చటివిభాషకు నిగాగమము నిత్యముగా వచ్చుటయో యసలు రాకుండుటయో వ్యవస్థ చేసికొనవచ్చును గాని యన్యకార్యమును (నువర్ణకలోపమును) వ్యవస్థ చేయుట సంస్కృతసంప్రదాయానుగుణమును గాదు. ఇక్కడనె నియమింప నాగ్రహించుచో సూత్రమునందే బహుళపదమును జేర్చికొను టే నొప్పు నేమో.

ఇంక నీనియమమువలన నైన నిబ్బందులు తొలంగినవా ? ద్వితీయైకవచన నువర్ణమునకె లోపము బహుళ మనిరి. (ద్వితీయాద్యేకవచనసందర్భములే సూత్ర

మున( బ్రస్తావింపఁబడిన వని కాఁ(బోదు)బహువచనమందు నువర్ణక మట్లే నిల్చి యుండవలెఁ గదా. రాములనును, వనములనును అనువిధ మైనప్రయోగములు చెలఁగుచ నున్నవా? సూరి (వీరును) ఇఈఎఏలంగూడిన- (సం. 8) అనుట గ్రామ్యము గదా. ఇఈఎఏలనును—కూడిన అని యుండఁగా ఇఈఎఏలనుం గూడిన – అనవలె. లేదా ఇఈఎఏలనును గూడిన అన్నను లక్షణబద్ధమై యుండును. కాని ఇఈఎఏలం గూడిన అనుట లక్షణవిరుద్ధము. అవసానేతరపదాత్వమున (సంశ్లిష్టేతరము నగు) నీపరుషపరకత్వమున ద్రుతము లోపించుట యెట్లు? లోపింపక "ఇఈఎఏలంగూడిన" – అని యగుట యెట్లు?

ద్వితీయైకవచన మనుట పొరపాటు. ద్వితీయానువర్ణ మనుట కొంతయుచితము. అట్టిసందర్భమునను వనమునను జూచె. రాములనును గాంచె ననుస్థితి వారించుట యసంభవము. అతనినిన్ "వనమునున్", అని చెప్పుట నే సరుదుగ నున్న దేమో. దానికయి ద్వితీయావిభక్తి (ను) లోపించుట బహుళ మనుటకంటె దఱుచుగా లోపించు ననుటయు యవసరము. వచ్చుంవా రన్నట్లు యథాప్రయోగముగఁ జెప్పఁదలఁచిన నిది సాధారణముగ లోపించు ననియు నెక్కడో యరుదుగ లోపింప కుంట గల దనియు జెప్పవలె విభక్తి సాధారణముగా లోపించు ననుట కంటె, ఉన్నద్రుతమునే విభక్తిగా గుర్తించి (లేని దాగమముగాఁ బరిష్కరించి) ద్వితీయకు నుగాగమము చెప్పకుంట సూరిసమ్మత మగుమార్గము. అతనినిన్ అనువిశేషస్థలములను విశేషముగా గుర్తించు టొప్పును గాని దానికై భాషాసామాన్యలక్షణమును జెఱచుట సరి కాదు.

"రామునినిన్" రామునిన్ — ఇవి యెల్ల నవసానద్రుతస్వరలోపము నందినయుదాహృతులు" (ఉ. 104) ద్రుతస్వరలోపము నిత్యము గాదు గదా; "రామునినిని" అని యుండునా? ఇట్టి దుదాహరించునప్పు డెల్ల వీరు పొల్లునే చూపిరి. "రామునినిన్" నిగాగమము. ద్వితీయానుప్రత్యయము. దాని ద్రుతము గలవు". ద్రుతము పొల్లుగా నున్న దేమి? "నువర్ణంబు ద్రుతంబు" కదా. మఱియు వికారముగ నుండు నని మానియుందురు. సీతనును, హరినిని అనువానిం దివరఁ జూపిరి. కాని యిట్టిరూపము లేకవిప్రయోగములందు దొరుకునో సూచించిన బా గుండెడిది.

"రామునినిన్" ఇందు నిగాగమము కలదు. ద్వితీయానుప్రత్యయము లోపింపఁగా దాని ద్రుతము నిల్చినది" ఇచట విభాష యయిననిగాగమమె రాలే దనియు ద్వితీయావిభక్తి నిలిచియున్న దనియు వీరు చెప్పుకొనుట యుచితము, (సూరి మతమున నిది నిగాగమ మైనరూపము)

ఇట వీరు రామునినిన్, రామునిన్, రామున్ అనురూపములే చూపిరి కాని రాముని అనురూపము చూపలేదు. (తత్స. 8 సూత్రమునకడఁ జూపిరి.) ఇట్టియెడల నాగమ ద్రుతమును బొల్లగనె మొదటినుండియుఁ జూపుచు వచ్చిరి. ప్రయోగముల ననుసరించి ద్వితీయాప్రత్యయమె లోపించును. (ఇది సిం. కనుగుణము గావచ్చును) గాని నుగాగమమును నిల్పియుండు ననునభిప్రాయము వీరి ప్రక్రియ కనుగుణమె. అట్టియెడల నిగాగమము రాక నువర్ణకము లోపింపఁగా నుగాగమము నిట వీరు సమన్వయింపవలయును. అపు డిట నాగమముగా నువర్ణమునే చూపవలసియుండును సీతను హరిని అనుతీరుగా "రాముని" అని చూప నవకాశము లేదు. "డుమంతంబుమీఁదినువర్ణంబు నుత్వంబున కిత్వం బగు" ననుచో నాగమనువర్ణమున కిత్వము వచ్చుటనుగూర్చి వీరు ప్రస్తావింపలేదు. ప్రత్యయమునకె దానిచే నిత్వము నుద్దేశించినట్లు తోఁచు. రాముని అనురూపము వీరి వ్యాకరణముచే నసాధ్యము.

## అతనినిన్ :

అతని నాతనిన్ అనుచో అతఁడుశబ్ద మాచ్ఛికము గాన నిగాగమము 24వ సూత్రము చెప్పిన నిత్యము అతనినిన్ అనుచో మొదటి "ని" అనునది నిగాగమము. తర్వాత నుండఁదగినద్వితీయానుప్రత్యయము వయికతివి లోపించినది, కాన దానిద్రుతమును సముచ్ఛయార్థకనుశబ్దమును నిన్ అనురూపముతో నిల్చినవి" (ఉ 104) సముచ్ఛయార్థకనుశబ్దమున కిట స్వరము లోపించి పొల్లు నిలిచినది. స్వరము లోపింపనియెడల "అతనినిని" అని యుండవలయును. నిగాగమమును, నుగాగమమును నిత్య మగుటచే ద్వితీయానువర్ణకము వీరివ్యాఖ్యానవిశేషముచే లోపించినది. కాని యీలోపము నిత్య మని వీరు చెప్పలేదు గదా. కావున

ద్వితీయానుకర్షకము లోపింపనిపక్షమున నిచట "ఆతనినినిని" అని నాలుగు నివర్ణము లుండవలయును. (వి. వి. లో వీరు సమన్వయించినట్లు సముచ్చయాద్యర్థకనుశబ్దము ద్రుతాంత మగునా ? ఆతనినినినిని అని నివర్ణము లయి యుండును.) ఇవి తెలుఁగుశబ్దములా ?

ఆతనినిన్ గొని, ఆతనినిన్ జయింతు మేము, బాలకునిని బుద్ధిహీను, అను ప్రయోగములం బ్రస్తావించి పరులవారు "బాల. పక్షమున "ఆతనిని + న్, బాలకునిని+న్, అనురీతిని పొల్లనకారమె సముచ్చయార్థకనుశబ్దంగఁ బంధిరూప మని యున్నవగును. లేదా ఆతనిన్ + నున్, బాలకునిన్ + నున్ అనియు భేదము సంగీకరించినను క్షతి లే" (వ్యా. సం. స 491) దనిరి. "బాలకునిని బుద్ధిహీను అనుచో బాల. పక్షమున బాలకునినిన్ అని విభాగింపనక్కఱ లేదు. చిం; వి. వి. ల మతమున ద్రుతస్వత్వము ను, ని అని యుండ దని పరులవా రందురు గాన వారి మతమున నిటఁ గూడ సముచ్చయాద్యర్థకనుశబ్దకల్పన మవసర మయినది. కాని బాల. పక్షమున నేల? బాలకునిని + బుద్ధిహీను ననుచో ద్వితీయాప్రత్యయము స్వత్వములో నున్న దని బాల. పక్షమున గుర్తింపనగును. కాఁగా బాలకునిని+న్ అని కాని విభాగింప నవసరమె లేదు.

ఆతనినిన్ అనుచో ఆతనిని + న్ అని చూపి పొల్లనకారము చాద్యర్థక మనిరి. కాని చాద్యర్థకనుశబ్దమును సూరి చెప్పలేదు. దానిం బ్రస్తావించినప్రౌఢ. (అనుదంతము లగుకళలపై మాత్రమె యువర్ణపూర్వక మవియెం గావున) ఈ ద్రు. ప్ర. పై "ను" వర్ణము విధించెను. ఇకారాంతముపై నుండుటచే నిత్వము వచ్చిన ఆతనినిని అని యగును పిదప హల్పరకత్వమున సంశ్లేషము రాఁగా ఆతనినిన్ జయింతు మిత్యాదిగాఁ బొల్లగా నుండును. సముచ్చయాద్యర్థకనుశబ్దము పొల్లునకారముగాఁ జెప్పుటలో పరులవారును పై విధముగనే తలంచి రందము. కాని యిట స్వత్వము వచ్చిన ఆతనినిని జయింతు మనురీతి నుండవలె. కాని యట్టివి భాషలో లేవు. కావున వీరీతిసమన్వయము సరి కా దని నిశ్చయింపఁ దగును.

పక్షాంతరము "ఆతనిన్ + నున్" అని యున్నను బాధ లేదనిరి. ఆతనిన్ అని ద్రుతమున స్వరలోప మెట్లయినది? పొల్లనకారమె ద్రుత మని తాము భావించిన చిం. వి. వి. ల మతమున నట్లు చూపుదురు గాక, బాల. లో నట్లు చూపరాదు. సుశబ్దపరకత్వమున సంశ్లేష మయినదా? అయిన నావ్యవస్థయందలి దగు ఆతనిని + నున్ అనియె చూపవలె నున్ అనుచో నువర్ణముపై నొకద్రుతము (పొల్లనకారము) చూపిరి. ఇది యెక్కడిది? చిం. వి. వి. ల మతమున చాద్యర్థక సుశబ్దమును వీరు ద్రుతాంతముగాఁ జెప్పిరి. బాల.లో నిది ద్రుతాంత మనుట కాధార మేది? బాల. ప్రౌఢ లమతమునఁ జాద్యర్థకసుశబ్దమే ద్రుతము గాని యది ద్రుతాంతము గాదు. కావున "నున్" అని యచ్చట నుంచుకోవచ్చు. కాని యిట నట్లు కుదురదు. సుశబ్దమును విధించిన ప్రౌఢ అది ద్రుతాంతముగాఁ పేర్కొనలేదు. (వీరే ద్రుతాంతముగాఁ జెప్పఁదలఁచిన బాల. మతమున సుశబ్దము ద్రుతము గావున చాద్యర్థకసుశబ్దముపైని ద్రుతమును గూడ నువర్ణముగాఁ జూపవలెను) కాఁగా వీరు బాల. మతమున ఆతనిని + నున్ అని చూపుట పొరపాటని నిశ్చయింపఁదగును

పొరపాటున నయినను ఆతనిన్ + నున్ అని విభాగించినవీ రావశ్యమున బాల. లో నాదేశ దను ఎట్లు? ఆతనిన్ + నున్ ఆతనినిఁ అగుట యెట్లు? ఇకారముపై నున్న సువర్ణమునకు ద్విత్వము వచ్చును (తత్స. 26) కాని యిట పొల్లనకారముపైఁ గదా వీరు సువర్ణమును జూపిరి. ఒకవేళ నయిన దన్నను ఆతనిన్ + నిన్ = ఆతనిన్నిన్ అని గదా యగును. ఆతనిన్ + నున్ అని యుండగా స్వపరకతలో ద్రుతము లోపించి (ఆతని + నుఁ ఇకారముండ ద్విత్వము వచ్చి ఆతనినిన్ అని యైన దని వారి యభిప్రాయమా? లోపాభావపక్షమున ఆతనిన్నున్ అని యగునా? ఆతన్నినిన్, (సంశ్లేష) ఆతనినిన్ (ద్విత్వము) ఆతనిన్నిని, ఆతనినినిని అని యిన్నియు నవరూపము లేర్పడవా?

"ఆతనిని" అని రూపము బాల. చే సాధింపఁబడును. "ఆతనినిని" అను రూపములు లేవు కావున నవు దగు "ఆతనినిన్" అనుస్థలములయందు "కొన్ని

యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి" నను సూత్రముచే నకారము వచ్చి యేర్పడినట్లు గుర్తించుట నిర్బాధము.

"ఆతనినిన్" అనురీతి నగురూపములకొఱకై మాత్రమె వీరు ద్వితీయకు నుగాగమము చెప్పుటచే ననేకము లప్రసిద్ధములును, గవిప్రయోగవిరుద్ధములు నగునరూపములు సాధింపఁబడుచు భాష కనర్థము వాటిల్లినది.

ఇవి చిం., వి. వి. లలోనె సుసాధ్యము లని వీరు తలఁతురు. కాని బాల. లోనె సముచితముగా సాధింపఁబడుచుండగా చిం;వి.వి. లయందే సరిగా నేర్పడవు. "స్త్రియశ్చ స్త్రీసమస్యైతో ద్రుతస్యాన్నిశ్రుతిః క్వచి" త్తనుకారికయందలిస్త్రీలింగ స్త్రీసమముల కన్నది తద్భిన్నములకు నుపలక్షణ మని "ఆతని నాతనిం గొని" (వ్యా. సం. స. 496) యని చూపిరి. ("ఆతనినిన్గొని" యనుచో (49) పుటలోఁ బొల్లనకారమును జూపి యట 496 పుటలో ఆతనిం గొని యని బిందువును జూపుట విశేషము వరుసలవారియభిప్రాయమున కిది యెట్లున్నను బాధ లేకపోవచ్చును. కాని కవిప్రయోగమును భిన్నములుగాఁ జూపు టుచితమా యని సందేహము.) కాఁగా స్త్రీలింగస్త్రీసమశబ్దములు పుంలింగపుంలింగతుల్యములకు నుపలక్షణ మన్న మాట. అట్టియెడ స్త్రీలింగస్త్రీసమము లన నేల? ఎల్లయెడల నిత్యనకుఁ బైని ద్రుతమునకు నిశ్రుతి చెప్పరాదా? గిరినిన్+నున్ ఇత్యాదుల గిరినినుఁ అనురీతి నుండునా? ఇట్లు విడఁదీసిన నిశ్రుతి యెల్లెడలఁ దప్పదుఁగదా. కాఁగా వి. వి. (చిం. అసలు పేర్కొనలేదు.) ననుసరించి యైన "నాతనిన్" అనురూప మట సులభసాధ్యమని(సూరి యట్లు సాధింపఁజాలక పోయె ననియు)చెప్పుటసంగతమా?

మొత్తముపై వీరు సూరిమతమునను భిన్నముగా ద్వితీయకు నుగాగమమును విధించుటచేతనె ప్రస్తుతసూత్రమునొద్దఁ దృతీయాదివిభక్తులయెడ నవసరము గానివిస్తృతవివరణము ద్వితీయాస్థలమందు నవసరము మగును దనవచ్చు అందువలననె ద్వితీయావిభక్తిలోపప్రసంగ మేర్పడినది పై కృత్రిమరూపము లనివార్యముగా నేర్పడుచున్నవి. కాఁగా నింతకు మూల మైన ద్వితీయకు నుగాగమవిధానము పొరపాటని నిశ్చయింపఁదగును.

## ఆచ్ఛికదుమంతము :

"అనుదంత మగు తెనుఁగు దుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును" (24) అను సూరిసూత్రమును "అనుదంత మగు నాచ్ఛికదుమంతమునకు నిగాగమము నిత్యముగా నగు" నని వీరు సవరించిరి. తెనుఁగు దుమంత మనునది యాచ్ఛిక దుమంత మని మార్పఁబడినది.

సంస్కృతసమేతరంబు లయిన తెలుఁగుశబ్దములయందు (సం. 16) అను సూత్రము ననుసరించియుఁ దెలుఁగనఁగా సంస్కృతసమరహిత మని స్పష్ట మగుచున్నది. కాని యిట నన్నియు నాచ్ఛికశబ్దములనే యుదాహరించెను. లక్ష్యములను బట్టి తెనుఁగన నాచ్ఛికమే యని యెట్లు నిర్ణయింతుము. తెనుఁగని చెప్పకయు నాచ్ఛికములనే యుదాహరించిన యాయెడల (సంధి 25, 33 మొ॥) సంస్కృతసమములకుఁగూడ నగుటయు నందుఁ గొన్నింట భ్రాంతి నివారించుటకయి ప్రౌఢ. ప్రత్యేకముగాఁ జెప్పుటయుఁ గలదు. కావున నీయుదాహృతులనుబట్టి తెనుఁగన నాచ్ఛికమాత్ర మని నిర్ణయించినఁ బొరపాటె యగును.

అయిన నీసూత్రము సంస్కృతసమములయెడఁగూడ వర్తిల్లినాఁ? సంస్కృతసమములం దనుదంత మగు దుమంతము లనఁగా ఋకారాంతములు (సవితృ, విధాతృ, మాంధాతృశబ్దములు మొ॥) మాత్రమే యగును. వీనికి నిగాగమము నిత్య మగునా? "షష్ఠీసమాసంబునం దుకారఋకారంబుల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు" ననుసూత్రమునొద్ద సూరి విధాతృ + ఆనతి యని చూపెను. నిగాగమము నిత్యమె యైన "విధాతృ" (యొక్క) అని యుండుటకే యవకాశము లేదు. ఇంక షష్ఠీసమాసమునందు ఋకారమున కచ్చు పర మగుటయె యసంభవ మగును. కాఁగా విధాతృయొక్క యనురీతిరూపము లుండవలయు నన్న నిగాగమము విభాష యనక తప్పదు. కాఁగా నిచటఁ దెలుఁగుదుమంత మన సంస్కృతసమమును గ్రహించుటకు వీలు లేదు. సంస్కృతసమేతర మగు తెలుఁగును మాత్రమే గ్రహింప వలయును. అట్లు గ్రహించుట కాధారమేది?

తెనుఁగుశబ్దమే యచ్చతెనుఁగని తెలియును. సంస్కృతసమము గూడ గ్రహించుచో నిందుఁ దెనుఁగుశబ్ద మేల? అనుదంతం బగుటను తమనకు అన్నఁ జాలదా? కాన "న వికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః" అను సూత్రమునొద్ద వికృతిశబ్దమును సంస్కృతసమశబ్దము గూడ సంగ్రహింపవలసి యున్నను "పూర్వసూత్రాత్ప్రథమామాత్రాదిత్యనువృత్తౌ సాంస్కృతికానాం న భవన్తీత్యేవాలం సూత్రమ్" (కవిశి 387) అనుపద్ధతిలో నిపటఁ గూడఁ దెనుఁగు శబ్దమున కాచ్ఛిక మని యర్థము చేయఁదగును. వఝలవా రాచ్ఛికడుమంతమున కని స్పష్టముగాఁ జెప్పిరి. అది యుచితముగనె యున్నది. సూరియు నట్లు చెప్పిన నింకను స్పష్టముగా నుండును గదా యనిపించును. అయ్యుఁ దెనుఁ గన నాచ్ఛిక మనియె యిట నర్థ మగుటంబట్టి సూరివచనమందు దురుక్తి లే దని మాత్రము గ్రహింపవలసియున్నది. సంజీవనిలో వీరు నట్లు గ్రహించిరి. (వ్యా సం.స 49)

## ౧౨ - ఇత్వము :

"డుమంతంబుమీఁదినువర్ణకంబునుత్వంబున కిత్వం బగు" (25)ననుసూరి సూత్రమును వీరు "డుమంతంబుమీఁదినువర్ణంబు ఉత్వంబున కిత్వం బగు" నని చూపిరి. "నువర్ణంబు ఉత్వంబునకు" అని సూత్రముననే సమాసమునందు నుగాగమ సంధికార్యమును బరిహరించుట యుచితము గాదేదు. ఇది వ్యాఖ్యానము నందుఁ జూపఁదగినవిధానము.

ఇచ్చటిసూరివివరణమును దొలగించిరి. కాని యది యనుచిత మనుతీరుగా విమర్శింపకుండుటంబట్టి యుచితమె యని వీరును దలఁచియుండవలె మఱుపువలన విపటిసూరివివరణము దొలఁగిన దేమో.

సూరి సూత్రవివరణములందు నువర్ణకంబు (నువర్ణకోత్వంబున కిత్వంబు) అని చెప్పెను. వీరు "నువర్ణకంబు" అని చెప్పిరి బుద్ధిపూర్వకముగనె యు ట్లుంచిరా? అయినఁ బ్రయోజన మేమి? వివరింపలేదు.

సువర్ణకం బనక సువర్ణం బనుటచేత  ప్రత్యయేతరమునకు వీకార్య మయ్యెడు నవకాశము గలదు. వీరు తమ ప్రక్రియాశికలో (ద్వితీయ యగు) సువర్ణకము బహుళముగా లోపించు నని చెప్పుకొన్నవా రగుటంజేసి విగాగమము లేక, సువిభక్తి లోపించి, యాగమము మాత్రమే నిల్చి, రాము+ను అని యుండును ఈయాగమము ప్రత్యయము గాదు, కావున సువర్ణకమున నిత్వము చెప్పిన నిందు రాదు. సువర్ణమన్నపక్షమునఁ బ్రత్యయము గాకున్నను నిత్వము వచ్చి రాముని అని యగును. కాని యీయంశమును వారు స్పష్టము చేయకుండుట వీప్రయోజనమును వా రుద్దేశింపలే దేమో యనిపించుచున్నది.

“ఈసూత్రముచేత దుమంతముమీఁద “ను” నిల్వనేర దని తేలుచున్నది. రామును సీఁతించె అనురూపము తప్పని భావము”[ఉ. 105] ఇట్లనుటలో నాగమమున కిత్వము చెప్పునుద్దేశ్యము వీరికి లే దేమో యనిపింపకమానదు. పూర్వసూత్రమునొద్దఁ గాని యిచట నేని రాముని అనురూపమును వీ రుదాహరింపలేదు. [తత్స.8. సూత్రమునొద్దఁ జూపిరి.] ఇట్టియెడల వీరు ద్వితీయ కాగమ మయిన ద్రుతమును ద్రొల్లనకారముగా మాత్రమె యింతకు ముందు చూపుట గమనార్హము. “రాము+నున్ అనునిగాగమాభావమునందలి ద్రుతాంత [ఇది మాత్రము వీరు మఱువరు. విశేషముగాఁ జెప్పికొన్నది గదా.] ద్వితీయాప్రత్యయస్థితియందును ద్వితీయాప్రత్యయముయొక్క ఉకారము తత్స.26.సూత్రముచొప్పున ఇకారము కాఁగా రామునిన్ అనియె రూపమేర్పడును” [ఉ 104] అనుటనుబట్టి వీరు ప్రస్తుత సూత్రముచేఁ బ్రత్యయ మగుసువర్ణమునందె యిత్వము నుద్దేశించి రనఁదగును.

ఆగమమునం దిత్వము వచ్చుటను స్పష్టపరచకుండుటచేత [వీ రిట్టిచోట్ల నాగమమును నకారపుఁబొల్లుగా మాత్రమె చూపుటచేతను] నది వీ రుద్దేశింపలేదు. సువర్ణంబు ఉత్వంబునకు నని సూత్రముననే వ్యాఖ్యానమునందువలె స్పష్టముగాఁ జెప్పఁ దలపెట్టినవీరు సూరిలక్షణమునకంటె విశేషముగా నాగమమునందు నిత్వ మగుట యనుప్రయోజనము నుద్దేశించిన నదానిని వివరింపక విడిచెడివారు గా

దనుట నిశ్చయము. కావున "సువర్ణకంబు" అనుసూరిపాఠమును మార్చవలె ననివీ రుద్దేశింపలే దనియుఁ బ్రమాదవశముననే "సువర్ణము" అని కవర్ణము తొలఁగి పోయిన దనియు గ్రహింపఁదగును.



కాఁగా వఝలవారి ప్రణాళిక ననుసరించి రాముని అనురూప మీవ్యాకరణమున సాధ్యము గాదు.

ఇంక నిగాగమము రాక, సువిభక్తి లోపించి, యాగమము మాత్రమె నిల్చి నపుడు "రామును" అనియే యుండవలసియుండఁగా ప్రస్తుతసూత్ర మెట్లుండ దని చెప్పు నని వఝలవారు వివరించుట సంగతము గా దని గుర్తింపవలెను.

సూరిలక్షణము నిర్దుష్టము, కవిప్రయోగానుగుణము.

## కు ప్రత్యయం - ఇత్త్వము

"ఇకారంబుమీఁది కునుప్రక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు" (28) ననుసూరిలక్షణమును వీరు యథాతథముగనె గ్రహించిరి.

సంజీవనిలో నీసూత్రవివరణసందర్భమున హరినిన్ + ను, హరిని+ను (వ్యా. సం. ప. 495) అని చూపిరి ఇట వీరు బాల. లక్షణమును వివరించు సందర్భ మగుట మఱచియుందురు. బాల. పక్షమున "హరికినిన్" అని యుండదు. ఈశబ్దము దుమంతము గామి నిగాగమము రాదు. సూరి ద్వితీయకు నుగాగమము చెప్పలేదు గావున ద్వితీయానువర్ణము మాత్రమె యుండును. కావున హరిని అనియే యుండునుగాని హరినిన్ (హరినిని) అని యెప్పుడు నవకాశమె లేదు. ద్వితీయపై నుగాగమ మవునెడల హరిని + ను = హరినిని అని యేర్పడును గావునఁ జాద్యర్థకనుశబ్దమును జేర్పనవసరమే లేదు.)

ఇంక వీరు హరినిన్ + ను, హరిని + ను అని చూపుటనుబట్టి చూడఁగా నింతకు ముం దనుకొన్నట్లు (ఆతనిన్ + నున్ అనుచోటవలె నిటఁ గూడ నుశబ్దముపై ద్రుత ముండు నని తలంచిన హరినినిని మొదలుగా "ఆతనినిని" ము న్నగుపూర్వోక్తవిధముగా నపరూపము లేర్పడక తప్పదు.

ఇట్టివిధానమునుగూర్చి "నన్నయాథర్వణు లిస్వరేకత్కృశ మనుమార్పు నుపదేశింపలేదు. చిపుకు, చినుకు, కినుక మున్నగుచోట్లఁ బ్రకృతసూత్రము చొప్పున చివికి, చినికి. కినిక మున్నగుకేతిమార్పు కల్గనేరదు గదా. ఇట్టి నిజపదానియమునుగమము నుపదేశింప నేల యని కావలయు నన్నయాథర్వణులు–" (వ్యా.సం.ప.495)అనిరి. ఇది నిజవరానియమునుగమ మనుటయు, నందుకుఁ గారణముగా వీరు చూపినయంశమును సరి కా వని యుద్యోతమున వీరే పేర్కొన్న దానినిబట్టి గ్రహింపవచ్చును. "క్రియావిభక్తు లనుదానిసాహచర్యమున నీవిధి ప్రకృతులయందు పర్తిల్లదు. చివుకు కిరురించు మొ॥ (ఉ.106)దీనినిబట్టి చిం;వి.ని.బా పయిరీతిసూరిలక్షణము నిజవరాని దనునుద్దేశ్యముతో (నసంగా నీలక్షణము సముచితము గా దని) చెప్పక విడువ లే దనియు నవశ్యము లగుపె క్కితరలక్షణములవలెనె యీయంశమును జెప్పలే దనియు నీరివ చనములను బట్టియు గ్రహింపవచ్చును.

అయిన నతివ్యాప్త్యాదిదోషములు కలుగు నన్నను నాదోషములు పరింపఁబడు నట్లుగా లక్షణము చేయవలెను గాని యున లాయంశమును జెప్పకయే విడువవలయు ననుట యుచితము గాదు గదా. చిం "ఘాతాదుతాం పరేషాం" త్తని క్రియా విభక్తుల నిత్వము చెప్పెను. కునువులయెడఁ (కి,ని వి యనువానిఁ బ్రత్యేకముగాఁ జెప్పుకొనెను గాని) గూడ నట్టి యిత్వము చెప్పవప్పను గదా.

## ఊధాతువు :

"ఊధాతుయుష్మదస్మఁబులమీఁదివానియుత్వంబున కిత్వంబు రాదు" (27) అనుసూరిలక్షణమును వీరు యథాతథముగా గ్రహించిరి. ఉదాహరణములలో సూరి "(ఊకు)నీకు మీకు" అని యవసానమున ద్రుతలోపముతోఁ జూపఁగా వీరు ఊకున్, నీకున్, మీకున్ అని ద్రుతస్వరలోపముతోఁ జూపిరి. ఇందుఁ బ్రయోజన మేమియు లేకుంటయు, సూరివచనము నిర్దుష్టము లగుటయు స్పష్టమె. "ఊకు"

అనుచో సూరి యుదాహరణమున యుష్మదర్థముపై షష్ఠీకువర్ణమున కిత్వము రాకుండుటతోపాటు, ఈధాతువుపై వ్యతిరేకప్రార్థనార్థ మందయినకుప్రత్యయమునను నిత్వము రాకుండుటకు (ఈకు = ఈయకుము) నిది యుదాహరణ మయినది. అట్లుదాహరింప నవసరము లేకున్నను (కు"వర్ణము దానికిని ద్యోతకమై యగుటను దెల్పుట ప్రయోజన మనియుఁ జెప్పవచ్చును) నొక్కదానిచేతనే రెం డుదాహరణములను గ్రహించునవకాశమును గల్పించుట విశేష మనవచ్చును. "ఈకున్" అనువయులవారియుదాహరణస్థలమున నట్టియవకాశము లేదు. అయినను నష్టము లే దనవచ్చును.

"ఇచ్చుధాతువుమీఁదివాని కన్నచో ఇచ్చితిని మున్నగుచోటులం దిష్ట మగు ఇత్వము నైతము వారింపఁబడవలసివచ్చును గావున "ఈధాతు" అని పఠింపఁబడె (వ్యా.సం స.496) నని వీరు వివరించిరి. కాని "ఇచ్చితిని" అనుచో క్రియావిభక్తి యగునువర్ణమునకును ఇచ్చుధాతువునకును నడుమ "తి"వర్ణముచే వ్యవధానము గల్గినది. అయ్యు "ఇచ్చిరి" అనునది యుండగను ఒకటియు నైనయుదాహరణము గదా యనిపించును.

## కుఁనగాగమము :

"కువర్ణకంబు పరం బగునప్పు డుకారఋకారంబులకు నగాగమం బగు" (28) ననుసూరిసూత్రమును వీరు "కు వర్ణంబు పరం బగునపుడు "ఉ"కారంబునకుఁ బ్రాయికముగను, ఋకారంబునకు నిత్యముగాను నగాగమం బగు" నని సవరించిరి. విసంధిప్రయోగము స్పష్టతకే. సూత్రమున ననవసరమే. ఇంత ముఖ్య మగు మార్పు ఉకారాంతములకుఁ బ్రాయికముగా నగు ననుట ప్రయోజనము నిట్లు పేర్కొనిరి. "ప్రాయిక మనుటచేతఁ గవిత్రయేతరప్రయోగములందు ఉదంతంబులకు నగాగమము రాకుండుటయుఁ గలదు. ఉత్సవము కేఁగెఁ క్రియ (ఉహ 86-140) సీతూపు కోర్వక (కవిక.3.119) ఇట్లు పువర్ణాంతములమీఁదను నక్కు రాకుండుట గలదు. [ఉ 107] నగాగమాభావము గుర్తింపవలసినదే యనుట

నిర్వివాదము. కాని కవిత్రయేతరప్రయోగములందలివిశేషములను గుర్తించు సందర్భములను వీ రొకక్రమములోఁ జెప్పియుండలేదు.



క్రియా 91 సూత్రమున ముత్వరకత్వమున "వవ"లు సూరివలెనె వీరును విధించిరి. కవిత్రయాదులకంటె నితరుల ప్రయోగములలో నట్టిది విభాష యని వివరణమునఁ జెప్పిరి. కాని సూత్రమునఁ బ్రాయిక మనలేదు. అటఁ గవిత్రయాదీతరకవిప్రయోగములలో నది విభాష కాఁగా నిది రాకుండుటయుఁ గల దని మాత్రమె చెప్పిరి. [అయ్యు నిందుఁ బ్రాయికశబ్దమును జేర్పవలసివచ్చినది. అం దక్కఱ లేకపోయినది.] కవిత్రయప్రయోగములందు నియత మని వీ రంగీకరించియే యున్నారు కదా. ఇట్టియెడల లక్ష్యానుసారముగా సూరిసూత్రమును యథాతథముగా గ్రహించి పిదపఁ గవిత్రయేతరప్రయోగముల విశేషమును సంగ్రహించుచుఁ బ్రౌఢలక్షణము చూపఁదగును.

పువర్ణాంతముపై నగాగమము గుర్తింపఁదగియున్నది. [ప్రౌఢ.శబ్ద 19]

ఉకార మనుటచేఁ గాఁబోలును "దీర్ఘ మగు ఊకారము పొందను నీవిధి వర్తిల్లును. భ్రూవునకును మొ॥" (శ. 105) ఈయభిప్రాయము సరి కాదు. అని వారే విమర్శించిరి. ఏకాక్షరోకారాంత శబ్దములకు నయితము విభక్తిపరకత్వమున వుగాగమము నిల్చును గాన నూకారముపయి కువర్ణకము నిల్చుట యసంభవము. భ్రూవునకున్ మొ॥ (వ్యా. సం. స. 604) అహో. కూడ ఊకారాంతము పయి (కువర్ణకపరకత్వమున)నవర్ణము (ఇట నగాగమము) వచ్చుటను జెప్పెను అహో. చెప్పినది తప్పయినపు డదే యంశము వీరు చెప్పినప్పు డొప్పగుట యెట్లు; ఇంకఁ జిం. లో వువర్ణాగమ మైన పిదప కువిభక్తి యగును గావున నామ ముదంతమె యగు నన్న వీరు నిటఁ జిం.లోవలెనే సంస్కృతవిభక్తులకే తెలుఁగు విభక్తులు చేయవలె ననిరి కదా! (అట్లు చేయలేదు గాని.) సూరిమతమం దయిన-కువిభక్తిపరకత్వమున (భ్రూ - దీర్ఘముపై కువర్ణక మగును) వుగాగమము చేసిన (హ్రస్వోదంతమైన) పిదపనే నుగాగమము చేయవలెను. కావున నగాగమము దీర్ఘ

మగు ఊకారముపైఁ గలుట యన్నది లేనేలేదు. కావున వీరిపై వివరణము వారి స్థలాంతరవిమర్శనపద్ధతినిబట్టియు యసంగత మని గమనింపవచ్చును.



**"దుమంతములకు నిగాగమము విభాషను వచ్చును గాన నట్టియెడల ఇకార పూర్వకము గాన** నగాగమము రా నేరదు నిగాగమము నగాగమబాధకము" (ఉ. 106) **అని వివరించిరి.** ఇది యసంగతము.

నిగాగమము వచ్చునప్పు డిదంత మగును గావున నగాగమము రా దనియు నందుచే నిగాగమము నగాగమమునకు బాధక మనియుఁ జెప్పుచో నాసూత్రము (తత్స. 23) న "సర్వత్ర" యనుట యేల? సూరి "సర్వత్ర" యనుటచే నగాగమము బాధింపఁబడు ననెను. వీరు నావివరణమును దమగ్రంథమున నట్లే యుంచుకొనిరి. కాఁగా నగాగమమును బాధించున దాసూత్రములోని "సర్వత్ర" యనుదళమె కాని నిగాగమము గాదు.

ఇఁక నట్లైయయిన నగాగమ మగుటకుఁ బ్రాతిపదిక మదంతము గావలె నని నియమము గలదు. నిగాగమమునకు నట్టిది లేదు గదా దుమంత మయినఁ జాలును. ఉదంతముపై నగాగమమును జేసిన రాముని + కు అని యగును. (నగాగమము క్రొత్తపుటచే యదాగమన్యాయమున రాముని ప్రాతిపదికమె యగును) ఇట్లు ప్రాతిపదిక మదంత మయినను నిగాగమము వచ్చుటకు బాధ లేదు గానఁ జేయనగునా? నిగాగమము వచ్చిన నగాగమము రానవకాశము లే దని చెప్పినప్పుడు, నగాగమము వచ్చిన నిగాగమమునకు రా నవకాశ ముండునా లేదా యని సందేహము గల్గుట సహజమె కాన వీరు పైరీతిని వివరింపరాదు.

సంజీవనిలో సర్వత్ర = అంతటను అనుటచేత బా. తత్స. 28 సూత్రము చొప్పున నగాగమము దీనికి బాధకము గా దనియు నిగాగమాభావపక్షమునవె నగాగమము వచ్చు ననియు —" (వ్యా. సం. వ. 90) చెప్పిరి.

[బా. తత్స. 28 సూత్రము నగాగమమునకు నది బాధకము గా దని చెప్పదు. నగాగమమును విధించు నంతియ.] వఝలవారిసయివచనములలో నా

ర్దేశించినదియు నిదియె యనందగును.] నిగాగమము విభాష గావున నిగాగమము రానపుడు నగాగమము వచ్చునెడల 28 సూత్రమున సర్వత్ర యనుదళ మేల ? ఎందుకో సూరియే వివరింపఁగా నింతవివాదము నేలకో యర్థము గాదు. సర్వత్ర యనుటవలన నగాగమము బాధింపఁబడు నని సూరి చెప్పెను. అనగా నచ్చో నగాగమమె రావలసియుండఁగా 23 సూత్రము నందలి "సర్వత్ర" యనుదళముచే నగాగమము బాధింపఁబడి నిగాగమము వికల్పముగా నగు నన్నమాట. దీనిక్రమ మిట్లు గుర్తింపఁదగియున్నది. రాము + కు అనురీతిస్థలములందు, సామాన్యవిధి యగు 23 సూ. చే రావలసిన నిగాగమమును బాధించి విశేషవిధి యగు 28 సూ.చే నగాగమము మాత్రమే రావలసియున్నది. కాని 23 సూత్రమున సర్వత్ర యనుటచే 28 సూత్రము 23 సూత్రముచే బాధింపఁబడి నిగాగమమె యగును. [రామునికిని] కాని 23 సూత్రముచే నిగాగమము విభాష కావున నిగాగమము రానిపక్షము నందు 28 సూత్రము వర్తించుటకు బాధ లేదు గదా. కావున నాపక్షమున 28 సూత్రముచే నగాగమము వచ్చి రామునకును అని యగును. పయివివరణమున నయులవారియభిప్రాయ మీతీరుగాఁ గానరాదు. ఇట్టి దైన స్పష్టముగాఁ జెప్పఁదగు ననఁదగును.

## కంటె, అందు - నగాగమము

ఇట నొక విశేష మిట్లు సూత్రించిరి. "కంటె, అందు అనువిభక్తులు పరం బగునప్పుడును నమహత్తులఉకారమునకుఁ దర్వాతఁ గొన్నియెడల నగాగమంబు గానవచ్చెడి" (వ్యా. సం. న, 606) ప్రౌఢ. శబ్ద. 20, 21 సూత్రములయభిప్రాయమును వీ రిందు సంగ్రహించిరి. "ఉదంతంబు లగునమహత్తులకు అనుప్రౌఢ. సూత్రదళము దుష్టము గాదు. దీర్ఘము లిటఁ జెప్పనక్కఱ లేదు గదా. దానికి వివరణముగాఁ అమహత్తుల ఉకారమునకు నని చెప్పిరి. నగాగమం బనుచో నది కిత్తు గావున నుకారమున కంత్యావయవముగా వచ్చుచునేయున్నది. కావున సూత్రమునందుఁ "దర్వాత" ననుదళము వ్యర్థము. అది లేకున్నను నగాగమము చివర (ఉకారమునకుఁ దర్వాత) రాకమానదు,

తంబె పరకతయందలినగాగమము మహాత్తులకే యని ప్రౌఢ. పేర్కొన లేదు. కాని మహాత్తుల నుదాహరింపలేదు. కాని, అందు పరకత్వమునవలె, తంబె పరకత్వమునను నగాగమ మమహాత్తులకే యయిన వర్ణులవారివలె నాతఁడు వీరెండు సూత్రములు కలిపిచెప్పఁడా యని సందేహము. ప్రౌఢ. ఉదాహరింప లేదు కాని జనకునకంబెను జననికి (కళా. 8.247) ననుచో మహాత్తుపై నగాగమము గలదు. సకలక్షేత్రావాసమునకంబె నం దునికి యొప్పు నరునకు (పారి. 2-84) ననురీతి నమహాత్తులకుఁ బ్రచురము.

## కై - నగాగమము

"కై అనునది కును + ఐ అనువానిసంధిరూపమె యైనను నిది పర మగు నపుడు నగాగమము వచ్చుట కానరాదు. -కై పరకత్వమున నగాగమము నెవ్వరు నుపదేశింపలేదు. అట్టి నగాగమస్థితిని నిర్ణయించుప్రయోగమును లభింపలే(వ్యా. సం. వ. 506) దనిరి. కాని వీరె యీ గ్రంథముననే 1664 పుటలో కర్ణునకయి యని చూపిరి. చైద్యునకై అని నిల్పిరా (వ్యా. సం వ. 462) దన్నవీ రందే 1083 పుటలో చైద్యునకై అని నిల్పిరి. అవి యచ్చుపొరపాట్లేమో

కై యనునది చతుర్థీవిభక్తిగఁ బరిగణింపఁబడఁగ నది కును+ఐ-అనువాని సంధిరూప మనుట సంగతము కాకున్నది. (విభక్తిగఁ జెప్పిన కై కును+ఐ అను వానిసంధిరూప మయినది కాని కునయి యన్నది మాత్రము విభక్త్యర్థాభిధాయకశబ్ద మని వీరె చెప్పుట వింత) సంధి రూప మైన విభక్తిగఁ జెప్ప నేల? చైద్యునకును +ఐ చైద్యునకై యని యేర్పడునే కదా. "కై" కును+ఐ అనువానిసంధిరూపమె యైనపుడు కువిభక్తిపరకత్వమున నగాగమము ప్రత్యేకముగ నుపదేశింపవలసిన యవసరము మాత్ర మే మున్నది? కై పరకత్వమున నగాగమమును నిర్ణయించుప్రయోగము లభింపదే దని గుర్తించిరి కదా? దానినిబట్టి యయినను కై - కును + ఐ అనువానిసంధి కా దని గుర్తింపవచ్చును గదా? కును అని షష్ఠి విభక్తమగునపుడు కైకి ముందు నగాగమము నియతముగ రాకుండుట యెట్లు? కాఁగా కై ప్రత్యయము నిరీతిగ వివరించుట వ్యాకరణమున సరి కా దని గుర్తింపఁ దగును.

## అందు-నుగాగమము :

“ఉకారఋకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు” [29]ననుసూరిసూత్రమును “ఉకారఋకారముల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు” నని చూపిరి.

వివరణమున “తత్స 29వసూత్రముచొప్పున నిగాగమము రానిపక్షమందే యీనుగాగమము వచ్చును. రామునందును, రామునియందును” [ఉ.107] అనిరి. నిగాగమము రానిపక్షమందే నుగాగను మవు ననురీతిగాఁ జెప్పునపుడు ముందగునది నిగాగమము కావున నిగాగమముతోడిరూపమును ముందుగను నుగాగమము తోడిరూపమును బిదపను జూపిన సక్రమముగా నుండెడి దనవచ్చును.

అసలు నిగాగమము రానిపక్షమున నుగాగమ మవుటలో భేదము గలదు. ఇంతకు ముందు నగాగమము విషయమున వీరివివరణము సరిగా లేకుండుట గమనించితిమి. విశేషశాస్త్ర మవుటంజేసి కువిభక్తిపరకత్వమున నట నగాగమమె యెట్లు రావలసియున్నదో యట్లే యిట నీనుగాగమవిధానమును విశేషవిధి యగుటం జేసి సామాన్య మగు[తత్స.23]నిగాగమము రాకుండ నీనుగాగమమే రావలయును అట “సర్వత్ర” [తత్స.23] యనువళముచే నగాగమమును బాధించి నిగాగమ మగునట్లుగా నిచ్చోట నైతము నుగాగమమును బాధించి నిగాగమ మగును. విభాష యవుటచే నిగాగమము రానిపక్షమునందు నుగాగమ మగుట కెట్టిబాధయును లేదు గావున నుగాగమ మగును. “సర్వత్ర” యనుట కుపరకనగాగమమునకువలె నందుపరకనుగాగమమునకు బాధనార్థమె యని గుర్తింపవలయును, కాఁగా రాముని యందును, రామునందును. అనుక్రమమున నుదాహరింపవలెను.

నిగాగమము రానిపక్షముననే నుగాగ మవు ననుటతో వరుసలవారికిని పై యభిప్రాయమె యుండుచో సర్వత్ర యనుటచే నగాగమమువలె నుగాగమమును బాధింపఁబడుట పేర్కొనియుందురు గదా.

**అందు-వైభాషికనుకళ్ళు :**

"ఆగమమువువర్ణంబుల కందువర్ణకము పరం బగునప్పుడు నుగాగమంబు విభాష నగు" [30]ననుసూరిసూత్రమును వీరు "ఆగమమువర్ణకంబున కందు వర్ణకము పరం బగునప్పుడు నుగాగమంబు విభాష నగు" నని సవరించిరి.

వీరు "ఆగమమువర్ణకంటు" అనుచో వర్ణముగా సూరి పేర్కొన్న[ము] దానిని వర్ణకముగాఁ జెప్పుట సరి గాదు. ఆగమముగా వచ్చిన[ము]వర్ణము ప్రత్యయము గానేరదు గదా.

సూరి యాగమమువువర్ణంబు లని వుగాగమమును గూడఁ బ్రస్తావించెను. కాని వీరు వువర్ణమును దొలఁగించుచు నిట్లు పేర్కొనిరి." ఆగమవువర్ణకంబుపైని నయితము నుక్కు పాక్షిక మని సూరి వచించెను. సూరి యుదాహరించినట్లు ధేనువందును అనురీతి గలప్రయోగములు లేవు. [ఉ.10౹] సూరి యాగమ[ము] వువర్ణంబు లనియెనె కాని వర్ణకము లనలేదు. ఆగమమును బ్రత్యయముగాఁ జెప్పుట కాధారము లేదు.

ఇఁక వుగాగమముపై నుక్కు లే దని నిర్ణయించుటయు సరి కాదు [వ్యా సం.స.508] సూరి యుదాహరించిన "ధేనువందు" నన్నది యేకవిప్రయోగమో తెలియకున్నది గాని వుగాగమముపై నుక్కు గలదు. మొక్కలమునం గదళీతరు వందు [జై 6.118] వ్యాపృతం బగువస్తువందు [శృం.శా.1.24] దామువందు [భాగ 3-501, 4-415,8-491] మృత్యువందు [భాగ.7.427] బిందువందు [భాగ. 7.467] అట్టి గ్రీష్మర్తువందు [కువ.1.105] బాహువందుండి [కువ.1-38]. అమహాత్ములవుగాగమముపై నుక్కు గల దనుఆం.భా. అవను. ఘులవారు విమర్శించుట [వ్యా.సం.స.508] సరి కా దని పయి ప్రయోగములు నిరూపించును మహాత్ములపైఁ గల వేమో వెదుకవలసియున్నది, (విభాష నాశ్రయించి మహాత్ముల

వుక్కుపై వైభాషికనుక్కు లేదని యనఁగా బాల.తత్స.29చే నుక్కు నిత్యమె

యని గ్రహింప వీలు కలదు.]

చెఱువందున తావందున్ మున్నగు రూపముల కెవ్వరును సాధుత్వము నుపదేశింపలేదు. అట్టియెడల నిత్యనుగామమె బా.తత్స.29సూ.చొప్పున లభించును [వ్యా.సం.వ.509] ననిరి. కాని అట్టిప్రయోగములును గానవచ్చును. చిత్తరువందు [శృ శా 2.185విజ.1–198 అహ.3.32] ఒకపువ్వందులతోనె [భాగ.10 పూ.1456] ఇప్పటిపుట్టువందు [హం.2–218] అత్తెరం దేవురు. [శృ.శా.1–349]. దీనింబట్టి ఆమహాత్ములకుఁ గొన్నియెడల నందువరకతలో నుగాగమము లేకుంట సాధారణముగా జెప్పఁదగునా యనిపించును.

లక్ష్యప్రాచుర్యము ననుసరించి సూరిలక్షణమున దురుక్తి నెన్నరాదు. వరుఖల వారివివరణము సముచిత మనరాదు.

## సంబోధనము–అత్వము :

"బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లగాగమం బగు" (31) ననుసూరి లక్షణము యథాశేషముగా గ్రహించిరి.

వ్యా.సం.వ.లో అదంతామహత్తులకు ముగాగమమును, నువంతములకు వుగాగమమును సూరి విధించును గావున నిలకారాగమమును ప్రకృతి కంతాగమముగా నుపదేశింపక ప్రత్యయమున కాద్యవయవముగా నుపదేశించినవాఁ డయ్యె (10) ననిరి. మువులు ప్రకృతి కాగమము లైన "ల"వర్ణమును బ్రకృతి కాగమముగాఁ జెప్పుటలో నవరోధ మేమి? ప్రకృతికి రెం డాగమములు చెప్పరాదా? "వధువునకు" ననుచో వుగాగమ మయినపిదప నగాగమ మగుట లేదా? "ఉకార ఋకారంబుల" కని (తత్స 28)యానిగాగమము ప్రకృతికే గదా విధింపఁబడినది? "బహుత్వంబున ద్వితీయాదివిభక్తులు పరంబు లగునపుడు లగాగమం బగు" నన్న వనములకు, వధువులకు ననురీతిరూపములు గావా? మువులు ప్రకృతి కాగమముగాఁ

జెప్పుట "ఱ"వర్ణము నట్లు చెప్పకుండుటకుఁ గారణ మెట్లయినదో వఝలవారు వివరించిన బా గుండెడిది.

లాగమమును బ్రత్యయమునకుఁ జెప్పుట మఱుగ్వాగమవిధానముచేతోడి బాధచేఁ గాదు విభక్తి లకార మగుట (రేఫ మందుట) సిద్ధించుటకే యని వఝల వారు పిదపఁ జేర్కొన్న ప్రయోజనము నుద్దేశించియే సూరి లట్టని ప్రత్యయమున కాగమము చేసె నని గ్రహింపఁదగును.

"సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుదియుకారంబున కకారం బగు" (32)ననుసూరిసూత్రమును సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుది ఉకారంబునకు అకారం బగు" నని వఝలవారు చూపిరి. ఇట్లు సంధివిరహితముగఁ బ్రయోగించుట స్పష్టతకుఁ గావచ్చును. కాని "సంబోధనబునం దేకార్థం బయిన" అనుచోట్ల సంధులు మానలేదే. తరువాతసూత్రమున "అకారేకారంబులకు" అను సంధిలో లేనిభ్రాంతి యిట సంధి మానినస్థలముల నట్లు చేయకున్నఁ గల్గునా? కాఁగా నీమార్పు ప్రయోజనవంతము గా దనక తప్పదు. సూరిసూత్రము సముచితము. వీరిసూత్రము దానికి వివరణముగా నున్న దనవచ్చు.

## సంబోధనము-దీర్ఘము :

బాల.తత్స 33,34 సూత్రములు యథాతథముగా గ్రహించిరి. 33 సూత్రమునకు సూరి యుదాహరించినవానిలో ఓరాముఁడా ఓ రాముఁడ, ఓహరీ. ఓహరి యనువానిని జూపి ఓచెలియా, ఓచెలియ, ఓతండ్రీ ఓతండ్రి యనువానిని వీరు పరిహరించిరి అట్లు చూపుటలో దురుక్తి లే దనుట స్పష్టమె. సంస్కృతసమశబ్దములందే కాక యీదీర్ఘ మాచ్ఛికశబ్దములకు నగుటను సూరి యుదాహృతులు స్పష్టము చేయుచున్నవి. మఱి యేప్రయోజనము నుద్దేశించి వీ రాచ్ఛికోదాహృతులను బరిహరించిరో తెలియకున్నది. 32,సూత్రముకడ ఓకొడుక యున్న యాచ్ఛికోదాహృతిని వీరును జూపియే యున్నారు.

వీరిట ఇగాగ్రప్రత్యయము సవర్ణంబు పరనామునకు గుణముగ వివరణమునఁ జేర్కొనిరి. ఇది ప్రత్యేక మగుటచే వివరించుట కాక విధించుట యుక్తముగా నుండును. ప్రాచీ. సూత్రించెఁ గదా. దానిఁ జూపఁదగు. స్మరించియే యుండఁదగు.



## ప్లుతవిధి :

“ఉదంతసంస్కృతనామంబుమీఁదిసంబుద్ధిడుజ్జునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు (81) ననుసూరిసూత్రమును “వీరు ఉదంతసంస్కృతనామంబు డుజ్జు సంబోధనంబున వైకల్పికముగ లోపింపఁగా మిగిలినపదముతుదిఉకారము దీర్ఘ మగును” అని సవరించిరి. “సంబుద్ధిడుజ్జు” అనుదానికి వ్యాఖ్యానమే “డుజ్జు సంబోధనమున” అనువదులవారిసూత్రభాగము. సూరిలక్షణమున వీరు చేసిన మార్పులు రెండు. సూరిప్లుతమును దీర్ఘముగాఁ జెప్పుట. ప్లుతము డుజ్జున కాదేశంబగు, డుజ్లోపము చెప్పి ముందటియుత్తునకు (దీర్ఘము) విధించుట రెండవది.

సూరి ప్లుతమును విధించుటనుగూర్చి యిట్లనిరి. “సూరి యాంధ్రవర్ణసమామ్నాయమునందు లేని ప్లుతమును విధించుట సరి కాదు. చింతామణిలోని ప్లుతశబ్దమునకు దీర్ఘమని యర్థము. (ఉ. 109) ఇట్లనుటం బట్టి సూరి చిం. ననుసరించి ప్లుతమును జెప్పియుండు ననియుఁ గాని చిం. అభిప్రాయము వీరివలె సూరి కర్థము కాలే దనియుఁ దెలియుచున్న మాట. చిం. లోఁ బ్లుత మనఁగా దీర్ఘమె అగుచో లక్ష్యములు చూపలేదు గదా. ఏ ట్లయినఁ జెప్పిన ట్లనా? సంబోధనే ప్లుతం ప్రాహుః కేఽద్దూరాదిరేఽభితః « నుచో వి వ. జూడఁ బ్లుతమును జేర్కొన్నది. అటఁ బ్లుతశబ్దమునకు దీర్ఘ మని వీరు నర్థము చేయలేదు (వ్యా.సం.స. 13) వి.వి. ప్లుతమును సామాన్యముగా విధించుటచేత అకారేకారములకును జేయవలెను. అంతకుముందు వి.వి. అకారేకారములకు దీర్ఘము విశేషముగా విధించియుండుటచే నిటఁ బ్లుతశబ్దమునకు దీర్ఘ మని యర్థము చేసిన నది కేవిన్మత మయి పూర్వవిరుద్ధ మగు. అందుకే వీరిట దీర్ఘ మని యర్థము చేయలేదు. పైఁగా క్షితిశోకతర్కగీతదూరాహ్వాన, సంశయార్థములను జరుగుఁ బ్లుతము” (అప్ప3.142) ఇట్లు తననాఁటికే

కొందఱు చెప్పుచుండుటచేత నట్టియనుస్వరపోక్తిని బాగాయెనే కాని యథర్వణుఁడు సమ్మతించె ననరా" (వ్యా.సం.స.13) దనిరి. అప్పకవి యథర్వణునినాఁటివాఁడా? తిక్కన కించుకపూర్వుఁడే యనఁదగునథర్వణునకు (వ్యా సం స 182,459,912) నప్పకవి సమకాలికుఁడా. అప్పకవివాక్యము నథర్వణుఁడు విమర్శించుట యసంభవము, అప్పకవియభిప్రాయ మంతకుఁ బూర్వమె యథర్వణునినాఁటి కుండఁగా నద్దాని నథర్వణుఁడు విమర్శించె ననవలె. అథర్వణుని నాఁటి కట్టియభిప్రాయము గల దనుట కథర్వణుని వచనమె యాధారము గాఁగలదు. బిన్దుం ప్రవదన్తి తం క్వచిత్తేచి త్తనుచోఁ గేచిత్పక్షముగా బిందువు సమ్మత మనిరి. ఇటఁ గేచిత్పదముచే నిది యథర్వణులయభిప్రాయము గా దనిరి. వి వి.లోఁ బ్లుతమె కాని చిం.లో మాత్రము ప్లుత మన దీర్ఘము. చిం. ఉదంతములకే ప్లుత మనఁగా దీర్ఘము విధించినది. మఱి యితరములకు రాదా? అకారేరములకు నుండఁగా నుకారమునకు మాత్రమె విధించు టెట్లు? నిత్యము గావచ్చును (వ్యా.సం.స 517) కాని యితరములస్థితి యేమి? అందుకే బా.స.ప్రభృతులు సంస్కృతవ్యాకరణప్రసిద్ధ మయిన ప్లుతముగనె వివరించిరి. తదనుగుణముగనె సూరియు [నకారేకారములకు దీర్ఘము చెప్పి] సంస్కృతోదంతపుమంతముఁ యుకారమునకు మాత్రమె ప్లుతమును విధించెను.

పిదప ఆంధ్రవర్ణసమామ్నాయమందె ప్లుతము లేదు. దూరాహ్వానరోదనాదులందును-బ్లుతము లేదు" (ఉ-108) అనిరి. వర్ణసమామ్నాయమునఁ బ్లుతము లేదు గావున దానిని విధింపరా దని యభిప్రాయము. సూరి చిం. ననుసరించియె చెప్పెను. చిం. కూడ వర్ణమాలలోఁ బ్లుతమును బరిగణింపలేదు. వర్ణసమామ్నాయమునం దిట్టిది పేర్కొనియుండక పోవుటచేతనే "ఉకారంబు ప్లుతం" బని యీ వర్ణమును సూత్రమున నుచ్చరించినట్లు గ్రహింపఁదగును. "ఊకారంబు ప్లుతంబు అని సూరి వచించుటయు సరి కాదు. ఊకారము దీర్ఘమె కాని ప్లుత మెట్లగును? (వ్యా. సం. స.618) అనుట సముచితముగా లేదు. ప్లుత మనుట ననుసరించియె యుకారము త్రిమాత్రాకాలికమైనయుచ్చారణము గలదిగా గ్రహింపఁదగియుండఁగా దీర్ఘ మనుట యుక్తము గాదు గదా.

వీరు "ఊతి అనుదానిచేఁ బుతోకారప్లుతి గల్గిన నది గురువు కానేర దని యూతఁడు తలంచినట్లు తోఁచుచున్న (వ్యా సం. స 518) దనిరి. ఇది నిరాధారము. ప్లుతము లఘువె యనుటకు సూరివాక్యములం దెట్టి యాధారమును జూపకయె యు ట్లనుట తగదు అస లిట గురులఘువుల ప్రసక్తియే సూరిలక్షణవివరణములందుఁ గానరాదు.

చిం లో ప్లుతవిధానము నిర్దుష్ట మయిన సూరివిధానము నట్లే. ప్లుతమునకు దీర్ఘ మని యర్థము చేయుటే తగదు. కాని ప్లుతమును విధింపవలసిన యవసరమె గానరాకున్నది. ప్లుతమువలన నెట్టిప్రయోజనమును గానరాదు. చిం. చెప్పినట్లే సూరియుఁ జెప్పవలసినయవసర మేమి ? దీర్ఘమ యవు నని చెప్పిన నేకవిప్రయోగ మైన విరోధించునా ? కాన సూరి చిం ననుసరించి ప్లుతమును విధింపక దీర్ఘమును జెప్పిన బాగుండెడి దనవచ్చును.

ఈసూరిసూత్రమున వీ రిం కొకమార్పు చేసిరి. సూరి దుజ్జనకె ప్లుతమయినయూకారము నాదేశము చేసెను. శంభుఁడు అని యుండఁగా దుజ్జన కూకారము ప్లుతము రాఁగా (శంభు+ఊతి) సవర్ణదీర్ఘస్వరసంధిచే శంభూతి అనురీతి రూపము అవును. వీరు "దుజ్జు వైకల్పికముగా లోపింపఁగా ఉదంతసంస్కృత నామము తుదిఉకారమునకు దీర్ఘ మగు" ననిరి. లోపింపఁగా ననుటచేత నాలోపమును ప్రస్తుతసూత్రము విధించుటలేదు. మఱి యొకసూత్ర మేదియు నిచ్చటిదుజ్జునకు లోపము చెప్పదు. కృతోత్కం బగు (తత్స. 35) అనుసూత్రముచే నీ సహజోదంతములకుఁ బైని లోపము రాదు. కాఁగా వైకల్పికముగా లోపింపఁగా— అని చెప్పినసామర్థ్యము ననుసరించి దీనిచేతనే లోప మగు నని చెప్పుకొనవలె. ఇందుఁ దప్పు లేదు. కాని బాల. క్రియా. 30. సూత్రస్థలమున నిట్టిస్థితిని లోటుగా నెన్ని యాసూత్రమును సవరించి (ఉ. క్రియ.31) చెప్పినవీ రిటఁ దమసూత్రమున నట్టిస్థితిని గల్పించుట సముచితము గా దనక తీఱదు.

ఇంక లక్షణవాక్యమున "మిగిలినపదము" అనుట స్పష్టతకుఁ గావలెను, ప్రయోజనము లేదు. లోపింపఁ దుదియుత్తున కని చెప్పియున్నను నెట్టియిబ్బంది

యును లేదు. కాఁగా వ్యర్థ మయిన "మిగిలినపద" మనుదానిని జేర్చుకొనుటయు అనవసర మయినదుగ్లోపమును విధింపకుండుటయు సరిగా లే దనవచ్చును.



వీ రెట్లును నిత్యస్థలమున దుగ్లోపమునే చేయుచున్నారు. పూర్వసూత్రమందు వలె నిటఁ గూడ నిలోపము వైకల్పికమే. కాన నాసూత్రముననే కృతోత్తమములనక "సంస్కృత నామంబును త్త్వంబుపయి దుగ్జనకు లోపంబు విభాష నగు" నని చెప్పుకొన్న సరిపోయెడిది గదా యనిపించుచున్నది. పిదప నిట దీర్ఘమును విధించుకొనవచ్చును. కానిచో నిటనే "ఉదంతసంస్కృతనామంబుసంబుద్ధిదుగ్జనకు లోపంబును ముందఱియుత్తునకు దీర్ఘంబును విభాష నగు" నని సూత్రింపవలెను. అయినచో నీరెండుకార్యములు గలసియె వచ్చుటయుఁ (వస్త్రాలు) బహువచనమున రెండును రాక (వస్త్రములు వలె) శంభుఁడ ఇత్యాదులు నగును గదా.

## ఆరగాగమము

"సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు" (36) అను సూరిసూత్రమున "బహువచనంబునకు అరగాగమం బగు" నని సంధిని విడఁదీయుటయె వరుులవారిలక్షణమున విశేషము. సూత్రమున నట్టియవసర మేమి ?

బాల. తత్స. 37 సూత్రము యథాతథముగా స్వీకరించిరి. ఇట "క్రియ బహువచనముతో నున్నను దానిపై నున్న అమ్మాదు లేకవచనాంతములె యగు" (ఉ110) అని పేర్కొనిరి. ఇది యనవసరము (చూ. త్రి. శే ప్రౌఢ. శబ్ద44)

## లకారమునకు రేఫము

"అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయినమహత్తుమీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు" (38) అనుసూరిసూత్రమును "తత్సమమహత్తుమీఁది-"అని నవరించి పేర్కొనిరి. సూరి సామాన్యముగా మహత్తనఁగా వీరు తత్సమమహత్తనుట విశేషము. ఇట్లనుటచేత వేలలు మూలలు అనుచో రేఫాదేశము లే దని

(ఉ 110) వివరించిరి. కాఁగా సూరిలక్షణమునఁ దత్సమశబ్దము లేకుండుటచే  బేలలు మాలలు ఇత్యాద్యాచ్ఛికశబ్దములయెడను నీకార్యము రావలసియున్నది.

కాని వీరు సంజీవనిలో "తపరకరణస్వారస్యముచేతనే యీవిధి తత్సమములకు మాత్రమె యని వ్యక్తమగుచున్నది. బేలలు మాలలు (వ్యా.సం.స.521) అని వ్రాసినారు. తపరకరణముచేతనే యీవిధి యాచ్ఛికశబ్దములపై లే దని యర్థమగుచుండగా నిట వీరును దపరకరణము చేసియు తత్సమమహత్తనుట యేల? సూరిలక్షణము నిర్దుష్టమనియె సంజీవనినిబట్టి పండితులవారియభిప్రాయము నెన్నవలె. కాని యిట మాఱినది.

ఇటఁ దపరకరణముచే నాయర్థము సిద్ధింపదా. సంజీవనిలోనె వీ రాయర్థమును వ్రాసినుట సరి గా దని యిచ్చటివివరణమునుబట్టి తెలియవచ్చును. అది యనుచితమే. తపరకరణమునకును దత్సమమే యగుటకును సంబంధ మేమి?

ఆచ్ఛికములను బరిహరించుటకే తపరకరణ మనుట సమన్వయించు టెట్లు? అప్పుడు తత్సమములకే యని సమన్వయించినపుడే యది సార్థక మగు ననవలె. అనఁగా అకారాంత మనుచోఁ దత్సమాచ్ఛికములు రెండింటికి రావలసియుండఁగా నదంతము లనుటచేఁ దత్సమములు మాత్రమె వచ్చు ననవలె. దీర్ఘాకారాంతములాచ్ఛికములందే కలవా? ఆచ్ఛికములందు మాత్రము హ్రస్వాంతముల కీవిధి యప్పుడు మాత్రము వర్తింపదా? ఎట్లు చూచినను దపరకరణమునకు నీవిధి తత్సమములకు మాత్రమె యగు ననుటకును బరస్పరము సంబంధ మేమాత్రమును గానరాకున్నది. కావున నుద్యోతములో వరులవా రీరీతిసమన్వయమును విడిచి పెచ్చు టుచితముగా నున్నది.

ఉదంత సంస్కృతనామంబు" అనురీతిగా నిచ్చటఁ గూడఁ దత్సమ మనక సంస్కృత మన్న బా గుండెడి దేమో యని సందేహము. బాల+లు అనుచో

"బాల" శబ్దమును దత్సమముగాఁ గాక సంస్కృతముగాఁ జెప్పుట సూరిమార్గముగాఁ దోఁచుచున్నది. ఉదంతసంస్కృతనామం బనుచో వఝలవారు నాపద్ధతి ననుసరించియున్నారు.

అయిన సూరిలక్షణము ననుసరించి వేలలు మాలలు అనురీతిస్థలములందును రేఫము రావలయునా యని సందేహము.

"వాచులంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు"ట తత్సమములందే కాని తద్భవదేశ్యములందు లేదు. సూరి యిట రమా-రమ సిరీ-సిరి యని సంస్కృత ప్రాతిపదికలకే హ్రస్వము చేసెను. "లకోరీలు అనుచోట దీర్ఘము గావునఁ దపరకరణముచే నుత్త్వము రాలే దని (తత్స.45) వివరించుచో నితరప్రాతిపదికలకు హ్రస్వము రాకుండుటను సూరి స్పష్టము చేసెను. అదేవిధముగాఁ దత్సమపరిచ్ఛేదమునందలి ప్రస్తుతవిధిచే సంస్కృత [ప్రాకృతసమము లట్టివి మృగ్యములు] ప్రాతిపదికలయెడ మాత్రమె వర్తించు నని గ్రహింపఁదగియున్నట్లు తోఁచుచున్నది. అట్టియెడల సంస్కృతమహత్తు [లేదా తత్సమమహత్తు] అని చెప్పుచున్నను సూరిలక్షణము విరుద్ధ మగుట గుర్తింపవచ్చును. దీనికి బాధకాంశములు గల వేమో పరిశీలింపవలసియున్నది

"సూరి దయాళురు" అనునదియుఁ గల దని వ్రాసెను. కాని యట్టి కవిప్రయోగము లే [ఉ.110] దనిరి. సూరి "కానంబడియెడి" ననుటచే నెచ్చటనేఁ జూచియే యుండు నని చెప్పవలెను. లక్షణముచే సాధ్యము గాకున్నను ప్రత్యేకముగాఁ 'గానంబడియెడి' ననుట నిరాధారముగాఁ ద్రోసిపుచ్చరాదు గదా. దయాళురు వనఘులు [భాగ. 4-634] విహితశాసనులున్ దయాపరున్ [భాగ-5-112] కదు దయాళువు దేవతాగణము లెల్ల [భీమ-2.159] "కృపాళు లొనర్చిన మేలు [నిమి. 3-94] అని యిం కొకటియుఁ గాననయ్యెడి] ఇట్టి వచ్చుపొరపాటులా ; సూరి యిట్టివానిని జూచియే కానంబడియెడి" నని చెప్పియుండవచ్చును.

## మువర్ణకము

"అమహన్నపుంసకముల కడంతములకు మువర్ణకం బగు" [illegible] అను సూత్రమును వీరు "అమహన్నపుంసకముల ప్రథమైకవచనమునకు మువర్ణక మాదేశ మగును" [౬ సూ౦౦] అని సవరించిరి.

"ప్రథమైకవచనమునకు" అను షష్ఠీవిభక్తిచేతనే దాని స్థానమున [ఆదేశము] వచ్చుట సిద్ధించుచుండఁగా వీరు సూత్రమున మరల నాదేశ మనుట యనవసరము.

"ప్రథమైకవచనమునకు" అనుటయే యనవసరము. "పుంలింగ మగుమహ ద్వాచకంబునకు డు జ్ఞగు" ననుసూరిసూత్రమును వీరు యథాతథముగనే స్వీకరించిరి. ఆ సూత్రమునఁ బ్రథమైకవచనమునకు న ను ద శ ము లేదే. అంత మాత్రమున నయ్యది యితరవిభక్తులయం దగుట గాని ప్రథమైకవచనమునకు [ముందో వెనుకో] ఆగమ మగుట గాని జరుగుట లేదు గదా. అట నవసరము గాని యియ్యది యిచ్చట నేల యవసర మగును. వయిఁగా మువర్ణకము విట్లు విధించుటవలన నిట్లు విధింపనిచో జాదు లిం కొకవిధముగ నగు నేమో యనుసందేహమును గల్గఁజేయుచు నీయది యనర్థక మగుచున్నది.

ఆసూత్రమునెడలవలె నిటఁ గూడ "డుమువులు ప్రథమ" యను సూత్రముచే మువర్ణము ప్రథమ యగుటయు "డుమున లేకవచనంబు" లనుసూత్రముచే నేకవచనము నగుట నీమువర్ణకము ప్రథమైకవచనముగానే వచ్చుట సిద్ధించుచున్నది. మొత్తముపైఁ "ప్రథమైకవచనమునకు" నని సూరికంటె నధికముగాఁ జెప్పినభాగము వ్యర్థము [అనర్థకము]గా వీరిలక్షణమునఁ జేరినది.

ఇంక సూరి లక్షణమునందలి "అదంతములకు" ననుదశమును దొలఁగించుటయె సూరిలక్షణముకంటె వడులవారిలక్షణమునందు ముఖ్య మయినమార్పు. దానిం గూర్చి "అన్నెము, పున్నెము, గాము, గీము ము న్నగు ననేకోదాహృతులనుబట్టి

సూరిగారి "అదంతములకు–" అనుదళము అనర్థక మనఁదగు.(ఉ:111 వ్యా.సం.స. 532)నని పేర్కొనిరి.



సూరి యభిమతముల కనుటచే నదంతేతరములకు మువర్ణకము రాదు. కావున పున్నెము, గాము, గీము ఇత్యాదులు కావని వీరినిర్ణయము. "అదంతములకు" ననుదళముచే అన్నెము పున్నెము నన్నవానికి బాధ లేదు అన్నియ, పున్నియ, యనురీతిగా నియ్యవి యియాంతములై యున్నదశలో నదంతములై కావున మువర్ణకము సిద్ధించును పిదప నియ కెత్వమై అన్నెము పున్నె మని యగును. సూరి ముత్తియము– ముత్తెము అని చూపెనే. ముత్తెము ఎట్లయిన దని సూరి తలంచెను. ఇవి యట్లు గావా? ఎదంత మయినపిదప మువర్ణకమునే చేయవలసియున్నచో నారూపము లగు నని సూరి యెట్లు తలఁచును. విరుద్ధములైన నెట్లుదాహరించు? పున్నియ, పున్నె– అనువానిపై వేర్వేఱుగా మువర్ణకము సాధింపవలసినయవసర మే మున్నది? ఇయాంతములై రూపములు గానరానవు (బల్లెము?) దచ్చోటియిని కు బహుళగ్రహణముచే (అచ్చ.21) నెత్వము నిత్యమని చెప్పుకొనుట లక్షణానుగుణమె కదా. కావున నెదంతములపై మువర్ణకమును సూరిసూత్రము సాధింపఁజాల దనుటకు వీలు లేదు.

గాము–గీము అనుచో ఆకారేకారాంతములపై మువర్ణక మయిన దని వరుసలవారితలఁపు. కాని యిం దున్న మువర్ణము ప్రథమైకవచనప్రత్యయముగాఁ జెప్పుటకుఁ దగినయాధార మందుఁగానరాదు మువర్ణకమునకుఁ జెప్పఁబడి కార్యము లేవియు దీని కగుట లేదు. మువర్ణకమునకగు మాముడి పూర్ణబిందుపూర్వకబువర్ణము వీని కగుచున్నవా? దీర్ఘముమీఁద బూర్ణము సాధ్య ముండుటకు వీలు లేదు గాన నది లోపించి గాబు గీబు అని కావలయును. (వీడు "సీంబ" అనుచో దీర్ఘముమీఁదను గల దనిరి. అచట "ంటి"వర్ణము దీర్ఘముపై నున్నట్లే యిటఁ గూడ నిల్చి నందుమా గాంబు గింబు అని వీరిమతమున నుండుటలో బాధయు లేదు.) మాముడి యైన దీర్ఘమునకు హ్రస్వమై (సమా.13) గమ్ము– గిమ్ము అనురీతిగాఁ గావలెను.

ఇప్పటిమువర్ణమున కెట్టి పనులు గూడఁ గానింపవు. ముప్రత్యయలక్షణము లేవియుఁ గానరానియీచోట్ల నున్నమువర్ణమును బ్రత్యయముగాఁ జెప్పుట యెట్లు గుదురును?

గీము వాము పాము- ఇత్యాదులు స్త్రీసమము లని ఆం. భా. అ స్పష్టము చేసినది. దానిఁగూర్చి వజ్ఝలవారు (గృహము అనుదానివికృతి యగుగీము స్త్రీసమ మనుట సరి యని తోఁప (వ్యా. సం. స. ౬౩౭) దనిరి. కుడ్యము అనుదాని వికృతి యగుగోడ స్త్రీసమము గాదా? తామరస మ్- తామర ఇత్యాదిగా నెన్ని లేవు? గృహము అనుచోట మువర్ణము గానఁ దద్భవ మగుగీము అనుదానియందలి "ము"వర్ణము ను బ్రత్యయమె యనవలెనా? కేవలము మువర్ణమునుబట్టి యది క్లీబసమ మను టెట్లు? వీనికిఁ బ్రత్యయమువర్ణమున కగుకార్యము లేవియు లేమి నివి స్త్రీసమము లని ఆం. భా. అ. తలఁచుట యుచితమె.

వీ రిట్లే కనుము పాము ఇత్యాదులలోను మువర్ణము ప్రత్యయమె యందురు. (వ్యా సం. స. ౬౩౭) స్థూలముగా శబ్దముచివర నున్నమువర్ణ మెల్లమొదలఁ బ్రథమైక వచనమె యని వీరితాత్పర్యముగాఁ జెప్పవలసియున్నది అది సమంజసము గా దనక తప్పదు. అప్పు ప్రేవు ఇత్యాదులలో వువర్ణ మెట్లు నామగతముగా భావించిరో యదేవిధముగా వీనియందలిమువర్ణము నామగతముగాఁ జూపుటయె యుక్తము. సూరి ప్రత్యయమువర్ణమునకుఁ గల్పిత్యేకలక్షణములనుబట్టి తద్భిన్న మగుదానిని ప్రాతిపదికావయవముగనె యెంచె నని యాతనిలక్షణమునుబట్టి గ్రహింపవచ్చును. అదియే సమంజసము. కాఁగా, గాము, గీము, కనుము, చేము, నోము ఇత్యాదు లందలిమువర్ణము నామగతమె కాని ప్రత్యయము గాదు అంచువలననె యామువర్ణమునకు మువర్ణకకార్యము లేవియు నగుట లేదు.

ఇది ప్రత్యయము గాదు. వాదమునకై ప్రత్యయమె యన్నను నీరూప ములనుగూర్చి సూత్రమునందలియదంతముల క ను ద ళ మనర్థక మని

నిర్ణయింపరాదు. ఎట్లన- "గామ్" అనుచో "మ్" ప్రత్యయ మన్న "గా" యన్నది ప్రాతిపదికము ఇది యాచ్ఛికమె కదా. అయిన "ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నగు" నుండవలె. (ఇది పుంలింగతుల్య మనరాదు గదా.) కావున నిది స్త్రీసమమో క్లీబసమమో కావలె. స్త్రీసమ మన్నం బ్రథమైకవచనలోపము మేర్పడదు. కావున నయ్యది స్త్రీసమము గాదు. ఇంకం గ్లీబసమము గావలె. క్లీబసమత్వాతిదేశమునకుం బ్రయోజన మేమి? ముఁవర్ణక మగుట యని సూరియే స్పష్టము చేసెను. ఇది క్లీబసమ మయినను నదంతము గాకుండుటచే ముఁవర్ణకము రా దని తలంచిన నింకం గ్లీబసమత్వాతిదేశమువలనం బ్రయోజన మేమి? కావునం గ్లీబసమత్వాతిదేశసామర్థ్యముచేతనే యాచ్ఛికముల కదంతములు గాకున్నను ముఁవర్ణకము సిద్ధింపక తప్పదు. ఊరు మొద లగునుదంతములకు స్త్రీసమత్వాతిదేశమువలనం బ్రథమైకవచనలోపమె యగుచున్నది గాని పువర్ణక మగుట లేదు గదా. కాంగాం బై సూరిసూత్రమున "నదంతములకు" ననుదళ మున్నను గా(ము) ఇత్యాదిక్లీబసమములకు ముఁవర్ణకము రాకపోదు. ఆచ్ఛికశబ్దములం దెల్ల నిట్టిస్థితి తప్పదు. కావున "నదంతముల" కనుదళ మనర్థక మని నిరూపింపవలె నన్న వఝలవా రదంతము గానిసంస్కృత ప్రాతిపదికపై ముప్రత్యయ మయినస్థలమును జూపవలసియున్నది. సంజీవనిలోం గాని యుద్ద్యోతమునం గాని వీ రన్నియు నాచ్ఛికశబ్దములే యుదాహరించిరి తప్ప మచ్చున కొక్కటియు సంస్కృతశబ్దమును జూపలేదు. అట్టివి లేవు.

కాంగా వఝలవారివాదము సరి యైనది కాకున్నను నంగీకరించినప్పటికిని సూరిసూత్రమునందలి "అదంతములకు" అనుదళ మెంతమాత్రము ననర్థకము గాదని నిశ్చయింపం దగును. అనర్థక మనునుద్దేశ్యముతో వఝలవా రాదళమును దొలంగించుటయె యనర్థక మనక తప్పదు. (గాంబు లేదా గాబు, గమ్ము అనురీతి నప రూపము లేర్పడును గదా.)

ప్రత్యయ మగుముఁవర్ణముయొక్క ప్రత్యేకతను స్పష్టము చేయుసూరి ప్రణాళిక యెంతయు విశిష్టము.

## ముగాగమము :

"వానికి మువర్ణకేతరంబయినవిభక్తి పరం బగునపుడు ముగాగమం బగు" (4) నను సూరిసూత్రమును యథాతథముగ గ్రహించి వివరణమునం దిట్లనిరి. "సూత్రములోని 'వాని' కనఁగాఁ బ్రథమైకవచనమున మువర్ణకము వచ్చుశబ్దముల కని యర్థము. చరిత్ర- చరిత్రలు, లత-లతలు, ము న్నగుమువర్ణకము నిల్వని శబ్దములకు ముగాగమము రానేరదు" (పు. 112)

వీ రాయెడల నువిభక్తిస్థానమునఁ దెలుగువిభక్తిని జేసి దానికే లోపము చేసిరి. లత + ను అనుచో నుస్థానమున మువర్ణము వచ్చి యాపిదప నది లోపించును ఇచట మువర్ణము వచ్చుట జరిగినది గావున నితరవిభక్తులలో ముగాగమ మగు నని వరులవారి పైవాక్యముల కర్థము. కాని వీరియుద్దేశ్యము ప్రథమైకవచనమున మువర్ణకము వచ్చుట గాక వచ్చిన మువర్ణము నిల్చియున్నపుడె దాని కితర విభక్తిపరకతలో ముగాగమము మగు నని. అది వీ రిటఁ జూపిన లత - లతలు అనుదానింబట్టి గ్రహింపవచ్చును. రమ యనుచోవలె లత యనుచోఁ గూడ మువర్ణము "వచ్చుట" యున్నది కాని యది నిల్వక లోపించినది. "మువర్ణకము నిల్వని శబ్దములకు ముగాగమము రానేర"దని చెప్పఁబోవువారు ముందు గూడ "మువర్ణకము వచ్చుశబ్దముల కని కాక మువర్ణకము (వచ్చి) నిలిచినశబ్దముల కని యర్థము చెప్పిన బా గుండెడిది.

మువర్ణకము నిలువనిశబ్దములపై ముగాగమము రానేర దనుచోట వీరు "చరిత్ర-చరిత్రలు" అనువాని నుదాహరించుట సమంజసము గాదు. వీరే తరువాతి సూత్రమునొద్ద "మువర్ణకమునకు విధించుటలోపాదేశాదికార్యములు ముగాగమంబునకు సహితము వచ్చు నని యర్థము. చరిత్ర-చరిత్రలు. లత-లతలు. గోడ-గోడలు. (పు. 112) అనిరి. ఈసూత్రమునుబట్టి మువర్ణకమునకుఁ జెప్పినలోపకార్యము ముగాగమమునకు రావలయు నన్న ముందు ముగాగమ ముండవలెను గదా.

ఇంతకు ముగాగమము రానేర దనిరి. ఇట ముగాగమము లోపించిన దనిరి. ముగాగమము వచ్చి లోపించినదా? అసలు రాలేదా? లతలు అనుచోఁ గూడ నిట్లే. ముగాగమము రానంచో లను నివియె యుదాహృతులు. ముగాగమము వచ్చి లోపించినందులకు నివియే యుదాహృతులా? ఇది పరస్పరవిరుద్ధము.

చరిత్ర-చరిత్రలు అనుచో ముపర్ణక ముగాగమములు వచ్చి లోపించిన దని చెప్పవలసియున్నది. కావున దీనిని ముగాగమము రానేర దనుచోట నుదాహరించుట సమంజసము కాదు.

లతలు గోడలు అనుచోఁ గూడ ముగాగమము వచ్చి లోపించిన దనియే సమన్వయము. (కావున వీరు వీనిని గూడ ముగాగమము రానేర దనుచోట నుదాహరింప కుండవలసినది.) వీ రిట్టిచోట్ల సువిభక్తికి ముపర్ణకము చేసి లోపింపఁజేయుదురు గావున మిగిలినస్థలములలో ముగాగమమునుగూడఁ జేసి దానిని లోపింపఁజేయవలయు నని వీరిమతము. సూరిమతమున నిట్టిచోట్ల సువిభక్తియె లోపించును. కావున ముపర్ణకము వచ్చుటయే లేకుండుటచే వీని కితరవిభక్తులలో ముగాగమమును వచ్చుటయె యుండదు. వరుసలవారిమతమునఁ బ్రక్రియాగౌరవమె కావచ్చును.

వీరియభిప్రాయము చొప్పున స్థలాంతరమున నిబ్బందులను గలవు. హరి+సు, గ్లౌ+సు అనుచో మహత్పుంలింగతనుబట్టి డుజ్జు చేయఁగా దానికి లోప మగును కాఁగాఁ బ్రథమైకవచనమున ముపర్ణక మయినవీని కితరవిభక్తిపరకతలో ముగాగమ మయినట్లే ప్రథమైకవచనమున డుజ్జు వచ్చిన హరి గ్లౌప్రభృతులకు (డుమంతములు కాక తప్పదు గావున) ద్వితీయాద్యేకవచనపరకత్వమున నిగాగమము నగును. ఇట ముపర్ణకమునకు విధించినకార్యము ముగాగమమున కగును గావున ముగాగమము లోపించినది. కాని డుజ్జును లోపింపఁజేసినచోట నిగాగమమునకు లోప మగు ననువిధానము లేదే.

డుజ్ఞ వచ్చినను లోపించుటచే నీమువు డుమంతాలు గా దని నిగాగమమును వారించుకొనుపద్ధతినిబట్టి (ముపర్ణకము వచ్చినను లోపించుటనుబట్టి "వానికిఁ" (ముపర్ణకము వచ్చి నిల్చినవానికి) జెప్పిన ముగాగమము వీనికి రా దని చెప్పుట వక్రమము.

ప్రక్రియలో సూరిమార్గమె సముచితము. లాఘవము గల్గి గ్రాహ్యమై యున్నది.

కాఁగా పీరిట ముగాగమమునకు లోపమగు ననుట సరి కాదు. లత, గోద ఇత్యాదులకు ముపర్ణకముగాగమములు రావు. చరిత్ర. చరిత్రలు అనుచో ముపర్ణకముగాగమము లయి లోపించును.

## ముపర్ణక కార్యము

"ముపర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకు నగు" (41) ననుసూత్రమును యథాతథముగ గ్రహించిరి. ముగాగమము లోపించి నందులకు చరిత్రలు అన్న దుదాహరించు టుచితము కాని లతలు గోద లన్నవి దీనికి లక్ష్యములు గా వనియు సూరిమత ముచిత మనియుఁ బైని స్పష్టము.

## మువ్వంబులు :

"ముపర్ణకంబునకు 'మాదియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు" (42) ననుసూరిసూత్రమును యథాతథముగనె స్వీకరించిరి. ఉద్యోతమున "బువర్ణకం బేని" అని యున్నది. ఇట "క" ముపర్ణ ప్రమాదపతిత మనుకొనఁ దగును. వివరణమున ని ట్లనిరి. "దీర్ఘపూర్వకపూర్ణము నిల్వదు. (సంజ్ఞా, 15) తత్సమానన్యాయమున మ్మువర్ణమును నిల్వదు. ఏతాము. ఏతాంబు- ఏతామ్ముఁ అనునవి లేవు." (ఉ? 113 వ్యా. సం. స. 538) కాఁగా హ్రస్వపూర్వకమైనచో

పూర్ణమును నిల్పును. తత్సమాసన్యాయమున "మ్ము" వర్ణమును నిల్పుననియె కదా తాత్పర్యము, వీ రదంతములవయినే కాక చివరిమువర్ణ మెల్లయెడలఁ బ్రత్యయమె యని నిర్ణయించిరి. కనుము, మినుము, ఇనుము ఇత్యాదులలో కనుంబు, కనుమ్ము ఇత్యాదిగా రూపము లుండవలయునే అట్టి వెచట నేని జూపఁగలరా? దీనినిబట్టియె శబ్దాంతిమమువర్ణ మెల్లయెడలఁ బ్రత్యయము గానేర దనక తీఱదు గదా.

ఇంక దీర్ఘపూర్వక మగుచోఁ బూర్ణము నిల్వరానిమాట నిజమె, బువర్ణము నిల్పుట కేమిబాధ.ఏకాబు గాబు ఇత్యాదులలోఁ బూర్ణబిందువు కూడని మాత్రమున దుష్టు రాకుండఁబోలేదే ప్రాఁగెంపు మీఁగడ. ఇత్యాదులలో ఖండము నిల్చియున్నదే ఇట ఖండబిందువున కవకాశము లేదు గావున నది యుండదు. కాని బువర్ణ ముండుట కిబ్బంది యేమి? వనంబు వృక్షంబు ఇత్యాదిగా నదంతముపైఁ బూర్ణము లోపించి బువర్ణము మాత్రమె నిల్చినను దద్విధానము వ్యర్థమును గానేరదు. పిరిది పూర్ణము నిల్వ దనుటయు విశేషము. ఇందువలనఁ బూర్ణబిందుపూర్వకబువర్ణము వచ్చి పూర్ణము మాత్రము నిలువకపోఁగా బువర్ణము నిల్చియె యుండు నని యర్థ మగును. ఇట్లైన "మ్ము". రా వని స్పష్టముగా జెప్పఁదగు.

దీర్ఘముపైఁ బూర్ణము నిల్వరాకుండుటకును పూర్ణబిందుపూర్వకబువర్ణమే రా దనుటకును సంబంధ మేమియుఁ గానరాదు.

అది యట్లుండఁగా "నీంట అనుచో దీర్ఘముపైఁ బూర్ణబిందువు గలదు గావున టవర్ణమునకు ముందు నూరి హ్రస్వముపైఁ బూర్ణము చెప్పుట సరి గా దనియుఁ గావున "ంటి" అను ప్రత్యయమును జెప్పవలె ననిరి.

ఇట "ంబు" వర్ణమును జెప్పిరి కానఁ దత్సమాసన్యాయమున ఏకాంబు అనుకీతిగా నుండుటలోఁ బ్రత్యేక మగునవరోధ మేమి? నీంట అనుచో లేని యిబ్బంది ఏకాంబు అనుచోనె యేర్పడినదా?

అదియు నట్లుండఁగాఁ దత్సమాసన్యాయమున "మ్ము" వర్ణమును నిల్వ దను టెట్లు? దీర్ఘము గావున దానిపైఁ బూర్ణము నిలువక పోవచ్చును. కాని

"మ్ము"వర్ణము విల్చుట కే మయినది ? అట్టియెడల ద్విరుక్తం బగుహల్లు పర మయినది గావున ముందటిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి ఏతమ్ము అని యవును. అట్లె గాము గమ్ము, గీము, గిమ్ము అని యవును. ఇవి యన్నియు నాచ్ఛికములే కాన బాధ లేదు. సంస్కృత మైనదీర్ఘముపై మువర్ణకమును వీరు చూపియేయుండలేదు, ఉండవు.



ఇంకను వీ రీహ్రస్వము "పదద్వయసంధిలో" (ఉ. వమా 77) నని చెప్పుకొనిరి. సూరికి భిన్నముగాఁ జెప్పినస్వీయలక్షణము ననుసరించి (యిది పదద్వయసంధి గాదు గావున) హ్రస్వమును రాక ఏతామ్ము, గామ్ము, గీమ్ము వేమ్ము అనురీతిగా నవు నన్నను వీరిలక్షణము విరోధింపదు. (అట్టియపుడు "ఏతమ్ము" అనుదానికంటె భిన్న మగురూప మేర్పడుటంబట్టి యిది విశిష్టమును గాఁగలదు.)

(కొను) కో + డజ్ అనుచోట మువర్ణకము లేదు గావున మాముడిప్రసక్తి లేదు. కాని తత్సమానన్యాయమున దుజ్పరకత్వమున దీర్ఘమునకు హ్రస్వము సయితము రా దని వ్యాఖ్యానింపఁదగునా ?

కావున నెల్లయెడలఁ దుదిమువర్ణమును ప్రత్యయముగాఁ దలఁచుటచేత వరుఖలవారిమతమున నేర్పడినవిరోధము దొలఁగించుటకు దగినయాధారము లేదనక తప్పదు. ఇందలివిభాషాపదమునకు వ్యవస్థ చేసి తన్మూలమున నదంతేతరములపై నీకార్యము లే దనవచ్చు. అపుడు పరోక్షముగా నదంతములపయి మువర్ణముమాత్రమె ప్రథమైకవచన మని యంగీకరించిన ట్లగును.

సూరిమతమున గాము గీము కనుము ఇత్యాదులలోనిమువర్ణము ప్రత్యయము గా దన్నను ఏతాము అనుచోఁ బ్రత్యయమె కదా. అట్టియెడ సూరిమతమున నైన ఏతాబు ఏతమ్ము అని కావలదా యనవచ్చును. కాని సూరిమతము భిన్నము. ఏతాదులకు మువర్ణకంబు పరం బగునపుడు దీర్ఘం బగు (ప్రకీ.15) ననుచో మువర్ణకంబు పరం బగునపుడుమాత్రమె ఏతాదులకు దీర్ఘము వచ్చును. మ్ముంబులు పర మైన దీర్ఘము రాదు, ఎల్లయెడల దీర్ఘ మిష్ట మైన మువర్ణకంబు

పరం బగునపు డనుట వ్యర్థము. ఏతాదులకు దీర్ఘంబు విభాష నగు నని మాత్ర మె చెప్పందగు. మువర్ణకపరకతయందు విధించినయీకార్యము ముగాగమపరకత్వ ముం దగుటలో బాధ లేదు. కాన నేతాములు ఇత్యాదులు సిద్ధించును. ఏతము, ఏతమ్ము ఏతంబు అని యేర్పడంగా నందు ఏతము అనుస్థితిలో దీర్ఘము వచ్చుటను సూరి మతమున గుర్తింపవలెను. వయులవారు సంజీవన్యాదులలో ఏతా అనుదీర్ఘాంతముపై మువర్ణక మగు నని భావించుటవలన నసంగములు గల్గిన వనందగు.

కాంగా సూరిప్రణాళికయును దైసూరిలక్షణము నెంతయు సముచితము లై గ్రాహ్యము లై యున్నవి.

## లోపదీర్ఘములు :

"లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు' (58) ననుసూరిసూత్రమును వీరు లులనలుపరంబు లగునపుడు ముగాగమంబునకు లోపంబును దత్పూర్వా కారంబునకు దీర్ఘంబును విభాష నగు" (ఉ.సూ.44) నని పేర్కొనిరి. సూరి వలె ముగాగమునకే లోపము చెప్పియును నీవిషయమును మువర్ణకలోపదీర్ఘములు గా సూచించుట యుచితముగా లేదు. ప్రథమైకవచన మగు మువర్ణకమే ప్రత్య యము. ఇట లోపించునది యాగమ మిది ప్రత్యయము గాదు. కాన మువర్ణ లోపదీర్ఘములు లేదా ముగాగమలోపదీర్ఘము లనిపేర్కొను టుచితము కవర్ణ మధికముగా ముద్రణప్రమాదమువలనం జేరిన దన్న నప్పు డుచితము.

సూరిసూత్రమందలి "ఒకానొకచో" ననుదళమును దొలంగించుట వీరిలక్షణ మందలిమొదటిసవరణము. దీనింగూర్చి "ఇట్టిరూపములు గవిప్రయోగములలో ధారాళముగ నుండుటచే సూరి "ఒకానొకచో అని సూత్రించుటయు, ఒకానొకచో ము న్నగు వివరణము వ్రాయుటయు యుక్త మయియుండలే" (ఉ.113) దనిరి. "వికృతౌ క్వచిచ్చ" యని చిం. క్వాచిత్కముగాం జెప్పుట ననుసరించి సూరి "యొకానొకచో" నని ప్రయోగవైరళ్యము వివరించియుండును. చిం. సమ్మత

మైనను ప్రయోగానుసారముగా నది సరిగా దనుట యుచితమె. విరళము లనఁగా నొకటో రెండో ప్రయోగము లనురీతియభిప్రాయముతో వీరు ధారాళముగాఁ గల వని పేర్కొనియుందురు వజ్రములు వజ్రాలు అనురీతిగా నెల్లయెడల ద్వైరూప్యము సామాన్యముగాఁ జెప్పుట భాషాసామాన్యలక్షణమున కనుగుణముగాఁ గానరాదు. (వ్యా.సం.స.639)

సూరి తత్పూర్వస్వరంబునకు అని చెప్పఁగా వీరు "తత్పూర్వాకారంబునకు" అని దిద్దిరి. అకారమున కని సామాన్యముగాఁ జెప్పినను హ్రస్వమునకే యని గ్రహింపవచ్చును. గాములు, పాములు, నాములు. ఇత్యాదులందు వీరిమార్గమున ముగాగమమె కలదు. ఇట ముగాగమమునకు లోపమయి తత్పూర్వము నందలిదీర్ఘాకారమునకు దీర్ఘమయిన (కా కున్నను) గాలు (గాములు) పాలు అనురీతిగాఁ గావలదా ? సూరిసూత్రమునవలె వీరిలక్షణమున మాత్రము వీరు పరిహరించిన "ఒకానొకచో" ననుదళ మవసరమె యనవలసియున్నది. దానిచే హ్రస్వ మగునకారముపై నున్న ముగాగమమె లోపించి ముందటియత్త్వమునకు మాత్రమె దీర్ఘ మగుట గుర్తింపవలసియుండును.

అదంతేతరములపైఁ గూడ ముగాగమమును జెప్పుటచేత వయ్యలవారిమతమున నీయనర్థ మేర్పడిన దనక తప్పదు. ఇంక మినుములు మినూలు, కనుములు కనూలు అనురీతిరూపములు వారించుకొనుటకు వీరు సూత్రమును మార్చి చెప్పకొనక తప్పదు. అట్లయ్యు ననర్థము దప్పలేదు. అదంతములకె ముగాగమము చెప్పినసూరిమతమున నిట్టియపరూపములప్రసక్తియె లేదు.

కాని ఇయ కెత్వమైనసందర్భముల ముగాగమ మెత్వముపై నుండు. ముత్తెములు మొ॥ కావున సూరిమతమున నత్వమునకుఁ దప్ప వేఱొకస్వరమునకు దీర్ఘము రావలయు నన్న నది యెత్వమునకె యనవలెను. వయ్యలవారు "సూరిసూత్రమున తత్పూర్వస్వరంబునకు అని నిల్పరాదు. అట్టియపమార్గము చేతనె కొండెలు, ముత్తెము మున్నగువానిని గొందఱు సాధింపఁజూచుచున్నా (పు.113) రనిరి. ఇందనౌచిత్య మేమి ? ఇట్టి వానిని సాధించుటకయియే సూరి

సూత్రమున నట్లు పేర్కొనియుండును. ఆత్వమునకు మాత్రమె యని సూరి తలఁచిన నట్లు స్పష్టముగాఁ జెప్పఁడా? అందు లాఘవమును గల్గును గదా.

ఉలునలు అనుచోటినవర్ణముచే నగాగమమును గ్రహించి కయ్యానకు అనురీతిరూపములు వీరు సాధించిరి. (వ్యా. సం. స. 538) కొండ్యాలు ఇత్యాదుల వలె దీనిని గూడ సూరి యుదాహరింపలేదు. అట్టియెడ "ఉలన" అనుచో నవర్ణముచే నవకాశమునుబట్టి నగాగమమును గ్రహించినట్లె "తత్పూర్వస్వరంబున" కనుదానిచే నెత్వమును గ్రహించి కొండేలు అనురీతివి సాధించుట దోషమా? "కొండేలఁ గొంపలు కూల్చువాతకురాలు (శ్రీరంగ 5-34) అనుచోట నయితము కొండ్యాల అని కవిప్రయుక్తపాఠము కానోపును"- (వ్యా. సం. స. 537) కవిప్రయుక్తపాఠముల నిట్లు వఝులవారు గుర్తించిరి గాని సూరిప్రభృతులు గుర్తింపలేదేమో. "కవిప్రయుక్త మని విశ్వసింపఁదగినప్రబల మైనప్రయోగము లభింపనిదే ప్రామాణికు లగునన్నయాథర్వణసూత్రముల నన్యథాకరించుట యుచితము కాదు గదా" (వ్యా. సం. స. 538) యనిరి. అట్టికవిప్రయోగములును లేకపోలేదు. "ముత్తెలపెట్టెల హత్తి మెఱయు" (యయా. 1-53) ఇట నియ్యది ప్రాసస్థానమందున్నది. "ముత్యాల" అనునది కవిప్రయుక్తపాఠ మన్న గణములు సరిపోవును. కాని ప్రాసయతి గుదురదు. ప్రాసయతినిబట్టి "ముత్తెముల" నన్నది కవిప్రయుక్తపాఠ మందమా గణములు సరిపడవు. ఇట్లే వండుతీఁగె లవి గొప్పలు కదలు (యయా. 1-120) రెండు,మూఁడు విడె లాకులు (వై॥ 2 42) మొ॥ ఇవి కవిప్రయుక్తము లని (వఝులవా రిట ప్రామాణికవిశేషణమును జేర్పకుంట మంచి దైనది. లే కున్న నట్టివిశ్వసింపఁదగినప్రయోగ మున్నను ప్రయోగించినకవు లప్రామాణికు లన్న నెట్లు?) విశ్వసింపఁదగినస్థలములే కదా.

కావున నన్నయాథర్వణు లత్వమునకె దీర్ఘము చెప్పియున్నను విశ్వసింపఁదగినపై రీతికవిప్రయోగముల ననుసరించి సూరి యిత్వంబున కవి కాక తత్పూర్వస్వరంబున కని పేర్కొనుట యెంతయు నుచితమూనా మన్న దనియుఁ దదనుగుణముగాఁ గొండలు కొండేలు మున్నగువానిని సాధించుట సముచితమే యనియు గుర్తింపఁదగును.

దీనిని గూడ దృష్టియం దిడుకొనఁగా సూరిసూత్రమందలి "యొకానొకచో" ననుదళము తద్వివరణానుగుణముగా సముచితమె యని స్పష్టము. సూరి సాధించిన పైయర్థములు సాధింపఁజాలక యనర్థక మగుటచే వఝులవారిసవరణ మఁచితము గా దని నిశ్చయింపఁదగును.



## సులోపము:

"ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు" (44) నను సూరిసూత్రమును యథాతథముగ గ్రహించిరి. దీనికి "ఇగ్లౌరాసూత్రము" అని సూచిక నుంచిరి. రై + ఉగంత- రాయుగంత- అని యైన దనుట స్పష్టము. సంధి వికారములో నగభాగమును వేఱు చేసి "ఇగ్లౌరాసూత్ర" మనుటకంటె "ఇగ్లౌరై సూత్ర మని యైనా లేక (సూరి స్థలాంతరములందుఁ జేర్కొన్నట్లుగా "ఇగ్లౌసూత్ర" మనియైనా పేర్కొన్న బాగుండెడి దని తోఁచుచున్నది.

ఈ సూత్రమును వివరించుచు నిట్లు పేర్కొనిరి. "హరి, సుధీ మున్నగు ఇఈలు తుదిని గలమహత్సంలింగములకు డుజ్జాను --- ప్రాప్తించు చుండఁగా నట్టి ప్రథమైకవచనములకు లోపము నీసూత్రము విధించుచున్నది" [ఉ. 114] అట్టిప్రథమైకవచనములోప మనఁగా డుజ్, ము, వు అనువానికే లోప మని వీరి యుద్దేశ్యము. "గిరి - రై శబ్దములకు "డుమువు" [ఆ ?] అనువానిలో నేదియు సూరిపక్షాన రాదు. సు నిల్పఁబడును. [ఉ. 114] వీ రిందులకే కాఁబోలును ముపర్ణక మెల్లశబ్దములకును విధించిరి. డుమువులలో నేదో యొకటి చేసి లోపింపఁ జేయుసౌకర్యము తమగ్రంథముననే సిద్ధించిన దని యభిప్రాయము గాఁబోలును. అట్టియెడలఁ బైని వివరణమునఁ "ప్రాప్తించుచుండఁగా" ననుట సరి కాదు. ఇట్లనుటవలన డుజ్ఞాదులు రాకముందే యెల్లయెడల సుప్రత్యయమే లోపించు నను రీతిగా నర్థము గల్గుచున్నది, డుజాదులు రాఁగా నవి లోపించు నవి చెప్పుట వీరి మార్గమున కనుగుణము. వేఱొకచోఁ గూడ [ఉ. 125] వీ రిదే పద్ధతిలోఁ జెప్పిరి.

తెలుఁగువిభక్తులనే లోపింపఁజేయుట యవసరమా? వీరు చిం. మార్గములోఁ దెలుఁగువిభక్తులు సంస్కృతవిభక్తులస్థానమునసే యాదేశము లగు నందురు. అట్టియెడ ముందుగా సుప్రత్యయమె యవును గాన దానికే లోపము చేయవచ్చునే. హరి + సు అని యుండఁగా డుజ్ ప్రత్యయము రావలసియుండఁగా దానిని బాధించి యీసూత్రముచే సు [ప్రథమైకవచనము] లోపించు ననుట లాఘవము గదా. దానికిఁ దెలుఁగుప్రత్యయము చేసి పిదప లోపింపఁజేయుటవలనఁ బ్రయోజన మేమి? చిం. లో నైనను సోర్లుగితః– అనుతాం శ్రియాం–– సులోపః ఇత్యాదిగా "సు"లోపమె చెప్పఁబడినది. [లోపవిధి బలీయ మయిన ముందుగా సువిభక్తికి లోపమె చేయవలసియుండఁగా దానికిఁ దెలుఁగువిభక్తులు చేయుట యెట్లన్నదియు సందేహమె.]

తెలుఁగువిభక్తులనే లోపింపఁ జేయువారు సూరిమతమునకు భిన్నముగాఁ దెలుఁగువిభక్తులను సంస్కృతవిభక్తులస్థానమునఁ జేయ నవసర మేమి? చిం. నమ్మత మని యమ్మార్గము ననుసరించిన చిం. వలెనె సులోపమును జేయక తెలుఁగువిభక్తులను లోపింపఁ జేయ నేల?

సూరిమతమున గిరి, రై శబ్దములకు డుమువులు రామి [వీరు ముపర్ణము చేసి లోపింపఁజేయుదురు. [ఉ. 114] సుప్రత్యయమును జేసి లోపింపఁజేయుట యొకలోటుగాఁ జెర్కొనిరి. సూరి తెలుఁగువిభక్తులను సంస్కృతవిభక్తుల కాదేశ ముగాఁ జెప్పకున్నను దేవత– ము న్నగుమహత్స్త్రీలింగములపైని సుప్రత్యయమునె నిల్పి లోపము చేసికొనవలసివచ్చుటయు నందుకె చిం. సంస్కృతవిభక్తులకుఁ దెలుఁగువిభక్తు లాదేశము చేయుటయుఁ [ఉ. 94] జెర్కొనిరి. మఱి వీరి మతమున నే మగును? దేవత, తంత్రి, భ్రాత. ఇత్యాదులకు వీ రేమి ప్రత్యయము చేయుదురు? మహత్తు లయినను బుంలింగములు గామి డుజ్ఞు రాదు. ఆమహన్మపుంసకములు గామి ముపర్ణకము రాదు. ఉకారాంతములు గామి వుపర్ణకము రాదు, కాఁగా వీ రయినను వీస్థలములందు సుప్రత్యయమునకుఁ దప్ప

ధుమువులకు లోపము నెట్లు చేయుఁగలరు? మఱి పిరి ప్రక్రియలో విశేష మేమి? సంస్కృతవిభక్తులకే తెలుఁగువిభక్తు లవు ననుట తప్పు.


సూరి మిగిలినస్థలములందు సంస్కృతవిభక్తులు చేయకున్నను లోప సందర్భమున సంస్కృతవిభక్తియే చూపవలసివచ్చినది. కావుననే చిం. సంస్కృత విభక్తులకె తెలుఁగువిభక్తులను జెప్పిన దనిరి. అట్టియెడ నా పద్ధతి ననుసరించుట వలనఁ దెలుఁగుప్రత్యయము చేయకయె ప్రథమైకవచన [సు] లోపము చేయుట కుదురు నని తాత్పర్యమా? మఱి వీరు తెలుఁగుప్రత్యయములు చేసి లోపింపఁజేయ నేల? వీరు బాల.చిం.మతములు రెండింటిని గలిపిరి.

కాక యెల్లెడల సరాసరిగాఁ దెలుఁగువిభక్తులు చేయుచుండఁగాఁ బ్రథమైక వచనలోపసందర్భమున మాత్రము సంస్కృతవిభక్తి చేయుట యెట్లు? ఈలోప సందర్భమున సంస్కృతవిభక్తి చేయక తప్పదు గావున మిగిలినచోట్లఁ గూడ ముందు సంస్కృతవిభక్తి చేయుట సక్రమ మని యభిప్రాయమా? అ య్యుండనవు.

సక్రమముగా నున్న దని చెప్పు చిం. ప్రణాళికయె యిటను మార్గదర్శకము గదా. చిం. నామవిభక్తులను సుప్పులకె యాదేశించినది. కాని క్రియావిభక్తుల నట్లు తిఙ్ఙుల కాదేశము చేయలేదు. ధాతువుపై సరాసరిగాఁ దెలుఁగుక్రియావిభక్తు లగుటయె వ్యాఖ్యాతలును జెర్కొనిరి. మహాతస్సోర్ధుట్, విరమః అన్నట్లుగా వ్యతిరేకార్థే ల్రుటి లటి డుట్, ఇత్యాదు లగువిధానములం దెచ్చుటను గ్రియావిభక్తులను దిబాదుల కాదేశముగాఁ జిం. చెప్పలేదు. సరిగా నదేపద్ధతిలో సూరి క్రియా విభక్తులతోపాటు నామవిభక్తులను గూడ నామములపై సరాసరిగ [తెలుఁగువిభక్తినె] విధించెను. కాని సుప్పుల కాదేశముగాఁ జెప్పలేదు పిదపఁ జిం. ప్రథమైకవచన లోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యా త్తనుచోఁ బ్రథమైకవచనలోపము చెప్పినది. వ్యతిరేకార్థే ల్రుటి లటి డుట్ స్యా త్తనుచో భూతతద్ధర్మార్థములందు డుఙ్ఙును విధింపలేదు. మఱి యిటఁ బ్రథమైకవచనమునకుఁ జెప్పినలోపము దేనికిఁ జేయవలె? ఆసూత్రముకడ వరుఖలవారు "సంస్కృతప్రథమపురుషైకవచనతిప్ ప్రత్యయమునె నిల్పి దానికి లోపమును జేయవలెను" [వ్యా. సం. న. 1338]

ననిరి. డుజాదులను డిజాదుల కాదేశముగా నేవ్యాఖ్యాతయుఁ జెప్పలేదు గాని యిటఁ బ్రథమైకవచనలోప మెల్లరును డిప్పునకే చేసిరి. చిం. నామవిభక్తులను సుప్పుల కాదేశించుటనె యీ రీతిఁ జేర్కొనిరి గాని క్రియావిభక్తులను డిఙ్జున కాదేశించినట్లు చెప్పకుంట గమనార్హము. ఇతరస్థలములం దెల్లఁ దెలుఁగువిభక్తులె యవుచుండఁ బ్రథమైకవచనలోపము చెప్పిన [భూతతద్ధర్మ] స్థలములందు మాత్రము "తిప్పు" అగుట యెట్లు?

ఆదే విధముగా నిచట సయితము నామవిభక్తులు సుప్పులకుఁ జెప్పకున్నను ప్రథమైకవచనలోపమును జెప్పినచోట మాత్రము సంస్కృతసువిభక్తిని నిల్పి దానినె లోపింపఁజేయుట యపూర్వము గానేరదు గదా.

ఈ రీతిఁ జిం. ప్రణాళిక బాల. కంటె విశిష్టముగాఁ బ్రతిపాదించిరి గాన నిట్లు దానితోఁ బోల్చుట జరిగినది గాని చిం. చెప్పినది గాన సరి గాకపోయినను సమంజస మనవలె నని యభిప్రాయము గాదు. కాఁగా సూరి సువిభక్తిని లోపింపఁ జేయుపద్ధతి చిం. తోఁ బోల్చి యసమంజస మనుట సమంజసము గాదు.

దేవత ప్రభృతిస్థలములలో వఝలవారును సువిభక్తికే లోపము చేయక తప్ప దని గుర్తించితిమి. అట్టియెడల హరి ప్రభృతులమాత్రము తెలుఁగువిభక్తి చేసి లోపింపఁజేయ నేల? [అసలు వీరు సంస్కృతవిభక్తులకుఁ దెలుఁగు విభక్తులు చేయుచుఁ బ్రక్రియ యెల్లెడలఁ జూపియె యుండలేదు.]

ఇంక సూరి మతమున "గిరి, రై" యనుచో డుమువులప్రాప్తి లేమి నటు "ను" నిల్పవలయు ననఁగా హరి, వనిత, ఇంద్రజిత్తు ఇత్యాదులలో డుమ్మువులు చేసి లోపింపఁజేయవలయు నని వఝలవారు తలఁచినట్లు తోఁచును. కాని యది సూరిమతమునకు విరుద్ధము. "కంధర" యనుచో [వనితవలె] నది యమహత్తగుట మువర్ణక మగును. స్త్రీలింగ మగుట నది లోపించును. కంధరము అను మువర్ణము నిల్చియున్నరూపమును గూడ సాధింపఁదలచిన మువర్ణకలోపము బహుళముగా లేకుండుటను విధింపవలె. కాని సూరి కంధరాదులకు బహుళముగాఁ

క్లీబత్వముం గ్రతను విధించెను [బాల. తత్స. 65] క్లీబత్వవిధానము ముపర్ణకసిద్ధి కొఱకే యనుట నిర్వివాదము. ముపర్ణకము సిద్ధించి యది లోపింపవలసినపుడు ముపర్ణకలోపమును వారింపవలయునుగాని వచ్చియున్న ముపర్ణకము వచ్చుటను సాధింప నేల ? దీనినిబట్టి వీనికి ముపర్ణకము ప్రాప్తింప దని స్పష్టము. కాఁగా స్త్రీలింగముల ప్రథమైకవచనలోప మనఁగా ముపర్ణము గాక సువిభక్తియె లోపించు నని సూరిమతము స్పష్టము. [కాని ముదాదులకుఁ బ్రథమైకవచనలోపము లే దను తత్స 72 విధానము నాద్యంతము పరిశీలింపవలె] కాఁగా నదేపద్ధతిలోఁ బ్రస్తుతస్థలమునను "సు"విభక్తికి లోపము చేయుటయె సూరిమార్గము. డుజాదుల జేసి లోపింపఁజేయుట కా దని గమనింపవలయును. హరిశబ్దమునకు డుజ్ఞ చేసిన [పిదప నది లోపించినను] డుమంతసంజ్ఞ గలిగి నిగాగమప్రసక్తి యేర్పడుట గమనించియుంటిమి.

ప్రథమైకవచనలోపస్థలముల నగతికముగా నరుదుగా సంస్కృతవిభక్తి చేయుపద్ధతినిబట్టి యె న్నెడల మార్గము ననుసరించుట ప్రక్రియాగౌరవమె కాని ప్రయోజనము లేదు. సూరి సూత్రాంధ్రాదు లగుతదయితరవ్యాకరణములలో డుము వులవస్తునః, అమోనుః చేతతోడా టాసః, వీని సూకు డు జ్ఞగు, సుజస్సులకు దివి యగు మున్నగురీతిగా సంస్కృతవిభక్తులకే తెలుఁగువిభక్తులను జెప్పియు నవి ప్రయోజనవంతము గాక ప్రక్రియాగౌరవమును గల్పించుటను సూచించుచు నీ బాలవ్యాకరణమున నా మార్గమును విడిచిపుచ్చె నని యెఱుంగఁదగును

"సూరి శ్రీశబ్దమునను స్త్రీలింగమునను నిం దుదాహరింపరాదు. (ఉ.114) స్త్రీలింగముల కెల్ల న సామాన్యముగాఁ బ్రథమైకవచనలోపము నాసూత్రము చెప్పి యుండఁగా నికారాంతములకుఁ జెప్పినయావిధి విశేష మగుట సూరి వీనిని దీని కుదాహరించె ననఁదగును

## ఉత్త్వము:

"ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్త్వం బగు" (45) వికృతి యం దికారాంతములయు మోత్తమేత్వంబునకు బహువచనంబు పరంబగు డుత్త్వం బగు(46)

రలదోపధనవార్థాదులయుపోత్తమోత్వంబున కుత్త్వంబు గదుగదు (47)  ననుసూరి సూత్రములలో ముందటిపదముతోడిసంధిని వేఱు చేసి "ఉత్త్వంబు" అని చూపుట మాత్రమె విశేషముగా వయులవారీవానిని యథాతథముగ గ్రహించిరి. స్పష్టతకైన విట్లు విడఁదీయ నవసరము గానరాదు. "పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున "కుత్వం బగు"ననుచో వీరును(ఉ.తత్స 21సూ) సంధి విడఁదీయకయె చూపిరి. అట లేని యస్పష్టత యిచట నెట్లు గల్గును? కావున సంధి వేఱు చేయుట యనవసరము.

## బాహప్పళించి:

"ఉకారాంతగోశబ్దంబుల కంతట పువర్ణకం బగు" (48) ననుసూరిసూత్రమును యథాతథముగ గ్రహించిరి. వివరణమున నొకవిశేషము. "బాహప్పళించి (విరా. 2.1) అనుచో బాహ + అప్పళించి అని భేదము. తత్సమాకారసంధి విరుదము కాదు. ఈప్రయోగముచే బాహు-బాహువు అని పువర్ణకలోపము నంగీకరింపరాదు." (ఉ. 117) ప్రౌఢ బాహుశబ్దమునకు పువర్ణకలోపము చెప్పుట (శబ్ద. 26) సరి కా దని యుద్దేశ్యము. కాని వీరును వ్యా. సం. స. (555) లో బాహుపదమును సాధించిరి. అదియును సరి గా దని వీరియీవాక్యములచే గ్రహింపఁదగు. బాహుశబ్దమునకు అసిలతా ధృద్బాహూ వేష్టింప (ఆము. 5-50) అనుప్రయోగ మొండు గోశములు చూపుచున్నవి. కావి యిది ద్వితీయాంత మగుట పుగాగమరహితస్థల మగుఁ గాని పువర్ణకరహితస్థలము గాదు. కాఁగా బాహు అను ప్రథమైకవచనాంతరూపముగా గానరామి పువర్ణకలోపము చెప్పుట నిరాధార మన వచ్చును వీరు నిరూపించిన "బాహు" శబ్దమును గోశములు పేర్కొన్నవి. ఇది విడిగాఁ బ్రయుక్త మయినస్థలము వెదుకవలసియున్నది.

బాహప్పళించి యనుచో బాహు + అప్పళించి యని విడఁదీసిన వయులవారి మార్గము నుచితముగాఁ దోఁపదు. ఈ తత్సమాకారసంధి వీరిలక్షణమునకే విరుద్ధము యుండుట గమనార్హము. మహత్త + అణఁగి"- మహత్త యణఁగి- అని

ప్రాచీనపద్ధతి." (పు. 37) యనిరి. బాహా + అప్పళించి = బాహప్పళించి యని ప్రయోగించె నన్న తిక్కన యర్వాచీనుఁడా. పైఁగా భారతాదిప్రాచీనగ్రంథములలో శుద్ధసంస్కృతాకారమునకును స్త్రీవాచకతత్సమసంబోధనాంతములఆకారమునకును సంధి లేదు అర్వాచీనకావ్యములం దట్టిసంధులు గల [పు. 36] వని నిర్ణయించిరి. ఈప్రయోగము భారతమునం దలిదే యైయుండఁగా నావివరణము తప్పా? యీ విభాగము తప్పా? ఈ రీతిసంధి తిక్కన భారతమందె యైన నింక నెచ్చట నైన నున్నదా? కావున దీని నీరీతిగా విభాగింపఁదగ దని గుర్తింపవచ్చును.

సంధి యగుటా మానుటా యన్నది తరువాతిసంగతి. బాహా + అప్పళించి యని విభాగించుటకుఁ దెలుఁగున "బాహా" యనునది తత్సమముగాఁ గల దనుటకె యాధారమును వెదుకవలసియుంట గమనార్హము. తిక్కన యేని నెచ్చట నేని ప్రయోగించెనా?

పిదప నిట సంధి యగుట యరు దనవలె. రంగభర్త్రంచు ననురీతివి మిక్కిలి విశేషములు గదా. అనఁగాఁ దత్సమాకారమునకు సంధిలేకుండుటయె ప్రసిద్ధము. అట్లు ప్రసిద్ధమైనసంధ్యభావముతోడి "బాహా యప్పళించు" అనురీతి ప్రయోగ మెట నే నున్నదా? తత్సమాకారమున కిట మాత్రము సంధినియతముగా నగు టేమి?

కావున బాహా + అప్పళించు అనుచో దత్సమాకారసంధి యయ్యె ననుసమన్వయము సరిగాదు.

మఱి యిది యెట్లు? విజయము+చేయు విజయంచేయు, భయము+పెట్టు భయపెట్టు, అచ్చెరువు+పడు అచ్చెరుపడు అనురీతిగా బాహావు+అప్పళించు బాహప్పళించు అని యేర్పడినశబ్దపల్లవముగా దీనిని గుర్తించుట యొప్పును. శబ్దపల్లవములలో వర్ణవికృతులు పెక్కువిధము లైయున్నవి. [ఇవి సూరియు స్పష్టము చేయలేదు] కావున భయపెట్టు అనుచో ముపర్ణకము, అచ్చెరు [వు] పడు అనుచోఁ బ్రత్యయేతర మగువువర్ణము లోపింపఁగా బాహావు అప్పళించు

అనుశబ్దపల్లవము వృద్ధికము లోపించిన దనవచ్చును. బాహా లేదా బాహా యను ప్రథమైకవచనాంతము విడిగాఁ గానరాకుండుట. ఉహా యప్పశించి- యనునీతి సంధ్యభావస్థలము లేకుండుట మున్నగువానినిబట్టి యిది సామాన్యమైనసంధి వికారము గాక శబ్దపల్లవములం దనేకవిధములై యున్నవిశిష్టమగు లోపాదివికారములలో నొకటి [లోపము] అయినస్థలముగా దీనిని గుర్తించుట సక్రమము గదా.

## పుగాగమము :

“పువర్ణకేతరవిభక్తి పర మగుచో సుకారాంతంబులకు బహుళంబుగా గో శబ్దంబునకు నిత్యంబుగా పుగాగమం బగు” [43] ననుసూరిలక్షణమును మార్పు చేసి “పువర్ణకేతరవిభక్తి పర మగుచో ననుహాదుపంతములకు వికల్పముగాను, జంతాూరూశబ్దభిన్నస్త్రీవాచకోదంతములకును, సూదంతములకును గోశబ్దమునకును నిత్యముగాను పుగాగమం బగు” [ఉ. 60 సూ] నని విస్తరించిరి, “ప్రయోగము లనుబట్టి యిట్లు నిర్ణయింపఁదగియుండఁగా సూరి బహుళవిధి నాశ్రయించుట సరి కా” [ఉ. 117] దనిరి, నిజమె ప్రయోగానుగుణముగా స్పష్టము చేయఁదగును. సూరి యింతకుముందు టుగాగమమును రెండుసూత్రములచే [సంధి. 28. 29] నెచట నిత్యమో యెచట విభాషయో స్పష్టముగాఁ జెప్పియుండఁగా వీరు “బహుళ” మని యొకటిగాఁ [ఉ.సంధి27] జెప్పరేమి? ఈరీతి ప్రయోజనము సాధింపఁబడినఁ గదా సూత్రమున బహుళపదము. కాఁగా సూరి లక్షణమందలి బహుళపదమునకు వ్యాఖ్యానముగా వరుసలవారిపైసూత్రము చాలవఱకు గ్రహింపఁదగును. బహుళ శబ్దము చేతనె యైనను సాధింపఁదగినవి సాధింపఁబడుచుఁ దగనివానిఁ బ్రస్తావింప కుండుటచే సూరిలక్షణము దుష్టమని చెప్ప వీలు లేదు

సంజీవనిలోఁ గూడ నన్నయాథర్వణులు చాలవఱకు విశదముగా ననుగమములు చూపియున్నను సూరి వానిని సరిగా గ్రహింపక యావిషయములను బహుళకవిధిచే సంగ్రహించుట యుక్తము గా” [వ్యా.సం.స. 555] దనిరి. చిం. కంటె

వి. వి. కొంత విశదముగాఁ జెప్పినను కాని దానిని సూరి సరిగా గ్రహింపలేక పోయె ననుట సాహసము సర్వత్రోదోతోర్ధ్వర్ణ్వతి మువత్. [ఋజ్మహాత్పదానాం వా, యని చిం. చెప్పినది. దీని నింతకంటె సముచితముగనె సూరి పేర్కొనెను. కాఁగా సూరి యన్నయు చెప్పినదానిని గ్రహింపలే దనుట కాధారము లేదు. ఇంక నథర్వణుఁడు చెప్పినవి. "ఖిన్నత్వే న చాస్య ఖిన్నత్వే ఋజోద న్తతో భవే త్తన్నది యునవసర మనుట నిర్వివాదము [పరుఁవారు నిట దానిని జెప్పలేదు]. అది గ్రహించియె సూరి దానిని [విశేషమువలె] ప్రస్తావింపకుండుట యుచితముగా నున్నది. న పట్వాదిశబ్దానాం, ఘవర్ణకోభవత్యత్ర యనువానిని పరులవారి మాట లనుటకుఁ బూర్వము వ్యాఖ్యానింపలేదు అయ్యు నవి ప్రస్తుతసూరి సూత్రమునందలి బహుళ శబ్దముచే సంగ్రహింపఁబడునని గాదు. వానినిగూర్చి యైన [బాల తత్స. 60 సూత్రమునొద్ద ఏ రిట్టి విమర్శ చేయఁబడె.]

వుగాగమమునుగూర్చి వి. వి. "ఉతామత్ర భవేద్వావురస్త్రియాం ల్వాది వర్ణకే యన్నది. ఇట "వా" యనఁగా సూరి బహుళ మనె నది సరిగా గ్రహింపమిచేఁ గాదు గదా. కారికయందలి "అస్త్రియా" మ్మన్నది సూరిసూత్రమునఁ జేర్చకుండుటయె సరిగా గ్రహింపక పోవుట యేమో. ఇంక వి. వి. లక్షణమున వేఱొకవిశేషము లేదు గదా. అస్త్రీయా మ్మన్నదానికి స్త్రీలింగేతరముల కనియె యర్థము చేయవలసియున్నను మహతీవాచకస్త్రీలింగేతరము లని వ్యాఖ్యానించిరి. (అయ్యది వ్యాఖ్యానమందలివిశేషమె కాని యథర్వణుఁడు స్పష్టము చేసినది కాదు) అట్టిదే యైన బరిత్యాగరుప్ అనుచో వుగాగమము లేదు. ఇది వి. వి. సంగ్రహింపఁజాలదున్నదా? చిం. వి. వి. లు విశదముగాఁ జేసినయుగమము లేమియో స్పష్టముగాదు. ప్రయోగానుగుణముగా బహుళశబ్దముచే నెల్ల విశేషములు సంగ్రహింపు నవకాశము సూరిలక్షణమున నుండఁగా విశేషార్థకల్పనము వి. వి. లక్షణమున నవసర మయ్యె. దానికంటె బహుళ మనుట యుచితము గదా.

ఇఁక స్పష్టముగాఁ జెప్పినపరులవారిపై ఉ. లక్షణమును బరామర్శింతము. "అమహాదుదంతములకు వికల్పముగా వుగాగమ మగు ననిరి. ఇ ట్లనుటచేత

మహదుదంతములకు వికల్పము గా దని యర్థ మగునా? కాని వీరు వైకల్పికస్థలములతోపాటు నిత్యస్థలములను గూడఁ జేర్కొనిరి. "జరత్కారూణిన్న-- నిత్యముగాను" అనుటచే మహదుదంతములకు నిత్యముగాను నుగాగమము లేదు. కాఁగా వీనికివైకల్పికముగాఁ గాని నిత్యముగాఁ గాని నుగాగమము రా నవకాశము లేకపోవుటచేత వీరిలక్షణము ననుసరించి శంభువుచేత ననురీతిరూపములు సాధువులు గానేరవు. సూరి యిట్లు చెప్పలే దని యాక్షేపింపఁదగునా?

"మహద్వాచకములకు నువర్ణాగమరహితరూపము లగు- శంభులు, శంభువ్ ఇట్టివి డుమంతత్వపక్షమున నెట్లును బై నుదాహరించిన రీతిని సిద్ధించును. కావుననె ఉతామ్రేత్యాసూత్ర మమహత్పక్షముగా మాత్ర మన్వయింపఁబడె" (వ్యా. సం. ప. 557) నని స్థలాంతరమునఁ జెప్పిరి. తదనుగుణముగనె యిట వైకల్పికస్థలముల నమహత్తులనె పేర్కొనిరి. కాని పై వఝులవారివచనములను బట్టి మహదుదంతములకు నుగాగమము నిత్య మనియె వారు తలఁచినట్లు స్పష్టము గదా. మఱి యిట నిత్యస్థలములలో మహదుదంతములను జేర్కొనకుండుట సంగతమా?

నుగాగమరహితము లనఁదగు "శంభులు" అనురీతిరూపములు డుమంతత్వపక్షమునను నేర్పడు ననుట నిజమె. కాని ద్వితీయైకవచనస్థలమున భేదము గలదు. శంభువ్ అని వీ రుదాహరించిరి గాని యట నంతకుముందు శంభును అని యుండును గదా. ఇపుడీ శంభుశబ్దము డుమంత మయిన పక్షమున "డుమంతము మీఁది – తత్స. 25) అనుసూత్రముచే నిత్య మయి శంభుని అని యగును. నుగాగమాభావపక్షమున నన్నచో నపు డీప్రాతిపదికము డుమంతము కానేరదు గావున నిత్యము రాదు. నువర్ణక మట్లె యుండవలెను. శంభును. శంభ్వుని లేదా శంభును అనుచో ద్రుతస్వరలోప మైన "శంభున్" అనునది రెండుపక్షములందును సమానమే యయ్యును (ఇదియె వఝులవా రుదాహరించిరి.) స్వరలోపము రానిచో [శంభునిని], శంభుని అనురీతిగా భిన్న మ య్యుండును.

"మహాత్ముంలింగోదంతములకు దుమంతత్వము పాక్షిక మగుటం జేసి నివర్తకము పాక్షికముగా నగు నని తాత్పర్యము. దుమంతత్వపక్షమున నివర్తక పాక్షికతయు, దుమంతత్వాభావపక్షమున "అన్యత్ర స్వత్ర సుఙ్భవే" త్తనుచొప్పున నువర్తకపాక్షికతయు సంభవించు నని భావ" [వ్యా. సం. స 489] మని వఝుల వారు నిషేధమును గుర్తింపక పోలేదు. అట్టియెడల దుమంతత్వపక్షముననే దుమంతాభావపక్షమునందలిరూపములును సిద్ధించు ననుట విరుద్ధముగదా. వఝులవారైనను రూపములు మార్గాంతరమున నేర్పడుటను ప్రస్తావించిరే గాని యట్టి రూపముల సాధుత్వమును జెప్పలేదుగదా. దుమంతపక్షమున విగాగమాభావముతో దుమంతత్వాభావపక్షమున వుగాగమాభావముతోను ద్వితీయాదులం దొకేతీ రగు రూపములేర్పడుటలో దోషము లేదు గదా.

కాఁగా మహదుదంతములకును వుగాగమము వికల్పముగాఁ జెప్పవలసి యుండఁగా వఝులవారు మహదుదంతములకె చెప్పుట సరి గా దని స్పష్ట మగుచున్నది.

జరత్కారూణిన్న. ఇత్యాది యగువఝులవారిలక్షణము సూరిసూత్రము నందలి బహుళపదమునకు వ్యాఖ్యానముగా స్వీకరింపఁదగియున్నది. ఊకారాంతము గా భ్రూశబ్ద మొక్కటియె ప్రసిద్ధ మయి కానవచ్చుచున్నది. స్త్రీవాచకములకు వుగాగమము నిత్యమ యని చెప్పఁదగును. "జరత్కారున్" అనుప్రయోగ మొందు విశేషముగా గుర్తింపవచ్చును.

ఇంకను వఝులవారిం కొకవిశేషము నిట్లు పేర్కొనిరి. బహుళగ్రహణముచే వువర్ణాగమమే కాక ప్రథమైకవచన మగుప్రత్యయము నయితము .బాహుబాహా శబ్దములకుఁ బాక్షిక మని వ్యాఖ్య చేసినను జేయనగును. (వ్యా.సం.స. 555) బా హువ్వఁ౹ంచి యనుచో బాహా అనుశబ్దముతో వీరు సమన్వయింతురు. "బాహు" అను ప్రథమైకవచనాంతరూపమున కొక ప్రమాణమును వీరు చూపలేదు. అట్టి యెడల "బాహు"శబ్దమున కిట్టివువర్ణపాక్షికతను జెప్పుట యనవసరము.

రామశబ్దమునకు వు ప్రత్యయ విసూత్రమునందలి బహుళశబ్దముచే లోపించు నని చెప్పుట సరి కాదనఁదగును. ఇది మహత్తు "ఉకారాంతం బగుమహత్తునకు పువర్ణకంబు బహుళంబుగా నగు". అనుసూత్రము మహత్తులకుఁ బ్రథమైకవచనమునందే పువర్ణము బహుళముగాఁ జెప్పుచున్నది. కావున రామశబ్దము పువర్ణకపాక్షికత నాసూత్రముచే సాధించుట యుక్తము (వ్యా.సం.స.(68) కావున నమహత్తగుబాహుశబ్దముతోపాటు రామశబ్దము నిటఁ జేర్కొనుట సమంజసము కాదు.

ఇంత దీనికి పువర్ణకము పాక్షిక మన్నను బ్రయోజనము లేదు. పువర్ణకము లేనిపక్షమున డుజ్వర్ణక మగు నంతియ. రామవు కాని పక్షమున రాముఁడు అని యగును విష్ణుఁడు అని యగు టెట్లే కదా. కావున బహుళశబ్దముచే నన్యకార్యముగా నిచ్చుటఁ బ్రథమైకవచనలోప మొకపక్షమున నగు. రాఁగా "రామ" అను రూపమును వుగాగమలక్షణమునొద్ద పువర్ణకపాక్షికత్వముచేతను సాధింపఁబూనుట సరి గాదు.

## మహత్తులు - పువర్ణకము :

"ఉకారాంతం బగుమహత్తునకు పువర్ణకము బహుళముగా నగు" (50) అనుసూరిసూత్రమును సవరించి యిట్లు పేర్కొనిరి. ఉకారాంతం బగుమహత్తునకు పువర్ణకము వైకల్పికము మనుకటుపటుశబ్దములకు నిత్యము (ఉ. 1సూ) మను పటుశబ్దాదుల నౌనరింప (వ్యా.సం.స 558) నను కా.చూ. ననుసరించి పీ రివి యిందుఁ జేర్చి రనుట స్పష్టము. కటుశబ్దము శ.ర. కాని సూ.చి కాని మహత్తుగాఁ జూపలేదు. కాని "మనువు ధర్మశాస్త్రమున మిక్కిలి కటువు" (కా.చూ.3 30) ననుసరించి కటుశబ్దము నిందుఁ జేర్చియుందురు. మనువట్వాదీనా మ్మని వి వి. పటుశబ్దమును గూడఁ జేర్కొన్నను చందస్పూర్తి పటుందు వు ఎగురీతిప్రయోగముల ననుసరించి (వ్యా.సం.స.558) పటుశబ్దమును దొలఁగించు టుచితముగా నున్నది.

కాఁగా నీమూఁడింటికి మాత్రమే నిత్య మనుటచే మిగిలినమహదుదంతములకు పువర్ణకము వైకల్పిక మని వీరినిర్ణయము. సూరిలక్షణముకంటె నిది స్పష్టముగా నున్న దని వీరియభిప్రాయము

అం.భా.అ. "పాండు-,కురు- ఘారు-, శంతను-, అభిమన్యు-, కంతు-, మొదలగుకొన్నిటికి పుప్రత్యయము రాదు దు మాత్రమె వచ్చు(వ్యా సం.స.669) నని చెప్పఁగా వీరు"ఇట్టిపువర్ణకప్రాగమురూపనిషేధమును వైయాకరణు లెవ్వరును జేసియుండలేదు. ప్రాచీనప్రామాణికవైయాకరణమహాకవీంద్రోపదిష్టసూత్రముల చొప్పున వీనికి పువర్ణకప్రాగాగమాంతరూపములును దుమంతరూపములతోపాటు సమ్మతములైయున్నవి. అభిమన్యువను నన్నగురూపము లంగీకరించినవీరు వానికిఁ బ్రయోగము లేవియుఁ జూపలేదు. కురువు అనుదానిని నిఘంటువులనుండి మాత్రమె వీరు చూపిరి. కాని నిఘంటువులు జగత్తు. హనుమానుఁడు అన్నవియుఁ జూపినవి. లాక్షణికులు స్పష్టముగాఁ జెప్పలేదు గాన పువర్ణముతో రూపము లుండవలయునా? విధాత్రాదులలో మాఁదాతృశబ్దమును లాక్షణికులు చేర్పలే దని దుమంతముగా నంగీకరింపమానిరా? ప్రయోగానుసారముగా గ్రహింపలేదా? నీగుణములు ఇత్యాదిసమాసరూపములను లక్షణమునకు భిన్నముగాఁ బ్రయోగములనుబట్టి వ్యాఖ్యానింపలేదా? (ఉ. 280) ఇట లక్షణముచే సాధించునవకాశము నుండగా లాక్షణికులు స్పష్టము చేయలే దని ప్రయోగములందు లేనిరూపముల నంగీకరింప నేల? నన్నయాథర్వణు లిరువురు మాత్రమె లాక్షణికు లని విశ్వసించినను ప్రయోగానుసారముగాఁ దామైనను స్పష్టము చేయవచ్చునే.

పువర్ణకముతోడిరూపములు లేవు జేసి శంభుప్రభృతులకువలె నభిమన్యుప్రభృతులకును పువర్ణము వైకల్పిక మని సూరులవారు లక్షణము చేయుట తగదనుటయు అం.భా అ.కంటె నన్నయాథర్వణులశాస్త్రము లె మేలుగా నున్న వని (వ్యా.సం స. 669) నిర్ణయించుటకంటె నట్టివిప్రయోగములు చూపుట మేలు. బిం.సూత్రములో వాశబ్దముచే నివి వారించుకొనరాదా? కాన వీరిలక్షణము నిర్దుష్ట మనుటకు లక్ష్యములు దొరకకున్నవి. కాన సూరిసూత్రమును సవరించుట సరి కాదు.

సూరిసూత్రమందలి బహుళశబ్దముచే మనుప్రభృతులకు బ్రవృత్తిమాత్రమును. శంభుప్రభృతుల విభాష యగుటయు. (బాహుళశబ్దమున కన్యకార్యముగా ప్రథమైకవచనలోపమును) లక్షణమున కనుగుణముగా సాధించుకొనఁదగును.



ఇట్లు సూరిలక్షణము లక్ష్యసంగ్రాహకమైయుండఁగా వీరు "నన్నయాథర్వణులయనుగమములు సాధ్యసాధనమువిషయమునఁ గాలియున్న వని గ్రహింపక సూరి యిచట నయితము బహుళవిధినె యారంభించుచున్నాఁ (వ్యా.సం.స.౧౬౪) డనిరి. నన్నయాథర్వణులయనుగమము గ్రహించినవఝ్ఝలవారు విశేషముగాఁ దెల్పిన దేమి? మన్వాదులకు వృద్ధము నిత్య మగుటయె. అదియు బహుళశబ్దముచే లాఘవముతో సూరి సంగ్రహించెను. ఇంకను నన్నయాథర్వణులు పేర్కొనని అభియుక్తుల దమరీతివానిని గూడ సంగ్రహించునది గాఁగా సూరిలక్షణము విసరింపఁబడలే దనియా విమర్శించుట? చిం. దుజ్మహత్పదానాం వా యని వైకల్పిక మన్నారి. ఇదే వీరు దమసూత్రమున మొదటివాక్యమునఁ జెప్పిరి. ఈయంశము సూరి గ్రహింపనిది కాదు గదా; కాఁగాఁ చిం. అభిప్రాయమును సూరి సంగ్రహించెను. ఇఁక నథర్వణుఁడు చేసిన యనుగమములను మాత్రమె సూరి గ్రహింపవే దందుమా?

వి. వి. మనువట్యాదిశబ్దానాం న దుజ్ నిత్య ప్రయుజ్యతే, వృద్ధకోభవత్యత్ర క్వచిన్నిత్యం క్వచిత్తు వా" యన్నది మన్వాదులకు నిత్య మన్నది వఝ్ఝలవారు తమసూత్రమున గ్రహించిరి. వి.వి. పేర్కొన్న వటుశబ్దము తొలఁగించిరి. సూరి వీని బహుళశబ్దముచే లాఘవముతో సంగ్రహించె. వీరిటుగాగమవిధానము నిట స్మరింపఁదగును. "వృద్ధకో భవత్యత్ర క్వచిన్నిత్యమ్" అన్నది పూర్వకారికార్థమును సంగ్రహించుచుఁ బునరుక్తియె యగును. స్పష్టతకందము "క్వచిత్తు వా" యనుదానికి దుజ్ఞు రానిశబ్దములు కొన్నింటికి వృద్ధము వికల్ప మనిరి. ఇవి డుజ్ఞు రానిశబ్దములు కావున వృద్ధమును రానిపక్షము (డుజ్ఞను లేమి) ప్రథమైకవచనము లోపించు నందము. అట్టిశబ్దమే దున్నది? బాహు (బహుత్వముగాదు) అనురూప మథర్వణసమ్మతము గాదు (వ్యా.సం.స.౧౬౪) అట్టిరూపము లేదు గాన నుతమె.

"క్వచిత్తు వా- అద్దానికి నొక్క రాహా అను షష్ఠ్యేకవచనరూపము మాత్రమె సమ్మతమగుచున్నది. (వ్యా.సం.స.110) అందువలన అనుదానిసాధుత్వము సందేహించిరి. (వ్యా.సం.స.561) విష్ణు సాహిత్యకారించె అనురం.రా.ప్రయోగమును దిరస్కరించిరి. (ఉ.118) రాహాశబ్దము నొక్కదానిని యుద్దేశించినయెడల దానిని స్పష్టముగా లక్షణమునఁ జెప్పవచ్చునే? క్వచిత్తన నేల? సూరి బహుళశబ్దము కంటె నిందలి క్వచిచ్ఛబ్దమునకు స్పష్టత యధికమా?

ఇవి సాధ్యసాధనమునఁ జాలియున్న వనిరి. వి.వి.ద్రుజ్ఞ రానికొన్నింటికి [రాహా శబ్దమునకు] పువర్ణము వికల్ప మనుటచే రాహాఁడు అనుడుజంతరూపము వి. వి. సాధ్యము గాదు కాని వీరు సూరిసూత్రవివరణమున "బహుళగ్రహణముచేత రాహాప్రభృతిశబ్దములకు పువర్ణకపుగాగమరూపములు పాక్షికము లనియు వానికిని రాహాఁడు రాహాలు రాహానిన్ము న్నగుడుమంతరూపములు పర్యాయముగా నిల్చు [వ్యా సం. స. 558] నని స్పష్టము చేసిరి. సూరి సాధించినరాహాఁ డను రూప మధర్వణునియనుగమముచే సాధింపఁబడినదా? మఱి సాధ్యసాధనమున నిత్యాదిగా వచులవారు చేసినవ్యాఖ్య సరి కాదనఁదగుఁ గదా.

పూరిచట "పువర్ణకము వచ్చుపక్షమున పువర్ణకపుగాగమాంత [బాల. తత్స, 49 సూ.] రూపములు సిద్ధించును. బహుళగ్రహణముచేత రాహాప్రభృతిశబ్దములకు పువర్ణకపుగాగమాంతరూపములు పాక్షికములు" [వ్యా. సం. స. 558] బాల. తత్స. 49 సూత్రము పుగాగమమును విధించునది కాన నాసందర్భమున పుగాగమాంతరూపములసిద్ధి మాత్రమె ప్రస్తావింపఁదగును "పువర్ణకము వచ్చుపక్షమున పుగాగమాంత [బాల. తత్స. 49 సూ] రూపములను సిద్ధించు" నని చెప్పఁదగును. అట పువర్ణకరూపప్రసక్తి తగదు.

రాహాప్రభృతులకు పువర్ణకపుగాగమములు పాక్షిక మగుట యేబహుళశబ్దము చేతఁ బ్రస్తుతసూత్రము ప్రథమైకవచనమునుగూర్చి మాత్రమె చెప్పుచున్నది. నీసూత్రమందలిబహుళశబ్దముచే పుర్ణకపాక్షికత మాత్రమే సిద్ధించును. పుగాగామ

పాక్షికత వుగాగమమును విధించినట్టి తత్స. 49 సూత్రమునందలి బహుళ శబ్దముచే నగును. కావున వ్యాఖ్యానమున వదులవా రాయంశము స్పష్టముగాఁ జెప్పఁదగును. లేనిచో వుగాగమపాక్షికతయునీసూత్రమందలిబహుళశబ్దముచేతనె యగు నేమో యని వీరివివరణవాక్యముచే సందేహము గల్గును.

## కద్రువః

కద్రువ నాగమాత [60] యనుసూత్రము నట్లు గ్రహించిరి. వివరణమున "వుపూర్వకవుగాగమములచో "వ" అనుదానిని విధ్యు నని యీనిపాతసూత్రమున కర్థము" [ఉ.118] అనిరి అనఁగా కద్రూశబ్దమునకు ముందుగా వుపూర్వకవుగాగమములు చేసి పిదప వానిస్థానమున "వ" వర్ణము చేయవలయు నని వీరు భావించి నట్లు తోఁచుచున్నది.

సంజీవనిలోను "కద్రుశబ్దమునకు... వుప్రత్యయవువర్ణములయుత్వమున కత్వ మగునట్లు ప్రకృతసూత్రము నిపతించుచున్న" (వ్యా.సం.స.681) దనిరి. దీనినిబట్టియు ముందు వుపూర్వకవుగాగమములు చేసి వానికే అత్వము (వత్వమో) చేయవలె నని వీరియభిప్రాయము స్పష్టము.

ఇటఁ బ్రథమైకవచనలోప మగు నన్న గుంత్ర ను విమర్శించుచు (వ్యా.సం.స.682,682) వ అనునదే ప్రథమైకవచన మనిరి.

కాని యీమార్గమునఁ బ్రక్రియాగౌరవము గల్గుచున్నది ఇంతేలఁ కద్రూ శబ్దమున కీసూత్రముచే దీర్ఘమునకు హ్రస్వమును బ్రాతిపదికకే వవర్ణాగమమును నిపతింపఁబడిన దని చెప్పుట యుచితము. ఈశబ్దము స్త్రీలింగము గావున దీనిపైని బ్రథమైకవచనము లోపించుట సామాన్యశాస్త్రానుగుణముగనె సిద్ధించును. ఇతరస్థలములలోఁ గద్రువలు కద్రువను ఇత్యాదిగ నగును.

ఈపక్షమున వుపూర్వకవుగాగమములు చేయ నవసరముండదు దీర్ఘమునకు హ్రస్వము నీసూత్రముచే నిపతింపఁబడినట్లు గ్రహించుట నదియుఁ బ్రత్యేకముగాఁ

చేయు నక్కఱ లేదా? పరమును బ్రహ్మ మొకవచనముగా నంగీకరించినఁ బ్రహ్మమొక వచనలోపప్రసక్తి తగ్గును కాని యితరవిభక్తిపరకత్వమునఁ బ్రాతిపదిక కాఁగను మనక తప్పదు. కావున వర్ణాగమమును బ్రాతిపదికయందే నిపతింపఁబడిన దనుట లెస్స గదా.



## విధాత్రాదులు :

ఋకారాంతంబున కత్వంబును స్త్రీవర్జ్యంబు నగు [52] ననుసూత్రము నట్లు గ్రహించిరి. [ఉ. 53 సూ.]

విధాతృధాతృదాతృసవితృనేతృశబ్దంబులకు మహాత్ముల కత్వస్త్రీవర్జ్యంబులు విభాష నగు" [53] ననుసూత్రమును వీరు విధాతృధాతృమాంధాతృదాతృసవితృనేతృ— అని మాంధాతృశబ్దము నధికముగఁ జేర్చి సూరిసూత్రము నట్లు గ్రహించిరి. "మాంధాతృఁడు (ఆర 3-198, శాంతి. 6-556] కాన సూరి దీనిని విధాత్రాదులలోఁ జేర్పకుండుట సరి కా" [ఉ,119] దనిరి. ఇది యుక్తమే. వి వి. "విధాతా సవితా ధాతా దాతా నేతా చ వా ఋజే భవన్తి" "స విధాత్రాదిః" అని గణమును నియతము చేయుటయే కాక "తదన్యే న ఋజే స్థితాః" అని యింకను గట్టిపఱచెను. ఈయంశమున సూరి కేవలము వి. వి ననుసరించుటలోఁ బొరబడె ననియే చెప్పవలసియున్నది. వి. వి. చూపిన విధాత్రాదు లన్నియు నిట్టివి గా వని విమర్శకులు గుర్తించిరి. ఆం. భా. ఆ. "ధాతృశబ్దమునకు ఋజ్వు లే దని చెప్పఁగా శ. ర. "విధాతృ సవితృశబ్దములకు ద్వివిధరూపముల నుదాహరించి తక్కిన వానికి ధాత దాత నేత యని... మాత్రమె యుదాహరించుట యుక్తము గాదు." ఇట్లె సూ. వి... వీరు ప్రబంధములలోని తత్సమశబ్దములను వెదకించి కోశములు వ్రాయలేదు గదా" (వ్యా. పం. స. 507) యనిరి వఝలవారు. జగత్తు, హనుమానుఁడు మొ॥ అప్రయుక్తము లని వీరు నిర్ణయించుట మాత్రము వెదకియే చేసి యుందురు. విచిత్రము. వఝలవారి కిష్టము గానిచోఁ బ్రస్తుతము గనఁబడకున్న నెటనో యుండు. కాక నన్నయాథర్వణులు సమ్మతించినఁ గవిప్రయుక్తము గాక

న్నను నిర్బంధి లేదు. ఇక వీరి కష్టము గావచ్చో కొన్ని ప్రయోగములు దొరికినను ప్రాచీనప్రామాణికమహాకవీంద్రప్రయోగములు గాకపోవుటయో, ప్రాసాదిస్థల నిబద్ధములు గాకుండుటయో, యెయ్యే దొరకుచున్నపాఠముకంటె భిన్న మై పీఠిసిద్ధాంతమున కనుగుణమై "క ప్రయుక్త" మనఁదగుపాఠము వేఱొండుండుట యో జరుగును. అది య ట్లుండుదము. ఇటు—

ధాతృదాతృనేతృశబ్దములకు ఢుమంతప్రయోగము మృగ్య మని పలుకువారి వచనములవలననే గ్రహింపవచ్చును. "వైయాకరణాగ్రగణ్యుఁడును మహాకవీంద్రుఁడును నగునధ్వర్యుఁడు దాతృశబ్దమును విధాత్రాదులలోఁ జేర్చకనియుండ నద్దానికిఁ బాక్షికఢుమంతరూపము రా దనుట యుక్తమా?" [వ్యా. సం. స. ౧౧౭] ఇం తేల? అట్టిప్రయోగమును జూపినఁ జాలదా? శ. ర. సూ. ని. చూపకున్న వీరు చూపరాదా? అస లందుకే వ్యాకర్తలు మహాకవులు గూడఁ గావలె నని వీరు నిర్ణయించి రేమో. మహాకవులు గావున వీరు వ్యాకరణమునఁ జెప్పిన నవి కవిప్రయుక్త మయినట్లే సా. ప్ర. శ లోఁ బెక్కు ప్రస్తావింపఁబడినవి. అవి యెల్ల నె ట్లంగీకరింతుము?

కాఁగాఁ బ్రయోగములు లభించునందనుక ధాతృదాతృనేతృశబ్దములను విధాత్రాదిగణమునఁ జేర్చుట నిరాధార మనక తీఱదు. కాఁగాఁ బ్రయోగానుసారముగా మాంధాతృ, విధాతృ, సవితృశబ్దములు మూఁడింటికి మాత్రమే ఢుమంతరూపము [పాక్షికముగా] లంగీకరింపఁదగు నని నిశ్చయించుట దోషము గాదు.

కావున సూరి వి. వి. ననుసరించి యీలక్షణము చేసి పొరపడె ననక తీఱదు. ప్రయోగము గలమాంధాతృశబ్దమును గ్రొత్తగాఁ జేర్చుట యెంత యుచితమో ప్రయోగములు దొరక విధాత్రాదులను దిరస్కరించుటయు నంత యుచితమే.

## హ్రస్వము :

"నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు [౬౪] ననుసూరిలక్షణమును వీరు "సంస్కృతప్రాకృతప్రాతిపదికములతుదిదీర్ఘమునకు హ్రస్వం బగు"

[ఉ. 68 సూ] అని వివరించిరి. న చ దేశ్యపదే యను చిం లక్షణమును దృష్టి యం దుంచుకొని వీ రిట్లు సూత్రించియుందురు. సూరిలక్షణముచేఁ దద్భవదేశ్యము లందు హ్రస్వ మగునా? తత్సమపరిచ్ఛేదమునందలియీవిధి సంస్కృతప్రాకృతములయెడనే వర్తిల్లుటలో భేదము లేదు. వీరే సంశోధనిలో "సంస్కృతప్రాకృతశబ్దములు తత్సమము లగునపు డాసంస్కృతప్రాకృతప్రాతిపదికలతుది నున్న దీర్ఘము హ్రస్వ మగు నని సూరిసూత్రమునకుఁ దాత్పర్యము" (వ్యా.సం వ. 671) అనిరి. కాఁగాఁ బ్రస్తుతసూత్రమున వీ రధికముగఁ జేర్చినభాగము సూరిసూత్రోద్దిష్టమె. కావున సూరిసూత్రమునకు వివరణప్రాయముగా నెంచవచ్చును. బహుశః వీ రందుకే సూరి సంస్కృతప్రాకృతనామము లనకుండుటను గూర్చి సూరిని విమర్శింపలేదు. సిరి యన్నది ప్రాకృతసమమై యాచ్ఛిక మవుచున్నను దత్సమ మవుట ననుసరించి యిట లక్ష్య మగుటలో విరోధము లేదు. కావుననే సూరి సంస్కృతప్రాకృతప్రాతిపదికలతుదిదీర్ఘమునకు హ్రస్వ మవుట నుదాహరించుటయే కాక తద్భిన్నమునకు హ్రస్వము రాకుండుటయు స్పష్టము చేసెను [తపర కరణంబుచే దీర్ఘంబున కత్వంబు లేదు. శ్రీలు, లకోరీలు. (తత్స. 45) ఇం దేకాక్షరప్రాతిపదికలకు హ్రస్వమును నిషేధించెను (తత్స. 5) కాని లకోరీలు అనుచో దీర్ఘమె యున్నది? హ్రస్వము రాలేదు. ప్రత్యేకముగా హ్రస్వనిషేధము లేదే. కాన నిట హ్రస్వము ప్రాప్తించుటయే లే దన్నమాట. కావున సంస్కృతప్రాకృతేతరము లగునామములందీర్ఘమునకు హ్రస్వము రా దని సూరి స్పష్టము చేసినట్లె కదా.

కావున సూరిలక్షణము నిర్దుష్టము.

ఇట వీరు రమాఇత్యాదులనుగూర్చి సంస్కృతప్రాతిపదిక లనియే పేర్కొనిరి. (కృతోత్కం బగు, ఉదంతసంస్కృతనామంబు మున్నగురీతిగా నున్న సూరివ్యవహారమున కిది యనుగుణము) కాని యింతకు ముందు "తత్సమమహత్తుమీఁది (ఉ. తత్స. 38) అని బాల ము న్నగుసంస్కృతప్రాతిపదికలనే తత్సమము

లనియుఁ బేర్కొనిరి.  ఇట్లు సంస్కృత(సమ)ము తత్సమ(భవ)ము పర్యాయముగా వ్యవహరించుట విచార్యము.

ఇచ్చోట వివరణమున "దేశ్యము వ్యవహారప్రసిద్ధము గాన నవలా (స్త్రీ) ము స్నగుదీర్ఘాంతములవలెనె నవల (స్త్రీ) ము న్నగుహ్రస్వాంతమును సిద్ధించు ననఁదగును. విలుకాఁడు ము న్నగుకాప్రత్యయాంతాములకు హ్రస్వము లేదు" (ఉ. 120) దనిరి. విలుకాఁడు ఇత్యాదుల కా,ఈ. ఇత్యాదిప్రత్యయములు దీర్ఘములుగా నుపదేశింపఁబడినవి. కావున దేశ్యము కు హ్రస్వ మగు నన్నను విధానసామర్థ్యముచే కాప్రత్యయాదులకు హ్రస్వము రా నేరదు. ఇట్టి కోవగాఁడు అంతకాఁడు మొ॥.

దేశ్యశబ్దములందె యైనను ద్వైరూప్యము వ్యవహారప్రసిద్ధినిబట్టి గల్గు ననుట విచార్యము. దీర్ఘాంతము వేఱుగను హ్రస్వాంతము వేఱుగను నొకేశబ్దమును భిన్నములుగాఁ జూపుట లాక్షణికమార్గమును గాదు దీర్ఘమునకు హ్రస్వము (వరుసగా) చెప్పుకొనుటద్వారాన దీర్ఘాంతరూపమునుండియే హ్రస్వాంత మగుదెందవరూపమును సాధించుట శబ్దశాస్త్రోచితము.

నవలా నేజా ము న్నగుదేశ్యశబ్దములు నన్నయభారతమున లేవు. అవర్వ్లుఖవినాఁటికి నవలా–నవల, నేజా–నేజ, ము న్నగురీతి ద్వైరూప్యము గలశబ్దములు వచ్చియుండును. (వ్యా. సం. న. 568) అని వీరే చెప్పిరి. దేశ్యములు నన్నయ ప్రయోగింపకున్నను "న చ దేశ్యపదే" యనుటచే నాతనినాఁటికివి దీర్ఘాంతములే యని వరులవారిమతము స్పష్టము. హ్రస్వాంతరూపము లాపిదప నేర్పడినవి. కావునను దీర్ఘమునకు హ్రస్వము విధించి యట్టిరూపములు సాధింపఁదగును. వ్యవహారప్రసిద్ధినిబట్టియే దేశ్యస్వరూపము నెఱుఁగఁదగియున్నను, దానిప్రక్రియను లక్షణబద్ధము చేయుట దోషము కాదు గదా. దేశ్యము లట్లు నిరూపించుటయు ప్రసిద్ధమే అచ్చికములు స్త్రీసమాసములుగాఁ జెప్పుట యిందులకే కదా.

దేశ్యముల హ్రస్వ మిట్లు పేర్కొన్నవీరు సంస్కృతప్రాకృతప్రాతిపదికల యందే హ్రస్వము విధించుట సమంజస మని సూచించిన ట్లయినది. "పల్లకీలు నంద

లములు (కళా. ?) (వ్యక్తి) వితా-విత ఇత్యాదులలో హ్రస్వము సైతము గలదు.

(వ్యా.సం.స. 14) ఈతద్భవములందలి హ్రస్వమును గూర్చి వీ రిటఁ బ్రస్తావింప లేదు. తద్భవములవిషయమున సంస్కృతప్రాకృతశబ్దములు ప్రాతిపదికములుగా నిలువవు గదా. "ఆకసము" అనుదానిలోఁ బ్రాతిపదికను "ఆకాశ" యని చూపరాదుగదా. ఇట్లె ప్రాకృతములయెడను. కంబము అనుదానిలోఁ బ్రాతిపదిక ఖంభో అని చూపరాదు కాఁగా సంస్కృతప్రాకృతశబ్దములు ప్రాతిపదికలుగా నిల్చునది తత్సమములయెడనే కాని తద్భవములయెడఁ గాదు. కావున సూత్రమున సంస్కృతప్రాకృతప్రాతిపదికలకుఁ జెప్పిన హ్రస్వము తద్భవములకు రాదు. పల్లకులు విత యనునవియు గుర్తింపఁ దగినవే కదా. తద్భవదేశ్యశబ్దములందు నరుదుగా హ్రస్వ మగుట ప్రయోగానుసారముగా గ్రహింపఁదగినట్లు లక్షణము చేయు టొప్పదా?

విజితత్మాఁ డనుచో హ్రస్వమగుటను వీ రీసూత్రవివరణమునఁ దెల్పిరి. [ఉ. 121] కాని యీహ్రస్వము తెలుఁగున నగునది కాదు. "గోస్త్రియోరుపసర్జనస్య - అనుసూత్రముచేత సంస్కృతమునందే యుపసర్జనత్వమున హ్రస్వము వచ్చును" [వ్యా. సం. స 570] సంస్కృత వ్యాకరణసిద్ధ మగుదాని విటఁ బ్రస్తావింప నేల? ఇట హ్రస్వాభావమును మాత్రమె పేర్కొను టుచితము.

## హ్రస్వాభావము :

ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు (66) అనుసూరిలక్షణమును "ఏకాక్షర శబ్దంబులకు హ్రస్వంబు లేదు" (ఉ. 56) అని చూపిరి. నామంబులకుదిదీర్ఘంబు నకు - ననుపూర్వసూత్రము ననుసరించి ఏకాక్షరంబు లనఁగా నేకాక్షరనామంబు లనియె సూరిసూత్రమునను నర్థము వీరు "ఏకాక్షరశబ్దంబులకు"- అని సామాన్యముగా శబ్దము లన్నను బూర్వసూత్రము ననుసరించి ఏకాక్షరకము లగుసంస్కృత ప్రాకృతప్రాతిపదికశబ్దముల కనియ యర్థము. కాఁగా వఝలవారు ఏకాక్షరక శబ్దంబుల కనుట యించుక వివరణప్రాయమె. సూరిలక్షణమున దురుక్తి యేమియు లేదు.

ఈవిషయమును "ప్రాతిపదికాంతదీర్ఘమునకు హ్రస్వాదేశాభావములు" అను పేర సూచించిరి. ఇందు హ్రస్వనిషేధమె చేయఁబడినది. కాని హ్రస్వ మగుట చెప్పఁబడలేదు. ఆయది పూర్వసూత్రము చెప్పుచున్నది. ఈరెండు విధానములను గూర్చి పూర్వసూత్రమునకు మూఁడురీతిగా సూచించుట యుచితము. కాని యట "దీర్ఘమునకు హ్రస్వము వచ్చుట" యని సామాన్యముగాఁజెప్పిరి

## డుఙ్లోపము:

"వృద్ధాదులకు డుజ్ఞునకు లోపము విభాష నగు" [ 6 ] అనుసూరిలక్షణమును వీరు నన్నయభట్టాదిశబ్దములకు నిత్యముగాను వృద్ధాదిశబ్దములకు వికల్పముగాను డుజ్ఞు లోపించును [ఉ. 67 సూ] అని సవరించిరి.

ఇందలివిషయమును "డులోపనిత్యత"గా సూచించిరి. వృద్ధాదులకుఁ బైని లోపమును వైకల్పికముగా నిందే విధించుచున్న వీరు "నిత్యత" యని సూచించుట సంగతముగా లేదు. సూరి విభాష యనుట సరి కా దనియుఁ గొన్నియెడల నిత్యత గల దనియుఁ జెప్పుట కిట్లు పేర్కొని రేమో. కాని విధానమున కది యనుగుణము కాదు. సూరియభిప్రాయమును దిరస్కరింపఁదలచినను బైనట్లు సూచించుట సముచితము గాదు గదా.

వృద్ధాదులవైకల్పికడుఙ్లోపము సూరి చెప్పినదే. కాఁగా వీరు విశేషముగాఁ జెప్పినది నన్నయభట్టాదుల లోపము నిత్య మగుట. దీనికి వీరు చూపిన నన్నయ భట్టు, నారాయణభట్టు, కంకభట్టు అనుమూఁ డుదాహృతులందు నుత్తరపదము [భట్టు] సమానమె. శ.ర., సూ.వి. భట్టుఁడు అనుపదమును జూపినవి [కాని భట్టుశబ్దమును విడిగాఁ జూపలేదు.] "సూరి భారతప్రయుక్తము లగునన్నయభట్టాది శబ్దములనిత్యతను సూత్రింపకుండుట వింతగా నున్నది [ఉ. 121] [వ్యా. సం. స. 679] దనిరి. ఇట్టియట్టి దగునొండురెండుస్థలములు ప్రత్యేకముగా సూత్రింప

578) లవిరి. "ధూర్తవృద్ధౌ" యని వి. ధూర్తశబ్దమును ముందే పేర్కొన్నది. అయ్యు సూరి "ధూర్త" ప్రాముఖ్యమేల యని వి. వి. లోఁ దర్వాత చూపఁబడిన వృద్ధశబ్దమును బ్రముఖముగాఁ బ్రస్తావించె ననఁదగును. అయినను బిదప నేని ధూర్తశబ్దమును గూడఁ జూపిన బాగుగనే యుండెడిది. ఇది యాకృతిగణముగాఁ గూడఁ జెప్పలేదు గాని నియతగణముగను నిర్ణయింపలేదు గావున ధూర్తశబ్దమును వృద్ధాదులలోఁ జేర్చిన నందుకు సూరిలక్షణము విరోధింపదు.

"మహోక్తివిప్రయుక్తములు కాని గృహస్థుచార్వాకు శబ్దముల పాక్షికత నట నుదాహరించుటయు వింతగాఁ (ఉ. 121) బేర్కొనిరి వీరు. "చార్వాకు"అనుదానిని సూరి యెటఁ జూచి చేర్చెనో పరిశీలింపవలసియున్నది శ. ర. సూవి. గృహస్థు (అని వృద్ధువంటిది) శబ్దమును జూపినవి. దీనికిఁ గవి ప్రయోగములును గలవు. మేటిగృహస్థు బ్రహ్మ యని (భాగ. 10. పూ. 1211) కోవిదుఁ డొక్కగృహస్థు భూవరా (భాగ. 7.424) ఒక గృహస్థు (వైజ 156) కన్నియ నిమ్ము గృహస్థునయ్యెదన్ (వి. పు. 5.132) మొ॥ ఇవి కాక ఈయన యొకశిష్టువోలె (భోజ 4.153) దుష్టు రావణుండు (మొల్ల కిష్కింధ. 4) అనురీతి నితరములును గాననవుచున్నవి.

"ధూర్తుమనసు, విష్ణుదాసు ఇత్యాదులు నిగాగమాభావముచే నైనరూపములు గాన నిట నుదాహార్యములు గావు." (వ్యా. సం. స. 58౹) ధూర్తశబ్దమును వృద్ధాదులలోనిదిగా నెంచవచ్చును. కాని "విష్ణు" శబ్దముపై ముబ్బు లోపించిన దనుకొనుటకు నిది వృద్ధాదులలోని దగునా ? అట్టియెడల "విష్ణు సాక్షాత్కరించె" (ఉ. 718) నన్నది మాత్ర మేల సాధువు గాదు ? ఉ.లో విష్ణుశబ్దము నిటఁ బ్రస్తావింపకుంట లెస్సగ నున్నది.

ఒకవేళ నిట్లు యయ్యును వీని నిట నుదాహరింపఁ దగినది కాదు. ఇట్టివానిని బట్టి (ముబ్లోపముతో) ఇవి ప్రాతిపదికము లగు నని యెంచిరా యనిపించు చున్నది.

సంజీవనిలో ఉత్వనె పేత్యాదివిధానసామర్థ్యముచేతఁ గాని ఉత్త్వఘటిత రూపములుగాఁ దలఁపఁబడుటచేతఁ గాని వీనిపై బా.తత్స. 48 సూత్రముచొప్పున పుపర్ణకము నిలుపనేర (వా. సం. స. 580) దనిరి. బాల. సూత్రవివరణమున వి ష్ణ్వల ? దుజ్లోపముచే నయ్యవి యుప్తప్రథమైకవచనాంతములె యగును. కాన వీనియందుఁ బ్రాతిపదికత్వమె యుండదు. ప్రథమై వచనాంత మగుపదముపై పుపర్ణకము మఱియొక్కటియె విభక్తి యె ట్లగును. రాముఁడు అనుదానిపై వుపర్ణ కము వచ్చునా ? కావున నీబాల. ప్రక్రియలో వింపి. లక్షణము ననుసరించి యీ (వృద్ధు)రూపములస్థితిని సమర్థింపవలసినయవసరమె లేదు. అమ్మ మొద లగువాని కిని ప్రథమైకవచనలోపసాధనము పదత్వసిద్ధికె కదా. హరి మొద లగువోట్ల వీరు డుజ్జు చేసి లోపము చేసిరి. డుజ్జు లోపించినను నయ్యవి ప్రాతిపదికము లగునెడ నాప్రథమైకవచనలోపవిధానము వ్యర్థము గదా. డుజ్జు లోపించిన యివి ప్రాతిపదికము లవు నని భావించుటచేతనే వీ రింతకు ముందు "వృద్ధును" అను రూప మవు నని చెప్పుట జరిగినది నన్నయభట్టుని ఇత్యాదులను బ్రస్తావింప కుండుటయు డుజ్జు లోపించినయివి డుమంతములు గా వనియుఁ దలఁచుట యందు వలననే యనవలె. అది సంగతము గాదు. కాఁగా వరుులవారు విష్ణుదాసు అను దాని నిటఁ బ్రస్తావించుట సరి కాదు.

వరుులవారు వృద్ధాదులలో రాహుశబ్దమును జేర్చిరి. అట్టియెడలఁ బ్రౌఢ. విధానము కేవలము స్పష్టతకే యనవచ్చును. రాహుశబ్ద మొక్కటే వృద్ధాదులలో నహజోదంత మనవచ్చును. అయ్యు వృద్ధాదులలోఁ జేర్చుటలో నవరోధము లేదు. కావున వరుులవారి యీ యుద్దేశ్యమున దోషము లే దనఁదగును.

## స్త్రీలింగము - సులోపము

"స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు" (56) నను సూరి లక్షణమును యథాతథముగనె గ్రహించిరి. వివరణమున "రమాదిశబ్దములకు తత్స 55 సూత్రముచే హ్రస్వము చేసి తత్స 40సూత్రముచే వచ్చువర్ణమునకు

నప్పుడు మువర్ణకేతరవిభక్తిపరకత్వమున ముగాగమమును వానికిఁ గల్గనేర"  (వ్యా. సం. స. 588) దనిరి. అనఁగా నవలు వీనికి ముగాగమమె రాదని యర్థము. (ఇంక లోపించుట యెట్లు ?)

ఇంతకు ముందు 536 పుటలో వీరు చెప్పినట్లే బా. సా. పే. "మువర్ణకేతర విభక్తిపర మగునప్పుడు గుమాగమమును లోపింపఁజేయుటకును స్త్రీప్రథమైక వచనలోపవిధి నుపలక్షణముగా నెన్ని — అనుటను తిరస్కరించుచు "ఇట్టి యుప లక్షణత్వకల్పన యేల ? మువర్ణకము ప్రథమైకవచనమున వచ్చువానికి మాత్రమే మువర్ణకేతరవిభక్తిపరకత్వమున ముగాగమము వచ్చు నని బా. తత్స 40 సూత్రము వచించుచుండుటచేత ముగాగమమునకు ప్రసక్తియే లేదు గదా యనిరి. (వ్యా. సం. స. 581) మఱి వీరింతకు ముందు "తత్స. 57 సూత్రము చెప్పిన స్త్రీలింగ ప్రథమైకవచనలోపము కల్గు ననుటచే లత ము న్నగువానిమువర్ణకమునకు లోపము గల్గును గాన నట్టిలోపము ముగాగమమునకుఁ గల్గును. లత–లతలు, రమ–రమలు" (వ్యా. సం. స. 536) అని యెట్లనిరి ?

ఇట్టివిరోధము చరిత్రాదులసందర్భమునను గోచరించును. చరిత్రాదులకు ముగాగమము వచ్చి లోపించు నను బా. సా. పే. అభిప్రాయమును ఖండించుచు "చరిత్రాదులకు మువర్ణకలోపవిషయమున ముగాగమమును రాదు. చరిత్ర–చరిత్రలు" (వ్యా. సం. స. 589) అనిరి. కాని యింతకు ముందు వీరే "41 సూత్రముచే బా. తత్స. 58. (చరిత్రాది) సూత్రముచెప్పిన వచ్చులోపము ము న్నగునవియు ముగాగమమునకును సంభవించును. చరిత్రము–చరిత్ర, చరిత్రములు–చరిత్రలు. (వ్యా. సం. స. 538) అనిరి. అనఁగా నీపక్షమున ముగాగమము వచ్చి లోపించి నది. వీరు తిరస్కరించిన బా. సా. పే. అభిప్రాయ మిదియే.

అనఁగా బా. సా. పే. ను విమర్శించుచో వీరు తమయభిప్రాయములనే పూర్వోక్తములను తిరస్కరించిరి. ఇం దేది సంగతము ?

"ముపర్ణకము ప్రథమైకవచనమున వచ్చువానికి మాత్రమే ముపర్ణకేతర విభక్తిపరకత్వమున ముగాగమము వచ్చు" (వా. సం. స 683) ననుట యథారమే. ఆదంతామహత్ స్త్రీలింగములకును ప్రథమైకవచనమున ముపర్ణకము చేసి (లోపింపఁజేసి)రి. ఇట్లు ముపర్ణకము వచ్చునీశబ్దముల కితరస్థలములందు ముగాగమము వీరి ప్రకరణము ననుసరించియుఁ దప్పక రావలసినదే కదా. ముగాగమము రా దందు రేమి? కాఁగా వీపక్షమున వీనికి ముగాగమమును వచ్చి లోపించు (వీరు తిరస్కరించిన) పూర్వాభిప్రాయమును నుచితము లనవలెను.

సూరిమతమున కన్న ప్రథమైకవచనలోపవిధానముచే నదంతామహత్ స్త్రీలింగములకుఁ బైని ప్రథమైకవచనమున "సు" విభక్తియే లోపించును. కాఁగా ప్రథమైకవచనమున ముపర్ణకము ప్రాప్తించుట లేదు గావున నితరవిభక్తి పరకత్వమునను ముగాగమము రాదు కావున వీపక్షమున ముగాగమము (వచ్చి) లోపించుట లేదు.

చరిత్రాదులవిషయమున ముపర్ణకలోప విధానముచేఁ బ్రథమైకవచనమున ముపర్ణకము వచ్చి యదియు లోపించును. ప్రథమైకవచనమున ముపర్ణకము వచ్చియుండుటచే ముపర్ణకేతరవిభక్తిపర మగునపుడు చరిత్రాదులకు ముగాగమ మగును. ముపర్ణకమునకు విధించినకార్యము ముగాగమమునకు నగును గావున 58 సూత్రముచే చరిత్రాదులముగాగమమును బహుళముగా లోపించు నని గ్రహింపవచ్చును.

బాల తత్త్వ. 58 సూత్రమునొద్ద ముగాగమలోపమునకుఁ జూపినచరిత్రలు, లతలు అనువానిని వీరే ప్రత్యాఖ్యానించుకొనుటచే నట లోపకార్యమునకు నొకఁ డుదాహరణము చూపవలె.

ఏ మంటినను ప్రథమైకవచనమునన ముపర్ణము వచ్చినచో నది నిల్చినను లేదా లోపించినను నితరవిభక్తుల ముగాగమము తప్పదని గ్రహింపఁదగు.

వజ్జలవా రీపద్ధతిలోనే గ్లౌశబ్దమునకును, గ్లోశబ్దమునకును డుజ్జు లోపించుటంజేసి యవి దుమంతములు కానేరవు. కావుననే వానికి నిగాగమము రాఁజాల"

(వ్యా. సం. స. 609) దనిరి. డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది. డుమంతం బనఁబడవలసియుండఁగా "డుజ్ఞ నిల్చునవియే డుమంతము లనియు లోపించినవి డుమంతములు గా వనియుఁ జెప్పుట యెట్లు ?

డుజ్వర్ణకము చేరునట్టిది ప్రాతిపదిక డుమంతము. అయ్యాగమములయం దెటనే విశేషముగా డుజ్ఞ లోపింప నవుఁ గాక. డుజ్ఞ వచ్చుట యైనచో డుమంతము గాక తప్పదు. పిదప లోపించినను ముందది డుజ్ఞనకుఁ బ్రకృతి యయియే యున్నది కదా. కావునఁ బ్రథమైకవచనమున డుజ్లోపము గల్గినను నితరవిభక్తులలో నివర్ణాదులస్థితి దప్పదు. అది సమ్మతము గానిచోఁ బ్రాతిపదికము డుమంతము కారాదు. అందుకయి డుజ్ఞనకుఁ బ్రాప్తియే లేకుండఁ జేయవలెను. "అంతట ననుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థము" మ న్నగువివరణముల ననుసరించి యిటఁ బ్రథమైకవచనలోప మనఁగా డుజ్ఞ చేసి లోపింపఁజేయుట గాదు సులోపమె. అపుడు డుజ్ఞ రామి దీనికి డుమంతసంజ్ఞ యుండదు. సూరిమతమును మార్చి తెలుఁగు విభక్తులను జేసి లోపింపఁజేయుటవలన వీరిమతమున ననర్థము లేర్పడినవి.

మొత్తముపై స్త్రీలింగశబ్దములపైని గూడఁ బ్రథమైకవచనలోప మనఁగా "సు"లోప మనియె తాత్పర్యము.

## చరిత్రాదులు :

"చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు" ననుసూరి లక్షణమును "దర్పాదులకు నిత్యము గాను, జరిత్రాదులకు వికల్పముగాను మువర్ణకము లోపించును" [ఉ. 69 సూ] అని సవరించిరి. సూరి చరిత్రాదులకు -- బహుళ మని చెప్పి బాహుళకముచే దర్పాదులకు ములోపము నిత్య మని వివరించెను. అవివరణమును గూడ వరుసవారు సూత్రమునందే చేర్చిరి తప్ప విశేషము లేదు. సూరిలక్షణమునందు దురుక్తియును లేదు.

దర్భ, కుశ, పనస - ఇవి దర్భాదులు [త. 1-2] అనుపీరివివరణముచే నీమూఁటియందె ములోపము నిత్య మన్నమాట. [ఇవి యెట్లు నల్పములె కావున వీరు సూత్రముననె విషయ మెల్ల స్పష్టముగా వివరింపఁదలఁచుకొనిరి కావునను "దర్భ కుశ పనసలకు నిత్యముగాను" అని యామూఁటిని సూత్రమునఁ బఠించిన వింకను స్పష్టముగా నుండెడిది గదా

పులకలు - దీని సహోబలపతి కుశాదులలోఁ జూపియున్నను కవిజనమందన కర్త చూపమింజేసి కావలయు సూరియు నుపేక్షించెను. పులక లెగయ [విరా. 6-341] [వ్యా. సం. స. ౯౨]. అనగా పులకశబ్దము దర్భాదులలోఁ జేర్పఁదగిన దని వీరియభిప్రాయము కాని ప్రస్తుతగ్రంథమున వీరును దర్భాదులలోఁ జేర్ప లేదు. క. మం. ననుసరించి సూరి యుపేక్షించె నని వీరు నుపేక్షించిరా ? వీరు దర్భాదులు నియతగణముగాఁ జెప్పిరి. సూరి దర్భ పనస ఇత్యాదు లనుటచే నాతని మతమున దర్భాదులలో నవసరమునుబట్టి చేర్చుకొనునవకాశము గలదు. కాని వీ రదియు లేకుండఁ జెప్పిరి. కావున నిది చరిత్రాదులలోఁ జేరు. ములోపము వికల్ప మగును. ములోపము లేనిపులకములు అనురూపమును వీరు సంజీవనిలో నంగీకరింపలేదు. ఇట నది యంగీకరింపఁదలఁచుచో నందుకు మూల మైనప్రయోగ మును జూపి యుండవలసినది. తెనుఁగున నిది క్లీబముగాను బహువచనాంతము గాను ప్రయోగములం జూపఁబడు" నని శ. ర. - క్లీబమ మనుట యసంగతము. క్లీబమగ్లీబవ్యవహార మాచ్ఛికములయెడనె కలదు. "కలఁగొనె నార టంపుఁ బులకంబులతోఁ బొడతెంచెఁ గంపముల్" [ఉ. హ. 5-110] మున్నగు నొండురెండుప్రయోగములు మువర్ణకాంతస్థితిని నిరూపించుచున్నవి.

చరిత్రాదులలో తరంగ, వేగ, స్ఫురణ, విజృంభణ అనువానిని జేర్పరా దనుటలో విరోధము గానరాదు. అభిలాష, ఘోష యనువానివి శ.ర సూ.ని. చూపినవి ప్రయోగము లీలేదు.

## ఉవు :

"ధర్మాదిశబ్దములముపర్ణకమునకు "ఉవు" అనునాదేశమును రూపాదిశబ్దములముపర్ణకమునకు "ఉ" అను నాదేశమును వికల్పముగ నగును" [ఉ. 60] ఇది బాల.లో నను క్తము. ప్రౌఢవ్యాకర్త ధర్మువు ఇత్యాదులను సాధించెనుగాని "రూవు" ఇత్యాదులను సాధింపలేదు. వీరి లక్షణమునం దౌచిత్యము పరిశీలింపఁదగు.

"ఉవు" అనునాదేశమును ముపర్ణకమునకు విధించుట సరి గాదు ముపర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగును గావున ధర్మువులు అను రీతిరూపము లగుటలో బాధ యుండదు. అర్థు లోలిఁ బెరిగె ననుచో అర్థులు అను రూపము గల్గుటకై దీనిని రూపాదులలోను జేర్పవలసియుండును. లేనిచో అర్థ + ము + లు అనుచో ముపర్ణమునకు "ఉవు" అన్నది మొత్త మాదేశ మయి అర్థ + ఉవు + లు అర్థువు లనియే యగును గాని అర్థులు అని షువర్ణరహితరూప మెట్లు సిద్ధించును? కాఁగా వీనిని ధర్మాదులలోను రూపాదులలోను రెండింటఁ జేర్పవలసిన యవసరము గల్గించుటకంటె లాఘవ మగునిం కొకమార్గ మెన్నఁదగును.

వి. వి. ముశ్చ ఉవుశ్చ యని యీముపర్ణకమున కాదేశము చేయక ము, ఉవు అనువానిని వేర్వేఱుగ విధించినది. ఆమార్గ ముచితముగా నున్నది.

అర్థాదులకడయున్న ఉత్వఁబును మీఁద పువర్ణకంబు నని ప్రౌఢ పేర్కొనెను. ఉత్వమును మాత్రము విధించిన పువర్ణకము సిద్ధింపదా? [చూ. త్రి. శే.]

రూపాదులముపర్ణకమున కుత్వాదేశమును వీరు విశేషముగాఁ జెప్పిరి. ముపర్ణకము మొత్తమునకు నుత్వ మవు నని యభిప్రాయము ప్రాతిపదిక కుత్వమును జెప్పి ముపర్ణకలోపమునుగాఁ జెప్పిన బాగుండెడి దేమో యనిపించు. ఉత్వ ప్రుత్వములు చెప్పుట యింతను లాఘవము. ప్రుత్వాతిదేశముచే నుదంత మయినను పువర్ణకము రాక ప్రథమైకవచనలోపమె యగును.

## సురలు :

"స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు" [59] "సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు" [60] అనుసూరిసూత్రములను గలుపుచు వీరిం కొకతీరుగా రెండుసూత్రములు వ్రాసిరి. "సురశబ్దము తెలుగున నిత్యబహువచనాంతము స్త్రీసమము నవును. సిద్ధసమాసమున నట్లు కానేరదు. [ఉ 61]

సూరిసూత్రమందలి "స్వర్గివాచి" అనుదానిని తొలఁగించుట యింతలి మొదటి సవరణము. దీనింగూర్చి "సురశబ్దము తెలుగున దేవతావర్థమందె కవిప్రయుక్తమనిరి. [ఉ. 125] దేవతార్థమందె యున్నది గావున స్వర్గివాచి యని విశేషముగాఁ జెప్ప నవసరము లే దని వీరియుద్దేశ్యము. భూసురశబ్దమునందలి "సుర" కూడ దేవతావాచకమె యయ్యు వీరు సిద్ధసమాసమున మార్గాంతంమున సాధించిరి.

కాని సూరిలక్షణమున "స్వర్గివాచి" కానపు డేకవచనాంతము గావచ్చును. అది భూసురుఁ డనురీతిగా సంస్కృతసమాసమే కా నక్కఱ లేదు, పుడమిసురుఁ డనువిధముగా మిశ్రసమాసమునందు నేకవచనాంతరూపము సూరిలక్షణసిద్ధము. ఇది ఎఱుఁగువారిలక్షణముచే నసాధ్యము. భూసురుఁ డనునదియు స్వర్గస్థు లయిన వారిని బోధింపదు గావున నది సిద్ధించుట స్పష్టమే. కావున "స్వర్గివాచి" యన్నది సూత్రమున నుండఁదగును [వీరు] బహువచనాంత మగు ననుటకంటె [సూరి] బహుత్వమున బ్రయోగింపబడు ననుటలో సామంజస్యము గల దని తోఁచు.

## దేవ్రఁడు :

దేవశబ్ద మేకత్వముననే ప్రయుక్తమగు నను [బా. 59 సూ.] నంశమును వీరు తొలఁగించిరి. దీనింగూర్చి "దేవశబ్దము నిత్యైకవచనాంతముగ సూరి వచించెను రాచవారలుం దేవులు" [శో జ. 5-33] [ఉ. 124] అనిరి.

దేవశబ్దము నిత్యైకవచనాంత మని సూరి పేర్కొనలేదు. "స్వర్గివాచి" యగునప్పుడె యేకత్వమునఁ బ్రయోగింపఁబడు ననెను. దీనివలన "భూదేవులు" అనుతీరుగా భువి నుండువారిని బోధించుచో దేవశబ్దము బహుత్వమునను బ్రయోగింపఁబడవచ్చును. "రాచవారలుం దేవులు" అనుచో బహువచనాంత మయినది. దీనిచే సూరిలక్షణము దిరస్కరింపవలెనా? దీనిఁగూర్చి వీరే సంజీవనిలో "ఈ పద్యమున దేవు లనఁగాఁ బ్రభువు లని యర్థము స్వర్గివాచి గాదు గావున బహువచనము నిర్బాధము" [వ్యా. సం. న. 602] అను గాణ. అభిప్రాయము నామోదించిరి. ఇంతను సూరిసూత్రాభిప్రాయమున కనుగుణ మగువివరణము చేసిరి. కాని పిదప "దేవశబ్దవిషయమును నిర్ణయించుటకుఁ దగినప్రబలప్రయోగములు లభింపలేవు. ప్రామాణికవైయాకరణు లెవ్వరును దద్విషయమును జెప్పలే [వ్యా. సం. న. 602] దనిరి. ప్రామాణికవైయాకరణు లెవ్వరును జెప్పలేదని [క్రొత్త] లక్షణము చేయరాదనుట సరికాదు. [అట్లయినఁ నింకఁ గ్రొత్తగా వ్యాకరణములు రచింపనేల? చెప్పినవే చెప్పుటకా?] వీరింతకు ముందు "రాపు" అనురీతియాపములను సాధించినవీరిలక్షణ మట్టిది కాదా? ఇంక నీ విషయమునఁ బ్రబలప్రయోగము లభింప లేదనిరి. ఎట్టిప్రయోగము కావలె? ఏకవచనాంత ప్రయోగ మున్నను నిర్ణయింపరాదు. ఏకత్వప్రయోగమె చెప్పఁబడినది కాన. బహుత్వమునఁ బ్రయోగము లేదు. లే దనియె సూత్రము చెప్పుచున్నది. దీనివలన "రాచవారలుం దేవులు" అనుప్రయోగము సూరిలక్షణమునకు బాధకము గా దని వీరు నంగీకరించిన ట్లయినది. ఉ.లో నదియె బాధకముగాఁ జూపిరి. కాని ఉ. అభిప్రాయమె సరి కాదు. ఇట [ఎదురు చూచుచుండువారు రాజధానిలోని రాచవారు] దేవులు అనుచో దేవత లనునర్థ మెంతమాత్రము గుదురదు. ఇంకను దేవశబ్ద బహువచనాంతరూపముగ నియ్యది ప్రయుక్తమైయుండదనగును. దేవతార్థమున దేవశబ్దము బహుత్వమునఁ బ్రయుక్తమైనస్థలమును జూపఁగలిగిన నప్పుడు మాత్రమె సూరిలక్షణమును దిరస్కరింపవచ్చును. కాఁగా సూరిలక్షణమునకు బాధకమైన ప్రయోగమును లేమిఁ బ్రయోగములనుబట్టియును సూరిలక్షణము గ్రాహ్యమై యుండఁగా నిద్దానిని వీరు చెప్పక విడచుట యుచితముగా లేదు.

దీని ననుసరించియే సూరిసూత్రమున "స్వర్గివాచి" యనుట యుపసరమె. దేవశబ్దము దేవతాభిన్నార్థమునను గలదు గదా.

పీరిలక్షణమునఁ "దెల్గున" నన్నది స్పష్టతకే యనఁదగు. "కంధరాదులు క్లీబతుల్యములు — — [ఉ. 68 సూ] ఇత్యాదులు నయితము తెలుఁగునందలివే కాని సంస్కృతమునఁ గాదు గదా. కాఁగా నీవిధియందుఁ "దెల్గున" అనుదళము వ్యర్థము. [అనర్థకము నగు నేమో యితరత్ర]

వరులవారు దీనిని స్త్రీసమ మనుట సూరి మతమున కనుగుణము కాదు. సూరి స్త్రీసమశబ్దము నాచ్ఛికములయెడ మాత్రమె నియతముగఁ బ్రయోగించెను. ఇట్లై "క్లీబసమము"లను. సంస్కృతసమములయెడల స్త్రీతుల్యము [స్త్రీత్వ యుక్తము] ననురీతి స్త్రీసమభిన్నముగా వ్యవహరించెను. వీ రాభేదమును దొలఁగింపకుండవలసినది. తొలఁగించి సాధించినప్రయోజనము లేదు. స్త్రీసమము లని చెప్పిన కర్మధారయలక్షణ [సమా. 56 సూ॥ సంధి. 26 సూ॥] నుగాగమమిత్యాది స్థలముల నాచ్ఛికములె నియతముగా నుండఁగా వీరివిధానమువలన సంస్కృత సమములకుఁ గల దేమో యని సందేహమున కవకాశము గల్గుట వీరివ్యవహార మున నిల్పింది.

"సిద్ధసమాసముల నట్లు కానేఁదు" అనువీరిలక్షణభాగము "సంస్కృత సమాసమునఁ గావు" అనుసూరి"సూత్ర"భాగమునకు వివరణప్రాయమె.

కాఁగా సూరిలక్షణ మెంతయు సముచితము.

## అసుర:

"అసురశబ్దముమఁగూర్చి సూరి చెప్పిన [60 సూ] ఉంశమును వీ రిట్లు ప్రత్యేకముగఁ బ్రస్తావించిరి. "అసురశబ్దము వికల్పముగా స్త్రీతుల్యం బగును. ఇదియు సిద్ధసమాసమున నట్లు కాదు" [ఉ. 62 సూ] ఇందు సూరియభిప్రాయ

మును విరోధించినది లేదు. కాని సూరికి భిన్నమగు రచనవలన "ఇదియు సిద్ధసమానమున నట్లు కాదు" అని యింకొకసారి చెప్పవలసివచ్చె. సిద్ధసమానమునఁ గాకుండుట యన్నది సురాసురశబ్దములు రెంటికి సమానమె. ఈ రెంటిని గలుపుట వలన సూరిరచనలో లాఘవము గల్గినది

## దూతాదులు :

"దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" [61] నను సూరిలక్షణమును వీరు "దూతాదులకు స్త్రీత్వము వైకల్పిక" [ఉ. 63 సూ] మని సవరించిరి. బహుళశబ్దమును బ్రయోగించిన సూరి యందుకుఁ జూపిన ప్రయోజనమును వీ రిటు తిరస్కరించిరి.

"దూతశబ్దమున కమహత్త్వమున స్త్రీత్వము నిత్య మనెడిసూరిప్రభృతుల వాక్యములు నిరాధారములు. దూతుఁ డగుజంబుకము అనియుఁ జెప్పవచ్చును. అశ్వసేనుఁ డనుభుజంగమము [ఆది 8-273] [ఉ. 124] "తక్షకతనయుఁ డశ్వసేనుఁ డనుభుజంగమము" అనుభట్టారకప్రయోగముచొప్పున దూతుఁ డగు జంబుక మనుటలో బాధ యేమున్నది?" [వ్యా సం స. 605] అది వేఱు సంగతి. సూరి బాధ యిట నున్న దన లేదు. పైభట్టారకప్రయోగమున తక్షకతనయ మశ్వసేన మనుభుజంగమ మనురీతి సమహద్రూప ముండనగునా?

అమహత్త్వమున స్త్రీత్వము నిత్య మనె సూరి. అది పొరపాటయిన [వీరిలక్షణమునుబట్టి] వైకల్పికముగాఁ గావలె. కాఁగా నమహత్త్వమున స్త్రీత్వము వచ్చిన దూత యగుజంబుక మని యయ్యె. స్త్రీత్వము రానిపక్షమున నమహత్కార్యము - మువర్ణక మయి దూత మగుజంబుక మని కావలదా? అట్లుండ దని సూరి చెప్పె నది పొరపాటనియు దూతుఁ డగుజంబుక మని యుంటలో బాధ లే దందు రేమి? [వ్యా. సం. స. 604] సూరి యమహత్త్వమున స్త్రీత్వము నిత్య మనియెం గాని యమహత్త్వము నిత్య మనలేదే. మహద్రూపము విరో

ధించుటకు? ఇంక సమహత్త్వమున నిత్య మనుటచే మహత్త్వమున వైకల్పిక మని యర్థమై దూత, దూతఁ డని ద్వైరూప్యము సూరి పేర్కొన్నదే. [చూ. బా. వి. వి. 225] ప్రాచీనప్రామాణికు లెవ్వరును జెప్పకున్న నట్లు చెప్పరాదా? [వ్యా. సం. స 604] వీరు చెప్పినలక్షణ మంతయుఁ బ్రాచీనప్రామాణికులు చెప్పినదే యగునా?

అస లింతకు నిట దూతశబ్ద మమహత్తు గాదా? దూతము అనుదాహరణముం గూర్చి వీరు విచారింపరైరి "దూత్యము తిర్యగ్జడకర్తృకము గాఁ జాలమింజేసి జంబుకమునందు మహద్వివక్షచే దూతశబ్దమును దద్విశేషణమును మహత్తులు కావోవును" [వ్యా. సం. స. 604] కాఁగా జంబుకశబ్దము పుంలింగమును, మహద్వివక్షచే మహత్తు నవుటఁజేసి యుత్వదుజ్జు లయి జంబుకుండు అని కావలె. [వాయసుఁడు వెగడొందెన్] సూరి "జంబుకంబు" అని మువర్ణకాంతముగాఁ జూపుటచే నమహత్తే కదా. నపుంసకము కాక, యమహత్తును గాక మువర్ణక మగుట యెట్లు? విశేష్య మగు జంబుకశబ్ద మమహత్తయినది. కావున దానికి విశేషణ మగుదూతశబ్ద మమహత్తగుటె యొప్పుఁ గదా. [దూతశబ్దమును దాని విశేషణమును - అని వివరించుటలో వరుసలవా రిచట దూతవిశేష్యమును, జంబుకము విశేషణముగాఁ దలఁచిరా యని సందేహము.]

మహద్వివక్షచే మహత్తగు ననిరి; అట్టి వివక్ష లేనిచో నమహత్తే యగును గదా. "దౌత్యము మహద్వ్యాపార మగుటచే నమహత్తునందు మహద్వివక్ష యుక్తము" [వ్యా. సం. స. 601] మహత్తుగా వివక్షించి తీఱనక్కఱలేదు గదా. అసలు దౌత్యము నెఱపు "జంబుకము" అమహత్తుగానె ప్రయుక్త మయినది. మీనంబు లిట్లనియె బిడాల మిట్లనియె ననురీతిని సూరియుఁ బ్రయోగించె. పలుకుట యమహద్వ్యాపారమా? కావున మహద్వ్యాపారముచే మహత్తుగానే వివక్షింపక తీఱ దనరాదు.

ఇంతకు సూరి "మహాత్త్వమున" అని చెప్పి "దూత" [జంబుకము] అని యుదాహరించుటచే నిది యమహాత్త్వమునందె యున్న దనక తప్పదు. ఇటఁ గూడ స్త్రీత్వము వికల్ప మైన స్త్రీత్వాభావపక్షమున "దూతము" అని ముపర్ణకము రావలెఁ గాని మహత్కార్య మగుట యెట్లు? సూరి మహాత్త్వమున నిత్య మని చెప్పలేదే.

"దూతము" అనునమహాద్రూపమును వయులవారును జూపలేదు. అట్టిది యుండదు కావున ప్రయోగానుగుణముగా నట్లు నియమించిన సూరి పై వివరణ మెంతయు నుచితము. ఇందలియౌచిత్యమును గుర్తింపమింజేసియె వయులవారు ఒహాళ మనుసూరియభిప్రాయమును దిరస్కరించి వైకల్పిక మనిరి.

దూతుఁ డగుజంబుకుఁడు అని యుండుటలో బాధ యేమియు లేదు. కాని వయుల వారు చూపిన "దూతుఁ డగుజంబుక" మన్నది విలక్షణము. "తక్షకతనయుఁ డశ్వ సేనుఁ డనుభుజంగము" మనుదానితో దీనికిఁ గొంతపోలిక గలదు. అమహత్తగు విశేష్య మమహత్కార్యయుక్త మయియుండఁగా దానివిశేషణము మాత్రము [మహాత్త్వమును బొంది] మహత్కార్యయుక్త మగుట విశేషము. దీనిని ప్రత్యేక ముగా పఠింపవలసియున్నది. ఇట్టిదే "బలితుం డనునొక్కయెలుక రోమశుం డను పిల్లి వంద్రదుం డనుగూబపులుగు పాలితుఁ డనుముంగి [శాం. 3-203]

## భువి:

వృథ్వీవాచి భూశబ్దంబునకు భువి యగు [62] ననుదాని నట్ల గ్రహించిరి. [ఉ. 64 సూ.] దీనికి స్త్రీలింగప్రథమైకవచనలోప మవును [ఉ. 126] "ఇవి స్త్రీ లింగములు గాన వీనికిఁ బ్రథమైకవచనలోపము గల్గును, ఇకారాంతత్వముచేత సయితము ప్రథమైకవచనలోపము రావచ్చు" [వ్యా సం. వ. 605] ననిరి. ఇగ్లో సూత్రముచేతనె [ఇకారాంతతచే] "ను"లోపము గల్గు నని సూరిమతము.

## నావి:

"నౌశబ్దంబునకు నావ యగు [63] ననుదాని నట్ల గ్రహించిరి. [ఉ. 65 సూ] నావి- అని సూరి యంగీకరించినరూప మేకోశమందును గానరాదు. [ఉ. 125] అని వీరు "నావి" యనురూపము సూరి యంగీకరించినట్లు పేర్కొనుట విచార్యము. "నావ" యనియె యాదేశించినసూరిలక్షణముచే "నావి" యనురూపము సిద్ధించు టెట్లు? కాని "ఔకారాంత మైననౌశబ్దమునకు తెలుఁగులో నావ, నావి అనురెండు

రూపములు గలవని [విశేష్య 50 సూ] తె. వ్యా. పేర్కొన్నది. అథః స్వయుండు "జీవన్నావః పుష్పదన్తస్య" అని త్రి. శ. లోఁ బేర్కొనెను. [సా త్రి.శ.లోను] ఇట్లు "నావి" యనురూపము ప్రాచీనులు చెప్పిరి. గౌరవసూచకముగ సూరి దానిని ప్రస్తావించి యుండు.

## రై - గ్లౌ :

"రై గ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు" (64)ననుదాని నట్లు గ్రహించిరి. [ఉ. 66 సూ] ఇట వీనిపై ముడుమ్ప్రత్యయములను జేసి లోపింపఁజేయుటలో [ఉ. 125] ననంగతు లింతకు మున్నె స్పష్టము. డుమ్ప్రత్యయము రామి గ్లౌశబ్దము డుమంతము గాదు. కావున "గ్లౌవికులజులను" విశేష స్థలము.

## ఐకారాంతములు :

ఐకారం బీతుల్యంబు [65] అనుదాని నట్లు గ్రహించిరి. "ఐకారం బితుల్య మని సూత్రించిన రైలు - రులు కావలసివచ్చును" [ఉ. 126] అందులకయియే సూరి "ఐకారం బిత్వతుల్యంబు" అను శ బ్దం. సం లక్షణము నిట నట్లు చెప్పెనా? కాని చిం. లో "తావభౌ కమేశ నమా" యనుచో [ఏమాతుల్య మగు డాబంతముల తుదిదీర్ఘమునకు హ్రస్వ మగుచున్నది] డాబంతములు గానివివాత్ర మొదలగునవి యీశబ్దసమము లైనను నీశబ్దముల యుత్వమున కుత్వ మగుటలేదు

"అదంగ్వాదుల దాకు ఇకారం బగు" ననురీతిగా వర్ణనిర్దేశములో హ్రస్వమునకు దీర్ఘ మగుట గలదు. [ప్రౌఢ. సం. 3] కావున ఇతుల్యం బని యుద్దేశించినను ఈతుల్యం బనుట యొప్పు. అయ్యవరుపులవారు పేర్కొన్న పైప్రయోజనమును బరిశీలనార్హము.

## కంధరాదులు :

"కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు"[68] ననుసూరిలక్షణమును "కంధరాదులు క్లీబతుల్యంబులు విభాష నగు. విభాశబ్దమున కీవిధి నిత్యము" [ఉ. 68 సూ] అని చూపిరి బహుళపదమును దీసి దానిచే సూరి సాధించినయర్థము సూత్రమునందే కూర్చుట తప్ప నిందు విశేషము గాని, సూరివచనమున దోషము గాని లేవు.

విధాశబ్దమునకుఁ బ్రత్యేకముగాఁ జెప్పుచున్న వీరు దీనిని గంధరాదులనుండి వేఱు చేసి కంధరాదులలోఁ జూప లేదు. వీరిసూత్రమునందలివిభాషాపదమునకు వ్యవస్థ చేయుట ద్వారమున నిచ్చట నిత్య మగుటను గుర్తింపవచ్చు. అయ్యు సూత్రమున వేఱుగాఁ జెప్పుట స్పష్టత కనవలెను వఝలవారియీలక్షణమున విశేష మెన్నవలయు నన్న గౌరవ మొండ గల్పించును.

ఇందలి బహుళపదముంగూర్చి "విధాశబ్దము నిత్యముగాఁ గ్లీబతుల్య మనుటకై సూరి యీవిధిని బహుళ మనుట సరి కాదు. [ఉ. 126] అనిరి. నిజమె ప్రయోజనాంతరము గల దేమో ప్రయోగము లందుఁ బరిశీలింపఁదగును. అయ్యు నిందు దోషము లేమిమాత్రము గుర్తింపవలెను.

ఈవిధానమున వీరు సూరిమార్గము ననుసరించుట యుక్తము గాదు. తన్మతమునకు భిన్నముగా వీరు ప్రథమైకవచనలోపసందర్భములో సుప్రత్యయమునకుఁ గాక డుమ్వాపులు చేసి వానికే లోపము చేయుదురు. కంధరాదు లమహత్తులు గావలతా ఇత్వములకువలె మువర్ణక [ముగాగమ] మును బొందును కంధరము - విధము. స్త్రీలింగము లగుటచే నామువర్ణము లోపింపవలె ఇట మువర్ణకము లోపింపని, నిల్చియున్నరూపమును సాధింపవలె. నిత్యముగా లోపింపవలసిన ప్రథమైకవచనము [మువర్ణకము] వైకల్పికముగా లోపించు [విధాశబ్దమునకు లేదు] అని చెప్పవలె. మఱి క్లీబతుల్యత్వాతిదేశమువలనఁ గంధరము అని యవు ననిరి [ఉ. 126 వ్యా. సం. స. 611] అమహత్త్వమునుబట్టి మువర్ణకము ముందే సిద్ధించియుండఁగా మువర్ణకసిద్ధికై క్లీబత్వత యేల? ఇటఁ గావలసినది మువర్ణకము వచ్చుట గాదు. ముందే వచ్చినమువర్ణకము లోపింపకుండుట.

సూరిమతమునఁ బ్రథమైకవచనలోప మనఁగా సువిభక్తిలోపము. కానఁ గంధరాదులపై మువర్ణకము రాదు. స్త్రీలింగతచే సులోపము గల్గుచుండఁగాఁ గ్లీబతుల్యతచే నాలోపము బాధింపఁబడి మువర్ణకము వచ్చును. కావున మువర్ణకసిద్ధికై క్లీబతుల్యత విధించుట సూరిమార్గమున కనుగుణము. దీనినిబట్టియును సూరిమతమునఁ బ్రథమైకవచనలోప మన సులోపమె యని గ్రహింపవచ్చును.

వఝలవారివిధానము వారిప్రక్రియామార్గమునకు భిన్నము. సూరివిధాన-ముచితము.

## అప్రయుక్తాజంతములు :

వీ రిటనొకవిశేష మిట్లు సూత్రించిరి. "ద్విత్రి, త్రిస్సృచతుస్సృప్రభృతులకు నల్పసంఖ్యావాచకములకును స్మృతోప్రభృతిశబ్దములకుఁ దెలుఁగునఁ దత్సమరూప విభక్తియోగము లేదు" [ఉ. 69]

విభక్త్యంతము గాకుండఁ బదత్వము లేమిఁ బ్రయోగార్హము గాదు కావున విభక్తియోగము లేదనఁ దెలుఁగున నీయవి ప్రయోగింపఁబడ వనియే యర్థము. అట్లు చెప్పుట యింతను సూటిగ నుండును.

"ద్విత్ర్యాదిసంఖ్యాశబ్దానామల్పానాం నాత్ర సంస్థితిః, నబ్బాద స్త్రశ్చ లస్త్రశ్చాప్యేద స్త్రశ్చాత్ర విద్యతే" యను వి. వి. లక్షణమూల ననుసరించి వీ రీ విధానము చేసినట్లు వీరిలక్షణవివరణములఁ బట్టి స్పష్టము. దీనికి బాల.లో మూలము లే దనిరి. కాని "శవచ్ఛ్రాదుఃకిందుఁ బ్రయోగంబు లేదు" అనుసూత్రమందలి యాదిశబ్దముచే నిట్టివానిని గ్రహించుటలో విరోధము లేదు.

ఆలక్షణము హలంతప్రకరణమునఁ జెప్పఁబడినది గావున నట నజంతములు గ్రహింపబడ వని తలఁప వీలు లేదు. సంస్కృతములోని కొన్ని యజంత శబ్దములు కొన్ని హలంతశబ్దములును దెలుఁగునఁ బ్రవేశింపకుండఁగా నా విషయమును జెప్పుటకు నజంతములనుగూర్చి యొకటియు హలంతములఁగూర్చి యొకటియు రెండుసూత్రములు చెప్పవలయునా?

హలంతప్రకరణమునఁ జివరినుండి కొన్నివిధు లజంతహలంతసాధారణములై యుండుట గమనింపవచ్చును. స్త్రీలింగంబు లెల్ల - - కర్తృ - కర్త్రి - కర్త్రి [తత్స. 85] ఇది కేవలము హలంతములనుగూర్చియె చెప్పె ననఁదగునా? ఇట్లె తత్స. 86. ఇట నజంతములను జేర్పఁగూడరాదా? శవచ్ఛ్రాదులకు - తత్స. 87- నను తరువాతి లక్షణ మజంతములను బ్రస్తావింప దని యెట్లు చెప్పనగు? ఇట మరియు నజంతము లొండు రెం డుదాహరించిన వా గుండెడిది. కాకయు నట నాదిపదముచే గ్రహించుట పూర్వలక్షణములనుబట్టి యుచితమే. కాఁగా వరుల వారియీసూత్రము బాల.తత్స. 87 సూత్రమందలియాదిశబ్దమునకు వివరణముగాఁ జెప్పఁదగును.

# ఇంక హలంతప్రకరణము

మరుత్తు :

'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు బిందు నామంబగు' (67) అను సూత్ర లక్షణము నట్లు గ్రహించిరి. (ఉ. 70 సూ.) 'సూరి మ న్నగునాథునకు లక్షితత ముగ మరుత్ వీరుత్ ము న్నగువానిని ప్రథమైకవచనాంతతుల్యము' అనిరి. ఇట్టివి ప్రయోగములు లేవు. మరుత్తు, వీరుత్తు ము న్నగునవి యపశబ్దములు' (ఉ. 127,482) వీరుత్తు అనుదానికిఁ బ్రయోగము వెదకవలసియున్నది. సూరి యెచటఁ జూచెనో. 'మరుత్తు లును (భాగ. 8. 334) ప్రేరి మరుత్తు లెడఁ జాలి గాని (భాగ. 6. 355) మరుత్తులు వసువులు (అము. 3.79) మరుత్తుల (రం. రా. పుట 26, 410) ఇట్లు 'మరుత్తు' నకుఁ గవిప్రయోగములు గలవు. ఇది యసాధు వని నిర్ణయించుటకు పరవస్తువారివే యొక సిద్ధాంతము మూలము. అది సరి కాదు. (తత్స. 73సూ.)

ద్విత్వము :

'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు (68) అను సూత్రలక్షణ మట్లు గ్రహించిరి. (ఉ. 71సూ.) 'దీర్ఘంబుమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' (69) అను సూత్రలక్షణమును 'వైకల్పికంబు' అని సవరించిరి. (ఉ. 72 సూ.) సూరి యిచట బహుళ మన నేల? ప్రయోజనము కానరాదు' (ఉ. 133) అనిరి. ఇట సూరి యన్నియు వైకల్పికద్విత్వరూపములనే యుదాహరించుటచే వీరిట్లు తలఁచియుందురు. కాని సూరి యింతకు ముందు సూత్రమునొద్ద 'రాట్టు' అనునది యుదాహరించెను. వీరును జూపిరి. దానియందు ద్విత్వాభావమును జూపలేదు. అనఁగా నిట దీర్ఘముమీఁది హల్లునకు ద్విత్వము నిత్యము. విరాట్టు సమ్రాట్టు అనుచో ద్విత్వాభావము గలదేమో ప్రయోగముల వెదకవలె. అట్టిద్విత్వము లేనిరూపములను వీరు నుదాహరింపలేదు. కోశములు నట్లే. కావునఁ బ్రయోగానుగుణముగాఁ గొన్నియెడల ద్విత్వము నిత్యమగుటను సాధించుట కీ సూత్రమందలిబహుళశబ్దము సార్థక మయియున్నది.

## మతుబాదులు :

'మతుబాదులందు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామంబగు'  (70)ననుసూత్ర లక్షణమునకు ముందు 'తక్కిన' అనువిశేషణమును జేర్చి యట్లు గ్రహించిరి. 'తక్కిన' అనువిశేషణ మనర్థకమె కాని ప్రయోజనము గానరాదు. 'తక్కిన' అనఁగా మిగిలినది చెప్పఁగా మిగిలినది. 'హలంతంబు (ప్రథమైకవచనాంతతుల్యంబు) అనుటచే హలంతము కంటెఁ దక్కినది- అనఁగా నజంత మని యర్థము చేయనగునా? మతుబాదిక మజంతమా కాక! 'ప్రథమైకవచనాంతతుల్యముకంటె నితర మని యర్థము చేయ (వలె నని యెంచి యుందురు) వీలు లేదు. పూర్వసూత్రమున నిర్దేశము 'హలంతము' గదా కాక 'ప్రథమైకవచనాంతతుల్యేతర మగుమతుబాదికము' అనుదాని కన్వయ మెట్లు? 'మతుబాదికంబు' అని గణము నేర్పఱచుచుండఁగా 'తక్కిన' యనువిశేషణ మేల? కాఁగా సూరిసూత్రము కంటె పరుషలివా విధికముగఁ జూపిన 'తక్కిన' యనువిశేషణ మసంగతమని గుర్తింపఁ దగును.

వీ రిట లక్ష్యములలో శ్రీమన్తమ్, గుణవన్తమ్' అనురీతిగా ననునాసికసంయుక్తముగాఁ జూపు టుచితముగా లేదు. అట్లు యున్న మకారలోపాదిక మగుతెలుఁగువ్యాకరణకార్యములచే శ్రీమన్తుఁడు అనురీతిగనె యవును నకారమునకు బిందువు వచ్చు టెట్లు? పంక్తి, కంఠము ఇత్యాదిగ నెల్లెడల ననుస్వారమె తెలుఁగున నున్నమాట నిజమె. కాని సూరి యిటఁ బ్రాతికాపదికావస్థయందు నున్న చూపియుండఁ గా దని పరసవర్ణమును జూప నేల? పిదపఁ బ్రక్రియలో బిందువు చెప్పఁబడలేదే 'దానియంతిమమకారంబునకు లోపం బగు' (71) ననుదాని నట్లు గ్రహించి (ఉ. 74 సూ) శ్రీమంత' అనురీతిగా మకారలోపముతోపాటు పరసవర్ణమున ననుస్వారమును జూపిరి.

కావున మొదటనే శ్రీమంతమ్ అనురీతి ననుస్వారముతోఁ జూపుట యుక్తము. తుల్యశబ్దముచే నిట్టిస్వల్ప మగుమార్పు నస్తరింపఁదగును (ఉ. .132)

## ముదాదులు :

'ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు (72) ననుదాని నట్లు గ్రహించిరి. (-లోపము లేదు- ఉ.75సూ.)

కాని సూరిగారి లక్షణము సమర్థించుకొనవలసినట్లు కన్పించుచున్నది.



ప్రథమైకవచనలోప మన సూరిమార్గమున నులోప మని చెప్పుకొనుచుంటిమి. అందుకే కంధరాదులకు మువర్ణాగమసిద్ధికై క్లీబతుల్యత చెప్పఁబడినట్లును చెప్పుకొంటిమి. అట్లైన యిట్లు ప్రథమైకవచనము లోపింపక మువర్ణకము వచ్చుటకు వీనికిని క్లీబతుల్యత చెప్పక ప్రథమైకవచనలోపము చెప్పు టెట్లు? అసలు వీనిని గార్గ్యసామ్యమునుబట్టి (హలంతములు యయ్యును) కంధరాదులతోఁ జేర్చి విధాశబ్దమునకువలె ముదాదులకుఁ గ్లీబతుల్యత నిత్య మన్న నెంతను లాఘవముతో నుండెడిది గదా యనిపించును.

స్త్రీలింగము లగువానికిఁ బ్రథమైకవచనము లోపింపవలసియుండఁగా నీసూత్రము దానిని నిషేధించుటచే నమహత్త్వమునుబట్టి మువర్ణకమగు నందురా (వ్యాసం. స.641)

అసలు లోపము లేదనుటవలన నమహత్త్వమునుబట్టి మువర్ణక మగు ననుటేల? ముందే యమహత్త్వమునుబట్టి మువర్ణక మగు నన్న స్త్రీలింగతచే నది లోపింపవలసియుండఁ బ్రస్తుతవిధిచే లోపింపక 'ముదము' అని యగును గదా. వరుసలవారి మతమున కనుగుణముగా నున్న యీమార్గముచేఁ బ్రథమైకవచనలోపమునఁ దెల్ల విభక్తులకే లోపము చేయవలసివచ్చును. కంధరాదులయెడను నిట్టివిధమే యనుసరింపఁగా వానికిఁ గ్లీబతుల్యతాతిదేశ మేల? వీనికివలెఁ బ్రథమైకవచనలోపాభావమును (పాక్షికముగా) విధింపనగుం గదా.

క్లీబతుల్యతావిధానమె యుచితము కాఁగా నిటఁ బ్రథమైకవచనలోపము సార్థకము గావలె నన్న ముదాదులలో నస్త్రీలింగము లగుశబ్దము లుండవలె. ఇట సూరి యుదాహరించినముదము, ఉపానహము ప్రజము అను వానికొఱకె యన్న నీవిధి తగునా యని సందేహము. ప్రయోగములం బరిశీలింపవలె.

ఋత్విగాదులు

'ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు' (76) నను సూరిలక్షణమును వీరు దమగ్రంథమునఁ దొలఁగించిరి. ఏ ? ఋత్విగాదులకుఁ బ్రథమై

కపవత్తులన్ప్రాతిపదికములు లేవు. ఋత్విక్కు, స్వస్తిత్తు అనుకవిప్రయోగములు లేవు' (ఉ. 184)

ఎట్లుండును? ప్రసక్కుల విడిచి ఋత్విక్కుల బాధించి అనుపాత మగపడు చున్నది. ఇవి ప్రసజులఁ జెడిచి ఋత్విజులను బాధించి' అని కవిప్రయుక్తపాతమై యుండును ఇట్టియర్వాచీనకవిప్రయోగములు వీ లైనచో దిద్దుట లెస్స (ఉ. 184) ఇట్లున్నప్రయోగములు దిద్దుచుండఁగా నింకఁ గవిప్రయోగము లుండు టెట్లు? ఇట్టి కవిప్రయోగములను జూచియె సూరి లక్షణ మేర్పఱచియుండు. వీరిలక్షణమున కను గుణముగా నున్నప్రయోగములు దిద్ది దానికిఁ గవిప్రయోగములు లే వన్న నెట్లుం డును! 'దిద్దుట లెస్స' యనవు వెనుకరిమతమున కనుగుణముగా వారు కవిప్రయోగములు దిద్దికొనుచుండఁగా నింక లక్షణ మేల? 'వీ లైనచో' దిద్దుదురు. అనఁగా వీ లైనఁ గవి యుద్దేశ్యమునకు భిన్నముగాఁ జెప్పవచ్చును. ఇట్టియధికార ముచితమా? వీలు కానిచో నేమి చేయవలెను? గ్రామ్యము (వ్యావహారికము) అనవలె.

"భారతమం దెచ్చటను ఋత్విజుండు అనియే యుండుటచేత ప్రసక్కుల విడిచి ఋత్విక్కుల బాధించి అనుసుంటసింగయ్య వరాహపురాణములోనిఋత్విక్కులు అనునది వ్యావహారికమె యని గ్రహింపఁదగును' (వ్యా. సం. స. 481) వ్యావహారిక మన నసాధు వనఁగా గ్రామ్య మని వీరియుద్దేశ్య మెన్నవలె. వీలైనచోట్ల దిద్ది వీలు గానిచోట్ల గ్రామ్యము లన్న నప్పుడు సూరిలక్షణము నిర్మూల మని తొలఁగింప వీ లగును. అస లిది యసాధు వెట్లయినది? భారతమున లేదు గాన. భారతమునఁ బ్రయుక్తము గానిచో నసాధు వనియె నిశ్చయించిన వీరివ్యాకరణము నెంత యట్టిది సాధింపదు? వీరు సాధించిన విశ్వకర్ముఁడు అనుదానికి భారతమందెచ్చట నేఁ బ్రయోగ మున్నదా? దిద్దక వ్యావహారిక మనక సాధించిరే. సాధింపనిదానిని విమర్శించిరే. అముక్తమాల్యదాది మహాకవిప్రయోగము లాధునికము లని యుపేక్షింపరాదు కాని యర్వాచీనకవి ప్రయోగములను స్వమతానుగుణముగా వీ లైనంతవఱకు దిద్దవచ్చును. కవిప్రయోగములను గూర్చి వీరి సిద్ధాంత మసమంజసము.

అన్యఋత్విక్కుల నతఁడు గూర్చి (భాగ. 9. 367) ఋత్విజులను నతఁ డని దిద్దుదురా? కానిచో నసాధు వనవలె.

'లేదా దీని నింద్రజిదాదులలోఁ జేర్పవలె' (ఉ. 134) ననిరి. ఇంద్రజిదాదు

లేవి? వాని కేమగును? వ్రీ రే మైన సూత్రించిరా ? ద్వితీయైకవచనాంతతుల్యరూప మెండ యుట వీ రుద్దేశించి రేమో యనిపించు. అయిన 'లేదా'యని యీవాక్య మారంభించుట యేల? ఇంద్రజిదాదు లన నేల? గతుజాదికమునందనఁగదాదగుకుండలీంద్రుఁడును ప్రబంధపరమేశ్వరభాస్కరులును సత్యజిత్తు,సత్యజితుఁడు, ఇంద్రజిత్తు ఇంద్రజితుఁడు అను రెండుస్థలములందుమాత్రము నిపాతన్యాయమున నంగీకరించి పై నుదాహరించిన కవిప్రయోగములను సూత్రింపక- ఋత్విగాదులు అని సూత్రించుట వింత. (వ్యా.సం. స.643,ఉ.178) అనఁగా రూపద్వైవిధ్యము సూత్రించుట యుక్తమె. ఋత్విగాదు లనుట తప్పు. ఇంద్రజిదాదు లనవలె నేమో. (అవసర మైన ఋత్విక్ శబ్దమునందుఁ జేర్ప వచ్చును) సూరి చెప్పినయంశము చెప్పవలసినదే యని పరుులవారే యంగీకరించి న ట్లయినది కదా.

ఆ ట్లగు ననియే యేమో పిదప "వ్యా.సం.సలోను ఉ.లోను సత్యజిత్, ఇంద్ర జిత్ శబ్దములకును సకారాంతమహస్మహతీవాచకములకును భారతప్రయోగానురోధమున ద్వివిధరూపము లుండ నగు నని చెప్పఁబడెను. కాని వానికిని ద్వివిధరూపము లుండు నని యంగీకరింప నక్కఱలేదు" (ఉ.483) అనిరి.అవసర మున్నచోట 'సత్యజిత్తుమేన (ద్రోణ.1.288) ననుచోఁ దిక్కన సత్యజితునిమేన ననియె ప్రయోగించియుండును. ఒకవేళ మొదట న ట్లున్నను బిదప మార్చుకొనియుండు, లేనిచో పరుులవారివ్యాఖ్య విరోధింపదా? (ఉ. 483) కాని మఱచిన ట్లున్నది 'అన్యచాపహస్తుఁ డైనసత్యజిత్తు సంరంభ-(ద్రో॥.1.290) అనుచోఁ గూడ సత్యజితుఁ డన్నను గణభంగము లేదు గావున నదియే తిక్కన ప్రయోగించియుండును. 'కాని తద్భిన్నస్థలము లచ్చటనే యున్నవి. చంపక. 'అనుపమధైర్యధుర్యుఁడు మహాబలదీప్తుఁడు సత్యజిత్తు ద్రో- ణుని వెనుఁ గాఁకి (ద్రోణ. 1.283) ఇట సత్యజిత్తు' ప్రథమాంతమె. దీనిని సత్యజితు డన్నచో గణభంగ మగు. ఇట్లె ఉత్పల. ఖండను లై పడం ధనువు గ్రక్కున నేయుడుఁ సత్యజిత్తు వి ల్లొండు గొనం దునియ (ద్రోణ-1.291) ఇటను ప్రథమాంతమె. దిద్దిన గణభంగము.

అయినచో దిద్దుటకు వీలు లేనితావు గావున నీరూపము వ్యావహారికముగ్గాఁ దిరస్కరింపవచ్చు. తిక్కనప్రయోగములకె యెట్టిగతి పట్టినదో. అర్వాచీనకవిప్రయో

గములను వీ లైనచో దిద్దు మనిరి. కాని వీరు తిక్కన ప్రాచీనప్రామాణికకవిప్రయోగములు గూడ దిద్ది రనవలసినదే. లేక నిరాధారముగాఁ దిక్కన తమవ్యాఖ్య కనుగుణముగా, ఇట్లు ప్రయోగించియుండు నని యెట్లు నిర్ణయింతురు? కాఁగా సత్యజిత్తుమేన, ము న్నగున్తలములందుఁ ప్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక మగుటచే (సత్యజితుఁడు) దీనికి ద్వైరూప్య మంగీకరింపక తప్పదు. ఇయ్యది ఋత్విగాదులఁ జేరు.

భాస్కరకవిప్రయోగమున 'నీకొడు కింద్రజిత్తు' అను(ఉత్పలమాల) చో దిద్దుటకు వీలు లేదు కావున 'భారతవిరుద్ధ మైయుండుటచేత నగ్రాహ్యమై వ్యావహారికసదమె యనఁదగుకు' (ఉ.484) అని నిర్ణయించిరి. దిద్దుటకు వీ లయినచో దిద్ది యదియే కవిప్రయుక్త మనియు వీలు గానిచో నగ్రాహ్య మనియు నిర్ణయించుట మిక్కిలి యసంగతము గదా. భారతవిరుద్ధ మేమి? వీరిసిద్ధాంతమునకు విరుద్ధ మై భారతమం దున్న వాని నేమి చేయుదురు! ఇట్లయిన వరుసవారిమతము ననుసరించి గ్రంథము లెల్లఁ దిరుగ ముద్రింపవలసియుండును. భాగవతమున పరీక్షిత్తు (9.659) విశ్వజిత్తు (8.681) ఇత్యాదిగ నిట్టిరూపములు వందలలో నున్నవి.

విశ్వజి త్తనఁగాఁ బుట్టి, వినుము సత్యజిత్తునకు (హరి.పూ 2.123) శ్రుతజిత్తనునామ మాత్మజునకు నిచ్చె (హరి.పూ.3.85) అపురజిత్తు బాణాసారమున (బ్రహ్మ-1.268) సంగ్రామజిత్తు గరోద్ధతుఁడై (విరా.5.79) సురేంద్రజిత్తు వికటుఁడై (ఉద్యో. 3.300) సేనజిత్తు (శాంతి. 1.20) శక్రజిత్తుచే (అని. 3.118) సుహృత్తులు (భాగ.10 పూ.1074) మొ॥

చిం.లో గుణపదగుణవర్ణములలో నొకదానియం దున్నశబ్ద మిం కొకగణమున నుండ దనుటకు విరుద్ధము నపూర్వము నగుసిద్ధాంతమును జేసికొని తన్మూలమున వీరు కవిప్రయోగముల నన్యథాకరించుటకు మిక్కిలి సాహసించి రనవలె. మహోపనిషత్తు (కాశీ.2.69) తాపనీయోపనిషత్తు (కాశీ.2-151) ధ్వని నవరింపనగును గాన ధ్వనిని శ్రీనాథుఁడు ప్రయోగింపలే దేమో. ఉపనిషదము అని శ్రీనాథుఁడు ప్రయోగించె నేమో (ఉ.479) అగ్నే ద్వైపరిషత్తు (కాశీ 7.233) తనూనపాత్తు (కాశీ.3 206)

అనుచోఁ గూడ పరిషదము తనూనపాద్వుఁడు అని శ్రీనాథుఁడు ప్రయోగించె నేమో (ఉ.479) సినెమ్మొగమ్ము సుహృత్తు-లంభావలనఁ బొత్తు (ప్ర.భా.5-157) ఇందలిసుహృత్తుమార్చరాద్ధు.(రగడ నియమముచొప్పున మార్చుట కవకాశము లేకపోయిన దని భావము) ఈపింగళిసూరకవి మహాకవి యైనను గ్రాహ్యము గా దనియు వ్యావహారికమె యనియు గ్రహింపవలెను' (ఉ.477) ఆముక్తమాల్యద నాధునిక మని సూరి మహాకవి ప్రయోగముల నుపేక్షించినట్లు వీరుసూరినివిమర్శించిరి కానియావీరే మహాకవిప్రయోగమె యైనను గ్రాహ్యము గా దనిరి. అధమపక్షము సూరికిఁ దమవంటియుద్దేశ్య మే నున్న దనితలఁప రేమి? ఇఁక మహాకవిప్రయోగములం దుండుటను గుర్తించియు భారతమందు లే వనుకారణముచే (దిరస్కరింపవచ్చునా) తుపటకనగాగమాభావము, ముత్పరకవత్వాభావము, ఇత్యాదు లెన్నిటిని కవిత్రయేతరప్రయోగములనుండి వీరు సంగ్రహింపలేదు? ఆన లిట్టిప్రయోగబలమునుబట్టియె బా.స ప్రభృతులు చింలోఁ గొన్ని శబ్దములకు గణద్వయపాఠము నంగీకరించియుందురు. తా మన్న తిక్కన శ్రీనాథుఁడు వంటి మహాకవులప్రయోగములకే దిక్కుండదే.

పరుషలవారియీసిద్ధాంతము కవియథార్థప్రయోగములకు విరుద్ధము కావున నగ్రాహ్యము.

ఋశ్యశృంగర్షి ము-ఋష్యల ఋత్విక్కుం (రామా.3.15) మత్తేభమునఁ బ్రయుక్తము (మల్లరు అనుకవిప్రయోగముచేతనె రేఫ వికల్ప యని పరుషలవారు పేర్కొనిరి. కావున నీతఁ దప్రామాణికుఁ డనరాదు.) ప్రాసమునఁగాకున్నను గణముల బంధింపఁబడి యుండఁగా నిది యంగీకరింపరాదా? నిర్వృత్తు-నిర్వృతము అని ద్వైరూప్యము సూ.ని చూపినది. ఆధారము వెదుకవలె.

కాఁగా సూ.లక్షణము సముచితము. అవశ్యగ్రాహ్యము. దీనిని పరుషలవారు వొలఁగించుట యనుచితము.

ఇంద్రజిత్తుఁడు :

ఇంద్రజిత్తుఁ డనుదానిని స,సా.సం. పేర్కొనుటయు నది కవిప్రయోగములం దుంటయుఁ బ్రస్తావించుచు పరుషలవాడు "ప్రామాణికు లగునన్నయాథర్వణుల సూత్రములకు విలక్షణ మగునీప్రయోగమును తిక్కనశ్రీనాథనాచనసోమనాదిప్రామాణిక

(ప్రాచీన?) ప్రయోగముల ప్రామాణ్యమైన లేనిదే సాధు వని యంగీకరించుట సరి కాదని నాయభిప్రాయ (వ్యా.సం.స.628) మనిరి. ప్రాచీనప్రామాణికలాక్షణికసూత్రము లాధారముగాఁ జూపుట యెట్లెడఁ గదురునది కాదు. సూరియు 'ఇంద్రజిత్తు'ఁ డను రీతి వానిని బాల.లో ప్రస్తావింపలేదు.

"ప్రథమైకవచనము లోపించినడుగాగమాంతముల పై మఱల డుజ్ఞు నిల్పుట కేవలము నసంభవ మగుటచే ఇంద్రజిత్తుఁడు అనురూపము సరికాదు. కాని కొందఱు సామాన్యకవు లద్దానిని ప్రయోగించిరి. గ్రాహ్యము గా దనుటయె లెస్స. సామాన్యకవి ప్రయోగములు. ఇంద్రజిత్తునితం. భాస్కర. యుద్ధ 1378 (ఉ.138)

'ఇంద్రజిత్తుఁడు' అనురూప మంగీకరింపరా దనుకొన్నఁ దప్ప లక్షణసిద్ధము గా దని గ్రామ్యము చేయ నేల? ప్రథమైకవచనలోపము రాక తప్ప దని ముదము మున్నగురూపము లగ్రాహ్యము లనిరా? ప్రథమైకవచనలోపము వచ్చిన డుజ్ఞు వచ్చుట కవకాశము లేదు. ముదాదులకు ముందొక మెట్లయినది? ప్రత్యేకముగా (ప్రథమైకవచన లోపమును వారింప లేదా? ఇటఁ గూడ నిట్లే యుగాగమాంతముల పైని రావలసిన ప్రథమైకవచనలోపము రా దని నిషేధించిన 'నింద్రజిత్తుఁడు' సముచితముగా సిద్ధింపదా? సూరి ముదాదులకు నిత్యలోపము చెప్పెఁ గాని వీనిని ముదాదులలోఁ జేర్చుకొన్ననిటఁ ప్రథమైకవచనలోపవిధానము సార్థక మయ్యెడిది. ఇంద్రజిత్తు అనియుఁ గావలసి యుండు ముదాద్యులలోఁ జేర్పు వీని కవకాశము గానరాకున్నది. కాన బాలవ్యాకరణసాధ్యములు గా వనుటయె లెస్స. ఏ మైన పరుషులవాడు సామాన్యకవి యొక్కరినిబరిచయము చేసిరి. మహాకవుల ప్రసంగమున వీరికిఁ దావు లేదు. ఎట్టిన మహాకవి యందురా? ఇట్టి వాతఁడు ప్రయోగించె. దశజిత్తును శతజిత్తుడును సహస్రజిత్తుండును నయుజిత్తుండును (హరి. పూ. 3.147) యుధాజిత్తుండు (హరి. పూ.3.155) సత్రాజిత్తుఁ డెల్లప్పుడున్ (ఉత్పల. హరి పూ.3.176) 'విశ్వకర్ముని' అని ప్రయోగించిన యెట్టనయె పైరీతిని ప్రయోగించె ఇంద్రజిత్తుఁడు చనియెన్(రామా.7.22) ఇంద్రజిత్తుని (ఉ.రా.6 250) కాలజిత్తుండు తాను (జై,6164) సత్యజిత్తునిన్ (హంస 2.218) కావున నివియు నంగీకరింపఁదగు నని తోఁచుచున్నది.

శబ్దరత్నాకరకర్తచేతఁ గల్పిత మయ్యెనా యని యాలోచింపవలసియున్నది. (వ్యా.సం.స.667) యనెడి ప్రయోగము లేదు గానఁ గల్పిత మయ్యె నని రన్నమాట శ.ర. దీనికిఁ బ్రయోగమును జూపనికొంతతను వీరు దీర్చిరి. మగాదుల నుదాహరించుచు వజ్ఝలవారు 'హనుమనివాలము' (భాస్క.ర.సుందర.456) అని యిచ్చిరి. 'మగఁడు'వలె హనుముఁడు అని యగు నని వీరు చూపినప్రయోగము (సామాన్యకవి?) చే శ.ర.కర్త కల్పించె ననుట సరి కాదు గదా.

హనుమానుఁడు, యువ, చార్వాక, పురోధసుఁడు ము న్నగువాని నిట్లే సూరి కల్పించె నని తలఁచుటకంటె (వ్యా.సం.స.664) నిట్టివానికిఁ గవిప్రయోగములు వెదకుట యుచితము గదా. తాము ప్రయోగమును జూపియె ప్రయోగము లే దని శ.ర.ను విమర్శించినతీరునుబట్టి యైనను గవిప్రయోగములవిషయమున లాక్షణికులు పేర్కొన్నచోఁ గవిప్రయోగములు లే వనుటలో నిదానింపవలసియున్నది.

విశ్వకర్మాదులు :

'విశ్వకర్మాదులకు త్రిత్వం బగు' (75) నన్సూరిలక్షణమును 'అశ్వత్థామాదులకు త్రిత్వం బగు' (ఉ.76 నని సవరించిరి. దీనింగూర్చి 'సూరి విశ్వకర్మాదుల కని సూత్రించెను. విశ్వకర్ముఁ డనియుఁ గలదు గాన విశ్వకర్మశబ్ద మాత్మాదులలోనిది. విశ్వకర్మని (ఉ.హరి. 445) (ఉ.135,వ్యా.సం.స.650) ఋత్విక్కు ఇత్యాదులవలె భావితము ఇది ప్రయుక్తము గాదు గావున వ్యాపహారిక మనకుండ, కవిప్రయుక్తము గా దనకుండ పరబులవారు యథాతథముగా గ్రహించుట విశేషమె. "నాచనసోముని ప్రయోగము విశ్వకర్మునికూఁతు (వ్యా.స.స.650) అనునొకేయొక్క ప్రయోగమునుబట్టి (ఇది నాచనసోమునియుత్తరహరివంశములోని దని యిట పరబులవారు ప్రమాదపడిరి. ఎఱ్ఱనహరివంశమున నుత్తరభాగమునందలి దగుట వారికిఁ దెలియనిది కాదు.) "అశ్వత్థామశబ్దమునలెనె విశ్వకర్మశబ్దము నైతము భట్టారకుఁడు త్రిసమరూపముతో మాత్రమె ప్రయోగిం(వ్యా.సం.స.651)చినను విశ్వకర్ముఁ డన్నదానిని వైకల్పికముగా నంగీకరింపవలె నన్న వీరు సూరి విశ్వకర్మాదులలో యజ్వశబ్దమును జేర్చుటనుగూర్చి "యజ్వశబ్దమును త్రిసమరూపముతోఁ గవితాపితామహుఁడు 'యాగపనమందు యజ్వయు— అని ప్రయోగించెను. కాని యీయొక్క ప్రయోగము దానికి దుమంతరూపము లే దని నిరూ

పింపఁజాలదు. అందులకుఁ బ్రమాణాంతరమును గానరాదు' (వ్యా.సం.స.650) అనుట వింత. కవితాపితామహుఁ డెఱ్ఱన (నాచనసోమన?) వలెఁ బ్రామాణికుఁడు గాఁ డేమో. అవుఁ గాక. ఉక్తస్త్రీత్వఘటితప్రయోగము దానిస్త్రీత్వమునకుఁ బ్రమాణము గాకుండ లేనిదుమంతరూపము దీనికుమంతత కాధార మె ట్లగునో యర్థము గాదు. దీని కుమంతతకు నొక్కప్రయోగ మేని దొరకలే దన్నమాట.



దీనికిఁ బ్రమాణాంతరము లే దనిరే యది ముఖ్యకారణ మైయుండును. నన్నయాదిపూర్వకవులు చెప్పినఁ గవిప్రయోగ ముండుట లేకుండుట యనువానితో నిమిత్తము లేకుండ నంగీకరింపవచ్చును స్పష్టముగాఁ జెప్పకున్నను మనుజసంజ్ఞా యామ్మనుచో నశ్వత్థామాదికతిచిన్నబ్దముల కనువీరివ్యాఖ్య ననుసరించి సూరియు' నశ్వత్థామాదుల కనవలసియుండఁగా (వీ రుదాహృతమున నట్ల లనిరి.) విశ్వకర్మాదు లనుటచే రవివీ యంగీకరింపలే దనఁదగు.

వీ రీసందర్భమునఁ బెక్కుసార్లు స్త్రీత్వఘటితము లగునీసంస్కృతశబ్దములను స్త్రీసములుగా (అశ్వత్థామస్త్రీసమరూపము 651,654 ము॥) ధారాళముగా వ్యవహరించిరి. ఇవి సూరిసమ్మతము గాదు సూరిమతమున స్త్రీసమము లాచ్ఛికములె.

యువశబ్దము విషయమై యెట్టిప్రయోగమును లభింపలే దనిరి. (వ్యా.సం.స 651) (యజ్వవిషయ మై లభించినప్రయోగ మేమి చేసినది? సూరి నిరాధారముగ యువ' నిండుఁ జేర్చె ననుటకంటె దానికి మూల మగునాధారము వెదకఁదగు ననుట యుక్తము. లేదా యువుఁ డనుప్రయోగము చూపఁదగు.

కృష్ణవర్త్మఁ డనుదాని కొక్కప్రయోగమును వరులవారు చూపలేదు. కాని 'విశ్వకర్మ కృష్ణవర్త్మ యనియే యుండు ననుట యథర్వణాశయమునకు విరుద్ధ' మని తలఁచిరి. అకృష్ణవర్త్మఁ డుజ్జ్వలాభీకరశరజిహ్వాంచరర (శల్య-2-362) నని యొకచో నట్టిప్రయోగము గానవచ్చును. కాని యిట కృష్ణవర్తుఁడు, కృష్ణదస్యుఁ డిత్యాదిగాఁ బాఠాంతరము లున్నవి.

'విశ్వకర్మఁ డని యొకప్రయోగ మున్నది. అట్టిరూప మంగీకరింపవలసినదే. కాని యంతమాత్రమున 'విశ్వకర్మ' శబ్ద మాత్మాదులలోఁ జేర్పఁదగునా? మునుపటి

దందు రేమి? విశ్వకర్మాది సూత్రము పరి యగుట నుత్తరించితిమి. విశ్వకర్మశబ్ద మాత్రాదులలోఁ జేర్పఁదగినది కాదు. పూషశబ్దమును పూరి విశ్వకర్మాదులలోఁ జేర్కొనియు నుండలేదు

సూరిలక్షణమున బహుళపదము ప్రయోజనవంతమె. సుధన్వశతధన్వశబ్దములు మనుజసంజ్ఞలు వీనికి స్త్రీత్వమసలు లేదు. ఇట స్త్రప్వృత్తి (వ్యా.సం.స.654) పూష, శబ్దము మనుజసంజ్ఞ కాదు, అయ్యు స్త్రీసమత్వ మిందలిబహుళశబ్దముచే నందుచున్నది. కావున సూరిసూత్రమున బహుళపద మవసరమె. కావున నిది సూక్తమె.

రాజు :

'మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు (78) నను సూరిసూత్రమును 'పుంలింగమును జేతనార్థకము నయి స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు' (ఉ.79సూ) నని మార్చిరి. స్వార్థప్రధానభావే స్యాద్రాజ్ఞోడుః పుంసి చేతనే' యనువి.వి.వాక్యమును వీరి ట్లనువదించి రనవచ్చును.

సూరిసూత్రమునందలి'మహత్త్వంబున' అనుదళమును దీసి 'పుంలింగమును జేతనార్థకమును' అని చేర్చిరి. మహత్తు పుంలింగమును జేతనార్థకము నవును గదా. మార్పేల? ఇట్లనిరి.

'సూరి మహత్త్వంబున- అనుటచేత అశ్వరాజు అనునన్వయప్రయోగమె కుదురదు. ఈప్రయోగమునందు మహద్వాచకయు లేదు. అశ్వశ్రేష్ఠ మని యున్నను నమహత్తుగానే యున్నది. పురుషతావివక్ష లేదు. '(ఉ.137) మహద్వివక్ష యనఁగాఁ బురుషతావివక్ష యనుట విశేషము. ఈశబ్దము మహద్రూప మందినను, నమహద్రూప మందినను దీనిచే బోధింపఁబడునది తిర్యక్ప్రదార్థమే గాని స్త్రీతిర్యగ్దేతరము కాదు. మహద్వాచ్యార్థముకై శబ్దమున మహత్త్వమును వివక్షింతుము.

అశ్వరాజు 'అనునన్వయప్రయోగము కుదురకపోవు టెట్లు? సూరియె యా సూత్రమునొద్ద 'ఖగరాజు' అని యుదాహరించెను. (వ్యా.సం.స 658) 'ఖగరాజు' అనుచో మహద్వివక్ష కుదిరినపు 'డశ్వరాజు' అనుచో నేల కుదురదు? 'అశ్వోత్తమున్'

అనుచో మహాత్కార్యము కాలేదా? 'అశ్వరాజు' అనుచో మహద్విశేష లే దందురు గాని దాని కేమి యాధారము. మహాత్కార్యము గలదు. మహత్తుగాఁ జెప్పుట కందు బాధ కాంశ మేమి? ఊరక మహద్విశేష కుదుర దన్న నెట్లు విశ్వసింతుము? సంజీవనిలోఁ గాని ఉద్ద్యోతమునఁ గాని మహద్విశేష లే దనుటకు నే రాధారమును జూపలేదు.

'అశ్వమేధంబునకు నర్చితం బై నయశ్వరాజు. విశేష్య మగు 'అశ్వరాజు' నకు మహద్విశేష మైన దానికి విశేషణ మగు 'అర్చిత'శబ్దమును మహత్తయి 'అర్చితం బైన' అని కావలెనా? అర్చితంబు అనుటచే 'అశ్వరాజు'లో మహద్విశేష లే దందురా? ఇచట నే రీ ప్రయోగముమొత్తము చూపలేదు. సంజీవనిలోను పై విశేషణమును గూర్చి వీరు ప్రస్తావింపలేదు. అది యుక్తమే. దినకరతిగ్మతేజము ప్రదీప్తమహాశనుఁడు (అర.4.244) అనుచో నెట్లు? (ఇట్టియెడల మువర్ణకాంతరూపములు సైతము వానిమహత్త్వమునకు వాచకములు కావచ్చును.వ్యా.సం.స.489)

కాఁగా నేతీరుగఁ జూచినను బైనన్నయప్రయోగమున మహద్విశేష కుదుర దనుట నిరాధారము. కాన నయ్యది సూరిలక్షణమునకు బాధకము గానేరదు.

'పుంసి, చేతనే' యనువి.వి.అభిప్రాయమునే సూరి 'మహత్త్వంబున' నను దశముచే సంగ్రహించె (వ్యా.సం.స.658) నని 'ఖగరాజు' అనుసూరియుదాహృతియు స్పష్టము చేయుచున్నది. కావున 'మహత్త్వంబున' ననుట సమంజసమె. వరుులవారు 'పుంలింగమును జేతనార్థకము 'నని మార్చుట గౌరవమాత్రమునకె.

ఇట 'రాజు' నిపతింపఁబడినతీరునుగూర్చి సంజీవనిలో 'రాజశబ్దము రాజునాఁబడు ననఁగా రాజు అనునది ప్రథమైకవచనరూప మైయుండు ననియుఁ దక్కిన విభక్తి వచనరూపములలో రాజు అనునది పూర్వావయవముగా నుండు ననియుఁ దాత్పర్యము (వ్యా. సం.స.659) మనిరి. వేధ పురోధ పురోధసుఁ (తత్స82) డనులక్షణమునుబట్టి యిట సూత్రమున చూపఁబడినరూపము ప్రథమైకవచనాంతమె. యను టుచితమె కాని యితరస్థలములలోఁ బ్రాతిపదికగా నిపతింపఁబడె ననుట సరి కాదు. ఇట 'రాజా' యను ప్రాతిపదికలో షష్ఠమున నత్వమును శ్రీత్వమును (జకారమునకు దంత్యతయు) నిపతింపఁబడినట్లు గ్రహింపఁదగును. శ్రీతుల్య మగున దని చెప్పినను వ్యుత్పత్తియము

ప్రథమైకవచనలోపమును బాధించి రావలసియుండును. కావున స్త్రీతుల్యత్వమువలన ప్రయోజనము లేదని.(వ్యా.సం.స.657) ఇది సరి కాదు. స్త్రీత్వమును నిపతించిన సామర్థ్యముచే సుదంత మయినను వ్రనికి వువర్ణకము రాక ప్రథమైకవచనలోపమె యగును. ఊరు, పేరు మున్నగుస్త్రీసమత్వాతిదేశము గలశబ్దముల కింతె గదా. కాఁగా ఊరుప్రభృతులవలెనె వ్రనికి వువర్ణకవుగాగమములు రానేరవు. ధేనుప్రభృతిసహజ స్త్రీలింగశబ్దములకువలె వీనికిని ప్రథమైకవచనలోపమును బాధించి వువర్ణక (వుగాగమ) మగుచో వీనికి స్త్రీత్వము (స్త్రీసమత్వము) నతిదేశించుట వ్యర్థము కదా. కావున వీనికి వువర్ణకవుగాగమములు స్త్రీ (సమ)త్వాతిదేశముచేఁ బ్రాప్తింపవు. కావున వీరు "రాజు అనుప్రథమైకవచనము వుప్రత్యయరహితముగా నిపతింపఁబడెను గావున నితరవిభక్తి పరకత్వమున వుగాగమమునకుఁ బ్రసక్తియే లే" (వ్యా.సం.స.658) దనుటలో విశేషము లేదు. స్త్రీత్వమువలనఁ బ్రథమైకవచనలోపముచే వుప్రత్యయరహిత మైనట్లును నందు వలన నితరవిభక్తిపరకత్వమున వుగాగమము రానట్లును వరుఖలవారివ్యాఖ్యానముపై నూహ చేసికొన్న నది యుచిత మగును.

### జగత్తు :

'జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు' (79) నన్సూరిలక్షణమును వీరు 'జగచ్ఛబ్దతకారమునకు నిత్యముగాను, నింద్రజిచ్ఛబ్దతకారమునకు వైకల్పికముగాను లోపం బగు' (ఉ.60సూ) నని సవరించిరి. తకారము సమాన మగుటచే సూత్రమున దానిని రెండుసార్లుచ్చరింపక 'జగచ్ఛబ్దమున నిత్యముగా నింద్రజిచ్ఛబ్దమున వైకల్పికముగా తలోపం బగు" నన్నఁ జాలు.సరి. అది య ట్లుండ జగచ్ఛబ్దమున తకారలోపము సూరి విభాష యన వీరు నిత్య మనిరి. ఇదియ సవరణము. తలోపాభావపక్షమున సూరిమతమున "జగత్తు" అనురూప మేర్పడును. జగత్తు అను రూపము నంగీకరించి వ్రనితకారలోపమును వైకల్పికమె యని సూరి సూత్రించెను. కాని యట్టిప్రయోగము కానరాదు. జగత్తు అనునదియు నపశబ్దమె యననగును" (ఉ.128,25,వ్యా.సం.స.667) క.ర; సూని. జగము అనుదానితోపాటు జగత్తు అన్నదియుఁ జూపినవి. జగ మనంగ జగత్తనంగఁ దగు జగత్పదమునకు (స.సా.సం.1.28) (కవిశి.552) ప్రయోగములు లేకపోలేదు.

భాగవతమున నీకరితం మెన్న విస్మయము గాదు సర్వజగత్తు తోలిమై (3.33) ఈజగత్తు సత్తు గాంయు (10.ఉ.1230) జగత్తునకు (3.972) జగత్తుం బ్రోచుమందు (2.126) మొ॥ గణములు సరిపడు నని జగంబులని దిద్దవలెనా?

కాఁగా జగత్తు అనురూప మంగీకార్యమె. లోప మరుదుగఁ గల దని నన వచ్చును. కాఁగా పరుపులవారు నిత్యముగా లోపము చెప్పుట సరికాదు.

ఇంద్రజి :

ఇంద్రజిత్ శబ్దమునకు వైకల్పికముగా తలోపము చెప్పిరి. వ్యా.సం.స.లోను ఉ.లోను సత్యజిత్తు, ఇంద్రజిత్తు అనురూపముం సంగీకరించియును పిదప నిది యగ్రాహ్యములు వ్యావహారికము లనియు సిద్ధాంతము చేసిరి. (ఉ.481)అట్టియెడల ఇంద్రజిత్ అనుప్రథమైక వచనాంతతుల్యరూపము ప్రాతిపదిక మగుటకే యవకాశము లేదు. కావునఁ ప్రాతిపదిక "ఇంద్రజిత్" అని యుండుటకె వీలు లేమి "త"కారలోప మగుట యెట్లు? అయినను నీసూత్రమునాఁటికి ఇంద్రజిత్తు అనునది కవిప్రయోగములం దున్న దనియు, గ్రాహ్య మనియు భావించినవా రగుటచే నిట్లు సూత్రించియుందురు. పిదప పరుపులవారి సిద్ధాంతము మారి కవిప్రయోగములును మాఱినవి. మాఱిన వగ్రాహ్యము లైనవి. వారి యీసూత్రము మాత్రము మాఱలేదు. ఇది యే మగును?

ఇది నొకవిశేష మిట్లు చెప్పిరి. "తకారలోపాభావపక్షమున ద్రునికి సత్యజిచ్ఛబ్దమునకు వలెనె ద్వితీయైకవచనతుల్యప్రాతిపదికరూపమును గలదు. (తత్స.70 సూ. 1-4.వివరణము) (ఉ.138) వీరు తమగ్రంథమునందు 70సూత్రపువివరణమున నీరెంటికి ద్వివిధరూపము లంగీకరించిరి, కాని యట్టివిధానము చేసినసూరిగారి (తత్స. 78) సూత్రమును మాత్రము వీరు దొలఁగించిరి. ఆ 70సూత్రము ప్రథమైకవచనాంతతుల్య రూపము ప్రాతిపదిక మగుటను మాత్రమె చెప్పుచున్నది. వీ రెట్లయిన ద్రునికి ద్వితీయైకవచనాంతతుల్యరూపమునె యంగీకరించిరి. ద్వివిధరూపములు సాధింపఁబడుటకు వారివివరణమె తప్ప వేఱు ప్రమాణము లేదు. ఆవివరణమందే అంగిరుఁడు అంగిరసుఁ డనుద్వివిధరూపములను పేర్కొనిరి. కాని 82సూ.చే నద్దానిని సూత్రమున విధించిరి. ఇది నేల యట్లు సూత్రింపరాదు. ఆసూరి(78) సూత్రమును దొలఁగించుట యనుచితము.

ప్రభృతులకు సకారలోపము బహుళముగా నగు" (ఉ.15సూ.) అనిరి. లోపమునుదిరిగి పేర్కొనుట కంటె 'నపయః ప్రభృతిసకారాంతములతుదిసకారంబునకు లోపంబు వైకల్పికంబు' అనిం చిం. మార్గములోఁ జెప్పవచ్చును. పయః ప్రభృతులలో సకారలోపాభావమును సూరి బహుళపదముచే వివరించెను. వీ రావివరణమును సూత్రమునఁ జేర్చి బహుళపదమును దొలఁగించిరి. 'ఇట్లు వివరించి చెప్పుటకు వలనుపడియుండఁగా సకారాంతముల కెల్ల సకారలోపము బహుళ మని సూరి సూత్రించుట సరి కా' (ఉ.139) దనిరి. వివరించి చెప్పుటకు వలనుపడినదానిని సూరి వివరణమునసే తెల్పెను. వీరిటుగాగమవిధిని స్మరింపఁ దగును. వీరు పేర్కొన్న 'అప్మదులు' (ఉ.తత్స.78) ఇట్లు వివరింపవలనుపడని వేమో.

కాఁగా పరుషులవారియీసూత్రము సూరిలక్షణమునకు వివరణప్రాయముగాఁ జెప్పవచ్చును.

ఇంకను బహుళపదముచేఁ గొన్నియెడల సలోపము నిత్యముగా గుర్తింప వచ్చును. జటాయుస్. జటాయువు మొ॥ ఇట పరుషులవారిలక్షణముచే జటాయువు జటాయుస్సు అని కావలెను. జటాయుస్సు అనురూపము గోశములందును గానరాదు. సూరి బహుళ మనుట ప్రయోజనవంతము.

అర్చిష్ ధనుష్ ఆయుష్ ము న్నగువానికి షత్వము గల్గకుండఁగనే యాత్వోత్వ త్వములు గాని సలోపముగాని వర్తిల్లు (ఉ.139) నని యొకవిశేషమును చెప్పిరి. 'సాంతంబులతుదిసకారంబున' కన్న సామర్థ్యమునఁబట్టి సాంతములు సంస్కృతప్రాతిపది కలే తెలుఁగునఁ బ్రాతిపదిక లగు నని గ్రహింపఁదగును. అట్టియెడల ఉరః ప్రభృతులు నిత్య నపుంసకములు గాన నపుంసకప్రథమైకవచనతుల్యరూపమె వానికిఁ బ్రాతిపదికముగ నిల్చును-సకారాంతములసకారమునకు త్వోత్వములు గల్గుట కనుకూలముగా నట్టి సకారమును విసర్గముగాఁ గ్రహింప (ఉ.139) వలసినయవసరమును లేదు. మఱి బాలకములోఁ జేరని సాంతములకుఁ బ్రథమైకవచనాంతతుల్యరూపములె ప్రాతిపదికలు గావలసియున్నను (సాంతంబుల కంతలోపం బనురీతిగఁ జెప్పక) తుదిసకారంబున' కని చెప్పుటంబట్టి ప్రథమైకవచనాంతరూపములఁ దుదిసకార ముండమి న ట్లుండుట ప్రాతిపదికరూపమందే సంభవము గావునను సాంతములు సంస్కృతప్రాతిపదికలే

తెలుఁగునను బ్రాతిపదికలుగా నిట్లు వచుట యుక్తమె. (వాంతములు లగువను జనసంజ్ఞ లనుటకంటె నిది భిన్న మయియుండుట స్పష్టము.) కాన షత్వము రాకముందే యని, విసర్గచోట సకారము వ్రాసికొనవలె నని కల్పించుకొన నవసర ముండదు.

మహాత్సాంతములు :

'మహద్వాచకంబు లగుసాంతం లకంతలోపంబేని ద్వితీయైకవచనాంతతుల్యత్వం బే నగు' (81) నను సూరిలక్షణమును 'మహన్మహతీవాచకము లగుసాంతంబుల కంతలోపంబేని ద్వితీయైకవచనాంతతుల్యత్వం బే నగు (ఉ.82సూ) నని చెప్పిరి, మహతీవాచకములను బ్రత్యేకముగాఁ బ్రస్తావించుట మాత్రమె పరులవారిలక్షణమందలి విశేషము.

సూరి మహతీవాచకములకును మహద్రూపలక్షణకార్య మగు నని సూత్రించకుండుట సరి గాదు, అప్సర -అప్సరస,(ఆది5.195) తపనతేజ- తపనతేజస (అర. 2.258)" (ఉ.139) అనిరి.

మహతీవాచకములకును గావలె నన్న దానిని బ్రత్యేకముగాఁ జెప్పవలెనా? కొన్నియెడల మహద్వంద్వంబు నందుఁ బూర్వపదాంతస్వరంబునకు దీర్ఘంబును జూపట్టెడు, అని సూత్రించిన ప్రౌఢ అన్నాదమ్ము లన్న దానితోపాటు తల్లిదండ్రులు, అప్పాచెల్లెండ్రు అని యుదాహరించినదే. కాఁగా నేకశేషచే నిష్పన్నగాఢ (మహత్ చ మహతీచ) మహచ్ఛబ్దము మహన్మహతులు రెంటిని బోధించుటలో బాధ లేదు. అందుకయి మహతి యని వీడ విశేషముగాఁ జెప్పుట యనవసరము.

కాని యిది మహతీవాచకము లగులక్ష్యములు గలవా? పరులవాడు రెండు చూపెరి. మొదటికి అప్సర. అప్సరస.

'స్త్రియాం బహుష్వప్సరసః ఇత్యమరవచనాత్ ప్రాయికమ్. అప్సరా ఇత్యేకవచనాన్తోఽపి వ్యాఖ్యాతృభిరుదాహృతః. మేనకా పరమాప్సరాః తత్రోఽప్సరసా ఇతి కాళిదాసః' (శబ్ద.552) అని యున్నది. అప్సరశ్శబ్ద మేకవచనాంత మైయుండుటను తెల్పుచున్నది. సూరి అప్సరాశ్శ అప్సరా- అప్సర అని సంజ్ఞాపరిచ్ఛేదమున దీనియేకవచ

నాంత పదమును జూపెను. ఇం కిట మతుబాదికం (తత్స.70)లో 'అప్సరసమ్' అనునది చూపె. వీరు నట్లు చూపిరి. కాఁగా నప్సరస్శబ్దము మతుబాదులలోని దగుట చేతనె ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక మయి స్త్రీలింగ మగుటచేఁ బ్రథమైకవచనలోప మయి అప్సరస యని యేర్పడును. కావున దీనికి ద్వితీయైకవచనాంత తుల్యరూపప్రాతిపదిక సిద్ధించుటకయి ప్రస్తుత సూత్రమున మహతీవాచక మన నక్కఱ లేదు గదా. మతుబాదికత్వముచే సిద్ధించుదానిని పరుబులవారిటఁ బేర్కొనుట ప్రమాదము. దీనివలన నిట మహతీవాచకములను బేర్కొనకున్న 'అప్సరస' యనురూపము సిద్ధింప దని యర్థ మగు. ఇంతకు ముందే అప్సరసమ్ అప్సరస యని చూపినదానికిది విరుద్ధము గదా.

ఇంకను నిలువ సాంతంబులతుదిసకారంబున కని యిచ్చుటిసకారము లోపించి అప్సర (అప్సరస్సు) అని యగు నని వీరు తలఁచినట్లు చెప్పవలె. కాని యది యసంగతము. ఇది మతుబాదులలోని దగు "అప్సరస" అనియె కావలె.అప్స(రస్)రాః అను ప్రాతిపదికరూప మందదు. మతుబాదికములోనిదిద్వచ్ఛబ్దమునకు విద్వాంసమ్ అన్నది ప్రాతిపదిక యగుచుండఁగా "విద్వాన్" అన్నది నిల్వదు గదా. కాఁగా వీరసాధారణ మగు"అప్సర" యన్నదానిని సాధారణముగను, సాధారణ మగు "అప్సరస" యన్నది విశేషముగను దలఁచి రన్నమాట. సాంతం ల- యనుసూత్రమునందలి బహుళశబ్దముచే నిట నలోపము నంగీకరింపఁదగును. శ.ర; సూని, కూడ అప్సరస అనురూపమునే చూపినవి. స్త్రీలింగమున కర్పణ చేసిన యప్సరల్ (ఆము.5.81) గంధర్వాప్సరల్ సురలు (రం.రా.197పుట) అని యరుదుగఁ గన్పించునీరూపమును విశేషముగ స్త్రీకరించుట యొప్పును.

మొత్తముపై అప్సరసమ్ అనుద్వితీయైకవచనాంతతుల్యరూపమునకై (మతుబాదికత్వముచే సిద్ధించుటఁజేసి) యీసూత్రమున 'మహతి'ని బేర్కొన నవసరము లేదనుట స్మరింపఁదగును.

ఇంకి నందుకయి పరుబులవారు చూపినరెండవ యుదాహృతి తపనతేజః- తపన తేజస యన్నది. అది యసలు లక్ష్యమె కాదు.

'తపనతేజ సరస్వతి' దక్షిణమున స్త్రీలింగసరస్వతీశబ్దమునకు విశేషణ మగుటచేఁ దపనతేజశ్శబ్దము సకారాంతస్త్రీలింగము. తుదిసకారము లోపింపఁగా తపనతేజ సిద్ధించును. తపనతేజసమ్ అనుదానినుండి అప్సరస అనుదానివలె తపనతేజస అనురూపము సైతము లభించును! (వ్యా.సం.స.66౨)

అప్సరస్శబ్దము మతుబాదులలోనిది గావున నప్సరస యనురూపము సిద్ధించును. అట్లె సిద్ధించుటకు తపనతేజస్ శబ్దము మతుబాదులలోనిది గాదు. అప్సరశ్శబ్దము మతుబాదులలోని దగుటను మఱచి వీ రిట్లు పేర్కొని రనఁదగు.

వీ రిటఁ 'దపనతేజ' అనుదానికె ప్రయోగము చూపిరి. ఇది మహత్తు కాదు గానఁ బూర్వసూత్రముచేఁ దుదిసకారము లోపించి స్త్రీలింగము గావునఁ బ్రథమై కవచనము లోపించి 'తపనతేజ' యని యవును. కాఁగా వీరు చూపినప్రయోగము బాల.చే సిద్ధించుచునేయున్నది. ఇది మహత్తు గామిఁ బ్రస్తుతలక్షణము ప్రవర్తింపదు గావున ద్వితీయైకవచనాంతతుల్యరూపప్రాతిపదికము సిద్ధింపదు. కావున తపనతేజస అని కాదు. సూరిలక్షణ మవ్యాప్తమై దుష్ట మగు ననవలె నన్న నిటఁ దపనతేజస అనుదానికిఁ బ్రయోగము చూపవలెను. అట్టిప్రయోగమును వీరు చూపలేదు. సూరిలక్షణము నిర్దుష్టమె కదా. బహుళపదముచే నిట సలోపము నిత్యము మని గుర్తింపఁగా దపనతేజస్సు అనురూప ముండదు. బహుళపదము ప్రయోజనవంతము కదా.

'తపనతేజస' కవిప్రయుక్తము గావున్నను నందుకయి మహతీవాచక మని సూత్రమునఁ జేర్చిరి కదా. వీరిలక్షణ మట్టిదానిని సాధింపఁగలదా? ఇది యసలు మహతీ వాచకమె కాదు. ఇట సరస్వతీశబ్దము (ఆం.2.259) నదిని బోధించునే కాని స్త్రీని కాదు. కాఁగా విశేష్యము (సరస్వతి=నది) అమహత్తు. తద్విశేషణ మగు తపనతేజశ్శబ్దమును మహతీపర మగునమహత్తె. మఱి యీసూత్రమునందలిమహతీవాచక మనుదానికిఁ బట్టితపనతేజశ్శబ్దము లక్ష్యము గాదు. వీరు చూపిన దిప్పటిదే కదా. మ ఱొకచోఁ గానరాదు.

అందుకే సంజీవనిలో 'మహద్వాచకములగు- అనఁగాఁ బుంలింగసాంతము లగు- అని యర్థము. ఇది స్త్రీలింగసాంతములకు నుపలక్షణ మని వ్యాఖ్యచేసికొనవలయు

(వ్యా సం.స.671) దనిరి. తపనతేజశ్శబ్దమిట స్త్రీలింగమె కాని మహతి కాదు. అందుకే స్త్రీలింగోపలక్షణత్వమును జెప్పిరి. లేనిచో మహత్తు లనఁగాఁ బుంలింగ మిత్యాదిగా లింగముజోలికె పోయెడివారు గారు.

అసలు మహత్తు లనఁ బుంలింగము లని యర్థము చేయుట సంగతమా? మహద్వాచకము లెల్లఁ బుంలింగములు గావు. మిత్రాదులు మహత్తులు క్లీబములు గలవు గదా. పుంలింగము లెల్లను మహత్తులు గావు. వృక్షాదులు ప్రసిద్ధములె. వీరె 'సంస్కృతములోనిపారిభాషికలింగము గాని కికలింగము గాని తెలుఁగునందలిమహదమహద్విభాగమునకు మూలము గా" (వ్యా.సం.స.463, ఉ.149) దనిరే. అట్లే మహతీవాచకము లన స్త్రీలింగములే యనియుఁ జెప్పరాదు.

కావున మహతీతర మగునమహత్తగుటచేఁ 'దపనతేజస' యనురూపమును మహతీవాచకముల కన్నకరులవారివిశేషలక్షణమును సాధింపఁజాలదు. అంగిరసుఁడు ఇత్యాదులకయి మహత్తులును, 'అప్సరస'కై మహతిని, తపనతేజస (సరస్వతి) యనుదానికై యితర మగునమహత్తును నెల్ల గ్రహింపవలె. అట్టియెడల మహదమహత్తుల కెల్ల సాధారణముగా నీకార్యము చెప్పవలె. అపుడు మహదమహత్తుల నేదియు సూత్రమునఁ జెప్పనే యక్కఱ లేదు. కాని పూర్వసూత్రమునకు గతి యుండదు.

అట్లు గాక పుంస్త్రీలింగముల కని సూత్రింపనగునా? 'పుంస్త్రీలింగమహన్మహతీవాచకసకారాంతములవిషయ ముత్తరసూత్రసందర్భమున వచింపఁబడు' (వ్యా.సం.స. 669) నని వీరు స్త్రీలింగ మగుటతోపాటు మహతీవాచకమును గావలె నని సూచించిరి. ఇచ్చటఁ జూపిన 'తపనతేజస' స్త్రీలింగమె కాని మహతికాదు. కావున నీవివరణమును బొరపా టనియు నమహత్తయుఁ గావ నవు ననియుఁ బుంస్త్రీలింగములు గావలె ననియుఁ జెప్పవలె. వా రట్లు చెప్పలేదు. చెప్పకుంటకుఁ గారణము లేకపోలేదు. (సుమనస స్త్రీ యిత్యాదులు గలవా?)

జటాయుశ్శబ్దము పుంలింగము కావున 'జటాయుషమ్' అన్నది నామ మయి జటాయుషుఁడు అనురూప మగును. ఏకోశము నిది చూపలేదు. "..బహుళగ్రహణా ద్విత్వే జటాయుషుఁడు ఇతి రూపం చ." (కవి.శ.552) అని యహో. చెప్ప 'ఉగాగమ

ముపై (ఇపడుత్త్వము) దుద్విత శ్రీ నము (వ్యా.సం.స.682) దనిరి. అట్లు కుదురక పోయినను బుంలింగ మైనది గాన నిట స్త్రీయేకవచనాంతతుల్యరూపము నామము కాఁగా నదే రూపము సలక్షణముగాఁ గ దును. కావునఁ గేవలము పుంస్త్రీలింగము లనుట వీరియుద్దేశ్యము గానేరదు.

ఇంకఁ 'దపనతేజ సరస్వతి' అనియే యవు ననియుఁ దపనతేజస అప్సరస యనురీతి స్త్రీవాచక మయినపుడే ద్వితీయైకవచనాంతతుల్యరూపము నవు ననియుఁ (వ్యా.సం.స.671) జెప్పుటయె వీరియుద్దేశ్యము అట్టిచోఁ 'దపనతేజ సరస్వతి' యను ప్రయోగమును జూపినఁ బ్రయోజన మేమి? 'తపనతేజస సరస్వతి' యనురీతిప్రయోగ మునే చూపి మహతీవాచకము లనియుఁ జెప్పవలదా? పైఁగా నుద్ద్యోతమున 'తపనతేజ. తపనతేజస (అర.2-259) (పుట139) యని చూపుటచే నీవన్నియుప్రయోగమునందే తపనతేజస యనురూపము సైత మున్న దనియు నర్థ మగుచుండె. ఆప్రయోగమును భారతమునందె చూడవలె. కాక యుద్ద్యోతము ననుసరించి యది మహతీవాచకము గూడ నగు నని భ్రాంతి పడుట కవకాశము గలదు.

మొత్తముపై తపతేజస పార్వతి యనురీతిప్రయోగములు లేకుండుటచే మహతీ వాచకములను సూత్రమునఁ జేర్పవలయుటకై వజ్ఝలవారు చూపినరెండురూపములును సరిపడమింజేసి వారినిర్ణయము నిర్మూల మని నిశ్చయింపఁదగును. 'మహద్వాచకంబు' లనుసూరిలక్షణము సముచితము. వజ్ఝలవారిసవరణ మాధారరహిత మగుట నగ్రాహ్యము.

అయయప్రత్యేకతలనుబట్టి సాంతము లగుమహత్తులకుఁ (ఋత్విగాదులకు భిన్న ముగా) బ్రత్యేకముగా ద్వైరూప్యమును సూరి ప్రస్తావించు టుచితముగ నున్నది.

వజ్ఝలవా రింకఁ బిదప 'ఋత్విగాదులకువలెనె సాంతము లగుమహత్తులకు సయితము ద్వివిధరూపము లుండు నని యంగీకరింప నక్కఱ లే' (వ్యా.సం.స.483) దని నిర్ణయించిరి. దానింగూర్చి 'మహన్మహతీవాచకము లగుసాంతములు గుణపద్గణము లోనివె యన నగును —— సాన్తాదపయఃప్రభృతే స్లోపః-ఊర్ధ్వరేతుఁడు ము న్నగు మహన్మహతీప్రాతిపదికశబ్దములకు సాంతములకుఁ బాక్షికముగా సకారలోపము చేయ

వలెను.' (ఉ.484) రూపద్వైవిధ్యము చెప్పక తప్పదు. ఉ.తత్స.81 సూత్రవిషయమును 'సాంతామహత్తులు'గా సూచించిరి. (ఉ.139) ఇట మహన్మహతీవాచకములకు నాసూత్రముచేతనె లోప మగు ననిరి. చిం.లో గణద్వయపాఠము లే దనుటకు వీ రిట్లు వివరించిరి. గుణపద్ధణపాఠమున అంగిరసుడు. ప్రాతిపదిక గ్రహింప సలోపముచే అంగిరుడు. ఇది యగుణపద్ధణమునందలిది కాదు. అచట వారిసిద్ధాంత మె ట్లున్నను నిటఁ బ్రథమైకవచనాంతతుల్యరూపములను గాక సాంతములు ప్రాతిపదికలె గ్రహింపఁబడుట కాధారములు చిం.లోనె గుర్తింపనగును. సంజీవనిలో వీ రిట్లు పేర్కొనలేదు. (వ్యా.సం.స.660) ఈయంశమును వీరు ముందుగనె గుర్తించియున్న నట విసర్గస్థానమున సకారము వ్రాయుట మన్నగుకల్పనములను జేసియుండ రనవచ్చును.

చిం.లోఁ గూడ వీరు "ఊర్ధ్వరేతుఁడు మన్నగు ప్రాతిపదికశబ్దములకు (ఊర్ధ్వరేతుఁడు ప్రాతిపదికకాదు. ప్రథమైకవచనాంత మగుపదము. ఊర్ధ్వరేతుఁడు మన్నగు 'వాని' ప్రాతిపదికశబ్దములకు- ననఁగా ఊర్ధ్వరేతస్ మన్నగువాని కని వరుఁలవారి యభిప్రాయము గుర్తింపఁదగును) బాక్షికముగా సకారలోపమును జేయవలయు' (ఉ.484) ననుట యసంగతము. గుణపద్ధణము లోని దనిరి గావున నట్లు ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక మై 'ఊర్ధ్వరేతసుఁడు' అని యేర్పడును. 'ఊర్ధ్వరేతస్' అను ప్రాతిపదికయందు సలోపము పాక్షిక మనుటచే సలోప మయినపక్షమున రామశబ్దమునకువలె ఊర్ధ్వరేతుఁడు అని యగును. సలోపము రానిపక్షమున నుత్వద్విత్వములతో నూర్ధ్వరేతస్సు) అంగిరస్సు అనుతీరుగా రూపము లేర్పడవలె. వీనిం గూర్చి విశ్రవస్సు-సుమనసు-ఈరూపములు నన్నయాదుల్యాణాచనములకు విరుద్ధము లగుటంజేసి సాధువులు గావని యనుట సాహసము గా (వ్యా.సం.స.662) దనిరి. వీనిసాధుత్వమువిషయమునను వ్యాకరణాభిప్రాయము మాత్రమేదా? అయిన నది సరి కాదు. ఒకటిరెండుప్రయోగము లున్న నవ్వానిని విశేషస్థలములు గుర్తింపఁదగుఁ గాని వానికయి యెల్లవానికి సిద్ధిరూపములను బాక్షికముగాఁ జెప్పుట యనుచితము అట చిం.లో 'వా'శబ్దమున కీమహాద్భాంతములందలోపము నిత్య మగుటను వ్యవస్థ చేసికొనఁదగు.

ఇట వివరణమున వతత్సూత్రవిభాగమె వీని రంత్యలోపాభావద్విత్వోత్వములు గల్గనేర వని విశదీకరించుచున్నది. విశ్రవస్సు. భాస్కరయుద్ధ.1278 అను సామాన్యకవిప్రయోగములు సాధువులు కావవు. సతసుమనస్సునసు (అను.6,98) అనునది

కవిప్రయుక్తపాఠము గాదు. సుమనస్కునకు అని యుండును. విశ్రవస్సు (కాశీ-4.138) విశ్రవసుఁడు కవిప్రయుక్తపాఠ మనఁదగును. (ఉ.140)



'సామాన్యకవి' యనుకొన్న నాప్రయోగ మసాధువు. 'మహాకవి' యనుకొన్న పరుఖలవారిసిద్ధాంతమునకు విరుద్ధముగా నున్న ఆప్రయోగము కవిప్రయుక్తము గాదు. కవిప్రయుక్తము వీరిసిద్ధాంతమున కనుగుణ మైయుండును. ఇట్లు చెప్పుటకంటె నవి విశేషస్థలములుగా గుర్తించుట యుక్తము.

పురోధసుఁడు:

'వేధ పురోధ పురోధసుఁడు' (82) అనుసూరిసూత్రమును 'వేధ పురోధ' (ఉ.83సూ.) అని వీరు సవరించిరి.

'పురోధసుఁడు- అనురూపాంతరమును సూరి యంగీకరించి నిషేధించెను. కాని దానికి మహాకవిప్రయోగము కానరాదు. (ఉ.140) అందుకయిపురోధసుఁ డన్నది వీరు దొలఁగించిరి. కాని దీనిని శ.ర.,సూని.లు చూపినవి. తత్సమములకుఁ బ్రయోగములు చూపుట యరుదు. 'పురోహితశబ్దమె గానవచ్చుచున్న' (వ్యా.సం.స.674) దందురు పరుఖలవారు. ఒద్దు అనినయవసరము లేదు. ఒద్దరాదు. సూరి యొకఁ డాది నీనిని బ్రస్తావి. చెవో పరిశోధింపవలెను.

'మనఃప్రకృతులనకారంబునకు ద్విత్వంబు విభాష నగు'(83) ననుసూరిలక్షణమును వీరట్లె గ్రహించిరి.

దివి-హ్వాది :

[illegible]

సారభూత గోవు (అను2.418) గోవు సర్వౌషధి మేప సరి సుపుష్టయు సుస్వరయు సురూపయునై యొక్కవృషభంబు పొందు పడసి (అను 3.63) కామరూపిణు లగుగోవులు (87) కపిలధేనువు లతి క్రూరచిత్తలు (74) అనురీతిగా స్త్రీత్వముతోపాటు గో వహ్నిమయ మమృతమయము. పూజ్య మనుజులకైనన్' (అను 2-277) అని క్లీబత్వముతోను ప్రసిద్ధము.

భవదాదులు :

భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు' (87) అనుసూరిలక్షణము నట్లు వీరు గ్రహించిరి. (ఉ.107)

పరఖులవారు దీని కెల్ల హలంతముల నుదాహరించిరి. సూరి యుదాహరింప లేదు గాని యజంతములు గూడ నిటఁ జేర్పఁదగినవే యని యింతకు ముందు గుర్తించియుంటిమి.

---o---

# ఆచ్ఛికపరిచ్ఛేదము

ఆచ్ఛికము :

'సంస్కృతసమేతరం బయినయాభాష యచ్చ యనఁబడు' (1) ననుసూరిలక్షణము నట్లు గ్రహించిరి. పైయినా, దైలము న్నగరీతిని (అన్యదేశ్యములను దేశ్యములుగా) ఇందుఁ జేర్చుట విశేషము.

'అచ్ఛికభాషయందుఁ బారిభాషికలింగము లేదు. (ఉ.149) ఇట్లనుటవలన నచ్చతెనుఁగున లౌకికలింగము గల దని యర్థ మగు. అయిన నిది శాస్త్రవ్యవహారమున లేదనఁదగు నని తోఁచుచున్నది. అగుచో కొమరుఁడు ఇత్యాదులఁ బుంలింగసమత్వాతిదేశ మేల? ఆఁడది అమ్మ అక్క ఇత్యాదులకు స్త్రీసమత్వ మేల? 'అచ్ఛికశబ్దముల కిట్లు లింగసమవ్యవహారమె కాని లింగవ్యవహారము లేదు'' (ఉ.99) అని వీర స్పష్టము చేసిరి.

స్త్రీసమాదులు :

'అచ్ఛికశబ్దంబు లెల్లం దఱచుగ స్త్రీసమంబులుఁ గ్లీబసమంబు లయియుండు' (2) ననుసూరిసూత్రమును 'స్త్రీలింగసమములును నపుంసకలింగసమములును నరుదుగఁ బుంలింగసమములు నై యుండు (3) నని మార్చిరి. ఇది సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్య యనవచ్చు.

వీరిలక్షణమునఁ గర్త యేది? సూరిసూత్రమందలి 'యాచ్ఛికశబ్దంబులు (ఎల్ల) విడిచి వ్రచ్చునచో నీలక్షణవాక్య మస్పష్టముగఁ గర్త (అచ్ఛికశబ్దంబులు) అధ్యాహారము చేసికొనవలె.

సూరిస్త్రీసమములు క్లీబసమములు నన వీరు స్త్రీలింగసమములు, నపుంసకలింగసమములు అనిరి, ఇది వివరణప్రాయమె కాని సూరిలక్షణమున మరుక్తి లేదు

'ఏతాము మోము - వీనిని పుంపదిలింగసమములుగాఁ బరిగణించినసామర్థ్యము చేతనె యదంతములు గావున్నను బా.తత్స.౪౩సూత్రముచొప్పున ముపర్ణకాదులు వచ్చు (వ్యా.సం.స.707) ఈరూపములు చూపిరి తత్స ౪౩ సూత్రమున నదంతముల కను దళము ప్రత్యాఖ్యేయ మని చెప్పిరి వీరే. ప్రస్తుతవ్యాఖ్యానముచే నది సరి గా దనియు నదంతముల కనుదళ ముచితమె యనియు వారే తమపూర్వవివరణ మసంగత మగుట నిరూపించుకొనిరి. అనదంతము లగుసంస్కృతప్రాతిపదికలపై ముపర్ణక మగుటను వీ రుద్ద్యోతమునఁ గాని సంజీవనిలోఁ గాని యెచ్చటను జూపలేదు. పాముప్రభృతులలో ముపర్ణ మెట్లు శబ్దానయనమో (వ్యా.సం.స.707) గాముప్రభృతుల ముపర్ణ మట్లే శబ్దానయనము. ఇవి స్త్రీసమములే యగును. (మొగము) మోము (నగము) నాము అనుచో ముపర్ణ మదంతములపైనె యయినది. ఇట్లె (ఏతము) ఏతాము. ఇట నొకవిశేషము 'ఏతాదులదీర్ఘపూర్వకముపర్ణము౦- మ్ముఁబు,వు, ము న్ననుగురూపములు గలుగ నేరవని ప్రయోగానుసారముగా వ్యాఖ్య చేసికొనవలయును ఏతాము, ఏతాముకొన (వ్యా.సం.స.7౪7) అనిరి. ఇట్టివ్యాఖ్య యనవసరము. ఏతాదులకు ముపర్ణకంబు పరంబగునపు' డను దానిచే మ్ముఁబులు పర మైన దీర్ఘమె రాదు. కాన నట ఏతమ్ము ఏతంబు అనియె యుండు. వు-వలు లే వనిరి గాని గారాపుబిడ్డ యనుచో 'పు'వర్ణమును వారే చూపిరి. 'ంపు' వచ్చినను దీర్ఘముపై సాధ్యపూర్ణ ముండదు గావున నది లోపింప వలెల 'గారాపు' అనియె యుండును. 'ఏతాముకొన' యని పుంపులు రావనుట కుదాహరించిరి. ఇది షష్ఠీసమాసము. కర్మధారయము చూపిన బా గుండెడిది. సాహసంబుతటి (వ్యా సం.స.౪౭౯)వలె ఏతాముకొన విరుద్ధము గాదు. కావున నిట పుంపులు లే వనుట సరి కాదు.

ఇట్లే పుంలింగసమమును 'నుత్వడుత్వంబులు గలవి' (పు.150) యని చెప్పుటకంటెఁ బుంలింగసమత్వముచే నుత్వడుత్వ లగు ననురీతిని జెప్ప నుచితము.

పుంలింగసమములలో వీరు 'సాలీఁడు' అనునది చూపిరి. కాని యిది మహత్తు గాదు. 'కొన్నిడుమంతములు సైత మమహద్వాచకములగుట కలదు' ఉదా. సాలీఁడు

సాలెపురుగు కైరఁడు ఒక గుఱ్ఱముపేరు (వా.సం.స. 08) పురుగు గుణము మొదలను మహత్తుగానిదే డు జగుట యెట్లు? సంజీవనిలో 'కైరఁడు' అనియు నీటుఁ జూపుటను బట్టి యీశబ్ద మమహత్తు అయినకయిరాడులలోఁ బఠింపఁదగిన దని గుర్తింపవచ్చు. ఆమహత్తులకు డుజ్జు ప్రత్యేకముగా విధింపఁబడఁగా వీనికిఁ బుంలింగసమత్వము చెప్ప వలయునా?

పయి సంజీవనివాక్యములోను 'కొన్ని డుమంతములు సైత మమహద్వాచకము లగుట కల' దనుటకంటె 'కొన్ని యమహద్వాచకములు సైతము డుమంతము లగు' ననుట సూరిమతము.

బల్లిదాదులు :

'బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు (6) అను సూరిలక్షణ మనసుగ మని కాఁబోలును వీరు పైసూత్రమునకుఁ బైని "ఇవి తత్స. 17.సూ.4వివృతిచొప్పున మహ ద్విశేషణము లగునపుడు పుంలింగతుల్యములును నమహద్విశేషణము లగునపుడు నపుంసకలింగసమములును మహతీవిశేషణము లగునపు డాలుశబ్దముతో సమసించు నవియు (సంధి.26) నగును (ఉ.8సూ.) అనుభాగమును జోడించిరి.

పరిశీలింపఁగా వీరు సూత్రమునఁ జేర్చినభాగము సూరి యేతత్సూత్రవివరణము నందలిదే కాని వేఱు గాదు. సూరివివరణముకే సూత్రములోని కెక్కించి "సూరిగారి సంస్కృతతుల్యత్వాతిదేశమాత్రమున నిట్టియర్థము లభింపనేరదు. కొన్ని యనర్థములును సంభవించును. కాన వలసినయర్థము సూత్రమందే చేర్పఁబడెను. (ఉ.151) అని చెప్పు కొనుట వింత.

అయినను నుత్వడుజ్జు లవు ననఁగా నయ్యవి సామాన్యశాస్త్రానుగుణముగ నగు నవి. వీనికి మహత్త్వామహత్త్వములు విశేషణము ననుసరించియె సిద్ధించును ఇచ్చికముల కమహత్త్వమాత్రముచే ముపర్ణకాదు లగుట లేదు. క్లీబసమత్వాతిదేశము చెప్పఁబడినది కదా. అమహత్త్వమున ముపర్ణక మగు ననఁగాఁ క్లీబసమత్వ మగు ననియు, మహత్త్వ మున నుత్వడుజ్జు లవు ననఁగాఁబుంలింగతుల్యము లగు ననియు సూరియభిప్రాయముగాఁ

జెప్పవచ్చును. మహతీత్వమున త్రసమములు గాకుండుటచే నట నగుకార్యమునె వర్తింప వలసియుండుటచే నాశబ్దక్రమములో నుండుటకై సూరి మహత్త్వామహత్త్వములందును బుంలింగతుల్యత్వాక్లీబసమత్వములను బేర్కొనక వానిచే నగుకార్యములనే పేర్కొనె నన వచ్చును. అట్టియెడల పరుషులవారిసూత్రమునందలిపుంనపుంసకలింగసమత్వవర్ణనము సూరివివరణమునందలియభిప్రాయమును వివరించుచుడగాఁ జెప్పవచ్చును.

సంస్కృతతుల్యత్వమువలన నీప్రయోజనములు సిద్ధింపనిచోను గొన్నియనర్థములు గలుగుచోను వీరు మాత్రము సంస్కృతతుల్యత్వమును సూత్రింప నేల? సూరిసూత్రమును దొలఁగించి యాసూత్రమునకు సూరి చేసినవివరణమునే సూత్రముగాఁ జెప్పకపోయిరా? ఆభాగము సూత్రమున వ్యర్థమే కదా.

ఇంక వీరు విశేషముగాఁ దెల్పిన దేమి? 'మహద్విశేషణము లగునపుడు—— మున్నుగా వీ రిచటఁ జెప్పినయంశము లీసూత్రముచే విధింపఁబడినవి గావు. 'తత్సమ 17.సూ.4. విస్మృతిచొప్పున' నవు ననిరి. ఆవివరణముచొప్పుననే యవుచుండఁగా నిట నదే యంశమును సూత్రమునఁ జెప్ప నేల? కాఁగా పరుషులవారిసూత్రమున మిగిలిన భాగమును ననఁగా సూత్రముమొత్తమును వ్యర్థ మని వారిమాటలవలననే తేలుచున్నది. తత్సమ.17సూ.4వివృత్తిచొప్పున నగునవు గాదానినేయిట సూత్రముగాఁ జెప్పనవునే. సూత్రమునఁ 'దత్సమ17.4.వివృతిచొప్పున, అనుట కేవల మసమంజస మయి దీనిని పరుషులవారు సూత్రముగాఁ దెల్పినను నది సూత్రము గాక వ్యాఖ్యానమే యగుట నిరూపించుచున్నది.

అలుశబ్దముతోడిసమాసము నిటఁ జెప్పుచునే రుగాగమమును జెప్పసంధి26 సూత్రముచే సమాస మగు ననుట యనవసరము. సంధి26సూత్రముచేతనె సమాసము సిద్ధించుచో నిటఁ దద్విధానము పునరుక్తియె గదా. సమాస మగుట కాక రుగాగమ మగుటకు మాత్రమే సంధిసూత్రమును బ్రస్తావించిన నంత బాధ లేదు.

సూరిలక్షణమున నిబ్బంది యిట్లు ప్రస్తావించిరి. 'సంస్కృతతుల్యత్వాతిదేశ మున్నను శ్రీరామదేవత బల్లిద అని కాని బల్లిదురాలు అని కాని కానేరదు. శ్రీరామదేవత బల్లిదుఁడు అనియె యగును. కళత్రము బల్లిదురాలు అనియె యగును గాని కళత్రము

బల్లిదము అని కాని బల్లిద అని కాని కానేరదు.' (ఉ 151) ఇది సూరిలక్షణముచే

సిద్ధము గాదా? సూరి యుత్వదుజ్ఞు లవు ననె. వీరు పుంలింగతుల్యము లవు ననిరి ఫలితము సమానము. కాఁగా సూరివివరణము స్పష్టతర మైయున్నది. 'శ్రీరామదేవత. యనుచో నది స్త్రీలింగ మయిన నగుఁ గాక. మహద్వాచకమె కదా అట్టిమహత్తునకు విశేషణ మవుటంజేసి బల్లిదశబ్ద మిట మహద్విశేషణ మవును. అట్టియెడల నుత్వదుజ్ఞు లవు నని సూరి చెప్పెను. విశేష్య మేలింగమం దున్నను మహత్తు లయినచో బల్లిదాదుల కుత్వదుజ్ఞులే యగు నని సూరిమతము స్పష్టము. ఇట్లే స్త్రీవాచక మగుచో కళత్రము (నపుంసకలింగ మయినను) బల్లిదురా లనియె యగును. సూరిలక్షణము సూక్తమె.

(దేవత బల్లిద) కళత్రము బల్లిద అని యగు ననుకొనుట కేంతమాత్ర మవకాశము లేదు. మహతి వాచ్యం బగునపు డాలుశబ్దముతో సమాస మవు ననియె కాని స్త్రీ(లింగ) సమ మవు నని చెప్పలేదు గదా సూరి. అందుకే యితరస్థలములందును లింగసమత్వమునుఁ గాక త త్తత్కార్యములనే (ఉత్వదుజ్ఞాలు మొ॥) వివరించె నని తోఁచుచున్నది. ఇంక వరుసలవారు మిగిలినచోట్ల పుంలింగసమములు నపుంసకలింగ సమము అని చెప్పినను మహతీత్వసందర్భమున మాత్రము స్త్రీలింగసమ మనక యాలు శబ్దముతో సమాస మని యాకార్యమునే చెప్పవలసివచ్చుట గమనింపఁదగును. కాఁగా మహతీత్వమునను స్త్రీసమత్వము లేమి (నాలుశబ్దముతో సమాస మయి బల్లిదురా లను రీతిగ నుండుటయె కాని) బల్లిద యనురీతి నుండదు. కావున బల్లిద సీత యనురీతిసమాసములు నుండవు. సూరిలక్షణముచే బల్లిద యని యేర్పడు ననుట యొప్పదు. ఇది వారు గుర్తింపక పోలేదు. స్త్రీత్వమున సీత బల్లిద మున్నగునసిద్ధరూపములు సిద్ధింపకుండ స్త్రీత్వంబునం దాలుశబ్దముతో సమాసంబునుం గలుగునని వివరించెను. (వ్యా.సం. స.709) వీరివివరణమును బట్టియు ఉ.లో వీరు చేసినవిమర్శ సరి గా దని స్పష్టము.

కాఁగా వీరు సంజ్ఞీ 'నలో 'సూరి సన్నయాథర్వణులపద్ధతి గ్రహింపఁజాలక విశేషణములపుంస్త్వాదికమును బుంలింగసమత్వాదికమును నుపదేశింపఁడయ్యె' (వ్యా.సం.స.709) ననుట సరి కా దని పైసందర్భము వలన స్పష్టము.

'విశేషణానాం మహతో దుజ్ఞి ఉభయథాపి చ' యనుఅ.వి.సూత్ర విచారణమున సీత బల్లిదాము అని పేర్కొనుచు సూరిలక్షణము నాధారము చేసికొనుట స్పష్టత క

వచ్చునా. లేకున్న వి.వి.లక్షణము బాల. అభిప్రాయ మాధారముగాఁ జేసికొని విచారింపవలసిన దగుట యెట్లు? విశేషణానామ్మసుకారికాభిప్రాయమును సూరి సంస్కృతతుల్యత్వాతిదేశముచే సాధించె (వ్యా.సం.స.708) నని వఝలవారు సూచించుచునే సూరి నన్నయాధర్వణులయభిప్రాయము గుర్తింపఁజాలకపోయె ననుటెట్లు?



వివరణమున సూరి పేర్కొన్నసంజీవనిలో (వ్యా.సం.స.709) నీయర్థము సూత్రసిద్ధముగా సముచితముగా నిరూపించిరి.

సూరిలక్షణమున నొకలోటును సంజీవనిలో నీ రిట్లు పేర్కొనిరి. 'తండ్రి సమర్థుఁడు, తండ్రి బల్లిదుఁడు ఆమె సమర్థ మున్నగుచోటులందుఁ బుంస్త్వాదికము సాధించుగతి బాలవ్యాకరణపద్ధతిలో లేమింజేసి యవి బాలవ్యాకరణసాధ్యములు గాఁజాలవు. ప్రత్యేకవిధి లేనపుడు బాల.అచ్చి 2.సూత్రమునొప్పున నిట్టివిశేషణశబ్దములకు స్త్రీపున్నపుంసకసమత్వములు సిద్ధింప వని సూరియు' (వ్యా.సం.స.709) ఇందు తండ్రి, ఆమె యనునవి విశేష్యములు. అచ్చి.2.సూ.చే నివి స్త్రీసమము లగుటకు బాధ లేదు గదా. విశేషణమగుసమర్థశబ్దము సంస్కృతము. బల్లిదాదు లాచ్ఛికములు గదా. (వ్యా.సం.స.709) కావున సమర్థశబ్దము బల్లిదాదులలోనిది గాదు. ఇంకను నాచ్ఛికము గాకుండుటనె అచ్చి.2.సూత్రము ప్రసక్తియు నీశబ్దమునెడ లేదు. సంస్కృతవిశేషణముల ప్రసక్తి యిట లేదు ఇది పైని జూతము.

తండ్రి బల్లిదుఁ డన్నది బాల.చే నేల సాధ్యము గాదు బల్లిదాదులకు సంస్కృతతుల్యత్వము 'సంస్కృతశబ్దములకు విశేషణము లయినపుడే' యని వఝలవా రొకవేళఁ దలఁచి రేమో. ఆట్లని లక్షణము చెప్పుట లేదు గదా. కావున విశేష్యము సంస్కృతసమ మైన నాచ్ఛిక మైన మహత్తయినచో దానికి విశేషణ మగుబల్లిదశబ్దమును మహత్తే యగును గావున మహత్త్వమున దీని కుత్త్వడుజ్ఞు లగును. ఉదా.శ్రీరాముఁడు బల్లిదుఁడు తండ్రి బల్లిదుఁడు. అట్లే యితరములును. వంశము బల్లిదము. పంగడము బల్లిదము, సీత బల్లిదురాలు. ఆమె బల్లిదురాలు. కాఁగా 'తండ్రి బల్లిదుఁడు' అన్నది బాల.సాధ్యముగా దనుట యసంగతము.

బల్లిదాదులలోఁ జేరనిశబ్దమున కీభేదము లేదు. అంద మైనమగఁడు, అంద మైనపెండ్లము, ఎత్తయినగుఱ్ఱము. ఎత్తయిన (వాఁడు. మొ॥ అడ్డమె పురహరాజకేళవు లైనన్ (ఆది.4.199) ఇంతవఱకు సూరి స్పష్టము చేసినదే. అనఁగా విశేష్యము సంస్కృతసమ మైన నాచ్ఛిక మయిన దానియాచ్ఛికవిశేషణ మె ట్లుండునో సూరి స్పష్టముగాఁ జెప్పినట్లే కదా.



సంస్కృతవిశేష్యముయొక్క విశేషణ మగుసంస్కృతవిశేషణ మె ట్లుండ వలయు నన్నది గూడ విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు (కార.19) ననుదానిచే స్పష్టము.

ఇఁక విశేష్య మాచ్ఛిక మై దానివిశేషణము సంస్కృతశబ్ద మైన నావిశేషణ మె ట్లుండు నన్నది సూరి స్పష్టము చేసినవాఁడ లేదు. తండ్రి సమర్థుఁడు అమె సమర్థ యనునవి బాల.చే సాధ్యములు గా వనుటలో వీరియభిప్రాయ మిదియ యగు నేమో. విశేష్యమునుబట్టి మహత్త్వామహత్త్వములు మాత్రము సంస్కృతవిశేషణములకును సిద్ధించును. తండ్రి సమర్థుఁడు అని యుత్త్వడుజ్ఞులు గావలె నన్నఁ బుంలింగము గావలెఁ గదా. పుంలింగత్వ మెట్లు వచ్చునో.

అవుఁ గాక వీరిలక్షణముచే సిద్ధించునా? సూరివలె నుత్త్వడుజాదులను గాక వీరు పుంలింగతుల్యత్వాదులచే విధించినను నయ్యది బల్లిదాదిశబ్దములకు నాచ్ఛికములకే కదా. 'తత్స.17సూత్ర'వివరణము నాశ్రయింపవలెనా? ఏ మైన సూత్రముచే సాధింపఁబడుట లేదు గదా.

సూరి యీసూత్రముచేఁ బైయర్థమును జ్ఞాపకము చేయవచ్చును.

బల్లిదాదులకు సంస్కృతతుల్యత్వమువలన మహత్త్వమున నుత్త్వడుజాదు లగుట ము న్నగునవి సిద్ధించుచున్నవి 'సంస్కృతతుల్యత్వమువలన నీరీతికార్యములు సిద్ధించు నవఁగా సంస్కృతములకు నిట్ల యవును. కాఁగా సంస్కృతముతోడితుల్యతవలన మహత్త్వమున నుత్త్వడుజ్ఞులు, నమహత్త్వమున ముపర్ణకము, మహతీత్వమున నాలుశబ్దముతో సమాసము సిద్ధించుటనుబట్టి యీయవి సంస్కృతశబ్దములకుఁ గలుగుటలో వింత లేదు గదా.

తండ్రి- మహత్తు. దీనికి విశేషణ మగుసమర్థశబ్దము మహత్తు. కావున నుత్వ డుజ్జులు. సమర్థుఁడు అట్లే తండ్రి—'బల్లిద విశేషణము సంస్కృతముతోఁ దుల్యము గావున (పైని 'సమర్థ'యనుసంస్కృతవిశేషణమున కయినట్లే) బల్లిదశబ్దమునకు నుత్వ డుజ్జులు. తండ్రి బల్లిదుఁడు ఇట్టె యితరము లూహింపఁదగును.

దీనివలన మనోహరుఁ డగుమిత్రము. శ్రీరామదేవత గంభీరుఁడు సురలు మహాత్ములు మొ॥ గూడ గుర్తింపఁదగు నని తోఁచుచున్నది.

మొత్తముపై సూరిలక్షణము సముచితము. వివరణమున "వీనిలోఁ గొన్నింటికి నపుంసకసమరూపములు కన్పట్టవు. మిసిమింతము, ఒడయము అను ప్రయోగములు లేవు. (ఉ.151) అనిరి. అయినను మిసిమింతుఁడు, మిసిమింతురాలు అనురీతిరూపముల కలిమి నివ్వానిని బల్లిదాదులలోఁ జేర్పఁదగు ననియు వరుఖలవారియభిప్రాయము గుర్తింపఁదగును. వీనికిఁ గ్లీబసమరూపములు లే వనఁగా నీశబ్దములమహత్తు (లగు విశేషణము) లగుటయె లే దన్నమాట.

కయిరాదులు :

'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డుజ్జగు నుత్వంబు గాదు' (4) అనుసూరిలక్షణమును మహత్తు లగుమగాదులకు నేకార్థకాద్యమహత్తులకును 'డుజ్జు అగు ఉత్వంబు గాదు' (ఉ.4) అని యించుక సవరించిరి. 'కయిరాదులకు'ననుసూరివాక్యమును నేకార్థకాద్యమహత్తుల కనుట యిందలిమార్పు. మహత్తు లగుమగాదులకంటె వేఱుగాఁ జెప్పుటనుబట్టియును గయిరాదులు మహత్తులు గా వని (అయిన మగాదులలోనె చేరుఁ గదా) సూత్రముననె స్పష్టము. కాక తిర్యగ్వాచకము లగుట నవి యమహత్తు లగుట స్పష్టమే. కావున కయిరాదు లమహత్తు లని వేఱ చెప్పనక్కఱ లేకపోయినది సూరికి. (మగాదులలో మగ మహత్తె. కాని యాగణమందలి పాప,మనుమ ఇత్యాదులు మహద్భిన్నములను గాఁజెప్పు నట నికాక్యము వారింపుటకై మహత్తు లగు అనువిశేషణము (మగాదుల కనవసరము.) వీరు ఏకార్థకాదులు అని పేర్కొనిరి. ఒకశబ్దమమహద్వాచక మని నిర్ణయింపరాదు గదా. విశేష్యమునుబట్టి గాని కుదరదు. అట్లయ్యును మహత్తు లగు మగాదులకు అని మహత్తులను ప్రత్యేకముగాఁ జెప్పియుండుటచే వానినుండి వేఱు చేసిన

యేకార్థకాదు లమహత్తులు గాక తప్పదు. కావున కయిరాదు లైనను 'అమహత్తులు' అని సూత్రమునఁ జేర్చుకొనుట వివరణాత్మకము, స్పష్టతకే. కాని వేఱుప్రయోజనము లేదు. కయిరాదులను నేకాద్యర్థకములుగా మార్చనేల? 'కయిర'శబ్ద మమహత్తు. ఏకార్థకము విశేష్యమునుబట్టి గాని నిర్ణయింపరాదు. అట్టియెడలనమహత్తని స్పష్టముగా గుర్తింపఁదగిన కయిరశబ్దము నాదియం దుంచినసూరిలక్షణము యుక్తము. (సూరి సర్వనామములప్రక్రియను నిరూపింపలేదు. అట్టియెడ దానిప్రథమైకవచనాంతరూపమును బ్రస్తావించుప్రస్తుతలక్షణమున నట్టిసర్వనామశబ్దమును జేర్చుకొను టుచితమును గాదు. అందుకే సూరి యిట్లు చెప్పనవకాశమె లేదు. వఝులవారును అన్నిప్రభృతులవిభక్త్యంతరూపసాధనప్రక్రియను సూత్రించుటకన్న వాని నుదాహరించుట లెస్స' (ఉ.ఉచ్చి.51.సూ.) అని యొకసూత్రముగా స్పష్టము చేసియుండిరి కూడ. అట్టియెడల వీరు మాత్రమే కార్థకము నిటఁ గణముమొదటఁ జూపుట యుచితమా? సూరి కయిరాదు లనుటలో దోషము గల దని వీరు చెప్పలేదు. ఏకార్థకాద్యమహత్తులలోఁ గయిరాదులను జూపియే యుండిరి. అట్టియెడ నేకార్థకాదు లన నేల? ఏకాదేరమహతాం చ డావున్' అనుచిం లక్షణము వఝులవారియీమార్పుచే స్ఫురించును. కాని యట నేకాదులు మహత్తులు. వీరును మగఁడు, ఒకఁడు. (ఒకపురుషుఁడు)' (ఉ.151) అని ఒకశబ్దమును మహత్తుగాఁ గూడఁ జూపిరి. పిదప నమహత్తుగాను జూపిరి. ఇది మహత్తు గూడ నగుచుండఁగా నమహత్తులనుగూర్చి చెప్పుట కుభయ మగుదీనినె గణాదియం దుంచనేల? సూరిమతమున నైన దీనిని మగాదిగణమునను, గయిరాదిగణమునను జేర్చుదుము గాక. కాని యమహచ్ఛబ్దములకు మొదట నుంచుట కుభయ మగునిదియె తప్ప గతి లేదా? దీనినె గణాది నుంచుటవలనఁ బ్రయోజనవిశేష మెది యేని గలదా? లేదు. వీరును వివరింపలేదు. కాఁగా 'నేకార్థకాద్యమహత్తులని విస్తరించి చెప్పినవఝులవారివచనముకంటెఁ గయిరాదుల కనుసూరివచనము మిక్కిలిసమంజస మని నిశ్చయింపఁదగును.

'ప్రేఁడు తేఁడు ఈప్రత్యయాంతములు (సాలీఁడు) కాప్రత్యయాంతములు మున్నగువానిని మగాదులలోఁ జేర్ప నక్కఱ లేదు. పుంలింగసమత్వముచేతనె వానికి డుజ్లు లభించును. ఉత్వమునకుఁ బ్రసక్తియే లేదు "(ఉ.151) అనువఝులవారియభిప్రాయము సమంజసమె యనిపించు. కొమ్మరాఁడు సాలీఁడు మున్నగునవి పుంలింగసమము లయినను మహద్వాచకములు కావు గాన డుజ్ప్రాప్తికయి యేకాద్యమహ

త్తులలోఁ జేర్పఁబడెను (ఉ.151) అమహాత్తు లగువీనిని బుంలింగసమములుగాఁ జెప్ప నేల? పుంలింగసమము లన్నను మహాత్త్వము లేమి డుజ్జు రాదని వీరును గుర్తించిరే కద. డుజ్జాకయి యెట్లును గయిరాదులలోఁజేర్పఁబడినవి. పుంలింగసమత్వము వ్యర్థము. సూరిపద్ధతిని విడచుటవలన నిట్టి యిబ్బంది వీరికిఁ గల్గిన దనవచ్చు'. సూరిమతము ననుసరించి పుంలింగతుల్యతవలన డుజాదు లగు. కాన డుజాదులకొఱకె పుంలింగ తుల్యత. అది యిటఁ గయిరాదిత్వముచేతనె సిద్ధ మగుచుండ సూరిమతమున (కయు రాదులవలె) నివి పుంలింగతుల్యములు కావు. వర్ధులవారు డుజ్జు నిర్చునవి పుంలింగ సమము లని యెంచుటవలన డుజ్జు కయిరాదిత్వముచేత వేఱుగా సిద్ధించినను నివి పుంలింగసమము లనవలసె. వీ మైనఁ బుంలింగసమత్వమువలన శాస్త్రమున నెట్టి ప్రయోజనమును లేకుండుటచే వర్ధులవారు డుమంతము లగునమహాత్తులను బుంలింగ సమములుగాఁ జెప్పుట యనుచిత మనవచ్చు.

సాలీఁడు అనుదానిని వీరు ప్రథమవాక్యమునఁ జూపుట యుక్తము గాదు. ఇది పుంలింగసమ మైనను మహాత్తు గామి డుజ్జు రాకపోవుటచేతనే కదా వీరు దీని నమ హాత్తు లగునేకాదులలోఁ జేర్చిరి. డుజ్వర్ణకము కలుగున వెల్లఁబుంలింగసమము లను నపార్థమువలన వీ రిట్లు చెప్పియుందురు. డుమంతము లగునమహాత్తులకుఁ బుంలింగ సమత్వము లేమిఁ బుంలింగసమములను వర్ధులవా రారీతిని విచరించుట సరి గాదు. కాఁగా స్త్రీప్రత్యయాంత మయ్యును, మగాదిగణములోఁ జేర్ప నక్కఱ లేకయె పుంలింగ సమత్వముచేతనె డుజ్వర్ణక మందుటను సూచించుటకయి అటువడీఁడు, ఉక్కిఁడు ననురీతి మహాత్తు లెవియేఁ జూపఁదగు (వ్యా.సం.స.712)

మగాదులకు డుజ్విధానమును, గయిరాదులకు నుత్వనిషేధము (వ్యా.సం.స.713) ననావశ్యకము అని తోఁచుచున్నది.

కృష్ణరాయ :

రాయశబ్దము మగాదులలోనిది. కావున దీని నుత్వము రాదు. కృష్ణరాయుఁడు అనురీతిని సమాసమునం దుత్వ మగును. కానచే కృష్ణరాయ అనుసంబోధనము సిద్ధించును' (ఉ.152) అనిరి వీరు. సమాసమునం దుత్వ మెట్లగునో వీ రిట విపరింపలేదు.

సూరిలక్ష్యమున కనుగుణముగా నాతనిలక్షణము నిర్దుష్ట మని గుర్తింప వచ్చును.



వీరియుద్దేశ్యము ననుసరించి వీరిలక్షణ మెంతయుచితమో పరిశీలింతము.

వీరిలక్షణమునుబట్టి రురలు, 'ండు'వర్ణమును', గొన్నియెడల వికల్పము. వీరు వైకల్పికస్థలములలో ఒకరు ఒకండ్రు- ఇత్యాదిగాఁ జూపినవానియందు 'ండు' వర్ణము రాకుండుట (వికల్ప మగుట) కలదు గాని రురలు రాకున్నస్థల మొక్కటియు లేదు. కాఁగా లులలకు రుర లగుట యెల్లెడల నిత్యమె యనియు, 'ండు'వర్ణ మగుటమాత్రమే కొన్నియెడల వికల్ప మనియుఁ జెప్పవలె. వీరిసూత్ర మట్లు చెప్పుట లేదు. కాఁగా లులలకు రురలు వేఱుగా విధింపఁదగును. ప్రౌఢ. సర్వనామములప్రక్రియ యుపదేశించి నది గదా. దానిని దృష్టియం దుంచుకొన్న బా గుండెడిది.

'పదురు-పండురు. పండ్రు' అనియు నిటఁ జూపిరి. పండురు, పండ్రు అనునవి లేవు. సర్వనామములపట్టికలో వీరును జూపలేదు. కావున నిది యచ్చుపొరపా టేమో. పదుండురు. పదుండ్రు అని యుండియుండనవు.

'ండు'వర్ణమును జెప్పి వీరు సాధించిన 'ఒకండురు' అనురీతిరూపములు సూరి ప్రస్తావింపలేదు. వీనికైనఁ గవిప్రయోగము లిచ్చిన బా గుండెడిది.

విలుకాండ్రు :

'కాప్రత్యయంబుమీఁదిబహువచనలకారంబునకుఁ ద్విలఘురేఫంబులును లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకారంబు నగు' (7) ననుసూరిలక్షణము నట్లు గ్రహించుచుఁ జివరలో 'పూర్ణబిందుపూర్వకడవర్ణంబు నగు' (ఉ.7సూ) ననిరి.

సూరి డకారము వ్యంజనమును విధించుటచే నది యెప్పుడును మీఁద నున్న రేఫముతో సంయుక్త మైయుండును. కావున అచ్చి. 5సూత్రముచే ఖండము నకును బూర్ణ మగును. కావున ఖండబిందుస్థితి కవకాశము లేదు. అందుచే సూరిలక్షణమున వరుసలవారివలె పూర్ణబిందు వని చెప్ప నవసరము లేదు. (పూర్వసూత్రమునొద్దను నిట్లు చేయుట సూరి చెప్పుట స్పష్టత కొఱకోవలె. చెప్పకున్న నిబ్బంది లేదు.) వీరు

డుగర్ణమును విధింపనుచో విలుకాండుడను అని కాకుండుటకై పూర్ణబిందు వని చెప్పక తప్పదు.



డుగర్ణమును విధించి వీరు విలుకాండురు అనురూపమును సాధించిరి. అథర్వణ సమ్మతము లగువిలుకాండురు అనురూపము సూరిపక్షమున సంగ్రహింపఁబడదయ్యె" (వ్యా.సం.స125) అనిరి. అథర్వణుఁడు సమ్మతించిన-ధాత్వుఁడు మను న్నగువానిని సూరియు సమ్మతింప నే మాయెను? అథర్వణుఁడు చెప్పె నని కాక యనుసరమునుబట్టి విధింపవలెను.

వేడుకకాండ్రురు వేడుకకాండ్రురకు అపశబ్దములు. 'సూరి విలుకాండురు అసాధువు విలుకాండ్రురు సాధువు అని తలంచెను; ఇది సరి కాదు' (ఉ.153) అనిరి. కవి ప్రయోగములందుఁ గానవచ్చు విలుకాండ్రురు అనురీతిరూపములు (చిం.వ్యా.వి సాధ్యములు కా వని?) సాధువులు గా వని యెంచిరి గావున వీరు తత్స్థానమున విలుకాండురు అనురీతిరూపములు సాధించి రనఁదగు. అయ్యు సూరిసమ్మత మగువిలుకాండ్రురు అను నదే యుక్త మనియు 'విలుకాండు' రనువాని కాధారము లే దనియు వీరివాక్యములలోని పైని గమనింతము. (అచ్చి.17)

కావునఁ బూర్ణబిందుపూర్వకడుగర్ణమును విధించుట తగ దనియు 'బిందుపూర్వక డకార'మని చెప్పినసూరిమతమె యుచిత మనియు గ్రహింపఁదగును.

### త్రెప్రభృతులు :

"త్రెప్రభృతులబహువచనము గసు ముందు డు గాగు' (8) అనుసూరిలక్షణమును 'తేశబ్దపు'—అని సవరించి తేశబ్దమున కొక్కదానికె చెప్పిరి. "త్రెప్రభృతు లనుటకు (సూరి) మ ఱొక్కశబ్దము నేని యుదాహరింపలేదు" (ఉ.154) కావునఁ బ్రభృతిశబ్ద మనవసర మని భావము.

ఈప్రత్యయాంతములబహువచనముల కీదృరూపము కన్పట్టలేదు. (వ్యా సం.స.722) సంగడీండ్రు (సి 5.247) తెక్కలికాండ్లు, మిండగీండ్లు అనునాలుగు. చూపిన ప్రయోగములనుగూర్చి 'పైయన్నిటను మిండగీండ్రు, మిండగీలు మన్నగురీతిని వానివాని ప్రోక్కఁగవులు ప్రయోగించి రేమో యనుటలో క్షతి యేమియు లేదు. (వ్యా సం.స722)

ప్రయోగములందు క్షతి లే కున్నను మార్చుట సూరిమార్గము కాదు. ప్రయోగానుసారముగానట్టివి వ్యాకృతులలోఁ జెప్పఁడును నని సూరి యెంచెనో 'వాండ్లలోఁ బాపుమోముల తీండ్ర మాలె (భం.1.) అనురీతిస్థలము లున్నను సూరి యట్టివానిని సర్వనామరూపములపట్టికలోఁ జూపలేదు. (మహా త్తులగు-) 'ఒక'ను మగాదులలోను మహాత్తును గయిరాదులలోను గ్రహించునట్లు సర్వనామములు గ్రహించుట యుచితము. అట్టిరూపము సూరిసమ్మత మగ నాధారము లేదు గాని, కేవలము సర్వనామరూపముల నుద్దేశించి మాత్రమె ప్రక్రియను జెప్పుట లే దని ఉ.అచ్చి.6సూత్రమునొద్ద నుద్దేశ్యము.

కూఁతురులు :

"కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రుగాగం బగు' (8) ననుదానిని ననుసరించుచు" కూఁతుశబ్దమున కేకవచనబహువచనములు రెండు నగునప్పుడు రుగాగమము వైకల్పికముగ నగు' ప్రథమేతరైకవచనపరకత్వమున రుగాగోత్వ మిత్వ మొందును' (ఉ.9సూ) అనిరి.

"సూరిసూత్రమును వివరణమును బ్రయోగవిరుద్ధము లగుటచే వానిని విడచి యథాప్రయోగముగ రచింపఁబడె (ఉ154) ననిరి. సూరి ప్రథమైకవచనమున మాత్రమె విధించెను. ఇతరవిభక్తివచనములందును నగునా? ప్రయోగవిరుద్ధ మగుట యెట్లు? "కవిత్రయమువారిప్రయోగములం దన్నిఁటనో యొక్క ప్రథమైకవచనమందుమాత్రమె రుగాగమము కూఁతుశబ్దమునకు నిత్యముగాఁ గన్పట్టుచున్నది. కేతన యిట్లె వచించెను. (వ్యా.సం. ప.75బి) సూరియు నట్లె వచించెను. కవిత్రయము కూఁతురిని ఇత్యాదిగఁ బ్రయోగింపలే దనిరి కదా. కవిత్రయప్రయోగములం దగుట లేనిత్వార్థ కేవలసంధినిమిత్త సూత్రింపలే దేమి? కవిత్రయేతరప్రయోగములందు మాత్ర మిది వైకల్పికమా? అరు దయిన దానిని వైకల్పిక మనుట యెట్లు? సూరిలక్షణము (కవిత్రయ)భారతప్రయోగానుగుణ మనియేని చెప్పనవును గదా.

కూఁతురిని ఇత్యాదులు కవిత్రయేతరప్రయోగములం దయినను (తిక్కనవాడి నట్లు గానవచ్చు) ప్రయుక్త మయియుండుటచే నట్టివాని నసాధువులుగా సూరి పేర్కొనుట యుచిత మగుచున్నది. వానికి సాధుత్వ మంగీకరింపఁదగు. అట్టిచో దుష్టవారి లక్షణ ముచితమా?

'ఏకబహువచనములు రెండింట' ఇష్ట మయినపుడు 'విభక్తిపర మగునపు' డన్నఁ జాలుదానికి 'ఏకబహువచనములు పర మగునపు' డనుట గౌరవము ఏకవచన బహువచనములు గానివిభక్తి లేదు గదా. పుంలింగం బై మహద్వాచకం బైననామంబు తుదియత్వంబున కుత్వం బగు ననురీతిగా విభక్తి పరం బగునపు డనియుఁ జెప్పక 'కూఁతుశబ్దమునకు రుగాగమంబు వైకల్పికముగ నగు' నన్నమాత్రము చాలదా?

దీనిని బ్రత్యయముగాఁ జెప్పుటలోఁ బ్రయోజనవిశేష మేమియుఁ గానరాదు. ప్రథమైకవచనమునను బ్రాతిపదికి కాగమముగనె చెప్పిరి గదా. నిగాగమాదులవలె రుగాగమ మనుట లాఘవము.

'ప్రథమేతరైకవచనపరకత్వమున' ననుటకంటె ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపు డనుట స్పష్టతరము. 'రువర్ణోత్వ మిత్వ మొందును' అని యుత్వము (తాను) ఇత్వముగా మాఱు నని చెప్పుటకంటె ఇత్వ మగు నని విధించుట శాస్త్రపద్ధతి కనుగుణము. ఇత్వ మేవా ల్లగుటచేఁ నది దగునుత్వమునకె యగును గావున నుత్వమును బ్రస్తావింపకున్నను బాధ లేదు. 'రువర్ణంబున కిత్వం బగు' ననవచ్చు.

ఇఁక దీనియర్థమును బరిశీలింతము.

ఏకబహువచనములు పర మవునపు డనుటచేఁ బ్రథమైతరైకవచనమునందు సయుతము రువర్ణము విభక్తి పర మగుచుండఁగా నాగమ మగును. కాఁగా దీనిపైని సుప్రత్యయము లోపించుటకు దీనిని త్రిసమముగా నెన్నవలయును. (కూఁతు అనురూపము నంగీకరించుటచే) వీరు త్రిసమముగా నంగీకరింపక తప్పదు. సూరి 'రు'వర్ణమును బ్రథమైకవచనముగనె విధించుటచేఁ గూఁతురు త్రిసమము గాదు.

కూఁతు:

బహువచనమునవలె నేకవచనమునందును రువర్ణము వీరువికల్ప మని 'కూఁతు-కూఁతురు' అని యుదాహరించిరి. రువర్ణము లేని కూఁతు అను ప్రథమైకవచనాంతపదము గలదా? 'కూఁతురు అని విడిగాఁ బ్రథమైకవచనరూపము కర్తగా ఎక్కడా కనబడలేదు (బాలక.2) అనుశరణ్యకర్తగారిమాట నిజమే. నాకు నట్టిది మహాకావ్యములందుఁ గాన

చెప్పినారు. అసలు వి.వి.ఎస్. గారు చేసినవ్యాఖ్య యుక్త్యసంగత మని గ్రం థాంతరమున స్పష్ట మగు.



కాఁగా సర్వజ్ఞుఁడు చెప్పెను గదా యని ప్రయోగములందు లేని 'కూఁతు పదము నంగీకరింపవలసినయవసరము లేదు. కావున రుగర్ణము నిత్యముగాఁ జెప్పిన సూరిమతమె యుచితము.

పైవిధులవారివాక్యములనుబట్టియె యితరవిభక్తిపరస్థలముల నీరుగర్ణము ముక్కరియరుదు. రుగర్ణము "కాకపోవుటయు ప్రచురప్రయోగప్రసిద్ధము." (వ్యా.సం. స,715) కావున నాయెడను వీరు వైకల్పిక మని సాధారణముగాఁ జెప్పుట సమంజసము గాదు.

కాఁగా నిట సూరిలక్షణము నట్లయుంచి రుగర్ణేతరవిభక్తిపరం బగునపుడు కొన్నియెడల రుగాగమము చూపట్టెడి' ననురీతిగా నెట్లేఁ జెప్పు టుచిత మని తోఁచు.

వజ్ఝలవారు "కూఁతురులు శబ్దమునుండి కూఁతుర్లు, కూఁతుళ్లు 'అని యేర్పడుట వింత కాదు.' (పు.155) అనిరి. మఱి 'కూఁతుంద్రు' అనునది వింత యగు నేమో. పెండ్లికూఁతుంద్ర వందాన, పెంపుడుకూఁతుంద్ర (ఆం.భా.ఆ 298) వీనిని గూడఁ బ్రస్తావించు టుచితము గాదా? రాచకూఁతుంద్రు సుతుం (శ్రీ.2.167)

సూత్రమునఁ బిదప వీరు ద్వితీయాద్యేకవచనపరకత్వమున రుగర్ణమున కిత్వమును విధించిరి. "సూరి యీ యిత్వమునే సంగ్రహింపలే (పు.155) దనుట సరి కాదు. ప్రథమైకవచనేతరస్థలములలో సూరి వీరివలె రుగర్ణాగమమునె చెప్పలేదు. (అట్టి వసామువు లనియు నిర్ణయించెను.) రుగర్ణమె లేకుండ దానియుత్వమున కిత్వము చెప్పుట యెట్లు సంభవించును?

ఇత్వమును ప్రత్యేకముగా విధించుటనుగూర్చి "ప్రాణివాచకము లౌపవిభక్తిక ములు గావేవవు కావున కూఁతురిచే అనుచోటియిత్వ మౌపవిభక్తికసంబంధిగాదు. తృతీయాషష్ఠ్యేకవచనములందు కూఁతురన్ అను ప్రయోగమును లే"(పు.155) దనిరి. ప్రాణివాచకము లౌపవిభక్తికముల యగుట పైని గమనింపఁగలము. అట్లయత్వాదేశము

గానలసినవచ్చునన్నది. కావుఁగాన శబ్దములకు 'బహువచనమునందే' ణకారాదేశ మగుటను సూత్రమునఁ జెప్పవలె.



(శ.ర.తాఁకుదల శబ్దము క్రొద్ద 'పగఱ' యనురూపమును జూపినది. సూ.ని. అదంతముగా నీశబ్దమును ప్రత్యేకముగ నిచ్చినది. పగఱలం గాచిన (సూ.ని.) అని పగఱ'శబ్దముపై ద్వితీయాబహువచనము చేరినప్రయోగ మిచ్చె.)

చూపఱు అనుచో వీరిలక్షణమునుబట్టి చూప ప్రాతిపదిక యని (ఱు ప్రథమా బహువచనము) చెప్పవలె. ఇది యె ట్లేర్పడును?

చూపఱను చూపఱకు ఇత్యాదిరూపములంబట్టి యీఱకారము బహువచనసంబంధి యగుట స్పష్టము చూపు అనుదానిపై మతుబర్థమున 'అ'ప్రత్యయము చేసి (అదప) చూప అనుదానిని దద్ధితాంతప్రాతిపదికముగా . సిద్ధము చేసికొనవచ్చు. ఇది నిత్య బహువచనాంత మగుటంజేసి చూపఁడు అను రీతిరూపము లుండవు. చూప + లు చూప + ఱు అను ఇత్యాదిగా బహువచనమందే యుండును. కావున నీకార్యమును ప్రవర్తింపఁజేయ నవు. చూపఱు అనుదానికిఁ జూచుట కలవా రనురీతిగ నర్థము గుదురు.

సం.లో వీరు "అంతాదులలోఁ (ప్రౌఢ శబ్ద 88) జేర్చియే చూపఱు పగఱు రూపములను సాధింపుకొనవలెను. చూచు+వారు. చూపఱు, పగ+వారు—పగఱు (వ్యా.సం.స.849) అనిరి. అయినను వెంటనె 'ఈసందర్భమునఁ ప్రౌఢవ్యాకర్త చూపినప్రక్రియ సరి యైనట్లు కన్పట్టదు. అంతవారు మున్నగువానికిని అందఱు మున్నగువానికిని సత్రసూత్రిలో భేదము భాసిల్లుచున్నది' (వ్యా.సం.స 851.) యనిరి పగవారు పగఱు చూచువారు. చూపఱు అనువాని కిట్లు భేదము భాసించుచున్నను వీరు ప్రక్రియను మార్చి యిట్లు చెప్పు టుచితము.

### అందుకు :

అల్వాదులబహువచనలకారంబునకు రేఫంబగు ముందర్థంబునకు బిందు - పూర్వసకకారంబు నగు' (11) ననుదాని నద్ది గ్రహింపుమఁ శాంబలో 'బిందుపూర్వ

కడువర్ణంబు నగు' ప్రతిపాదిత్వ బహుత్వంబున పరత్వమున వీనితుదిడకారము ఇకార మగును' (ఉ.11సూ) అనిమార్చి కూర్చిరి.

సూరి డకార మన వీరు డువర్ణ మనుట ప్రధాన మైనమార్పు. 'అంధ్రుడు అప శబ్దము ఆంధుడు సుశబ్దము' (రయిసూత్రవిషయమున కిది సూచిక) అని వీరిసిద్ధాంతము. కావున 'అంధురు' అనురూపము సాధించుటకయి వీ రిట్లు మార్చి రనుట స్పష్టము. 'డువర్ణమె చింతామణిలో విధింపఁబడెను. సూరి డకారమును విధించుట నిర్మూల' (ఉ.156) మనిరి. నిత్యందారాదేశ్చ' యనుచిం. సూత్రమును వ్యాఖ్యానించిన యహో. 'దారాదేశ్చ నిత్యం బిన్దుయుతో డురుల్లోపశ్చ నిత్యం స్యాత్ ఆంధ్రుః (కవిశి.483) అని పేర్కొనె. అహో. యీవ్యాఖ్య బా.స. (పుట.212) ననుసరించినది. కవిజనాంజ నాదు లిట్లె చెప్పె. మఱి సూరిలక్షణము నిర్మూల మగు టేమి? వీరివ్యాఖ్య ననుసరించి చిం.కి భిన్నము గానగె. వీరివ్యాఖ్యయందలి ప్రమాదము లు తద్గ్రంథపరామర్శనమున గమనింతము డువర్ణమును జెప్పి నిత్యముగా సులోపమును జెప్పుటకంటె (సుత్వము లేని) డకారమును విధించుట లాఘవము కాదా? చిం. కూడ 'అంధ్రు' అనునదే సాధించి నది. కాఁగా వీ రిట సుశబ్దముగాఁ జెప్పిన'అంధురు' అనునదే నిర్మూల మని నిర్ణయింప వచ్చును.

"ఆంధురు అనునది తాళపత్రమాతృకలలో నున్నది" (ఉ.156) యనఁగా ముద్రితప్రతులందు 'ఆంధ్రుడు' అనురూపములు నింపి రన్నమాట. తాళపత్రప్రతులు తప్పులతిప్పలు'(వ్యా.సం.స.191) అని చెప్పినను వీ రిటఁ బ్రమాణీకరించుట బాగున్నది. వివాదస్థలమునందె యట్టివి ప్రమాణము లగును గదా. 'అంధ్రుడు' అనున దె యుచిత మని వీరిమాటలలోనె పైని గమనింతము. (అచ్చి.14) కాఁగా బా.స. ప్రభృతులమతము ననుసరించి యాంధురు అపశబ్దము. అంధ్రుడు సుశబ్దము. కోదండ్రు రయం దని అహో. చూపెను గదా. (కవిశి 482) కావున సూరి బిందుపూర్వక డకార మును విధించుట యుచితమె.

వీరు సుశబ్దముగాఁ దలఁచిన 'ఆంధురు' అనురూపము వీరిలక్షణముచే ససాధు వగుట యిట గమనింపవలసినయంశము. సూరివిధానమును తిరస్కరించుమనే వీరు తత్ప్రభావమునకు లోనయి "బిందుపూర్వకడువర్ణం' బనిరి. సూరి వ్యాఖ్యానమును జెప్పు

టచే నిటఁ బూర్ణబిందువె (అందు) ఏర్పడు (ప్ర.ఆశ్వా.7) ఏడు పూర్ణమును విధిం చుటవలన బిందుశబ్దముచే ఖండబిందువు గూడ వచ్చి అఁడురు, (కోదండురు) కోదఁడురు ఇత్యాదిగ రూపము లగును. ఇటఁ ఖండమునకుఁ బూర్ణము వచ్చునవకాశ మేది? 'అనిర్దిష్టబిందువిధానస్థలములతో దీర్ఘముమీఁద ఖండమునే నిల్పవలయును. (ఉ.సం.15) కావున వీరిలక్షణము ననుసరించి దీర్ఘముపై ఖండమువూత్రమె యయి 'యాఁడురు' అనియె యగును గాన 'నాండురు' అనువీరిసుశబ్ద మసాధువు చేయుచున్నది వీరిలక్షణము. సూరివలె బిందుపూర్వక- అనక 'పూర్ణబిందుపూర్వక- అని బిందువును బూర్ణముగా వీరు నిర్దేశింపకుండుట పొరపాటు.



### చెలియండ్రు :

సూరి యాల్వాదులలోఁ 'చెలియలు' అనుశబ్దముతో మొత్తమివి యైదుగాఁ జూపెను. కాని వీ రిట 'అలు చెల్లెలు కోడలు మఱఁదలు ఇవి యాల్వాదు (ఉ.156) లని 'చెలియలు' తొలఁగించి నాలుగే చూపిరి. (వ్యా.సం.స.780) సంజీవనిలోఁ జం. వివరణమునఁ జెలియలుశబ్దమును జూపియే యుండిరి. అక్కచెలియండ్ర (ప్ర.భా.1.76) కాఁగాఁ బొరపాటునఁ జెలియలు శబ్ద మిటఁ దొలఁగిన దనఁదగు.

పిదప ద్వితీయాద్యేకవచనపరకత్వమున నిత్యము విశేషముగా విధించిరి. ప్రాణి వాచకము కావిభక్తికములు గా (ఉ.156) (వ్యా.సం.స.783) వను సుద్దేశ్యముతో వీ రిట్లు విధించిరి. అది సరి కాదు. కావున దీని నావిభక్తిక మగునిత్వముగా సమన్వయించుటతో దోషము లేదు. ద్వితీయాద్యేకవచనపరకత్వమున మాత్రమె యగుట దీనియావిభక్తికలక్షణ మగును.

### కొల్లు :

బహువచనము పరంబగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు (12) ననుసూరిలక్షణము నట్లె గ్రహించిరి. 'డలటరల ఉత్వంబునకు' అని సంధిని వేఱు చేయుట స్పష్టతకుఁ గావచ్చును. అది యనవసరము.

లక్ష్యభాగమునఁ గొంతగనఁబడును. 'కాళ్లు (కాళ్ళు) మొసళ్లు (మొసళ్ళు)' అని వీరియుదాహరణములు. దీనింగూర్చి వీరు "కాళ్ల మున్నగురీతి నపభ్రష్టముగా నిట్లు ద్రావిడళకారము వాడుక కెక్కినది. ఇట్టియెడల కాల్లు అని యలఘులకారము ఉండవలయును- (ఉ.157) మున్నుగా సూరి యుప ళకారమును జూపుటను విమర్శించిరి. 'ళ' త ప్పనియు 'ల' సాధు వనియు వీరిసిద్ధాంతము. ఇది సరి కాదు.



కాల్లు మొసల్లు అనురీతివ్యవహారము వాడుకజనులయం దెవరికేని గల దేమో. అయ్యది కవివ్యవహారమునందు లేదు. అందుకె వీరు కాల్లు అనుదానితోపాటుకై కాళ్ళు అనుదానియుఁ జూపవలసె.

ళకారమె వాడుక కెక్కినదని సూత్రించియు వీరు లకారమునె చూప నేల? ఒకవేళ వీ రన్నట్లుగాఁ గవిత్రయమువారు 'కాల్లు' అనురీతినె ప్రయోగించి రనుకొందము. తరువాతివారు ళకారమునే యుంచిరి కదా. కవిత్రయమువారు ప్రయోగించని (ఇట్లని వారె చెప్పిరి) కూఁతురని ఇత్యాదులు వీ రంగీకరింపలేదా? అట్టియెడల నిప్పటి ళకారమె యసాధు వని నిర్ణయించు టెట్లు?

అసలు కవిత్రయమువారు 'కాల్లు' అనురీతిగనె ప్రయోగించి రని విశ్వసించుటకుఁ బ్రమాణమేది? ఇట్టె నన్నయనాఁటికిఁ గాల్లు అనురీతిగనె యుచ్చారణమునం దున్న దనుటయు విశ్వసించుట కిపు డేది యాధారము. ఇట్టిస్థలములు శాసనభాష ప్రమాణ మగునా? అగుఁ గాక. నన్నయభాషకు (భారతభాషకొ) మాత్రమె వీరు లక్షణము చెప్పఁబూనిరా యీగ్రంథమున?

'కాల్లు' అనుచోటిలకార మలఘు వనుటయు నిరాధారము. 'ల'కారము లఘువు గదా. ఇది యలఘు వెట్లయినది? 'దన్త్యజా లఘురతా ద బిందుయుతా' యను నన్నయచిహ్నలక్షణము ననుసరించి యైనను లఘు వగులకారముపై బిందువు రూపమున లఘ్వలఘులకారములకు లిపియం దిభేదము గలదు. అట్టిభేదము గూడ లేక లఘులకారమునె వ్రాసి యది నన్నయాధర్వణులమతమున నలఘు వన్న నెట్లు విశ్వసింతుము? అలఘురేఫమును లఘురేఫముగాఁ జూపుదురా? అలఘులకారమునె యట్లు చూపు టెట్లు?

అప్పకవిసర్వమాలలోఁ శకారమై యుండుటయే కాక పూర్వులలోఁ బాహుళ్యము యలఘువు 'శ'కార మైయున్నదనుట స్పష్టము. దాని నంగీకరింపరాదా?

'కేతనయును బెద్దిరాజును నిట్టియెడల 'ళ్ళు' అనుదానిని విధించిరి. "కలుండలు అంతస్థము లైనన్ లు నడచి తదంత్యములకు ళ్ళు ల్లను బహుతం బయి గోళ్ళని, కొన్ని వేళ్ళని, కలగూళ్ళని పేళ్ళ నాఁగఁ గ్రమ మై యునికిన్" (ఆం.భా.భూ.77) "పాలు కుండేలు గోరనుపలుకు లిల్లఁ బాళ్ళు కుండేళ్ళు, గోళ్ళు నాఁబడు ధరిత్రి" (వ్యా.సం.స.742) అనువారివారి వచనములనుబట్టియు కేతననాఁటికే యువర్ణ ళకారము ప్రసిద్ధ మైయున్నదే. 'కాల్లు' అని యుండవలె ననుట కసలు ప్రమాణ మేది?

నన్నయకాలమునగుడి-గుడులు- గుడ్లు అనునవె సాధువులుగ నుండెడివి. గుళ్ళు గుల్లు (ళ్ళు) అనులాదేశము తిక్కయజ్వనాఁటికిఁ గాలక్రమమునఁ గల్గె (పు.160), ఆరూపము నథర్వణుఁడు వైకృతానాం లకి భవేల్లతయో రేఫరూపతా' యని లక్షణ బద్ధము చేసెను గదా. ప్రాల్లు అనుచో లకారము మాత్రము నేఁటికి నల్లే యుండవలెను? అథర్వణుఁడు తననాఁటికిఁ గల్గినమార్పును లక్షణబద్ధము చేసినట్లుగాఁ గేతనాదులును సూరి 'ళ'కారమును జెప్పుట యుచితమే కాక యవసరము నైయున్నది గదా.

ఉచ్చారణమునుబట్టి గ్రహింపవలసినస్థితిలో నాయుచ్చారణమె యపభ్రష్టమనియు, నన్నయాథర్వణు లెంత చెప్పిన నంతయు ననుటయు సరిగాదు.

ఇట్టియనేకకారణములనుబట్టి వసుఖలవారు 'కాల్లు' అనురీతిరూపములె సాధువు లనుట యసంగతము. సూరి కాళ్లు అనురీతిగ సాధించుట యెంతయు సమంజసము.

ఈసూత్రవిషయమును వీరు 'ళ తప్పు-లు సాధువు' అని సూచించిరి. 'ళ్ల-ల్ల' అని యుంట యుక్తము.

పిల్లలు

సూరి విల్లులు- పిల్లలు అనుచో సుత్వలోపము లేదని చెప్పఁగా వీరు 'సూరి పిల్లలు అనుదానితోఁబాటు విల్లులు అనియు వ్రాసెను. ఇది సరి గాదు. విల్లు(ళ్ళు) అని

యుండ ననును. (ఏకబహువచనముల కిట భేదము గానరాకున్నది.) సలోలోశ్చ-- చింతామణి సాధించుచున్నది. విల్లు (విళ్లు) ముల్లు (ముళ్లు)' (ఉ.157) అనిరి. 'సలోలోశ్చ' యనుచిం.సూత్రమునకు నహో. చేసినవ్యాఖ్యయె సమంజసము. కాన 'విళ్లు' అనురీతిరూపములు చిం. సాధించె ననుట సరి కాదు. 'విళ్లు' అనురీతివానికిఁ గవిప్రయోగము నీయలేదు. కవిప్రయోగములును లేకుండ చిం. చెప్పిన దని యంగీకరింపవలెనా?

ఆడఁగి రఁట నీళ్లలోని ముక్కైరి గాని (ఉ.హ.4-240) పలుదెబ్బఁగుముళ్ల మాటలు (పారి.1.85) 'నాళ్లు 'నాండ్లు' అనుదానినుండి సాధింపవలసినట్లు ముండ్లు-ముళ్లు అయ్యె నన నగు నేమో. (అపుడు కల్లు-కళ్లు అనురీతిరూపములప్రసక్తి యుండదు.) అరు దగునిట్టిరూపములను మార్గాంతరమున సాధించుకొను టుచితము.

కోట్లు :

తత్సమములం గోటిపిప్పలిశబ్దముల కీకార్యము చూపట్టుచున్న దని సూరి వివరించెను. దానింగూర్చి 'సూరి యీవిధి తత్సమములందును వర్తిల్లు ననుట పొరపాటు' (ఉ.157) అనిరి. సూరి చూపిన'కోట్లు' అనునది యెట్లు? "సూరి కోట్లు మున్నగు తత్సమములందును నీవిధి వర్తిల్లు నని వ్రాయుట సరి కాదు. సురపితృకోటులు (శాం.2.25) అనునది కవిప్రయుక్త మనందగును. సూరి వ్రాసిన పిప్పళ్లు అనునది వ్యావహారికము. దృష్ట్లు అనుదానిని ముద్రణసంస్కర్తలు భారతమున నింపిరి. అట్టియెడల దృష్టి అని మాత్రమె గ్రహింపవలయును'(ఉ.157) అని తిరస్కరించిరి. కోట్లు అనుదానిని కోటులు అనియు, దృష్ట్లు అనుదానిని దృష్టి యనియు దిద్దుబడియే కవిప్రయుక్తము లనుచుండఁగాఁ దత్సమములం దీకార్య మెట్లు గానవచ్చును. మూఁడుకోట్లతీర్థంబులు (అర.2.270) ఆఱువది కోట్లపదివేలు తీర్థంబులు (అర.2 282) మూఁడుకోట్లదానవులు (అర.4.55) ముప్పదిమూఁడుకోట్లబృందారకులన్ (హర.3.3) పింఛటకోట్లన్ మ్రింగుటయు (రాజ.2.58) ఘనమాయాకోట్లు (భాగ.8-689) దృష్ట్లగనినఫలం బెల్ల (ఆది-7.159) అనిమిషులదృష్ట్ల (శల్య.2-255) (మేన నెల్లప్పుడు తృష్ణచే - సింహా.6.93) కుంభకోట్లును(వ్యా.సం.స.159)

చుట్లు కలిగిన కోసల-కు (పరా.10-153) ఇట్లు కడచిన బ్రహ్మాండ కోట్లు మెఱయ (విష్ణు 3 258) అనుప్రాసఘటితప్రయోగముంగూర్చి వీరు సంయుతాసంయుతప్రాసగా చుట్లు- కోటిసంఖ్య ఇట్లు- కోటి మెఱయ అని కవులు ప్రయోగించి యుందు రని (విజ్ఞప్తియనుబంధము. 10.పుట) పేర్కొనిరి. ఇట్టి ప్రయోగము లెట్లు దొరకును?



పిన్నళ్లు అనుదానికిఁ బ్రయోగము శ.ర. కాని సూ.ని. కాని చూపియుండలేదు. వరుఁబవా రన్నట్లుగా నిది వ్యవహారమునందుఁ బ్రసిద్ధము. సూరి యేగ్రంథమునఁ జూచి పేర్కొనెనో యింకను బరిశీలింపవలసియున్నది. 'పిన్నళ్ళు కోష్ఠవ (హం.2.227)

అలఘుళకారము :

బహువచనము పరం బగునపు డసంయుక్తంబు లయి యుదంతంబు లయిన డలరల కలఘులకారంబు బహుళంబుగా నగు' (18) అనుసూరిలక్షణమును బూర్తిగా నవరించి యిట్లు వ్రాసిరి. 'బహువచనశ్లిష్ట మగునపుడే రేఫమునకుఁ గొన్నియెడల నలఘులకారాదేశ మగును. (ఉ-18సూ) అనిరి. సూరిలక్షణమునుగూర్చి 'బహు- అని సూత్రించి వ్రాళులు, మొగిళులు, ఊళులు మున్నగువాని నుదాహరించెను. ళ అను ద్రావిడళకార మెట్లును దప్పే. ల అనియె వ్రాయవలెను. అది యట్లుండఁగా వ్రాలు (ళు) లు అనురూపములును నిర్మూలములు. అట్టిచోటుల నలఘులకారమును నిర్వహించు ప్రామాణిక(ప్రాసాదిగత) ప్రయోగము లేదు - ప్రామాణికవైయాకరణు లెవ్వరును సాధింపలేదు. మీఁదుమిక్కిలి నన్నయసూత్ర మిందులకు విపరీతము. బహువచనలకార సంయుక్తరేఫమునకె నన్నయ యలఘులకారము నాదేశించెను. అథర్వణుఁడును- (ఉ.158) (వ్యా.సం.స.745) అని మిక్కిలి విస్తరించిరి.

వీరు భావించిన 'ఊలులు' అనురీతిరూపములు లేనిమాట నిజమె. 'ఊళులు' అను రీతిగా సూరి సాధించినవానికిఁ బ్రయోగములు లేవనుట వారివాక్యములకె విరుద్ధము. అట్టిదానికిఁ బ్రామాణిక(ప్రాసాదిగత)ప్రయోగము లే దనిరి. కాఁగాఁ బ్రాసేతరస్థలము లందుఁ బ్రామాణికకవులే యలఘులకారమును బ్రయోగించి రని వీ రంగీకరించినట్లే కదా. లక్షణము సాధించినరూపము లన్నింటికిఁ బ్రాసాదిగతప్రయోగములు దిద్దుటకు

వీని లేని ప్రయోగములు దొరకవలె నన్న నెట్లు? దిద్దుదు రని యేకవు లనుకొందురు? ఇక వైయాకరణులెవ్వ రే నందుకయి కావ్యము వ్రాయవలె. (వ్యా.సం.స.748) ఇంక నిక ప్రామాణికవైయాకరణు లెవ్వరును జెప్ప లే దనిరి. బహుశః నన్నయాధ ర్వణులు చెప్పలే దని యుద్దేశ్యముగా వచ్చును.

నన్నయాధర్వణు లు చెప్పకుండుట యన్నది విరోధము గాదు. "ప్రకృతసంద ర్భమున లకారమునకు బహువచనపరకత్వమునఁ గల్గునలఘుత్వము నట్టియెడల బహు వచనలకారమునకుఁ గల్గునలఘుత్వమును బంధితవ్యవహార సిద్ధములె యగును గాన వానికి వేఱువిధాన మక్కఱ లే దని భట్టారకుఁడు తలఁచియుండు (వ్యా.సం.స.734) ననిరి. మొనకలు, అనువాదియలఘుత్వమును గూడఁ బంధితవ్యవహారమువలననే తెలియఁదగు నని భట్టారకుఁడు తలఁచె నేమో. గోళ లన్నదయు నట్లే చెప్పవలె. ప్రాణ్లు అనుటో నన్నయ ధకారమున కలఘులకారము చెప్పలేదు గదా.

అనంతుఁడు ప్రాసవిషయమునఁ 'భాగ్యవంతుఁ డేలు సూకలు సూర్యలు ప్రోళ్ల లయ్యె బ్రాఁతె కూడు లిచటి' (ఛం.1.57) ననెను. ఇటఁ జివరిపాదమున నలఘులకా రము (ళ) నాదేశింపనిచో (ప్రోలు లయె బ్రాఁతె కూడు లిచట అని యుండ నీయది లఘుప్రాస మగును. (అసలు నాల్గుచోట్ల తప్ప) లఘుప్రాస మనంతుఁడు చెప్పలేదు. అనంతుఁ డప్రామాణికుఁ డనవలె నేమో.

"నేఁటిముద్రణములందును గొన్ని తాళపత్రమాతృకలందును నీసూత్రమునకు (చ్ఛి.18) లక్ష్యములు పెక్కు కన్పట్టుచున్నవి. బాలవ్యాకరణతదనుయాయిలక్షణ గ్రంథములవ్యాప్తిచే నిట్టిరూపములు గ్రంథముల కెక్కెనవో అట్టిలేఖనములచేతనే సూరిగారిక్కృతు లిట్లు సూత్రించిరో తెలియకున్నది -- పదినాళులేని, గోళులవాత్త మొగిళులు లేదయు. పైచోటులం దెల్ల పదినాఁడు లేనియు, గోరుల మొగిళులు, అనియె

కవిప్రయుక్తము లనుటలో క్షతి యేమియు లే (వ్యా. సం. స. 744) దనిరి. ముం దను మానించినను దుదకి ముద్రితప్రతులందలఘులకారము గలయిట్టివోట్లు బాలవ్యాకరణ తదనుయాయి గ్రంథములప్రభావముచేతనె యేర్పడిన దని నిశ్చయించి రన్నమాట. ఈనిర్ణయమునకుఁ దమసిద్ధాంతము తప్ప మఱి యొకయాధారము వీరివివరణమునుండి తెలియ వీలు లేదు. కాని యిది కొన్ని తాళపత్రప్రతులందును గల దనిరి. అదియు బాలవ్యాకరణప్రభావముచేతనే యగు నందురా? ఉన్న ప్రయోగములను దిద్ది (దిద్ద రాకున్న నప్రామాణికము లని) ప్రయోగములు లేవుగావున నీలక్షణము సరి గా దన్న సమాధాన మేమి ?

ఇతరలాక్షణికులు చెప్పకున్నను ప్రయోగానుసారముగా సూరి సూత్రించుట యుచితము. దానిం దిరస్కరించుట యనుచితము.

ఇఁక వీరిలక్షణమును బరిశీలింతము.

'ఉత్వలోపముచే 'బహువచనముతో శ్లిష్ట మగు నపుడే' రేఫమున కలఘులకారము వచ్చు ననిరి. 'అగునపుడే' యనుచోటియేవార్థకముచే సూరి చెప్పినట్లు లనురీతి రూపములు సాధువులు గా వని చెప్పుట వీరిలక్ష్య మనఁదగు.

కాని దీనివలన రేఫేతరములకు (పూర్వసూత్రముచే నత్వలోపము చెప్పఁబడిన డేలటరలకు బహువచనశ్లిష్టములు గాకపోయినను నలఘులకారము వచ్చు ననునర్థమున కవకాశము గల్గుచున్నది. తరువాతిసూత్రముచే బహువచనశ్లిష్ట మయినపుడు నిత్యము గాఁగా శ్లిష్టము గానిచో ననిత్య మని యర్థము గాదా?

తరువాతి సూత్రముచే వీ రెట్లును బహువచనశ్లిష్టము (లయినడకారలకారము) లకే యీకార్యము విధింపఁబోవుచున్నారు. కావున దీనిని బృథక్కరింప నేల? పైసూత్రముతోఁ గలిపి "బహువచనశ్లిష్టంబు లయినడకారలకారంబులకు నిత్యంబుగాను గొన్నియెడల రేఫంబునకు (వికల్పంబుగా) నలఘులకారం బగు' నని చెప్పుట లాఘవము గదా. దీనివలనఁ బై యనర్థము తొలఁగుటయుఁ బ్రయోజనము.

కొన్నియెడల ననుటచే తేర్లు ఇత్యాదుల నలఘులకారము లేకుండుట సాధింపఁబడు(ఉ 159) ననుట యుక్తమె. "ఊరులో ఊర్లు, ఊళ్లు (ఊళ్ల) 'అనురీతి వికార్యము ప్రవర్తించినస్థలములు." (ఉ.159) కాఁగా వికార్యము ప్రవర్తించుకొన్నియెడలందును వికల్పమే. కావున వికల్పముగ నగుటను వీరు లక్షణమున స్పష్టము చేయవలసినది. వీరిసూత్రమున అలఘులకారాదేశ మగును అనుచో 'ఆదేశ' శబ్దము వ్యర్థము.

వీరు అలఘులకారమును గూడ 'ల' అనియె చూపుచుందురు కావున సూత్రమున నలఘులకార మని చెప్పుట యవసరమా యని సందేహము. గసడదవాదేశ సందర్భమున వకారమును, యడాగమసందర్భమున యకారమును లఘు వని సూత్రమునఁ జెప్పెనా? యవలవల నీలకారమును లఘ్వలఘువు లోకేతీరుగ వ్రాయఁబడుచున్నవి గదా. హరి యతఁడు నిద్ర వోయె నిత్యాదులందువలె నిటఁ గూడ నుచ్చారణమునుబట్టి లఘు వని గ్రహింపవచ్చును. లఘ్వలఘుయరలవలవివరణమున రలడల కాదేశ మైనలకార మలఘువుగాఁ జెప్పఁబడినది గదా. కాఁగా నిట నలఘు వని ప్రత్యేకముగాఁ జెప్పకున్న నిబ్బంది యేమి?

ఏళ్లు :

'ఏళ్ళనీళ్ళను నొండె వేస్నిళ్ల నొండె' అనుపాఠము సరి కాదు. 'ఏర్ల నీర్ల (ళ్ళ)ను నొండె వేస్నిర్ల నొండె' అని కవిప్రయుక్తపాఠము' (ఉ.159) కవిప్రయుక్త పాఠమును పరుఖలవారే కనుగొనవలెను. అది మ తెప్పుటరు గానరాదు గదా. 'ఏళ్ల' అనుపాఠము సరి కాకపోవుటకుఁ గారణ మేమి? "మఱి కొన్నియలఘులకారాదేశము లానిస్థలములు. దారి-దార్లు అరు-అర్లు ఏఱు-ఏర్లు (ఉ.159) అని వీ రింతకు ముందిట నలఘులకారము లే దని నిశ్చయించిరి. కావున 'ఏళ్ల' అని యుండుటకు వీలు లేదు గదా. అందు కని యాపాఠము కవిప్రయుక్తము కాదు. 'ఏర్ల' అని యుండుటయె పరుఖలవారు సమ్మతింతురు గావునఁ గవిప్రయుక్తపాఠ మట్ల యున్నది. నీళ్ల అన్నది వీరికి సమ్మత మైనను ప్రాసయతికై యదియు 'వేస్నిర్ల' నని యున్నది. నడుమ 'నీర్ల(ళ్ళ)' ననుచో బాధ లేదు గావున నది యలఘులకారముతోనె కవిప్రయుక్త మైనది.

అసలు 'ఏరు'శబ్దమున కలఘులకార మేల కాదు? సం.లో ఏరుశబ్దములోనిది అకార మగుటంజేసి అఱు- ఆఖ్యలు అర్లు- అనుచోటులందువలెనె ఏర్ల అనురూపము

లభింపఁజాల దని పైని వ్రాయఁబడెను గాని ఏఱు ఏళ్లు (బాలసం.అజం.18) అను చెప్పిన నీవిషయము నిశ్చయ మనఁజాలము. (వ్యా.సం.స.748) అనిరి. 'ఏళ్లు' అని యుండ దని నిశ్చయించుట కిట విశేషముగా లభ్య మైనయాధార మేదియు వఝులవారు పేర్కొనియుండలేదు.

ఏళ్ళనీళ్లల నొండె వేన్నీళ్ళ నొండె'- పైవానిలోఁ గొన్నిట (ప్రాస, ప్రాసయతి స్థానము లేమో) ళ్ళ అనుచో ర్లు అనియె కవిప్రయుక్త మనరాదా యని సూరిపక్షమున సమర్థించిన సమర్థింప నగు నేమో కాని- (వ్యా.సం.స.742) అని యట నలఘులకారముతోడిపాఠమె యుండవలయు నని వీరు నిర్ణయించిరి. లేనిచో సూరి గోళ్లు అను రూపములు సాధింపకుండుట సరి కా దని వారు చేయువిమర్శకు నాధారము గాకుండఁ బోవుఁ గాన ఏళ్ల-నీళ్ల అనియె యుండవలసివచ్చినది. ఇట నది సమ్మతము గాకుండుటచే (నాపాఠమె పోయి కవిప్రయుక్త మగుచు వే ఱొకపాఠము ప్రవేశించినది. వఝుల వారిసిద్ధాంతముతోపాటు కవిప్రయోగమును మాఱవలసియుండును.

'అకారము గావున' నిచట నలఘులకారము రా దనుట యేల? ఉత్వలోపమయినపిదపనే రేఫ కలఘులకారమును వీరు చెప్పిరి. ఏఱులు-ఏర్లు అనుతీరుగా నుత్వలోపమును సాధించిరి. ఉత్వలోపముచే నలఘురేఫము లఘురేఫమె యగును. లఘురేఫమున కలఘులకార మెట్లును వచ్చును. ఏరులు-ఏర్లు-ఏళ్లు అగుటలో బాధయె లేదు. దీనివలన ఆర్లు నూర్లు ఇత్యాదులందును రావలసివచ్చు ననుబాధ లేదు. 'కొన్నియెడల' ననిరి కదా. స్వరలోపముచే శకటరేఫము సాధురేఫ మైనపుడు దాని కీకార్యము రా దని వఝులవా రిట స్పష్టము చేయులేదు. అట్లు చెప్ప నవసరమును లేదు.

సూరిమతమున అచ్చి.13.సూత్రముచే 'ఏఱులు' అని కాఁగా నుత్వలోపముచే 'ఏళ్ల అని యగుటలో బాధ లేదు.

త్రాళ్లు-కాళ్లు :

'బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయినడకారలకారంబుల కలఘు--వంబు నిత్యంబుగ నగు' (14) ననుసూరిలక్షణమును వీరట్ల గ్రహించిరి.

(ఉ.14సూ) సూత్రమున 'అద్విరుక్తంబు లయిన' అనుదశము గానరాదు. అయినను 'అద్విరుక్తంబు లనుటచేత తెడ్డు, గ్రుడ్డు, జెల్లు, కల్లు- మున్నగుశబ్దములం దట్లు లాదేశము గల్గ' (ఉ.158) దని వివరించుటబట్టి సూత్రమునం దీదశము వ్యాఖ్యాతలవారి మతమునను నుండు ననియు, ప్రమాదవశమున నిట సూత్రమున వది తొలంగిన దనియు గ్రహింపవచ్చు. కాఁగా నీసూరిసూత్రము యథాతథముగా గ్రహించి రనవచ్చు.

కాని వీరిమతమున నొకయిబ్బంది. అద్విరుక్తంబు లయిన- అనుటచే జెల్లు, కల్లు శబ్దములందువలె విల్లు ముల్లు, మున్నగుశబ్దములందును లకారమున కలఘులకారము రానేరదు. సూరి విల్లు లనుచో నుత్వలోపము లే దనుట సరి గా దని వీరు చేసిరి. (విల్లు+లు విల్ల్+లు-విల్లు) కాని యిట లకారమున కలఘువు మాత్రము రా దని సూరివలెనె నిర్ణయించిరి. కాన నయ్యది లఘువే. అట్టియెడల విల్లు అనునేకవచనాంతరూపము 'విల్లు' అనుబహువచనాంతరూపమును సమానము లగుట భేద మేమి? అట నలఘుత్వ మేసూత్రముచే సిద్ధించినది.? కాఁగా వీ రితఃపూర్వము విళ్లు, ముళ్లు అనురీతిగా నలఘులకారముతోఁ జూపినరూపములు (ఉ.157) వీరి యీ లక్షణమునకు విరుద్ధము లైనవి. చిం. సాధించిన దనుకొన్నరూపములను వీ రసాధువులు చేసి రనవలె.

నీళ్లు :

సూరి యీసూత్రముచే డకరలకారములకు మాత్రమే యలములకారమును విధించుటవలన రేఫమున కీకార్యము సిద్ధింపమి నద్దేశించి యిట్లనిరి. "సూరి చింతామణి సాధించిన(లోలః) (నీళ్లు(ళ్ళు)- ఊళ్లు(ళ్ళు)) మున్నగురూపములు సాధింపకుండుటయుఁ జింతామణిసమ్మతములు కానట్టియుఁ బ్రయోగప్రామాణ్యము లేనట్టియు నీళ్ళలు ఊళ్ళలు మున్నగువానిని సాధించుటయు వింతగా నున్నది. (ఉ.159) యనిరి. గోళులు, నీళులు ఇత్యాదు లసాధుత్వము నింతకుముందే గుర్తించితిమి. గోళ్లు అనురూపములు బాల.సాధ్యములు గావా?

గోరు+లు అని యుండఁగా '18సూత్రముచే నలఘులకార మై గోళులు అని యగును. అపుడు 12సూత్రముచే నుత్వము లోపించి 'గోళ్లు' అనురూప మేర్పడుచునే యున్నది. ఇదియు నపూర్వ మగుమార్గము గానేరదు.

సూత్రమునందలి 'ం' అనునది కొన్ని యలఘుళకారములకును నుపలక్షణము. నూఁబు - నూఁబులు - నూర్లు.' (ఉ.188) ఇట్టి యలఘుళకారమును గూడ గ్రహింప వగును. ఇచ్చటి 'డలటర' యనువాన్నింటిలో ల,రలకే లఘ్వలఘుభేదము గలదు. కావున సూత్రమునందలి లఘులరలచే నలఘువులును గ్రహింపఁబడి యందు నుత్వలోపము చేయఁదగును. నీళులు నీళ్లు ఊళ్లు మొ॥ కాఁగా పర్వులవారు "సూరికి సమ్మతములు కా వనఁదగు ఊళ్లు నీళ్లు- వీర్లు (వీఁబులు) మున్నగురూపములు ప్రయోగదృష్టము లగుచున్నవి. (వ్యా.సం.స.789) యనుట సరి కాదు.



అట్టిచో డలలయెడను 18-సూ.చే త్రాళులు, మొసళులు అని కాఁగా నుత్వలోపముచేఁ బైరూపము లేర్పడును గదా. డలల కీసూత్రముచేఁ బ్రత్యేకముగా నలఘులకారమును జెప్ప నేల? అనవచ్చును. నిజమే. కాని 13సూ.చే నలఘుళకారము బహుళము గావున రాసిపక్షమునందుఁ ద్రాడులు, మొసలులు అని యుండఁగా 12సూ.చే డలలయందు నుత్వలోప మగును గావున నుత్తు లోపించి త్రాళ్లు మొసళ్లు అనురీతి నపరూపము లేర్పడును. గోళ్లు అనుచో రేఫవిషయమున గోర్లు అనురీతిరూపాంతరము గలదు గాని డలలయెడ నట్టిరూపాంతరములు లేవు. రేఫమునకు నీళ్లు, నీళులు, నీర్లు నీరులు అని అని నాల్గురూపము లగుచుండఁగా, డలలకు మాత్రము త్రాళ్లు, త్రాళులు, త్రాడులు అని మూఁడేసిరూపము లగును. ఇంకను డకారలకారములకువలె రేఫమున కలఘులకారము సార్వత్రికమును గాదు. తేర్లు, ఆర్లు మొ॥ ఇటుఁ దేళులు, దాళులు అనురీతిరూపములును లేవు. అనఁగా నుత్వము లోపింపకముందు దేశబద్ధమున రేఫమున కలఘుళకారము గల్గుచున్నదో యనునే గోళ్లు ఇత్యాదిగా బహువచనశిష్ట మయినస్థలమందును రేఫస్థానమున నలఘ్వలకారము గానవచ్చుచున్నది (నీళులు- నీళ్లు, పేళులు- పేళ్లు-ఇత్యాది.) దీనిం బట్టియు నలఘుళకారమునం దుత్వలోపము చేయుటచేతనే గోళ్లు అనురీతిరూపములు సాధించుకొనఁదగు నని స్పష్ట మవుచున్నది.

డలల కట్లు గాక 13సూత్రమందలిబహుళపదముచే నెట నేని డలల కలఘులకారము రాకున్నను 12సూ.చే నుత్వలోప మయినపుడు మాత్ర మలఘులకారము తప్పక వచ్చును. సిడులు, మామిడులు అనువానికి సిళులు, మామిళులు అని రూపములు

లేవు. కాని యుల్లోప మైనమాత్రము, నిల్లు మామిళ్లు అనుతీరుగానలఘులకార మగును. కావున దంత కలఘులకార మయినపుడే యుత్వలోపముచే నిట్టిరూపము లగు నన వీలు లేదు. (సూరియె పిప్పళ్లు, పిప్పలులు అని చూపుట గమనింపవచ్చు.) మెఱుఁగుఁబ్రత్తి విత్తు నాఁగఁ బొక్క లెంతయు నుల్లసిల్లె (క. కా. 8.12) దీనికి విత్తులు అనురూపము గానరాదు.

కాన రేఫమునకు (ప్రత్యేకముగాఁ జెప్పకుండుటయు) దంతకు విధించుటయు సహజము. సూరి యట్లు చెప్పుట యుచితము. గళ్లు అనురీతిరూపములు బాలసాధ్యములుగా వచుట యసమంజసము. కావున సంయుక్తె పరవులవారు సూత్రించుట యనవసరము. (ఉ. 13సూ)

మొత్తముమీఁద సూరిలక్షణ ముచితమే.

పరవులవారిమతమున దోషభేదము. "ఇచట (యీ?) వీయలఘూచ్చారణమునకు వేరుగ విధి యనావశ్యకము. ...లోకవ్యవహారప్రసిద్ధము. కావునె చింతామణిలో 'రోల' అని రేఫమాత్రమె యాదేశము విధింపఁబడె'(ఉ.160) ననిరి. అలఘూచ్చారణము లోకప్రసిద్ధము గావున శాస్త్రమున విధింప నక్కఱ లే దని యభిప్రాయము. అందుకే చిం. రేఫమాత్రమె లఘుత్వము చెప్పెను. (గుడులు గుళ్లని యప్పటిరూపములు?) బా.వ్యా. దకారమునకును లకారమును జెప్పెను. కాని యిరువురు లఘుత్వమును జెప్ప లేదు. ఉద్ద్యోతమున మాత్రము వీరు నన్నయాధర్వణులమతము ననుసరింపలేదు. ఇచట నలఘువును వీరు విధించిరి. అట్లు విధింపక లోకప్రసిద్ధము గదా యని నన్నయాథర్వణులవలె నుపేక్షించిన లోకమునందు 'ళ'కారోచ్చారణము ప్రసిద్ధము గదా. అది యసత్యమేమో యని తోఁచును. మఱి యలఘూచ్చారణవిధి యనావశ్యక మని యుంటె చెప్పి దానినె వీరు విధించుట విశేషము. నన్నయ లాదేశమునె చెప్పె నని నేమొ? ఆదేశించినలకారము లఘువె యనవలె. నన్నయ లఘువునె యాదేశించినను నది యలఘు వెట్లయినది. 'ద స్త్వచజౌ గురురలౌచ బిన్దుయుతౌ' యని లఘ్వలఘులకారములను లిపిలో భేదమును జెప్పెను గదా. మఱి లఘువునె యెట్లాదేశించెను. పరవులవారిసమన్వయము సముచితముగాఁ గుదురుపడదు.

పోఁడిమి-పోణిమి యనుచో నెట్లు తలఁచెను. కాఁగా స్థిరపరకబిందువు లేదని స్థిరము నాదేశము చేయుట పూనరాదు. స్థిరము పరముగా నయినపిదప బిందువు స్థిరమునకు ముందుండుటకు వీలు లేదు గాన నాబిందువు లోపించు నని గ్రహింపవలెను. వేసంగి-వేసవి ఇత్యాదు లిట్లే కదా. ఇట నదే పద్ధతిలో ఏండ్లు అని యుండ దకారమునకు ళకారాదేశము చేసి ఏంళ్లు అని కాఁగా స్థిరపరకబిందు వుండదు గాన నాబిందువులోపించి 'ఏళ్లు' అని యగును. కాఁగా తె.వ్యా.(131-138) పేర్కొన్నట్లు గుంళ్లు అనురీతి రూపము లుండ వవి లక్షణవిరుద్ధములే. కాని ఏళ్ళు పళ్ళు అనురీతివానిని లక్షణవిరుద్ధము లనుట కవకాశము లేదు.

విల్లు పట్టిన పదునేను 'నాల్ల(ళ్ల)లోన అనుప్రాసప్రయోగముచే నారూపమును మాత్రమె యంగీకరింపవలె ననిరి (వ్యా.సం.స.758) సూరియు 'నాళ్ళు' అనురీతిని నీ.చం.లోఁ బ్రయోగించెను.

వేసఁగి, పోఁడిమి మున్నగువానిలో స్థిరవర్ణాదేశము దీక్షితము కాఁగా వేసవి పోణిమి అనువానిలోని బిందువు లోపించినట్లును 'నాండ్లు అనుదానిలో నైతము ళాదేశము నకు ముందు నిలువఁజాలక బిందువు లోపించె నని యర్వాచీనకవి యగుధూర్జటి తలంచె నని గ్రహింపనగును."(వ్యా.సం.స.748) ధూర్జటి యీదృష్టి యంతయు శాస్త్రోక్త మై సలక్షణ మై యున్నది. తద్భిన్నముగాఁ జెప్పుట యలాక్షణిక మనుట తప్పు గాదు.

సం.లో 'రెన్నాండ్లు, ఇన్నాండ్లు అనియు భట్టారకునిచేతను సోమయాజిచేతను బ్రయోగింపఁబడె నని విశ్వసింపనగు' (వ్యా.సం.స.747) ననిరి. కాని వీరందె పుట 384లో రెన్నాళ్ళు అనియె చూపిరి. కాని నైని ధూర్జటికిఁ గలశాస్త్రీయ మైనదృష్టి లాక్షణికునకుఁ దగునన్నయకును లేకపోయె నేమో? ఉన్నచో 'రెన్నాళ్లు' అని ప్రయోగింప రాదా? రెన్నాండ్లు అనియె యేల ప్రయోగింపవలె.

'సబిందుకము లగుటచేత తృతీయే ప్రథమే వర్ణే అనుసర్వణసూత్రపు) నియమముచొప్పునను బా.సంజ్ఞా.16 సూత్రముచొప్పునను రెన్నాంళ్ళు, న్నాళ్లు మున్నగురూపములు వ్యాకరణసంప్రదాయవిరుద్ధము లనఁగును. '(వ్యా.సం.స.748) స్థిరపరకబిందు వుండరాదుగానరెన్నాంళ్లు అని యుండుట లక్షణవిరుద్ధమె. కాని రెన్నాళ్లు

అని యుంట విరుద్ధ మగు టేమి? వేసవి, పోణిమి యన్నవి లక్షణవిరుద్ధములు గాక 'వాల్లు' అనునది విరుద్ధ మగుట యెట్లు గుదురును?



ఇట శాదేశ మిష్టము గాకున్న వేరుగాఁ జెప్పుకొనవలెను కాని బిందుపూర్వకస్థితము లేదు గావున ననుకారణముచే నాదేశమును వారించుట సరికాదు. అసలు బిందువు శాదేశమునకు బాధకి మెట్లగును? పోణిమి యిత్యాదులకు భిన్నముగా నిటనె యాస్థితి యేల.

12. సూత్రముచే నుత్వము లోపించి (గుండులు) గుండ్లు అని డకారము బహువచనశ్లిష్టము కాఁగా 14 సూ.చే శకారాదేశ మగుట కవరోధ మేమి? లక్షణముచే నవకాశము లేకపోలేదు. ఆబిందువుపై డకారమునకు శకారము సమ్మతము గానిచో నట్టి లక్షణమున స్పష్టముగాఁ జెప్పవలె.

### బహువచనము-శ

సూరికంటె నధికముగ వీరీ లక్షణమున నొకయంశమును జేర్చినిరి. "అలఘు లకారపూర్వక (అవ్యవహితపూర్వక) సంయుక్తలఘులకారం బలఘులకారం బగు' (అవ్యవహితపూర్వక-) సంయుక్త అనువిశరణము వ్యర్థము. (వ్యవహితపూర్వమై) సంయుక్తము గాకున్న లఘులకారమున కలఘువు రా దని చెప్పుటయే యనవలె. అనఁగా గోళులు, మొసళులు, ప్రాళులు ఇత్యాదులందు స్వరముచే వ్యవహిత మై సంయుక్తము గాకున్న యలఘులకారముపై లఘు వలఘువు గాకుండుట ప్రయోజన మనవలె. కాని వీ రట్టిరూపము లంగీకరింపలేదు. సాధించి సూరిలక్షణమును దొలఁగించిరి. కాఁగా గోళ్లు, ప్రాళ్లు మొసళ్లు అన రీతిగా నలఘులకారము బహువచనముతో సంయుక్తమయియే యుండును. గోడ(లు) ప్రాకు(లు) అనుచో లకారమె లేదు. మొసలు(లు) అనుచో లకార మున్నను నది యలఘువు గాదు. అలఘులకార మీస్థలమునఁ దప్ప మఱి యొకచోట లేదు. కాఁగా నెప్పుడు నలఘులకారము బహువచనముతో సంయుక్తమయియే యుండును గాని వ్యవహిత మైయుండదు వీరిమతమున. సూరిమతమున ప్రాళులు అనునీతిరూపములు గలవు కావున నాతనిపక్షముననే (వీరు చెప్పినట్లు) కావలెను కాని వీరు '(అవ్యవహితపూర్వక) సంయుక్త' యనుట వ్యర్థము. కాన దీనివలన

వీరు స్త్రాంతలు అనురీతియావములు గల వని యుగాలకొలందురా? (వ్యా.సం.స.282పుటలో ఒడళులతో అని చూపి పిదప ఒడలులతో అని యుండవలె నని సవరించుకొనిరి. (చూ.సవరణములు.పుట.7) కవిప్రయోగ మెత్తి వ్రాసికొనునప్పు డిట్టిభేద మేల కలిగెనో వ్యా.సం.స.132లో మెయిళులు అని తిక్కనప్రయోగమును జూపిరి.

ఇచ్చటి లక్షణమున లఘులకార మనఁగా బహువచనలకారమె. అలఘులకారము బహుత్వమునకె యగుచున్నది. కావున 'సలఘులకారముమీఁదిలకారమునకు' అని సూత్రించుట లాఘవము. అలఘులకార మన్నది వే ఱొక వర్ణము కాదు. లకారమె యుచ్చారణముచే నలఘు వగు. కావున లకారం బలఘులకారం బగు ననుటకంటె లకారంబున కలఘుత్వం బగు ననఁదగును.

మొత్తముమీఁద గోళ్లు, మొసళ్లు, త్రాళ్లుఅనురీతిస్థలములందు బహువచనలకారమున కలఘులకార మగుట పరులవారినిశ్చయము. (గోలు మొ॥) సూరిమతమున బహువచనలకార మట్లె యుండును. కేతన పెద్దిరాజులలక్షణములనుబట్టి వీ రిట్లు చెప్పి యుందు రనవచ్చును. కాని వీరిమతమున లఘ్వలఘువులకు లిపిలో భేదము లేమి కాళ్లు అని యుండుచో నది లఘువో యలఘువో యుచ్చారణమునుబట్టియే తెలియవలెను. ఇది యుచ్చారణమునుబట్టి తెలియఁదగిన దగుట విధింప నక్కఱ లే దని వీరును బేర్కొనిరి. వీరివిధించినయలఘుత్వమువలన వీరిలక్షణమునఁ బ్రయోజనము గనఁబడదు.

సూరి బహువచనలకారమున కలఘుత్వము చెప్పకుండుటలో శాస్త్రమునకు సంబంధించి యుద్దేశించినప్రయోజనమునుగూర్చి పరిశోధింపవలసియున్నది.

ఎడ్లు :

ఈ రీతి కా.చూ. (9.90) ననుసరించి, ప్రస్తావించిరి— "ఎడ్లు, వడ్లు, నెల్లు దేవళ్లు అనువానిని సూరిప్రభృతులు సాధింపలే'(ఉ.160) దనిరి. ఇటఁ బ్రభృతు లన నెవరో. ప్రౌఢవ్యాకర్త గాకపోవచ్చును. ఏ లన ప్రౌఢ. ఎడ్లు, దేవళ్లు (శబ్ద.50) అనురూపములప్రక్రియను బేర్కొన్నది. 'నెల్లు అన్నది బాల. చేతనె సాధింపవచ్చును. (12సూత్రమునందలిబహుళశబ్దముచే నిట నల్లోపము) వడ్లు అనుదానిని ప్రౌఢ.ప్రదర్శించెఁ గాని ప్రక్రియ నిరూపింపలేదు. ఇంక వీరు కా.చూ.లక్షణమునుబట్టియు నింకను

వివరణమునఁ దెల్పిరి. కాని వీరి ప్రక్రియను నిరూపింపలేదు. 'దుత్వ ముబ్బు' అను కా.చూ.లక్షణము చూపి వీరు 'నెల్లు' అనునదియుఁ బ్రస్తావించుట విశేషము.

ఎద్దునకును పరికిని దుత్వ ముబ్బుటలో భేదము గలదు. (ఎద్దులు) ఎడ్దులు ఎడ్లు అని యటుద్వైరూప్యము గలదు. కాఁగా నిట దకారమునకు డకారము వికల్పముగా నగును. పరి + లు అనుచో రిసర్గము'మొత్తమునకు దకారము నిత్యము. ఇట పదులు, పరులు అని రూపాంతరములు లేవు గదా. కా.చూ.లక్షణమునఁబట్టి గాక వీరు స్వతంత్రముగా లక్షణము చేయుచు వీ లున్నమేర ప్రౌఢ.లక్షణమును జూపిన బాగుండెడిది.

'దేవళ్లు' అనుదానికి లక్షణమును జూపలేదు. వీ రుద్ధరించిన కా.చూ.లక్షణము దీనిని సాధింపలేదు. సూరిప్రభృతులు చెప్పకుండుటయు వరుసవారు చెప్పుటయు నన్నది యెట్లు సమన్వయించును? (వెడలు వెళ్లు, మడలు మళ్లు మొద లగునవి గూడ వీరు ప్రస్తావించిన బాగుండెడిది.)

### సమాసపదము-పూర్ణము :

సమాసపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు (15) ననుదాని నట్ల గ్రహించిరి. వివరణమున విశేషము. 'పయిరీతిని బహువచనపరకత్వమున నీవిధి యవ్యభిచరితమె యైనను దద్భిన్నస్థలములందు బాహుళముగా నసఁగా యథాప్రయోగముగ నెన్నఁదగును మాఁడుచు-మాడ్చు. ఇట బిందులోపమె (ఉ.161) యథాప్రయోగము (బహుళముగా నసఁగాఁ బ్రయోగాను)గుణముగ బిందు వగుట కాకుండుట ము న్నగుప్రవృత్త్యాదులుగా గ్రహింపఁదగును. తీఁడిరించు-తీఁద్రించు అనుచో బిందువు నిత్యముగనె యగుచున్నది. సూత్రమున నీకార్యము బహువచనస్థలములయందే యని నియమింపలేదు. కావున నీయది సూత్రముచే సామాన్యముగానె సిద్ధించుచున్నది. మాఁడుచు-మాడ్చు' అనుచో బిందులోపమునకై బహువచనేతరస్థలములందు బాహుళ మనవలెనా? సూరి సూత్రాంధ్రవ్యాకరణములో సర్వత్ర శ్లసంయోగే సమానపదే- దలసంయోగే ఇతి కిమ్ మాడ్చు అత ఏవ న పూర్ణ అని వివరించెను. బిందులోపము చెప్పినజాడ లేదు. అయ్యు బహువచనేతరస్థలములం దీవిధి బాహుళ మగునర్థ మెట్లు చెప్పుదురు? సూత్రమున దాని కవకాశము లేదు. ఇందుకలు

సూత్రముననే బహుళపదమును జెప్పఁదలఁపరాదు. స్పష్టముగా నిరూపింపఁదగినలక్షణ మస్పష్ట మగును. ఇఁక విశేషముగా వివరింపవలెను. అట్టియెడల 'మాఁడుచు మాడ్చు ఇట బిందులోప మని వివరింపఁదగు. బహుళపదమునకై వే ఱొకరూపము గానరాదు. ఉన్నఒక్కదానిని పేర్కొన్న స్పష్టతయు నుండును. బహుళపదావసరమును లేదు. ప్రకీ.17సూత్రమునందలిబహుళపదముచే నిట నుత్త్వము లోపించునపు డుత్త్వముతో పాటు ముందర్ధఖండమును లోపించు నని గుర్తించిన నిటఁ బ్రస్తావింపనవసరమె లేదు.

రలేతరసంయుక్తస్థితియు నందు ఖండము పూర్ణ మగుటయుఁ గల దేమో పరిశీలింపవలె.

విండ్లు :

'ఔపవిభక్తికలివర్ణసలలు పూర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడుకారంబు బహుళంబుగా నగు (16) ననుసూరిసూత్రము నట్ల గ్రహించిరి. వివరణమున విశేషము. "ఈసూత్రపు వివరణమున సూరి ఇల్లు ప్రభృతిసలలు వర్ణంబులకు బిందుపూర్వకడుకారము రానిపక్షమున అచ్చి.12,14సూత్రములచొప్పున ఉల్లోపము, అలఘులకారాదేశమును నుదాహరింపలేదు. బహుళవిధానఫలముగ నట్లు చేసె నేమో (ఉ.162) ఉత్వలోపాభావమును అచ్చి-12 సూత్రమునందలిబహుళపదమునకు ఫలముగానే గుర్తింపవలెను. అలఘులకారాదేశాభావము బహుళపద ఫలమె ట్లగును? ఇట నుత్వలోపము లేనిదే బహువచనశ్లిష్టతయు లేదు గావున అచ్చి.14. సూత్రముచే నలఘులకారాదేశప్రాప్తియె లేదు. ఇంతను నందు 'అద్విరుక్తంబు లయి' యనియుఁ జెప్పఁబడినవి. బహుళపదము నాశ్రయించుట కలఘులకారమును విధించిన అచ్చి.14సూత్రమున బహుళపదమె లేదు. 'నిత్యంబుగ' నని యున్నది. కావున వర్ధు లవా రిట నలఘులకారమ్మునని బహుళపదమునకు ముడి పెట్టుట సుదూరము.

ఈరూపములు వీరిలక్షణముచే మాత్ర మేర్పడునా? అచ్చి.12.సూత్రముచే నిట (సూరికి భిన్నము) వీ రుత్వలోపమును జేసినను అచ్చి.14 సూత్రమునందలిఅద్విరుక్తంబు లయి యనుదళముచే 'గ్రుడ్లు, తెల్లు (ఉ.159) అనుచోటులందువలెనె యలఘులకారమసలెరా వరాకుండుటకు వీలు లేదు గదా. వీరిమతమున నలఘులకార మయినను

రూపము 'ముల్లు' అనియు యుండును. తమమతమున ముల్లు అనునేకవచనాంతమునకును బహువచనాంతమునకు నలఘులకార మయినను 'ముల్లు' అనియే యుండి భేదము లేదు గావున నలఘులకారమును దాము చెప్పనక్కఱ లే దని యెంచి రేమో. లోకవ్యవహారమునుబట్టియు లఘుత్వము సిద్ధించును లె మ్మన్న అచ్చి.14సూత్రమున 'లకారము' ప్రస్తావించుట వ్యర్థము.

కాఁగా సద్విరుక్తము లగుతెల్గులికి ల్లుశబ్దములం దెట్లు రా దనిరో (పు.159) యట్లే ఇల్లు, విల్లు, ముల్లు శబ్దములందు నలఘులకారము వీరిలక్షణము ననుసరించియు సిద్ధింపదు. అట్టియెడల వీరు "ఇల్లు-విల్లు-ముల్లు మొ న్నగుశబ్దములకును ద్వివిధరూపంబులును గ్రహింపవలె (పు.162) ననుటయు ముళ్లు మొ న్నగురీతి నుదాహరించుటయు వారి లక్షణమునకును విరుద్ధములు. ఇట్టిరూపములు చిం.సమ్మతము లనుటయు సరి గాదు. ఇది గ్రంథాంతరమున స్పష్ట మగును.

అచ్చి.12సూత్రమునొద్ద సూరి "బహుళగ్రహణముచే విల్లులు పిల్లులు. పులులు ఇత్యాదులయందు లోపంబు లేదు" అని వివరించుటతో 'విల్లులు పిల్లులు' అనుచోటి ద్విరుక్త లకారస్థలమున కెల్ల నలఘులక్షణ మని గ్రహింపవలెను. కాక సద్విరుక్తములం దగ్గి మొదలనె లోపాభావ మని ముల్లులు ఇత్యాదిస్థలముల నుత్వము లోపించు నందమా. అప్పుడు 'ముల్లు' అని (బాలవ్యాకరణవారిమతమున వలె) బహుత్వమునను రూప మగును. అచ్చి 14.సూత్రమున సద్విరుక్తంబు లయి యనుటచే ద్విరుక్త (ల) కారస్థలమున నుత్వము లోపించినను నలఘులకారము రా వీలు లేదు గదా. ఉత్వలోపానంతర మొకలకారము లోపించి (ముళ్లు) యద్విరుక్తము యగుఁ గావున నలఘులకార మై ముళ్లు అను యను నగరాదు. అట్లు గ్రుళ్లు ఇత్యాదులందు నలఘులకారము రావలసి యుండును. స్వరలోపము వచ్చినఁ గాని బహువచనశ్లిష్టము గాదు. (బహువచనశ్లిష్ట మయినగాని యలఘులకారము రాదు.) స్వరలోపము వచ్చిన ద్విరుక్తస్థలమునకొకల్లు లోపించును. కావున బహువచనశ్లిష్ట మయినపుడు ద్విరుక్త మగుట యనుస్థితియే యుండదు. అట్టియెడల సూరి సూత్రమున 'సద్విరుక్తంబు లయి' యని చెప్పుట యనవసరము గదా. అచ్చి 12సూత్రమునొద్ద సూరి స్పష్టముగా లేకా. మునుపు ద్విరుక్తము నకుఁ బై నుల్లోపము లే దని పేర్కొనకుండుటలో విశేష మే మేని గానరాకున్నది.

## కొడవండ్లు :



'కొడవలిన (శాంతి.4.162) అను ప్రయోగమునుబట్టి 'కొడవలిశబ్దము భారతము నందనౌపవిభక్తిక' ము. , 'కావున భారతపక్షమున కొడవలులు- కొడవళ్లు (శబ్ద- తప్పు) కొడవళులు- అను మూఁడురూపములె బాలవ్యాకరణసాధ్యము లగును.' (వ్యా.సం.స.753) భారతమున ననౌపవిభక్తిక మయ్యు నితరత్ర యిది యౌపవిభక్తికమె కావున భారతేతరస్థలములనుబట్టి 'కొండవండులు కొడవండ్లు' అనురూపములు బాల వ్యాకరణసాధ్యముల యగును. ఇంక సూరి భారతలక్షణము భారతేతరలక్షణము నని కొన్నియెడల పంపులవారివలె) ఉ.సం.ధి.8సూ) వేఱు చేసి చెప్పువాఁడు గాదు గావున భాషాసామాన్యలక్షణము ననుసరించి 'కొడవండ్లు' అనురీతిరూపములు సాధారణముగనె సాధించె నను టుచితము. ఓం. కూడ 'ఔపవిభక్తికలీనా' మ్మనియె చెప్పినది. చిం. నన్నయకర్తృకము గాన భారతమున నిది యౌపవిభక్తికముగాఁ బ్రయోగింపఁబడలేదు గావున, నీరూపము చిం.సాధ్యము గా దనుకొనవచ్చును (వ్యా.సం.స.753) గాని సూరి లక్షణమున భారత భారతేతరవివక్ష తగదు.

## కొడవండ్లులు :

ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నొంయు' (17) ననుసూరిసూత్రమును వీరు "ఒకానొకచో నామంబు లుప్రత్యయాంత తుల్యం బయి లుప్రత్యయంబు నొందు' నని సూరిరచనాపద్ధతిలోనె సవరించిరి.

సూరిలక్షణమును డిరస్కరించుచు "చింతామణిసూత్రమును బ్రయోగమునుబట్టి ద్విరుక్తలుప్రత్యయమె నిల్వవలెను గాని డలసంయోగ ముండరాదు. 'లుః ప్రద్యుశ్యతే' అనుటచే 'లస్' అనుద్వితీయ నిల్వరాదు' (ఉ.162) అనిరి.

'కొడవండ్లు' అన్నది చిం.విరుద్ధ మని మొదటి నిర్ణయము. ఇందుఁ దప్పు లే దేమో. చిం. 'కొండవండ్లు' అనురూపమునె సాధింపలేదు. కొడవండ్లులు సాధింపక పోవుటలో వింత యే మున్నది. నన్నయకర్తృక మన్న నది తప్పుకపోవచ్చును. కాని 'యిండ్లు' మున్నగునవి చిం.సాధించినది. అటఁ గూడ ఇండ్లులు అని యుండరాదా? డలసంయోగ ముండరాదు. ద్విరుక్తలుప్రత్యయమె నిల్వవలె ననిరి. అది వారివచనము లకు మాత్ర మనుగుణమా?

నపరూపము లేర్పడవలసివచ్చును. ప్రమాదవశమున నట్టియర్థము నిచ్చుభాగము లుప్త మైన దేమో. కాని యది యవసర మని యుపేక్షించి రనలేము.



మొత్తముపై కొడవళ్లులు అనుదానికి 'కొడవండ్లులు' అన్నరూపము సాధువె. ఏండ్లు లివ్విధమున (శాం.6.224).

కొడవండ్లులను :

చిం. ఋః ప్రద్యుశ్చ్యతే యనుటచే 'లన్ అని ద్వితీయ రాదు గనుక సూరి కొడవండ్లుల ననురీతిని వేర్కొనుట తగ దని మతి యొకయాక్షేపము చేసిరి. అందుకె సూరి 'బహువచనంబు నెనయు 'ననఁగా వీరు లుప్రత్యయంబు నెనయు ననిరి. అనఁగా సంశ్లిష్టబహువచనాంతుల్యనామముపైఁ బ్రథమాబహువచనమే కాని ద్వితీయాదిబహువచనములు రా వన్నమాట.

కాని వీరియీసిద్ధాంతమునకు విరుద్ధ మైనకవిప్రయోగములను వీరే చూపుట యొకవిశేషము.

కన్నీళ్ళులు దొరుగ (ద్రోణ 4.333) వేళ్ళనీళ్ళుల నొండె (మార్కం.8) పై ద్రోణపర్వప్రయోగమునందు మార్కండేయపురాణప్రయోగమునందును నీళ్ళులు నీళ్ళుల అనువానిలో అపిసంయుక్త-- చొప్పున ళ్లు అనురూపమె కవిప్రయుక్త మనక తప్పదు. యతిప్రాసస్థలప్రయోగములు లభింపకున్నను నన్నయకేతనపెద్దరాజులు కంఠోక్తముగ సూత్రించుటయును-- (వ్యా.సం.న.742) అనఁగా నీళ్లుల అనే మార్కం.ప్రయోగమున నీళ్ళులన్ అనుచోఁ గూడ 'అపి సంయుక్త- చొప్పున బహువచన మైన దన్నమాటయె. నీళ్ళులన్ అనునది సాధు వైనపుడు కొడవండ్లులన్ అనునది యేల సాధువు గాదు? సంయుక్తసమాసముపై ద్వితీయాదిబహువచనములు నిలువ వనుట యెట్లు?

కాని వీ రాతర్వాత 'కోదండురయందు. ఆంధ్రులలోన్ మున్నగువానితోపాటుగ వేళ్ళులయందు, నీళ్ళులన్ మున్నగురూపములును నన్నయాధర్వణసాధ్యములు కావిం జేసి నిర్మూలముల యని చెప్పక తప్పదు అట్టిప్రయోగములును లేవు. (వ్యా.సం.న. 762) అనిరి. అంతకు ముందే మార్కం.లో నీళ్ళుల నను ప్రయోగము నీసూత్రముచే

సాధించినవిషయము మఱచిరి. కాన నదే ప్రయోగ ముద్ధృతమున వీరిసిద్ధాంతముతోపాటు మాఱిపోయి ఏఁబదీల్ల(ళ్ళ)ను నొందె నని మైపోయినది. (ఉ.159) నీళ్లను అన్నదే కవి ప్రయుక్త మైనచో సం.లో 'అపి సంయుక్త'సమాప్త్యనుదానితో దీనికి సంబంధ మేమి? మ రేల చూపిరి. కవిప్రయోగములు గావలసినరీతిలో లభించుట వర్ధులవారి యదృష్టము గదా.

పైవాక్యములలోఁ గవిప్రయోగములకంటె నన్నయాథర్వణులలక్షణమునకె ప్రాధాన్య మిచ్చుట గమనింపఁదగును. 'సూరిగారు-- కొడవండ్లలను కొడవళ్ళలను (సూరి కొడవళ్లలను అని చూపును) అనువాని కేమి ప్రయోగప్రామాణ్యమును జూచు కొనిరో తెలుపలేదు. కొడవండ్లలు, కొడవళ్లలు అనువానికిఁ గవిప్రయోగములు దొరుక కున్నను క్షతి లేదు' (వ్యా.సం.స.764) ఈభేద మెందుకో స్పష్టము. నన్నయాథర్వ ణులు పేర్కొన్నదానికిఁ గవిప్రయోగము అక్కఱ లేదు. కవులు ప్రయోగింపకున్నను గ్రహింపకతప్పదు. కూఁతు మొద లగున విట్టే కదా. (త్రాళ్లు నీళ్లు కూడ నిట్టివే కావచ్చు.)--ఉపర్యుక్త సంశ్లిష్టరూపములపై లక్షణముయొక్క వాని లాగమముయొక్క కాని పునఃప్రవృత్తి నన్నయాథర్వణీయసాధ్యము కామింజేసి నిరాధారము. --మహాకవి ప్రయోగములా లేవు. నన్నయాథర్వణసమ్మతి యైన లే (వ్యా.సం.స.764) దనిరి. ఈవాక్యములనుబట్టియె వీరినిర్ణయము లెంతగా నాధారవంతములో గుర్తింపవలసి యున్నది. వ్యా.సం.స.739 పుటలో 'వేళ్ళనీళ్ళల' నని చూపినకవిప్రయోగమునందలి నీళ్ళలవంటివి కావా సూరి చూపిన'కొడవళ్లల'. కవిప్రయోగము లున్నను నన్నయా థర్వణీయసమ్మతికి (వానికి వీరివ్యాఖ్యానము) ననుగుణముగా దిద్దుకొనుచుండవలెను. కాని పొరవడి'నీళ్ళలు-నీళ్ళల కవిప్రయుక్తము కాక తప్పు దనిరి. (వ్యా.సం.స.742) ఏంతసేపు? వీరిసిద్ధాంతము మాటికి వెంటనె "కవిప్రయుక్తము కాకతప్పుటయుఁ దప్పును. ఈవివరణమునుబట్టియె వారు పిదపఁ జూపినపాఠము లెల్ల స్వయముగా దిద్దిన వని గ్రహింపవచ్చును.

నన్నయాథర్వణులు సమ్మతింపకపోవుట యన్నది యీసూరిలక్షణమును ధిక్కరించుట కాధార మెంతమాత్రమును గాదు. త్ర్యాద్యకేకారసంధి ము న్నగునవి

నన్నయాథర్వణులస్మృతి కనుగుణముగనె వీరు చెప్పిరా? ఇంక కవిప్రయోగము లన్నది ప్రధానము. కవిప్రయోగములు గల వని వారిపైవాక్యములవలననే స్పష్టము. కావున సంశ్లిష్టబహువచనాంతతుల్యనామముపై ద్వితీయాదిబహువచనములు చేరుట కవిప్రయోగానుగుణమె. నీళ్లల నగ్నిపుట్టిన దయ్యె(ఉ.125) చూపులుచూడ్కికి (ఉ.155) మొ॥ విశేషస్థలములు.

కోదండ్రుడురు :

కోదండ్రుడురు- కోదండ్రుడుఁన్ అనుదానిని సూరి యుదాహరింపలేదు. కాని వరుఖల వారివలె 'కోదండురు' -కోదండురన్ అనురీతిరూపములను సాధింపకుండుటచే నట్టి స్థలముల గోదండ్రుడురు అని యుండుట సూరిమతముగాఁ జెప్పవలె. ఇవి యసాధువు లని వరుఖలవారిమతమా.

"ఆహోబలపతి 'అపిసంయుక్త--సూత్రములోని'లు' అనునది రు ప్రభృతుల కుపలక్షణ మనుచు) 'రు' అనుపరుక్తబహువచనమును సాధించెను. ముఖ్యార్థబాధ లేనిదే (మహాకవిప్రయోగరూప)లక్షణకుఁ బ్రసక్తి యే మున్నది. ప్రామాణికులు-- రుప్రత్యయము నెవ్వరును జెప్పలేదు. (ఉ.158) ఆహో. 'సమాప్తవర్ణకాః కేచిద్దేశ్యే పునరపి శ్రుతాః' ఇత్యథర్వణోక్త్యా అత్రాపి లువర్ణస్యోపలక్షణత్వమ్ ఏతచ్చాచార్య స్యాభిప్రేతమేవ. నాకోదండ్రుడురయందు- ఇత్యాది తత్ప్రయోగా (కవి.482) త్తనెను. లువర్ణము ప్రథమేతరవిభక్తిబహువచనాదులకు నుపలక్షణ మని చెప్పుట యహో. అభి ప్రాయముగా 'కోదండ్రుడురయం' దనురూపము నిచ్చుటనుబట్టి గుర్తింపవచ్చును. బహు వచనము నెనయు ననుసూరిలక్షణమునకు నిది మూలముగాఁ జెప్పినఁ దప్పు లేదు. మహాకవిప్రయోగరూప మైనముఖ్యార్థబాధ లేమి లక్షణయే కుదుర దనిరి. ఆహో. కోదండ్రుడురయందు అనునన్నయప్రయోగమునే చూపెనే? నన్నయయు మహాకవి కాఁడా? "అచట తాళపత్రమాతృకలచొప్పున కోదండురయందు మున్నగుపాఠములు కవిప్రయుక్తము లయియుండును" (ఉ.163) తాళపత్రమాతృకలయం దెల్ల 'కోదండురయందు' అనియే యుండఁగా నహో. ఏ దైనముద్రితప్రతిని జూచి కోదండ్రుడురయం దనుపాఠము నేర్కొనెనా? (ఒకవేళఁ దాళపత్రమాతృకలలో కోదండ్రుడురయం దనురీతిగ నున్న 'తాళపత్రమాతృకలు తప్పులుతిప్పలు' (వ్యా.సం.స.) లోఁ జేరు. అహో.చూపిన పాఠమును తిరస్కరించుటకుఁ బ్రబల మైనప్రమాణము గానరాదు. కానఁ గోదండ్రుడు

రయుం దనుట దంగీకరింపబడినదే. అంతియ కాని కవిప్రయోగములను మార్చి 'ప్రయోగబాధ లేదు గావున, లక్షణమునకుఁ బ్రసక్తియే లేదు గాన, లుః ప్రదృశ్యతే యనుచో 'లు'వర్ణము రువర్ణకమున కుపలక్షకము కానేరదు (ఉ. 168) దనుట సరి గాదు.

ఇంకఁ బ్రామాణికు లెవ్వరును రువర్ణకమును జెప్పలే దనుటయు సరి యైన హేతువు గానేరదు. నన్నయాథర్వణులే ప్రామాణికులు (వీరు చేసినవ్యాఖ్య ననుసరించి యీయర్థము నన్నయాథర్వణసమ్మతమె. అహో. చేసినవ్యాఖ్య ననుసరించి 'లుః' అను నది యితరములకు నుపలక్షకము. కాఁగాఁ గోదండ్రురయుం దనురీతివి నన్నయాథర్వణ సమ్మతము లనియె చెప్పవలెను.

'లు' చెప్పరి గాని 'రు' చెప్పలే దనరి. చెప్ప నవసర మేమి? ఋమువులకుః ప్రథమా స్యాత్తనుచో రువర్ణము చెప్పఁబడలేదు గావున నది ప్రథమాబహువచనము గాదందుమా? లుప్రత్యయ మవు నప్పుఁ డాలు నందలి లకారమునకు రేఫ మగుట (త్రిక 'లుల'ల స్థానమున రురలు ఆదేశము లగుట) చే రు(ర) అనుస్వరూపము సిద్ధించుచునె యుండును. ఇంక రువర్ణమును బ్రత్యేకముగాఁ జెప్పవలసిన యవసర మేమి.

'కోదండ' అను ప్రాతిపదిక సంయుక్తసమాక్షిప్తము కాఁగా కోదండ్రుఁడు అని యగును దీనిపై ఆపి సంయుక్తసమాప్తః అనులక్షణము ననుసరించి ప్రథమాబహువచనము (జస్) 'లు' రాఁగా, కోదండ్రుడు+లు అని యగును. కోదలుశబ్ద మాలోపములలోనిదే కదా. దారాదులలోని (కోదలు) శబ్దమె యిట్టియుండి కావున దీనిపై లులలకు రురలు అవును. కోదండ్రురు కోదండ్రురయుందు మొ॥

అయినను లులలకు రురలగుచున్నవి కాని ముందు (అలు + రు అండ్రు) బిందుపూర్వకదకారము (రువర్ణమునుత్వలోపము) రాలే దేమని సందేహము గల్గును. దారాదేశ్చ 'లోః' అనుటచేతను నిట కోదండ్రుడు+రు అనుచో నున్నది రువర్ణము గనుక 'ండు' రా నవకాశమె లేదు. డాప్ రానిపక్షమున విధాత్రు + సు అని యుండఁగా 'తావుభారమేశసమా' యని విధాతృశబ్ద మీశతుల్యమైనను (ఈశశబ్దమున నత్వము గలిమి దాని కుత్వ మగు. ఈశుఁడు) ఋత్వమున కుత్వము రాక విధాత్రుఁడు అనియు

యగుట యిది స్మరింపఁదగును. కాలమునకు నిష్ణ గుర్తింపఁదగు.  (చూపఁబడిన అనుదానికి వీనితో భేదము గలదు నింతకు ముందే గమనించితిమి.)

కాఁగా రుపర్ణమును ప్రత్యేకముగాఁ బ్రస్తావింపవలసినయవసరమే లేకుండుటచేఁ గోదండ్రదురు అనురీతిరూపములు సమ్మతములుగా నగుట కిదియు నాధారము గాఁజాలదు.

కోదండురు-సాధువు కోదండ్రదురు-అసాధువు అని తాము నిర్ణయించుటనుగూర్చి వారే యిట్లనిరి. "అండురు- మున్నగువానిలో గేవలముఘువర్ణమె కల దని కాని, అండ్రురుమున్నగురీతి రేఫసంయుక్తడకారము గల దని కాని నిర్ణయింపఁజాలుయతిప్రాసాది స్థలగతప్రయోగము మహాకవిప్రయుక్త మని విశ్వసింపఁదగినది లభింపలేదు. అట్లయినను నీక్రిందిప్రయోగములు రెండువిధములలో నొకరీతివి కవిసమ్మతము అని నిర్ణయింపఁజాలును. పయిరీతిని నన్నయాథర్వణసూత్రములు కోదండురు అనురీతిరూపములు గల వని స్పష్టముగా వచించుచున్నవి. రుపర్ణకపునఃప్రాప్తికి నన్నయాథర్వణీయసమ్మతి కన్పట్టలేదు. కాన కోదండ్రదురు — మున్నగురీతిరూపములు సాధువులు కావనుటను సందేహింప నక్కఱలేదు. (వ్యా.సం.ప.762) మొత్తము మీఁద నట్టియాధారము లేకున్నను సూరిమతమందలి 'కోదండ్రదురు సందేహింపకుండ నసాధు' వనుటకు వీరు పేర్కొను 'కోదండురు' సాధు వనుటకు రెండు కారణములు పేర్కొనిరి. మొదట కొన్ని ప్రయోగము లిచ్చిరి. కాని యాప్రయోగములు చూపుటకు ముందే 'క్రిందిపద్యములలో ముద్రణసంస్కర్తలు 'ంద్రదు' రూపము నిల్పిరి గాని యవి ప్రక్షిప్తము' (వ్యా.సం.ప.762) అనిరి. ముద్రణసంస్కర్తలెల్లరు నిరాధారముగాఁ బ్రక్షిప్తములను గూర్చి రనుట విశ్వసింపఁదగునా? ఇది యాథార్థము గాదు. అని వారును గుర్తించిరేమో యాప్రయోగములు కోదండురు లేదా కోదండ్రదురు అనువానిలో నొకరీతివి కవిసమ్మతము అని నిరూపింపఁజాలునని. మఱి యట్లు చెప్పినవీరు నిస్సంశయముగా 'ండ్రదు' ముద్రణసంస్కర్తలు ప్రక్షిప్తము చేసిరట్లు నిర్ణయించుట సమంజసము కాదు గదా.

నన్నయాథర్వణులు కోదండురు అనురీతిరూపములే సాధించిరి గాన యదే సాధు వనుట ప్రధానమైనకారణము. ఇది సరి కాకుండుట కొంతయింతకు ముందు గ్రహించి

తము. గ్రంథాంతరమున విపులముగాఁ గనఁగలము. నన్నయాథర్వణులు సాధించినది 'కోదండ్రము' అనురీతిరూప దొక్కటె కాని కోదండము రనురీతిది గా దని బా.స. ప్రభృతుల వ్యాఖ్యలును నిరూపించుచున్నవి. అది తిరస్కరింపఁదగినయాధారము వీరు చూపలేదు.

ద్విపర్ణకఘనప్రాప్తికి నన్నయాథర్వణసమ్మతి లే దనుట రెండవది. ఇదియు నసంగత మగుట యింతకు ముందు గమనించితిమి. ద్విపర్ణకఘనప్రాప్తిని జెప్పుటచేతనే ద్విపర్ణరూపసిద్ధి యగుట స్పష్టము.

కాఁగాఁ 'గోదండ్రుడు' అసాధు వని నిస్సందేహముగా నెట్లు గ్రహింతుము? కోదండుడు సాధు వనుటకుఁ దగినయాధార మేది. ముద్రణసంస్కర్తల నెపపెట్టుట కంటెఁ గవిప్రయోగానుసారముగాఁ 'గోదండ్రుడు' అనురీతిరూపములు గ్రహించుట యుక్తము గదా.

వీ రూపక యతిప్రాసాదిస్థలగతప్రయోగము లే దనిరి. కాని యది యంత ముఖ్యము గాదు. నన్నయాథర్వణులు చెప్పి రని తమకుఁ దోఁచినఁ దప్ప యతిప్రాసగతము లైనను వీ రొప్పుకొందు రనునమ్మకము లేదు. రేఫతో యతి యున్న-'కోదండ్రు'(రు) అనెడు కవిప్రయుక్త మని పై నేదో యర్థవిశేషమున నుశబ్దమును జూపిన నేమందురు? కోదండ్రుడను అనురీతిద్వితీయాదిస్థలములలో 'ద్రు'వర్ణమున రేఫకు యతి యున్న నను నంగీకరింపక మార్గాంతర ముండదు. అట్టివి దొరుకుచున్నవి. ప్రాచీన ప్రామాణికలాక్షణికులు కావ్యము లీదృష్టితో వ్రాసిన నిట్టిస్థితి సంభవించెడి దేమో. ప్రాసస్థలమున నున్నసంయుక్తాసంయుతప్రాసముగాఁ జెప్పి నన్నయాథర్వణలక్షణానుగుణముగాఁ గవి కోదండురనురీతిగనే ప్రయోగించియుండు నందురు. (కోట్లు- విజ్ఞప్తి యనుబంధము ఉ.పుట.10)

కాఁగాఁ గోదండ్రుడు రూపము కవిప్రయోగానుగుణముగా సాధు వగుచున్నది.

కోదండ్రురయందు :

ఇట్టివానియసాధుత్వమునుగూర్చి 'అపిసంయుక్తసమాప్తః — అనుచెప్పిన కోదండ్రురలో మున్నగువానియందు సంయుక్తసమాప్తత యెట్లు గుదురును? ఛాయ

సమాసప్రవర్తకము రవర్ణ మయినఁ 'గోదండ్రరయం' దని యింకొకయపరూప మేర్పడవలయు ననిరి. ఇదియు నసంగతమె. రవర్ణకముతో సంయుక్తసమాస మగుట యెట్లు? ద్వితీయయం దైనను 'కోదండ్రను' అని యగును. అందుఁ జివర ద్వితీయాను వర్ణము గలదు గాని '్ర' అనుసంయుక్తము లేదు. (కోదండ్రయందురయందు నిత్వాదిగ నెట్లే నీవు చూపవలె.) పైఁగా కోదండ్ర(ను) అనుద్వితీయాంతముపై (అందు) సప్తమి యెట్లయినది? ఇది ఏకవచనమా? బహువచనమా? బహువచన మైన లాగమ మేది? ఏకవచనము రా వీలు లేదే. కాఁగాఁ 'గోదండ్రరయందు' అనునపరూప మేర్పడుటయు నసంభవమే.

ఈవిషయమును వరుభవారును గుర్తించియుందురు. పిదప నిట్లనిరి. "ద్వితీయాదిబహువచనపక్షమున నీవిధి ప్రవర్తించుటయే దుర్ఘటము. కోదండ్రురయందు, ఆంధ్రురలో మున్నగుచోటులందు అందు, లో మున్నగుప్రత్యయములు చేరకముందు సమాసప్రవర్తకత్వ మొఁగా సమాసప్రక్రియాకత్వ మెట్లు సంఘటిల్లును? అట్టియెడల అందు, లో మున్నగు ప్రత్యయములు ప్రకృతిని జేరినపిదప వానికి సమాసప్రవర్తకత్వము సిద్ధించునే కాని లాగమమునకును దదాదేశభూత మగు 'ర'అనుదానికి నెట్లు సిద్ధించును? (వ్యా.సం.స.762) దీనింబట్టి వీరింతకు ముందు కోదండ్రురునందు, కోదండ్రరయం దని యనిష్టరూపములేర్పడవలసివచ్చు నని చేసినప్రసంగ మసంగత మని వారిమాటలవలననే గుర్తింప వీలైనది.

ఈవివరణమునుబట్టి కోదండ్రయందు. ఆంధ్రలో అని యైనపిదప మఱల, నావిభక్తి యగుటయో కాకుండుటయో కాక కె.కోదండ్రయందు, ఆంధ్రలో ననుచో సమాసప్రక్రియాకత్వము (వరుభవారివివరణమునందలిది) కుదిరినది గాని సూత్రమునఁ జెప్పిన సంయుక్తసమాసత్వ మేది? సమాసము సంయుక్త మైనదా? కాలేదు గనుక, కోదండ్రయందు అనుదానిపై మఱల సప్తమీబహువచనము వచ్చుప్రసక్తియే లేదు. కాఁగా వేఱొకవిధ మైనయపరూపము ప్రసక్తియు (కోదండ్రయందురయందు) నిలక్షణము నొద్ద లేకన్నే కదా. 'కోదండ్రురయందు' అనురూప మేర్పడుటంగూర్చి యిబ్బందిగా వరుభవారు చేసినవిమర్శ యెల్ల నిట్లు నిర్మూల మైనది.

ఈ గ్రంథమునందే పై రెంటికి ముందు 'చూపులచూడ్కికి' అనియు నగపడు చున్నది. చూ. అచ్చు. 17 సూ'(ఉ.15) 'అనిరి. అది ప్రస్తుతసూత్రమె. కాఁగాఁ 'జూపులచూడ్కి' యన్నది ప్రస్తుతసూత్రములోఁ జేరియున్న కోదండ్రురయందు విరుద్ధమగుట యెట్లు?

ప్రథమాంతము (కోదండ్రుఁడు)పైఁ బ్రథమాబహువచనమును, (కోదండ్రుఁడు) ద్వితీయాంతముపై (కోదండ్రుని) ద్వితీయాబహువచన మనురీతిగా పరుల వారేవిభక్త్యంతము (సమాసప్రక్రియాకత్వము గలది) పై నావిభక్తి (బహువచనము) చేరవలసి వచ్చు నని తలంచి రేమో. కాని యట్టియెడల వారు చెప్పిన సమాసప్రక్రియాకత్వము కుదిరినను, సూత్రకర్త చెప్పిన సంయుక్తసమాసత్వము గుదురదు. అవి యీ సూత్రముచే నూహింపఁదగినస్థలములు గావని గుర్తించితిమి.

సంయుక్తసమాసత (సూరి చెప్పిన సంశ్లిష్టబహువచనాంతతుల్యత్వము) ద్వితీయాదులందుఁ గుదురదు. కోదండ్రులను. కోదండ్రులయందు. ఇవి బహువచనాంతములే కాని సంశ్లిష్టబహువచనాంతములు గావు. (ఇట్టి సంయుక్తసమాసములు గావు.) అట్టి స్థితి ప్రథమావిభక్తియందు మాత్రమే కుదురును. కావున సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి' (సంయుక్తసమాసమయి) యనుటచేతనె యట్టి ప్రథమాంతస్థలమె యగుట స్పష్ట మగుచున్నది. (కావుననే సూరి ప్రథమాబహువచనాంతతుల్య మని ప్రత్యేకముగాఁ జెప్పలే దనఁదగు.) షష్ఠ్యాదితోఁ బహువచనమే యనుసూత్రమునొద్ద నహో. షష్ఠీవచన సమాసే యని యర్థము చేయుట యెట్లు గదా.

ఇట్టి పౌతిపదికములపై 'బహువచనము' గలచోఁ బ్రథమయే యేమి? ద్వితీయాదిబహువచనములును గావా? అవియు నగును. హాల. తద్రూపములను గమనింపఁ దగును. చిం. లః అని ప్రథమా బహువచనమె యుదాహరించినను నిది యితరవిభక్తులకు నుపలక్షణ మని చెప్ప నగును. మహాకవిప్రయోగరూపముఖార్థబాధ యున్న నట్లు చెప్ప నగు నని మహాకవిప్రయోగములు (లే వనుచు) వారే చూపిరి కావున నహో వలెఁ బై రీతిని గ్రహింపఁగా చిం. లోని బాల.అర్థమే సిద్ధించును గదా.

చిం.లోనె భూయశ్శబ్దము లేకున్న బా గుండెడిది. కావుననె సూరి తనలక్షణమున నట్టియర్థమును దొలఁగించెను. (బః) సంయుక్తసమాసః అపి నామ్నః భూయః బః

ప్రపద్యేశ్వతే"- యనుచో ఉపసర్గముతో సంయుక్తమైన కొడవండ్లు, ఆంధ్రడు గోర్లు, నీళ్ల అనునివి నామములుగనె చిం. కూడఁ జేర్చియున్నరి. అట్టిచోటల వీనియందలి లుప్తవర్ణము బహువచన మగు టెట్లగునా? 'మూయః' అను చేత? కొడవండ్లు అనుప్రాతిపదికపై 'లు' అనుప్రత్యయ మైన దనియే చెప్పవలయును. 'లు' మొదలైన దను టెట్లు? కావున దానిని బట్టుకొని కవిప్రయోగముల నన్వధారింపఁజూచుట (యెట్లును దగదు.) మఱియు నసంగతము.

వాదమునకై యొకవేళ నన్నయాథర్వణుల దృష్టిస్థితిని ప్రథమయందు మాత్రమె యంగీకరించి యుందము. కవిప్రయోగానుసారముగా సహో. ప్రభృతులు ద్వితీయాది బహువచనములు నగు నని చెప్పుట తప్పు గాదు. అది గ్రహించుటయే యవసరము. సూరి దుల్కా మనె. చిం. ఆగదేమ. నన్నయపద బహువచనాంతమె యనక సూరి బహువచనాంతతుల్య మనుట తగ దందుమా? వీరిసూత్రమున నెక్కైనని 'సంయుక్త సమాప్తత' తొలఁగినది. అది నన్నయ కిష్టమా? అథర్వణున కిష్ట మనిరి. అట్టి దొకటియు వీరిట నుదాహరింపలే దేలకో.

చిం.వి.వి.లు కోదండ్రురయం దనురీతిని సాధింపఁజాల రని వాదమునకొఱకు యంగీకరించినను నట్టివి కవిప్రయోగానుగుణముగా లక్షణబద్ధము చేసినసూరిమతము దుష్ట మని తలఁపరాదు. ఆంధ్రుడు, కోదండ్రురయందు, వేఱుకాంద్రురకు మున్నగు వానిం గవిప్రయోగానుగుణముగా గ్రహింపఁదగును.

పై నైన నిష్టిరూపములఁ దిరస్కరించుటకు నన్నయాథర్వణులు చెప్పలే దన్న దొక్కటె ప్రధాన మైనయవరోధముగా నెంచ వలవచ్చును. అది యొక యవరోధమును గానేరదు గాన నంగీకరించుట యుచితము కాక యవసరమును. నన్నయాదుల ప్రయోగములలోనె యుట్టి సహో. ప్రభృతులు ప్రస్తావించిరి కదా.

మొత్తముపై నీసూరిలక్షణము సమంజసము వరుఖలవారు దానిని సవరించి విపరించినయంశములే సరి గాని గ్రాహ్యము లనరావన్నవి.

'కలన్వాదులనువర్ణంబు కుజ్ఞగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు'(18) ననుసూరిసూత్రమును వీరు 'కలన్వాదులనువర్ణకంబునకు బహువచనము పరం బగునపుడు కు జ్ఞగు' (ఉ.18,సూ) నని సవరించిరి.

కలన్ప్రభృతులలోనినువర్ణము ప్రాతిపదికావయవము. ఇవి త్రికములు అగుటం బ్రథమైకవచనము లోపించును. (ఇవి యౌపవిభక్తికములు కలనికి మొ॥) రేనుగోను శబ్దములందలి దానివంటిది. ఇట్టిదచ్చునువర్ణము ప్రత్యయము గానేరదు గావున వీరు దమసూత్రమున 'నువర్ణకంబున' కనుట పొరపాటు. సూరి 'నువర్ణంబున' కనుట యెంతయు నుచితము. కాక యప్పొరపాటున 'క'వర్ణ మధికముగా వచ్చి వర్ణము వర్ణక మైన దేమో యుద్యోతమున

సూరిలక్షణమునందలిదోషము నిట్లు పేర్కొనిరి. "సూరి యేకవచనపరవకత్వ మున కుజ్ఞ వికల్పముగ నగు నని సూత్రించెను. ఇందులకు మహాకవిప్రయోగ ప్రామాణ్యము లేదు. చింతామణివిరుద్ధము. ఆంధ్రభాషార్ణవకోశమునందుమాత్ర మేకవచన మున కుజ్ఞ గలదు." (ఉ.163) (వ్యా.సం.స.766,767) సూరి యేకవచనమున కుజ్ఞ వికల్ప మని తనలక్షణమున స్పష్టముగాం జెప్పలేదు. బహువచనము పర మైన పుడు నిత్య మనుటచేతను కలంకు కలను అని చూపుటనుబట్టియు నేకవచనస్థలమున వికల్ప మని వీ రర్థము చేసియుందురు. బహువచనము పర మైనపుడు నిత్య మనుటచే నేకవచనమున ననిత్య మని యర్థము. ఎట్లయిన కుజ్ఞ గలదు గాన కు జ్ఞయినరూప మును గూడ రానిదానితోపా టుదాహరించెను. అనిత్య మగుటం బ్రయోగానుసారముగా గ్రహింపవలసినదే కాని వికల్పస్థలమునవలె ద్వైరూప్యము సామాన్యముగా గుర్తింపు టకు వీలు లేదు గదా.

చిం.విరుద్ధ మగుట యేకత్వమునందలికుజ్ఞను తిరస్కరించుటకుం బ్రమాణము గాంజాలదు. కాని వీరు ప్రయోగప్రామాణ్యము లే దనుట విశేషము. అర్వాచీనులు భ్రాంతిలోం బ్రయోగించి రన్న ఆం.భా. అ.ను గూడ వీ రంగీకరింపలేదు. క్రీ.శ.1750 నాంటియాంధ్రభాషార్ణవమునం దున్న దనుటచే నంతకు ముం దిది లే దని వీరు చెప్పిన ట్లయినది. కాని వీ రి ట్లెట్లు నిర్ణయించిరో యస్పష్టము గానున్నది. ప్రమాంకుగములు

(ఉ.శ.59) అని తిక్కనయు ప్రయోగించె. ఇంకను నూతునెఱుంకు లంటి (దశ.2.36) కొలంకు కెలంకున (శృం.శా.3.40) డాకెలంకు (మను.4.26) ఆఁకొలంకునం గరఁగి (వసు.3.164) నెఱఁకు గాడ (రామా.3.131) విప్పొంకుఁ వలంకునన్ (రామా.7.176) మిన్నుకొలంకు (రామా.5-19) చీఁకటి ప్రమాఁకు ద్రాఁకు (పాం.5-67) తమ్మికొలఁకునకు (యయా.3.60) కొలఁకుం గనియెన్ (రాజ.2.121) కొలంకుకలంకం బొంద (భాగ.8.55) మున్నుగా భాగవతమునఁ బెక్కు ప్రయోగము లున్నవి. ఇవి పరవస్తువారు చూడనే లేదా. వీరు మహాకవులు కారేమో. ప్రయోగ ప్రామాణ్యము లేదని యేకవచనమున కుజ్ఞను దిరస్కరించుట సమంజసము గాదు గదా.

కాఁగా సూరిలక్షణము ప్రయోగానుగుణమును సముచితమును. పరవస్తువారి సవరణమె కవిప్రయోగవిరుద్ధ మై యగ్రాహ్య మైనది.

బహుత్వమందుఁ గొన్నియెడల గుజ్ఞ నుజ్జగించుటను గుర్తించియు (ఉ.164) వీరు కుజను నిత్యముగా విధించుట యుచితమె. ఇట్టియెడ దగుస్థలములనుబట్టి (విశ్వకర్మకు స్త్రీత్వము వలె) బహుత్వమందును కుజ్ఞ వైకల్పిక మనఁ (చిం. ననుసరించి?) యుండుట భాషాసామాన్యలక్షణమున కనుగుణ మైయున్నది.

ఏకవచనము-గుజ్ఞ

అట్లు రేనుగోనుశబ్దంబులనుఁ గుజ్జగు' (19) అను సూరిసూత్రమును వీరు 'అట్లు రేనుగోనుశబ్దములను ద్రుతంబునకు బహుత్వమున గుజ్ఞగు' (ఉ.19సూ.) అనిచూపిరి. (సూరివలె) 'అట్లు' అని పేర్కొనియు సూత్రమున మరల 'బహుత్వమున' అనుట పునరుక్తియె. అట్లు అనుటచేతనె పూర్వమువలె ననునర్థము సిద్ధము. ఆపూర్వసూత్రమున వీరు కుజ్ఞను బహువచనము పర మగునపుడు మాత్రమె విధించి యుండుటచే నీగుజ్ఞ గూడ నట్లె బహువచనము పర మైనపుడే యగుట అట్లుశబ్దముచేతన సిద్ధము. కావున నీపరవస్తువారిసూత్రమున నధిక మైయున్న 'బహుత్వమున' అనుపదము వ్యర్థము. (బహుత్వమున గుజ్ఞగుటవలన ల్వాదిప్రత్యయములు రాకయె యన్ని విభక్తులయందు బహువచనముగా గుజ్ఞ వచ్చునేమో యని సందేహమునకును నీపదము మూల మగుచున్నట్లు తోఁచు.)

సూరి కలన్వాదులకట్టెవలె రేఁగుగోఁగులగుట్టను గూడ నేకవచనము పరమైన పుడు నంగీకరించెను. దీనిఁగూర్చి వీరు 'దీని కేకత్వమందుఁబాక్షికగుట్టన యాంధ్ర భాషార్ణవము మాత్రమె యాధారము. గోఁగునారు మున్నగునవి యేకత్వగుట్టసాధకము లనరాదు. గోఁగులయొక్కనార గోఁగునార -- వేఁబ్రుటాకు మున్నగునవి లేవా? (ఉ.164) (వ్యా.సం.స.772) యనిరి. 'గోఁగునార'ను గూర్చి సమాసపరిచ్ఛేదమునఁ జూతము.

ఏకవచనస్థలమునందలిగుట్ట'నకు నాంధ్రభాషార్ణవమె మూలమనుట యసంగతము. "కొంకణము గోఁగును గనకంబు కేసరముఁ గ్రోవియు వావిరి పొన్న మావి యున్ (వసు.3-146) అనునది పశ్చిమమున నున్నది. కొప్పుగ్రేఁగున- పప్పు గోఁగున (వసు.2.149.రగడ అంత్యప్రాస.) గోఁగుపూ గొల యలరించె (పారి.2-70) రేఁగుపువ్వులరసం బాను నెట్లు (అర.6.341) కొండగోఁగును (విరా 4-20) రేఁగుఁ బం డ్లురియ వయ్యె (కల్య.2.197) సుపుష్పం బయ్యె గోఁ గంతలో (అము.5.129) కొండగోఁగు, గోఁగు రేఁగు (హంస.4.11) కొండగోఁగుఁ బువ్వు (నీలా.1.109) రేఁగుపండ్లపాటి (కళా-3.4, గోఁగుసంపెంగ (వై జ.2-14) మొదలుగా దీని కనేక ప్రయోగము లున్నవి.

కావున నేకవచనస్థలమున గుట్టను వారించుటఁ బూర్వలక్షణము ప్రయోగ విరుద్ధము. వీరు చూపిన రేఁగుచెట్టు ఇత్యాదులే యీగుట్టను నిరూపింపఁజాలి యున్నవి. కాఁగా సూరిలక్షణమే సమంజసము.

మీనులు :

'బహువచనంబు పరం బగునపుడు చేను పేను మీను శబ్దంబులనుపర్ణంబు లోపించు' (20) ననుదాని నట్లు గ్రహించిరి. "గండుమీనులన్ (కవిక.2-28) అనునపాఠము నంగీకరించి మీనుశబ్దనుపర్ణలోపము పాక్షిక మనరాదు. అచట గండమీలనున్ అని కవి ప్రయుక్తపాఠ మైయుండును.' (ఉ.165) (వ్యా.సం.స.778) లోపము వికల్ప మనుట సమంజసము గాదు కాని యున్నపాఠమును నిరాధారముగఁ గవిప్రయుక్త మనుచు దిద్దివేయుటయు సరి కాదు. ఇది మిక్కిలియరుదగుస్థలము. కావున సిద్ధానిని

గసనులు, ముసలమానులు ఇత్యాదులవలె విశేష్యప్రయోగముగా గుర్తించుట యుక్తము. మీనులు వీక్షించి మేను వెంచు (పం.1.226) మీనులఁ బట్టించి (కవిక.3.46)

'మేనుమీనుశబ్దములు ప్రాణివాచకములు గాన నౌపవిభక్తికములు గావు' (ఉ.165) అని వీరు సిద్ధయించిరి. కాని సూరి 'పెను మేనిం జూచి, వీరమేనితో' (సి.చం.94పుట) అనుతీరుగా నిత్యముగ జేసి ప్రయోగించెను. ఔపవిభక్తికములలోఁ బ్రాణివాచకములను సూరి యుదాహరింపలేదు కాని, ప్రాణివాచకము లౌపవిభక్తికములు గావని నియమించనూ లేదు. కావునఁ 'మేను' ఔపవిభక్తికమె యనఁదగు.

### రేప్రభృతులు :

బహువచనంబు పరంబగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు (21) ననుదానిని వృత్తులవారు బాగుగా విస్తరించి యిట్లు సూత్రించిరి.

బహువచనంబు పరంబగునపుడు 1. రేయిప్రభృతులయుపర్ణంబు లోపించును. 2. రాయిశబ్దపుయివర్ణమునకు లోపము గాని ఉ-తి అనువానిలో నే దేని యాదేశ మగుట గాని సంభవించును. 3. గోయిప్రభృతులతుదియివర్ణమునకు తివర్ణాదేశము నిత్యముగా నగును. (ఏకవచనమున నౌపవిభక్తిక 'తి' వర్ణము వక్ష్యమాణ మవును. అచ్చి.' 6.సూ) 4. నోయిశబ్దముతుది 'యి' వర్ణమునకు లోపము వైకల్పికము.' (ఉ.21 సూ)

ఇందలి మొదటియంశము సూరి చెప్పినదే కావున నాసూత్రము సర్దె యిచ్చి వీరు చెప్పఁదలంచినకొన్ని విశేషాంశములను వేఱుగా సూత్రించియున్న బాగుండెడిది. ఆపై సూరి చెప్పినలక్షణముతో వీరు విభేదించియుండలేదు. కావున వీరు చెప్పినవిశేషాంశములను బరామర్శింతము.

### రాతులు :

రాయిశబ్దమున యిలోపము గాని ఉ-తి ఆదేశములు గా నీయవు ననిరి. సూరి రాయిని రేప్రభృతులలోఁ జేర్చుట సరి గా దని వీరు లక్ష్యస్థలమున సూరితో విభేదించి రనవచ్చు. సూరి రాలు అనియే సాధించెను. వీరు విశేషముగా సాధించినవి రాళ్ళు రాతులు అనునవి. దీనింగూర్చి 'సూరి రాయిశబ్దమును రేయిప్రభృతులలోఁ

బహువచనాంతము మీఁదనే గాని మరల బహువచనప్రత్యయము చూపట్టమింజేసియు బా ళ్లనున దపరూపమె యయ్యెడి (అచ్చి.21.వ్యాఖ్య) సంశ్లిష్టబహువచనాంతము మీఁదనే కాక బహువచనమాత్రము మీఁదఁ గూడ రూపములు వేడుకకాండ్రులు అని మరల బహువచనప్రత్యయము గ్రంథములఁ గానంబడియెడి అని వ్రాసియు (అచ్చి 17. సూ) పీఠికావ్యాఖ్యాత పైరీతిని వ్రాయుట వింత (వ్యా.సం.స.77రి) అనిరి. కాఁగాఁ జూపట్టులువలెనే రాళ్లు అనుచోఁ గూడ లువర్ణముపై లువర్ణ మవుటను వీ రంగీకరించిన ట్లయినది గదా. పైఁగా వీరు తమయాసూత్రమున సంశ్లిష్టబహువచనాంత మని చెప్పియు నుండలేదు గాన నీరూపములు సాధింపఁబడునే గదా రాళ్ళు అనుదానికై చెప్పిరా. చూపఱులచూడ్కి యని చూపిరే అట్టె యిదియు. దీనిని మఱల సూత్రింప నేల? ప్రయోగములందుఁ గానదానివీనికై యిట్టిప్రత్యేకవిధాన మేల? ఇంతకు నధర్వణాచార్యులు చెప్పిరనునభిప్రాయముతోనే వీ రిట్లు సూత్రించి రని తెలియఁదగును. కానీ యాయర్థము సత్తి యనుట విచార్యము 'కేషాంచిద్బ్యన్తశబ్దానాంలుతిస్యాత్ యథోచితమ్ క్వచిత్త్యాదేశ ఏవస్యాత్ క్వచిన్నైవ ప్రయోగతః' అనఁగా - తివర్ణ మవుగోతులు ఇత్యాదులు 'క్వచిత్త్యాదేశ ఏవ స్యాత్ అనుదానికి లక్ష్యము లై యున్నవి. కేషాంచిద్బ్యన్తశబ్దానా మ్మనుదానికి లక్ష్య మేది? రాచ్చు అనున దొక్కటే వీరు చూపిరి. య్యన్తశబ్దానా మ్మను చోటిబహువచనమునకుఁ బ్రయోజన మేమి? ఇట్లు చెప్పినచొక్కస్థలమునందును 'తి' అనుదానికిఁ బ్రయోగములే లేవు. వ్యవహారమునందుఁ గానరాదు రాళ్లు అనుదానికి వీరును బ్రయోగము చూపి యుండలేదు. అవు నధర్వణుఁ డట్లు చెప్పియుండుఁ గాక. ప్రయోగములందు లేనిదానిని దొలఁగించి యనుసరణీయ మగుదానిని దమప్రజ్ఞాశక్తి ననుగుణముగాఁ జెప్పినను యుక్తమే కాక యనుసరణీయము. ఆ నధర్వణాచార్యులనిరోధమేమి? అధర్వణుఁడు కేషాంచిద్బ్యన్తశబ్దానా మ్మనఁగా వీరు రాయిశబ్దమున కనిరి. ఇది తడను గుణమా?

సూరి రూపములు అనునదే సాధింపఁబడలేదు. ఇవి యయుక్తములకోవలో, జేరుట గాన వైరుధ్యము లేదు.

"ముద్రణపుస్తకములు గ్రాంథికలేఖకులును భారతాదులలో వాళ్ళు జాతు లనువానిని దొలఁగించి రని చెప్పఁదగును. తాళపత్రమాతృకలలో రాళ్ళు అనురూపములు

దానికిఁ బ్రయోగము జూపియున్నారే కాని దోయులు అనుదానికిఁ జూపలేదు. సూ.ని. దోయి- బహువచనము దోయులు దోయి చూ. కుత్రచిన్నలోపశ్చ సూత్రాహోబలపండితీయ మన్నది. ప్రయోగము జూపలేదు. ఆహోబలోక్తియే దీని కాధారముగాఁ జూపుటకుఁ గారణము ప్రయోగము లభింపమి యేమో. కాఁగా దోయులు అను ప్రయోగమును జూపకయే వీరు వైకల్పిక మని నిర్ణయించుట సముచితము గాదు. కావున దీనిని సూరిగారు రేయిప్రభృతులలోఁ జేర్చుటయే యుక్త మని స్పష్టము. ఇంక వీరు చూపినఁ రేయి- రాయి దో యనియుడిటినిబహుత నోరిఁ దుద లుత్వ మొనఁగూడు రాలు దోలు నా (కా.సూ.8.90) - అను ప్రమాణము సైతము నిత్యలోపమునే చెప్పుచున్నది. దోయులు అనురూప మున్న దని గాని లోపము వైకల్పిక మని గాని వీరిట (వ్యా సం.వ.774) స్పష్టము చేయలేదు. కావున వడ్లిలవారియీవిధానము నిరాధారమనఁదగును.

మొత్తముమీఁద సూరిలక్షణముకంటె వీరు అధికముగాఁ జెప్పినయంశములు సముచితములు గావు. కావుననీయంశములు సూరి సూత్రింపకుండుటయె సముచితముగా నున్నది.

కూయిప్రభృతులను రేయిప్రభృతులలోఁ జేర్పకపోవుటవలన వాని కికార్యములు రా వని గ్రహింపవలెను. (ఉ.166)

'గోయిప్రభృతులలోఁ గొన్నింటికిఁ బ్రథమైకవచనమున గొయ్యి, చెయ్యి -- అనురూపాంతరములు గలవు. హొయి, హొయ్యి అనియుఁ గలదు. (ఉ.166) ఈవిషయమును ప్రౌఢ. (శబ్ద.105) పేర్కొన్నది, ఈసూత్రమును సూచించిన బా గుండెడిది.

వీనిలోఁ గొన్నింటి కేకవచనముననే యిలోపముతో రే(యి) వే(యి) నే(యి) చే(యి) అనురీతిరూపములు గానవచ్చుట విశేషము.

అఁదోఁక :

'బహువచనంబు పరం బగునపు డావుప్రభృతులం తుదియక్షరంబునకు లోపంబు విభాష నగు' (22) ననుదానిని వీ రట్లె గ్రహించిరి. 'ఆవుశబ్దమునకు సమాసమున మగాగమము గల్గును అఁదోఁక'(167) 'ఆవు' అని వుపర్ణాంతముగాఁ జూపుటయే వీరి యుద్దేశ్య మైన నిటఁ జెప్పుట యనవసరము. సంధి36,37సూత్రములయొద్ద నిది

సూత్రమం దెట్లును బహుళపద ముండనే యున్నది. దానిచే చెల్లియలు చెల్లెలు అని యత్వమును సాధింపఁదగు. చెల్లియలు అనుశబ్దమును శ.ర., సూ.ని. అంగీకరించినవి. కాని ప్రయోగములను జూపలేదు. సూరినిఘంటువు నీరూప మంగీకరించినట్లు సూ.ని. పేర్కొనుచున్నది. సూరి యాల్వాదులలో చెలియలు చెల్లెలు అనునవి చూపెను. వీ రిట్లు చెల్లె లనియు చూపిరి. చెల్లియలు - అనుదానిలో నియ కెత్వమగుటచేతనే యారూప మేర్పడిన దని తలఁచుపక్షమున మూల మైనచెల్లియలు చూపవలెనే కాని 'చెల్లెలు' అని యత్వరూపము చూపు టేల? 'చెల్లియండ్రు' అనురూపములు నివారించుటకా? అట్టియెడల చెల్లియలు అనుదానిబహువచనము రె ట్లుండును? చెల్లియళ్లు చెల్లియళ్లు చెల్లియలులు అనురీతి నుండునా? చెల్లియండ్రు అనురూపమే యుండునో - చెల్లెలు అనునది గాక చెల్లియ లనుదానినే యాల్వాదులలోఁ జేర్చుట యుక్తము గదా. ఇట్టి వివాదాస్పద మైన దానికై మార్పు చేసినవీరు తాము మాత్రము చెల్లియలు అనునీదానికిఁ బ్రయోగ మునే చూపలేదు. మఱి సూత్రము మార్చుట సంగతమా?

ఎటనే నిట్టిరూపము గానవచ్చినను సూత్రమందలి బహుళపద మిద్దానికి సాధక మయియుండఁగా ను దెచ్చుటను లేని శబ్దమధ్యమం దెత్వమును జెప్పినామాంతమం దగుట యను సామాన్యలక్షణము నస్పష్టము చేయుట యుక్తము గాదు.

కాఁగా నిట సూరిసూత్రము నిర్దుష్టమే యని స్పష్టము. సూరివివరణమందలి పొరపాటు నిట్లు పేర్కొనిరి. ఇయశబ్దమునందలి ఇకారలోపము (శబ్దమునందలి యికారమునొక్కలోపము) మత్తియశబ్దమందు మాత్రము గల దనుట సత్యవిదూరము. చివ్వియ, చిన్న, కన్నియ-కన్య, పల్లియము పళ్యము మొ॥ (ఉ.167).

ఈయభిప్రాయము సమంజసమే యని యంగీకరింపవలయును. అందుకే గదా ప్రౌఢ. 'మత్తియశబ్దేతరంబులయందును దఱుచుగా నిత్యలోపంబు చూపట్టెడి' నని. అసూత్రమును వీ రిట్లు సూచించియుండవలసినది. ఇట నథర్వణుఁడు 'యత్వంచాపి తద్భవే లఘుస్స్యోఽపి చ సంయుక్తః' అనురీతిగా ఇకారలోపము అత్వము యత్వము (784) అని చెప్పినను వీరు సూరిప్రభృతులమార్గము ననుసరించి యికారలోపముగాఁ జెప్పుట యుచితముగా నున్నది. లాఘవాద్యపేక్షతో నన్నయాథర్వణులు చెప్పిన

యంశములు సవరించి చెప్పుట పీఠిగ్రంథమునందు నిరూపింప సంకల్పించుటవలన మాత్రమే కాన వచ్చుచుండును. అయ్యు నీయంశముపై పీఠ సూరిని విమర్శించుటయుఁ దఱుచే యగుట వింత.



ఎవిశబ్దములచోట ఇయ నిల్చుటయుఁ గల దనువీరిసూత్రమునందలితరువాతి యంశము విశేషము. (శబ్దాంతమునందును శబ్దమధ్యమునందును గాక యుట) శబ్దము ఎ(ఏ) - అనురీతిగా నుండఁగా నాశబ్దము మొత్తము 'ఇయ' అనురీతిగ మాఱు నని యీవిధానము చెప్పుచున్నది.

అ తియ (అంతె) ఇంతియ (ఇంతె) అనునవి రెండే రెండు దీనికి లక్ష్యము లగుచున్నవి. వే ఱొక్కచోట నెత్వమున కియ వీరు చూపలేదు. రాముఁడే అనుచో రాముఁడియ యనురీతిగా రూపములు గానేరవు. 'ఏ'శబ్దము ప్రత్యేక మగుటచే (వ్యా.సం స.784) తత్సములపైఁ జేరినను నీకార్యము రా దనరాదు. అయ్యుఁ దమ్ముఁడియ (తమ్ముఁడే) యను నదు గదా. కావున అంతె ఇంతె అనుశబ్దములకు అని చెప్పకొనుట యుచితము. (చెల్లెలు - చెల్లియలు అనుచో 'ఎ'త్వమున కియ యయిన దన్నఁ గొంతనయ మేమో) కాని ఎవి అవధారణార్థకము లయిన ప్రత్యేకశబ్దములుగాఁ జూపుచున్నారు.

కావున నీరెంటికై (ఎల్లమొదల?) యిట్లు చెప్పరాదు. — ఇంక నీచోటఁ గూడ ఎవిలు రెంటికిని 'ఇయ' యగు నని చెప్పవలసినయవసరము లేదు. — అంతియ ఇంతియ అనురూపములను సాధించుటయే గదా, యిట నుద్దేశ్యము. ఎత్వమునకు 'ఇయ' యగు నని చెప్పినఁ బై రూపము లగుచునే యుండఁగా మఱల 'ఏ'శబ్దమునకు సైతము "ఇయ" విధించుటవలనఁ బ్రయోజన మేమి?

కాఁగా దీనికై ప్రత్యేకలక్షణ మవసర మని నిర్ణయింపలేము. (సూరి) సూత్రమందలిబహుళపదముచేతనే యన్యకార్యముగాఁ బ్రయోగానుసారముగా చెల్లెలు- అంతె ఇంతె అనుశబ్దములం దెత్వమున కియ యగుట గల దని చెప్పుకొన్న సరిపోవునే కదా!

అర్థవిశేషములందు శబ్దములపై 'ఇయ'- అనునదే యయిన దని చెప్పవచ్చును. కాని 'అట్టిదయ' మున్నగు రీతిగా నర్థవిశేషములం దాగమము పునరుక్తమై వచ్చుట

సంస్కృతానుకరణమునను సూరి చెప్పియుండడన్న సందుఁ దప్పేమి? ఇతర స్థలములందు లేదా? ఇట్టి యనుకరణము నిరర్థక మైనదా?



'సంస్కృతవైయాకరణులు ప్రక్రియాలాఘవమునకయి యట్టిసంజ్ఞ కల్పించుకొనిరి.' (పు.180) సంజ్ఞాంతకు సాధారణముగా నదియె ప్రయోజన మనవచ్చును. అట్టే ప్రక్రియాలాఘవమునకయి తెలుఁగువైయాకరణు లాసంజ్ఞను గ్రహించుటలోఁ దప్పు లేదు గదా. సంస్కృతమునం దున్న హేత్వాదులు తెలుఁగున లేక పోవచ్చును. సంస్కృతమునుండి స్వీకరించినసంజ్ఞలకు సంస్కృతమునఁ గల ప్రయోజనము లన్నియుఁ దెలుఁగున నున్నవా? కావునఁ దెలుఁగున సర్వనామములకు ప్రత్యేకత లే దని మొదలుగా (పు.180) వీరిచేసిన విమర్శ మాసంజ్ఞను గ్రహించుటకు బాధకము గాదేమో. సర్వనామప్రక్రియాపదంబుల (అచ్చ.26) మున్నగువాట్ల నీసంజ్ఞ యుపయోగింపఁబడి లాఘవమును దెలుఁగునను సంపాదించుచున్నదే కద. అట్టి యెల్ల యెడల నన్ని ప్రకృతులని చెప్పవలె నందురా?

ప్రత్యేక మైనప్రయోజనము నుద్దేశించుటచేతనె తెలుఁగుసర్వనామములు విలక్షణముగా నిరూపింపఁబడినవి. "వీరిమతమున 'తా' శబ్దము సర్వనామము తదర్థకఆత్మన్ శబ్దము సర్వనామము గాదు సంస్కృతమున ఏకద్విశబ్దములు దప్పఁ దక్కినసంఖ్యావాచకములు సర్వనామములు కావు. ఉభయవిధమతమున సంఖ్యావాచకము లెల్ల సర్వనామములె. (పు.181) సంస్కృతమున నాయాకార్యములసామ్యము ననుసరించి యాయాశబ్దములు సర్వనామములుగాఁ బరిగణింపఁబడి యుండఁగాఁ దెలుఁగున నేయే వానికిఁ బోలిక గలదో యట్టివి కూర్పఁబడినవి. సంస్కృతము ననుసరించి చెప్పిన 'సర్వనామప్రక్రియాపదంబులయు మహదా ప్రకృతిసంఖ్యావాచకంబులయు -- (అచ్చ.26) అనురీతిగాఁ జెప్పవలసినది. ఇవి సంస్కృతానుకరణమె కాని ప్రయోజనములే దని చెప్పవలసినదే. అన్నిప్రకృతులకు సర్వనామసంజ్ఞ నంగీకరింపలేదు తప్ప వీరు తాశబ్దమును' త్రిప్రకృతిసంఖ్యావాచకములను నన్నిప్రకృతులలోఁ జేర్పలేదా? ఇవన్నియు నొక్కచోటఁ గూర్పఁదగినవే కదా.

అయినఁ గార్యసామ్య మున్నఁ బరుపులకై స్వతంత్రముగా నింకొకసంజ్ఞ కల్పింపరాదా? సర్వనామసంజ్ఞయే యేల యనవచ్చును. సర్వాద్యర్థకము లగు అన్నిప్రకృతులు కొన్నియందు నుండుటచేత నిట్టివి సర్వనామములుగాఁ బ్రాచీనులు

చెప్పియు న్నారు గావునను) నాసంజ్ఞను స్వీకరించుట యుచితము. అవి యేవో నిశ్చయింపఁబడుటంజేసి వివాదములకుఁ బ్రసక్తియు నుండదు గదా. తెలుఁగున కుచితమగువిధముగా నాయాశబ్దముల నిందుఁ జేర్చుట సమంజసమే. కొంచెము భేద మున్నను తె.వ్యా. 'తెలుఁగులో సర్వనామము లన్నియు దేశ్యశబ్దములుగానే యున్న (187) వని పేర్కొనె.



కావున నిందలిశబ్దములు సంస్కృతానుగుణములు గావు నీసంజ్ఞ తగ దనుటయు నొప్పదు.

ఇం కొకభేద మిట్లు పేర్కొనిరి. 'సూరి' 'ఎల్లన్' అనునది యవ్యయ మని కంఠోక్తముగా సూచించెను. — (ప్రౌఢ — ఎల్లరు ఎల్లకన్ మున్నగునవి సర్వనామము లని — (ఉ.181) అవుఁ గాక. ఒకశబ్దమువిషయమున సర్వనామము, కాదు అని మతభేద ముండుటచే నసలు సర్వనామసంజ్ఞ చెప్పుటయే తగ దనవచ్చునా? శ.ర. ఎల్ల ద్రుతాంతమైన యవ్యయముగ (ఎల్లరు సర్వనామముగను) సూరివలెఁ జెప్పెను. అయ్యు సర్వనామసంజ్ఞ నంగీకరించి వివరించిన ప్రౌఢ వచనములచే నీ సంజ్ఞ తగ దని యెట్లు నిరూపింతురు?

ఇట్లె అంతాదులను సర్వనామములుగాఁ జెప్పకపోవుటయు (ఉ.181) సర్వనామసంజ్ఞ చెప్పరా దనుటకు హేతువు గాదు. ఇవి సర్వనామము లని భావించినసూరి యట్లు చెప్పకుండుట పొరపాటని వీరు చేర్చుకొనవలెఁ గాని సూరి సర్వనామసంజ్ఞ చెప్పుట తప్పన నేమి?

కావున సర్వనామసంజ్ఞను జెప్పుటయు నట్లు చెప్పిన ప్రస్తుతసూరిలక్షణమును సముచితములే.

'కొందొక' యనుసూరిప్రయోగముచొప్పున ఒకానొక యనునర్థమున దీనికవి ప్రయోగములు వెదుకవలసినదే" (వ్యా.సం.స.917.)సమా.78సూత్రమున వీరు ప్రయోగించిరి.

రెండులు :

ఇఁక వీరిలక్షణమును బరిశీలింతము.

అన్ని ఇన్ని ఎన్ని కొన్ని పలు పెక్కు-శబ్దంబులును, ద్విప్రభృతిసంఖ్యావాచకంబులయు మహన్మహత్త్వార్థకంబులు నిత్యబహువచనాంతంబులు అన్న్యాదులయ మహదర్థకంబులు (సమూహార్థకశబ్దములవలెనె) నిత్యైకవచనాంతంబు లగుచు బహుత్వమును బోధించును.' (ఉ.50.సూ) ఇది 'అన్ని మొదలగుశబ్దంబులాలును — మున్నగుసూరి వివరణవాక్యమునకు వివరణాత్మక మైన సూత్ర మనవచ్చును.

సూరి అన్ని ప్రభృతు లాయింటితోపాటు ద్విప్రభృతిసంఖ్యావాచకములు సమహదర్థమున నేకవచనాంతము లగు ననె. వీ రన్న్యాదులకు మాత్రమే చెప్పిరి. "అన్న్యాదులవలెఁ గాక ద్విప్రభృతిసంఖ్యావాచకముల కమహత్త్వమునందును బహువచనరూపము లరుదుగఁ గలవు. తొమ్మిదులు రెండువేలు శరము లా అయిదుల్ ("కర్ణ-1-111-ఉ.119,వ్యా.సం.స.830) అట్లే యున్నను నీయవి బహువచనాంతము లగుట యరుదు గదా. అనఁగాఁ దఱుచుగా నేకవచనాంతములే యవునే. అ ట్లని చెప్పవలదా? రెండు, మొద లగునవి బహుత్వార్థమునం దున్నవి కావున బహువచనమె కావలె. బహువచనాంతము లగుటలో విశేషము లేదు. బహుత్వార్థమునం దుండియుఁ దఱుచుగ నేకవచనాంతము లగుటయె విశేషము. అది చెప్పవలదా?

అన లివి యరుదుగ నయినను బహువచనముతో నున్నవా? 'తొమ్మిది' యను నర్థమునఁ దొమ్మిదులు అనుబహువచనాంతరూపము లేనేలేదు. తత్స.47.సూ.వద్దఁ దొమ్మిదులు అని చూపఁబడినది కాని దానికిఁ దొమ్మిది అని యర్థము గాదు. పెక్కుతొమ్మిదులు మొ॥ రెండుతొమ్మిదులు, రెండువేలు ఇత్యాదులందు రెండు మున్నగు విశేషణములనుబట్టి యిట్టిబహువచనము విశేషముగాఁ గల్గినది. రెండు రెండులు రెండు రెండ్లు మెఱయు ఉ.హ.7.11 కేవలము రెండులు, తొమ్మిదులు అనురీతిగ నున్నది చూపినపుడే యరుదుగ నైన సిద్ధి కల దని యంగీకరింపవచ్చు. అట్టివి వీరు చూపలేదు. ఎటనుండి చూపఁగలరు? భాషలో నున్నఁ గదా చూపుట. మేలిమియును గానిదియు నగుబంగారములు, వెండిబంగారములు, రెండువిధము లైనయి ంగువలు ఇత్యాదిగాఁ బ్రయోగించుట తప్పా? మఱి యివి నిత్యైకవచనాంతము లని పేర్కొనుటేమి ?

కావున 'వ్యుత్పత్తి సంఖ్యాబాధకము లనుటాదర్శమున నేకవచనాంతము లగు నను సూరియభిప్రాయము సమంజసము. వీరును సర్వనామరూపములపట్టికలో రెండు ఇత్యాదు లేకవచనాంతములు మాత్రమే చూపిరి. అటుదుగ నైన నివి బహువచనాంతము లగు ననువీరియభిప్రాయ ముచితము గాదు., ఇట్లె ఒకట్లు, ఒక్కట్లు (సూ.195) అనుచో సర్థవిశేషము గుర్తింపవలెను. వీరును బహువచనము లే దను టుచితము.

పలు - పెక్కు :

సూరి పలు పెక్కుశబ్దముల సర్వనామములలోఁ జేర్చుట సరి రా దని (వ్యా.సం.స. 832, 854) వ్రాసిరి తలఁచిరి. ఏలః మహాదర్శమున నివి బహువచనాంతములె యగును. 'పలువుండ్రు = పలువురు అనెడినిత్యబహువచనరూపములె ప్రసిద్ధములు' పెక్కుశబ్దమునకు మహత్త్వమున పెక్కుఁగ, పెక్కండ్రు అని నిత్యబహువచనరూపములె వెలయుచున్నవి. (వ్యా.సం.స.824) అని వీరె పేర్కొనిరి. అన్ని మొదలగు వానితో నీకార్యము లీపలు, పెక్కులకు సమానమే కదా. 'ఇంత నమహత్త్వమున భేదము గలదు. పలు అమహత్త్వమున వ్యస్తముగా లేదని సూరి. కావున నమహత్త్వమున నేకవచనాంతముగా లే దనుబాధ లేదు గదా. పెక్కుశబ్దమునకు నమహత్త్వమున బహువచనము గల దని చెప్పెను సూరి. ఈమాత్రపుభేదము ననుసరించి అన్ని మొదలగువానినుండి పలుపెక్కుశబ్దములు వేఱు చేయవలెనా? చేసిన వీనికిఁ బ్రత్యేకముగా మహాదర్శమున బహువచనాంతరూపములు మాత్రమే యుండు చెప్పవలె. పలు శబ్దమున కమహత్త్వమున వ్యస్తముగాఁ బ్రయోగము లేమి విశేషమున నైనను జెప్పక తప్పదు. సూరి ప్రణాళికలో లాఘవము గుర్తింపదగును.

సర్వనామము లనుపంక్తి యుంచవలసిన సన్నాహములలో 'పలుపెక్కు'లను జేర్చి, యాయాకార్యములను సూరిచెప్పుటలవా రుద్యోతమునఁ బేర్కొని సం.లోఁ దమ విమర్శ సరి గా దని నిరూపించిరి.

పెక్కులు :

అన్నాదు లనఁగాఁ బూర్వము చెప్పినదాని ననుసరించి అన్ని, ఎన్ని, ఇన్ని, కొన్ని, పెక్కు' పలు అనునట్టిశబ్దములు గ్రహింపవలె నని వీరియుద్దేశ్యము కాని

ప్రక్రియ కొంతకొంత సూత్రించెను. వీరు పన్నిప్రభృతులలోఁ జూపిన- నీ,నా,తా,మన అనుశబ్దములప్రక్రియను జిం.. సంఖ్యావాచకములప్రక్రియను గొంతవఱకు వి.పి. చెప్పియున్నవి. నన్నయాధర్వణులయు సమ్మార్గము లెన్నగా దందురా? నిజము నకుఁ బ్రక్రియను సూత్రించుటయె లెన్న యనక తప్పదు. గౌరవాదులకు వెఱచి యథారూపములను స్పష్టము చేయుటకై లాఘవమున కీమార్గము నెన్నుకొనిన నెన్ను కొందరు గాక యిదియె లెన్న యనుట విచార్యము.

### ఆ-అన్ని-అందఱు :

“అంతవారు- అందఱు ఇంతవారు- ఇందఱు మున్నగు ప్రౌఢవ్యాకరణోక్త ప్రక్రియ సరి కాదు. అర్థసందర్భము లేదు. కాన నిది యాశబ్దసంబంధి యని మాత్రము చెప్పనగును.’ (ఉ.182) అనిరి. ప్రౌఢ. ప్రక్రియ సరి గా దనుట యుచితమె. కాని యివి ‘ఆ’శబ్దసంబంధు లనుటయు విశేషము. వీ రింతకు ముందె ‘అన్ని-ఇన్ని-ఎన్ని మహన్మహత్త్వార్థకంబులు బహువచనాంతములు అని చెప్పి అన్ని-అందఱు ఇన్ని-ఇందఱు (ఉ.178) అని చూపిరి. దీనింబట్టి అందఱు అన్నది అన్ని అనుదాని మహన్మహత్త్వార్థకరూపము గదా. ఆశబ్దసంబంధి యగుట యెట్లు? అన్ని, ఆశబ్దములు వేఱుగాఁ బరిగణించిరి గదా. ఇట్లె ఇందఱు-ఈ ఎందఱు ఏ- కొందఱు ఒక శబ్దములకు సంబంధించినవి కాఁగా ఇన్నిప్రభృతులను సమహదర్థకములుగాఁ జెప్పుట యెట్లు గుదిరినది. ఆఈఏఒకఅనుశబ్దములె అమహదర్థమున అన్ని ఇత్యాదులుగను, మహదర్థమున అందఱు ఇత్యాదులుగను ఏర్పడు నన్న అన్ని ఇన్ని ఎన్ని కొన్ని అను వాని నిటఁ బరిగణించుట వ్యర్థము. అందఱు అనుదానికి ఆశబ్దములతోఁ గలదన్న మాత్రము సంబంధము అన్నిశబ్దమునకు మాత్ర మాశబ్దముతో లేదా. అన్ని ఇత్యాదులకు ఆప్రభృతులతో నిట్టిసంబంధమును పరుషులవారు పేర్కొనలేదు. ‘అన్నిప్రభృతు’ లనుచో గణాదిశబ్దమె వ్యర్థ మాయెనే.

ఇవి ‘ఆ’శబ్దసంబంధు లనుట యెంతవఱకు సరిపడును? ఆఈఏశబ్దములకు మహదర్థమున వారు వీరు వేరు మొద లగువిధముగా బహువచనాంతరూపము లేర్పడు చున్నవి గదా. ఈ అందఱుప్రభృతులును ‘ఆ’శబ్దసంబంధులే యైన వారు—అందఱు,

వీరు = ఇందఱు వేరు—ఎందఱు అనునవి పర్యాయము లగునా? అర్థము సందర్భ పడునా?



ఆశబ్దసంబంధి యనఁగా 'అ'శబ్దమునుండి యీరూపము నిష్పన్న మగు నని యుద్దేశ్యము లేనిచో నాసంబంధ మెట్టిదో నిరూపింపవలె. ప్రక్రియ భిన్న మైన శబ్దసంబంధము లేదు. అర్థము చూత మన్న 'అ' శబ్దము తదర్థకము గాఁగా నిది సర్వత్రా సదర్థకము. శబ్దార్థములకు భిన్న మైనసంబంధ మేది? 'అశబ్దమూలక' మగుట (ఉ.184) యెట్టిది? ఇట్టి అంతాదులును (ఉ.187.వ్యా.సం.స.322).

## అందు-ఇందు-ఎందు :

అందు ఇందు ఎందు అనువానిని సూరి సర్వనామములుగాఁ జెప్పకుండుట యటుండ శ.ర. సూ.నిఘంటుకర్తలు వానిని ప్రదానాంతాన్వయము లనుట యటులయు వింతగా నున్న (వ్యా.సం.స.822) దన్న పరుషులవారు అందు అప్పుడు మొద లగువానినిఁగూడ సర్వనామరూపములుగా అశబ్దమూలకములుగా ఉ-(165)లోఁ జూపిరి. వీనికిఁ గొన్ని విభక్తులందు మాత్రమె వాడుక గల దనుచు అందుకయి, అందులకున్ అందుకన్ అందున్ అందునుండి అందులోన్ మొ॥ (ఉ.185) చూపిరి. ఇట దానికయి, దానికిఁ దానియందు దానివలననుండి, దానిలో ననురీతిగా నమహత్తచ్ఛబ్దార్థము గోచరించుచునే యున్నది. సూ.ని. అందు తచ్ఛబ్దార్థక మైనపు డాయావిభక్తుల నందు నని అందుకై 'అందుకు, అందున అందులో ననువానికిఁ బ్రయోగములును బ్రదర్శించినది. ఇంకను పరుషులవారు అందును ఇందును ఎందును అనునవి సప్తమ్యర్థకశబ్దములు గలవు. కాన వాని ద్వితీయాబహువచనములు అందులను ఇందులను ఎందులను అనియు షష్ఠీబహువచనములు అందులకును ఇందులకును ఎందులకును అనియు— అందులవారు ఇందులవారు ఎందులవారు మున్నగునవియు (ఇవి షష్ఠీబహువచనాంతము లేమో) వెలయుచున్న (ఉ.68,వ్యా.సం.స.400) వనిరి. అందులను మొద లగునవి అంద్వాదులద్వితీయాది బహువచనాంతము లనుట యెప్పుడు. ఎండుండి వచ్చి తందులకు (ఆది.4.76) అను రీతిగా నివి యేకత్వార్థమునను బ్రయుక్త మవుచున్నవి. 'నీయందుల మాకు నొండు కార్యంబు (సభా.1.84) అనుచో సప్తమీప్రత్యయమె యనఁదగిన అందుపై లక్షము

గూర్చి యింతకు ముందే గమనించితిమి. 'బహ్వర్థకములు' (56 సూ) అని యొక సూత్రమును జెప్పుట వింత.



ఆ ప్రభృతులు :

పిదప 'తదర్థకము ఆశబ్దము (57) ఇదమర్థకము ఈశబ్దము, (58) యత్కిమర్థకము ఏశబ్దము. (59) అని మొదలుగా 65 వఱకుఁ జెప్పిన సూత్రములు సూత్రములుగాఁ జెప్పఁదగినవి గావనుట స్పష్టమే. 'సర్వనామార్థకము' మున్నగుపూర్వసూత్రములవలె 'తదర్థకము' అని మాత్రమే సూత్రింపక 'ఆశబ్దము' అనురీతిగను జేర్చుట యింకను స్పష్టత కేమో. ఇట్టిసూత్రములవలనఁ బ్రయోజన మేమి? ఇవ్వి సూత్రములు వ్యర్థపఱుపకుంటె వీనిప్రక్రియ చూపినచె లెస్సగా నుండెడిది.

ఆ ఈ ఏ శబ్దములవిషయమున వీ రొకభేదము నిట్లు 'ప్రతిపాదించిరి'. ఆశబ్దము తచ్ఛబ్దార్థకమె యైనను వానికిలో భేదము గలదు. తస్య పుత్రః తత్పుత్రః అని యైనట్లు వానియొక్క కొడుకు ఆకొడుకు అని కానేరదు వానికొడుకు అనియె యగును. (ఉ.135) ఇట్టె వీనికొడుకు (ఉ.187) ఎవ్వనికొడుకు (ఉ.190) ఇందలిభేదము వఝులవారిమతమునందలి దేమో. కాని విభక్తిలోపము చెప్పినసూరిమతమునఁ గాని షష్ఠికి ద్వితీయాతుల్యత చెప్పినవీరిమతమునఁ గాని వానికొడుకు ఆకొడు కని యగు నెట్లు? తదర్థక మైనను నట్లు గాకపోవు టేమి?

అసలు వీనిలోని ప్రత్యేకత యేమి? సంస్కృతమున రామస్య పుత్రః రామపుత్రః అని యైనట్లుగాఁ దెలుఁగున రామునియొక్క కొడుకు రామకొడుకు అని యగుచున్నదా? (సమాసకములం దేని దమ్మునికొడుకు- తమ్మకొడు కని యగునా?) రాముని కొడుకు, తమ్మునికొడుకు అని యవుచున్నట్లే వానియొక్క కొడుకు వానికొడు కని యవును. స్పష్టతకై యన్నను వఝులవారివివరణము సందేహములకు మూల మగుచున్నది కాన నిట్లు చెప్పకుండు టుచితము.

వేఁడు :

యత్కిమర్థమునకు సూరి వేఁ డనురూపమును జూపకుండుటను వఝులవారు విమర్శించు టుచితమె. (ఉ.190) వేరీ ని న్నెదిరింపఁగా జగమున న్వీరుల్ (హవ 7.45.)

అతఁడు-పూజ్యార్థము :

అతఁడు మున్నగువానికిఁ బూజ్యార్థకత లే దనువజ్ఝులవారివివరణ ముచితమె. (ఉ.191) సూరి పూట విపక్షించునపుడే యి ట్లవు ననుట గుదురకున్నది. ప్రాణి విక్రయమున బ్రదుకు నతఁడు (ఆను 2.57) ఇట్టిచోట్లఁ బూజ యున్న దనలేము గదా. తఱుచుగఁ బూజయుం దగు నన్న బా గుండెడి దేమో. 'వాఁడు'కుఁ గేవలము పర్యాయముగా 'అతఁడు' చెప్పఁదగునా? కాని పూజార్థ మసలు లే దని చెప్పుట యసంగతము. వాఁడుశబ్దమె కొన్నియెడలఁ బూజ్యతయందుఁ బ్రయుక్త మవుచుండఁగా అతఁ డనునది యసలె యట్లుగా దనుట యుచితమా?

ఎత్తఁడు-ఏమె :

సూరి పేర్కొన్నఎతఁడు ఏతఁ డనువానిని వజ్ఝులవా రుదాహరింపలేదు. వీనికిఁ బ్రయోగములు లే వని స్పష్టము చేసిరి. (ఉ.188) ప్రౌఢ. వీనిని సాధించినది, శ.ర. సూ.ని. చూపినవి, ప్రయోగము లేదు.

'ఏమె (ఏపూజ్యురాలు) అనువాడుకకుఁ గవిప్రయోగము లభింపలేదు.' (ఉ.191) (వ్యా.సం.స.388) అన్న వజ్ఝులవా రారూపమును బ్రస్తావించి ప్రమాణీకరించియే యుండిరి. వాడుకనుబట్టి యేమో.

ఆమె-పూజ్యార్థము :

“తదాదులు మహతీవాచకంబుల 'ఆమె-ఆపె-ఆకె, ఈమె-ఈపె-ఈకె, ఏమె-ఏపె-ఏకె, అనుపూజ్యార్థకరూపంబులు వడయు' (60.సూ) అని వీరు సూత్రించిరి.

మహదమహదర్థకరూపము లెల్ల నుదాహరించి వీనిని మాత్రము సూత్రించుటలో విశేష మేమి. అట్లె యుదాహరింపఁదగును. సర్వనామరూపములప్రక్రియను నిరూపించుటలో నట్లు నిపతించుపద్ధతియె యనుసరించుచో వజ్ఝులవా రన్నట్లు దీని ప్రక్రియను జెప్పుటకంటె సిద్ధరూపోదాహృతియె చెన్న.

ఈలక్షణమున తదాదులు పూజ్యార్థకరూపంబులు వడయు ననుటకంటెఁ బూజ్యార్థమునందు (ఈ) రూపంబులు వడయు ననుట సక్రమము.

ఏ రీలక్షణమునే ద్విప్రభృతిసంఖ్యావాచకములు మహాదమహాదర్థములందుఁ బ్రయుక్తము లగు నని చెప్పఁదలఁచుట స్పష్టము. అయ్యు నిట్లు చెప్పుటవలన నేకార్థక మగుటకు శబ్ద మిట్టిది గా దనునపార్థమున కవకాశ మేర్పడుచున్నది.

ఇరువురు :

ద్విప్రభృతిసంఖ్యావాచకములకు మహాదర్థమున ఇరువురు ఇత్యాదిగా వీరు వకారఘటితరూపములనే ప్రదర్శించిరి. 'సూరి గుపర్ణమునె నిల్చి గకారమునకు' వకారము విధించెను. కాని వీనిలోని కార మర్వాచీనము. వకారమె ప్రాథమికము. మూఁడు+వారు మూవురు వేయివారు వేవురు. అని వానివ్యుత్పత్తిని గ్రహింప వలయు" (ఉ.197) అనిరి.

గకారము ప్రాచీన మని యంగీకరింపఁదగినట్లుగా ఏ-గురుకును నిది పత్నిగాఁ దగుం గావున' అనునన్నయప్రయోగమును సూ.ని. చూపినది. వీ రిటఁ బరిష్కర్తలు సవరించి రనియు 'ఏ-వురు- తపున్- అనియె కవిప్రయుక్త మనియు నిర్ణయించు' (వ్యా సం.స.912) రనిరి. దీనింబట్టి యేది ప్రాచీన మని నిర్ణయించుటకును వీలు లేకపోవచ్చును.

అవుఁ గాక. వ్యుత్పత్తిఁబట్టి వకారమె ప్రాచీన మయినను శబ్దశాస్త్రవేత్త చరిత్ర కనుగుణముగనె లక్షణము చేయవలెనా? వీ రనుస్వారచరిత్ర ననుసరించి పూర్ణము నకు ఖండము విధించినదేరు గమనింపఁదగును. అందువలననె అంతవారు అందఱు అని ప్రక్రియను జెప్పినప్రౌఢ.సైత మిట గుగాగమమునె విధించె. అయినను వ్యుత్పత్తిలో మూఁడు+వారు మూవురు అని చెప్పినవీరు 'మూవురు' అను రూపమును 'మూఁడు+వారు' అనుదానినుండి సాధింతురా? కానపుడు వకారము ప్రాచీన మని యవి మాత్రమె చరిత్ర ననుసరింప నేల? ఎట్లయినను మూఁడు+లు మూగురు (మూవురు) అని చూపక తప్పదు. ఇంక రెండువారు మూఁడువా రనురీతిరూపము లును లేవు గదా.

కాఁగా గుగాగమము చెప్పి గకారమునకు వకార మయిన దని మిగిలినపెక్కింటితో గ్రహించుట యుక్తము గాన సూరిమార్గము శాస్త్రోచితము.

### ఇరువై :

సూరికి విశేషముగా వీరు (ఇరువది) ఇరువై అనురూపమును పేర్కొనిరి.  యుక్తమె, (ఉ.198) రాఁగలఇరువైతొమ్మిదగుద్వాపరయుగమున (కా.శి.3.51).

ఎనమనూఱు, ఎనమన్నూఱు అన్నవి సామాసికవికారములు నిక్కలాది సూత్రముచే సాధింపవచ్చు.

### ఇరువదియొకటి :

'షష్ఠీసమాసమున షష్ఠి. ద్వితీయారూపమున నిల్చుట సంఖ్యావాచకసమాసముఁ ప్రథమారూపమున నిల్చుట కొన్నిచోటులఁ గలదు. ఇరువదియొకటి ముప్పదిరెండు. ఇట షష్ఠి ద్వితీయారూపమున నిల్చినచో ఇరువదిటియొకటి ముప్పదిటిరెండు మున్నగురీతి గలయనిష్టరూపము అవతరించును.' (ఉ.169) సూరికి భిన్నముగా షష్ఠికి ద్వితీయాతుల్యత యన్నది వీరు తెచ్చిపెట్టుకొన్న ప్రక్రియ. దానివలన నేర్పడినయనర్థ మిది. వివరణమున మార్చిరి కాని యుఁ "ఇట్టిచోటుల సాపవిభక్తికములబాహుళ్యముచేత టింటులు రాక ప్రథమ నిల్చు" (ఉ.280) అనిరి. బాహుళ్యమువలన టింటులు రాకున్నఁ జాలదా? ప్రథమ నిల్చుననుట యేల? ప్రథమయే నిల్చిన టింటుల ప్రాప్తియే లేదు గదా బాహుళ్యముచే వారింపఁజేయ నవసర మేమి?

"బాలప్రౌఢవ్యాకరణపద్ధతి నిట్టియనిష్టరూపములు పుట్టావు (ఉ.198) లనుట యేల? వీరు బహుళ మన సూరి ప్రాయిక మనుట నిట సాపవిభక్తికములు రావన్న వీరు బాహుళ్యముచే వారించుకొన్నటువంటిది కాదా?

అసలు ఇరువదియును ఒకటియును, ఇరువదియొకటి, ముప్పదియును రెండును ముప్పదిరెండు అనురీతిగాఁ ప్రథమాంతములతో నీసమాసములను సంగ్రహించుకొనుటకు వీ లుండగా షష్ఠిని దెచ్చిపెట్టుకొను టేల? వ్యస్త మన్నఁ గల్గునిబ్బంది యేమో పరిశీలింపవలె

### ఒకటి :

సూరి రెండు మొదలగునవి సాపవిభక్తికము లనుట పొరపాటు. తక్కొకటను లేదు. (స్వర్గ.1.82) (ఉ.190) అని వీరు పేర్కొనుటలో రెండు మొద

లనునవి యౌపవిభక్తికములు గావని చెప్పుట వీరియుద్దేశ్యము గా దనవచ్చును. 
ఇక 'శబ్దము గూడ నౌపవిభక్తికమై యుండ రెండు మొదలగువానికౌపవిభక్తికత్వమును జేర్చుట సరి గా దని వీరియుద్దేశ్య మిది చింత్యము

ఓరట్టు :

'సూరిగా రుదాహరించిన— ఓరట్టు శబ్ద మేకోశమందును గానరాదు.' (ఉ.189) సూరి 'అర్థవిశేషంబునఁ జూపట్టెడు' నని ప్రత్యేకముగాఁ జెప్పె. సూరి యెటఁ జూచెనో పరిశోధింపవలె.

అవ :

'సంఖ్యకుం బూరణార్థంబునం దవాగమం బగు [25] ననుసూరిసూత్రమును సవరించి 'సంఖ్యకుఁ బూరణార్థమున అవప్రత్యయము తుదిని నిల్చును. అది యుత్తర పదముతో సమసించియె యుండును.' [ఉ 67.సూ.] అనిరి.

సూరి 'అవ' ఆగమముగాఁ జెప్పఁగా వీరు ప్రత్యయ మనుట మొదటి మార్పు. సమాసేఽవస్తు సర్వదా యనువి.వి.వచనము వీరిలక్షణమునకు మూల మనఁ దగు. అందు 'అవ'ప్రత్యయ మని స్పష్టముగాఁ జెప్పినయాధారము లేదు. కాని వీ రట్లు వ్యాఖ్యానించిరి.

'అవ యనునది యాగమ మగునప్పు డింకఁ బూరణార్థకప్రత్యయ మెయ్యది యగు నని యాతఁడు తలంచెనో తెలియకున్నది. [వ్యా.సం.స.918] ఇ ట్లాగమ మనుట సరి గా దని, స్వయముగాఁ బ్రత్యయ మని చెప్పియు నింతకు ముందు అంద్వవగాగమంబులు దప్ప' (ఉ.సంధి.12.సూ] అని యవాగమముగా సూరివలెనె యెట్లు చెప్పిరో. ఉ.లో సూరి దీని నాగమ మనుటను ఖండింపలేదు,

'అవి యుత్తరపదముతో సమసించియే యుండు ననిరి, అనఁగా అవప్రత్యయాంతము మీఁదిపదముతో సమసించియే యుండు నని యర్థము, కాఁగా పూరణార్థమున సంఖ్యావాచకము లెప్పుడు మీఁదిపదముతో సమాసము నందియే యుండఁగా

వాఁడు మున్నగుఘా.వి.స్థలములందు గాని, గూడ ననుగతముపై విభక్తివిషయములోఁ దచ్ఛబ్దమనుప్రయుక్తమగునట్లు చెప్పఁదగు. వచ్చినవాఁడు వ్యస్తము. (సమా.9) కాఁగా రెండవాఁడు రెండవది మున్నగునీస్థలములను సమాసములుగాఁ జెప్పరాదు. వ్యస్తములే. మహదర్థమునఁ బ్రథమయందు రెండవవాఁడు. ద్వితీయాదులలో రెండవవానిన్ మొ॥ ఇట్లె యమహదర్థమున రెండవది, రెండవదానిన్ మొ॥

కాని సూరి తచ్ఛబ్దానుప్రయోగమును ధా వి.లకు మాత్రమే చెప్పెను. (సమా.8) ఇట రెండవాఁడు రెండవది యని యుదాహరించెను. కాన నివి సమాసము లన్న నీవు రెండవవాఁడవు ఇత్యాదులు గుదురవు. కాన నీలక్ష్యప్రదర్శనసామర్థ్యము చేతనె ధాతుజేతరము లగువిశేషణములపైఁ గూడ విభక్తివిషయములోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగుట గల దని యెన్నఁదగును. జ్ఞాపిత మగునీయర్థమువలన (వీఁడు) నల్లవాఁడు మీరుపెద్దవారు ఇత్యాదులు గుర్తింపఁదగు. మీరు పెద్దలు మొ॥ అయ్యెడ 'అప్' ఆగమ మనుటలో నిబ్బంది మృగ్యము.

కాఁగా వరుసలవారిసమాసవిధాన ముచిత మని చెప్ప నవకాశము గాఁరాదు

మహతి-మహద్రూపము ;

సర్వనామక్రియాపదంబులబహువచనంబు మహత్తునకుంబోలె మహతి కగు (26) ననుసూరిలక్షణమును వీరు అన్నిప్రభృతులకును తదన్వితక్రియలకును, మహతీ బహుత్వమున మహద్బహువచనరూపములె యగు' (ఉ.68.సూ.) నని సవరించిరి. సూరి పేర్కొన్న సర్వనామసంజ్ఞను వీర ంగీకరింపక పోవుటచే సూరి సర్వనామములన్న యన్నియెడల 'అన్నిప్రభృతులకు' అనియే చెప్పుచు-దురు. సూరి చెప్పిన సర్వనామము లన్నింటిని వీ రన్ని ప్రభృతులలోఁ జేర్చిరి. భేద మన్నిప్రభృతులనుటలో మాత్రమే. సర్వనామసంజ్ఞ చెప్పుట యుచితమె యని గుర్తించితిమి. కాని నిట సూరి లక్షణమున దురుక్తి గాని వరుసలవారిసవరణలో విశేషప్రయోజనము గాని లేవు.

సూరి పిదపఁ గ్రియాపదంబు అని సామాన్యముగాఁ జెప్పఁగా వీరు 'తదన్విత క్రియలు' అనిరి. తచ్ఛబ్దము పూర్వోక్తమును బరామర్శించును. పూర్వోక్త మన్నిప్రభృతులు. కావున నన్నిప్రభృతులతో నన్వయము గల్గినపుడే మహత్యర్థకక్రియను

మహద్రూప మవునని లక్షణమునభిప్రాయము. 'వారు వచ్చిరి.  స్త్రీ లందఱును వచ్చుచున్నారు. పదువురు స్త్రీలు గలరు. (ఉ.201) అని వీరు చూపినలక్ష్యములలో నన్నిప్రభృతులలో నొక్కటి చూపుటనుబట్టి పరుచులవారియభిప్రాయ మదియే యని చెప్పవలె.

కాని యిది సమంజసము కాదు. "శ్రీభూనీళలు వచ్చుచున్నారు" అనుచో నన్నిప్రభృతులలో నొకండును లేమి 'తదన్వితత్వము' లేదు. అట్టియెడ మహద్రూపమసాధ్యమై వీరిలక్షణము ననుసరించి యమహద్రూపమె యుండి 'శ్రీభూనీళలు వచ్చుచున్నవి' అనవలె. ఘనశాస్త్రౌఘ చని కాంచిరి, పూజించిరి కాంతలు (వ్యా.సం.స.921) అనుస్థలము లెట్లు? 'తదన్వితత్వము'నకై యన్నిప్రభృతులలో నొక దేదే నధ్యాహారము చేసికొనవలె నేమో. లేనిచో రుక్మిణీ సత్యభామలు వచ్చిరి అనవలయును గాని రుక్మిణీసత్యభామలు వచ్చెను అనరా దని యెఱుంగు(వా.సం.స.921) ట యెట్లు? లక్షణము సమన్వయింపుటకుఁ దప్ప నధ్యాహార మనవసరము.

కాఁగా పరుచులవారు దమసూత్రమున సూరికంటె నధికముగఁ జేర్చిన 'తదన్విత'శబ్ద మనర్థకము. సూరిలక్షణము సూక్తము.

గ-వ ;

ఆపదాద్యం బయి యసంయుక్తం బయినగకారంబునకు వకారంబు విభాషనగు' (23) ననుసూరిలక్షణమును వీరు 'అచ్చికగపలు కొన్నియెడలఁ బరస్వరము విభాషగ నాదేశము లగును. పదాదిగకారమునకు వకారాదేశము లేదు.' (ఉ.69) అనిరి. సూరిసూత్రమందలి 'ఆపదాద్యం బయి' యనుదానికి వివరణమె వీరిసూత్రమందలి రెండవవాక్యము. ఇందు సూరిమతమున దురుక్తి లేదు గదా. (అపద-ఆది అనుచో 'ననాద్యం బయి' యన్న బా వుండెడి దేమో సూరి. విచారింపవలయు.) కాని వీరు 'ఆపదాద్యం బయి-అని సూత్రించుట కేవలము నవిమర్శపమూలక మని' (ఉ.202) పేర్కొనుట వింత. వీరిసూత్రమున సగము 'అపదాద్యం బయి' యనుదానివ్యాఖ్యానమే గద.

'అసంయుక్తం బయి' అనుసూరిసూత్రస్థపదమును వీరు దమసూత్రములోఁ

దొలఁగించిరి. అయ్యు సంయుక్తమై యున్నగకారమునకు వకారము వచ్చుటను జూపలేదు.

'ఆర్వురు, ఆర్గురు మువ్వురు ముగురు, నల్వురు నల్గురు, అనుచో సంయుక్తమైనవకారమునకు గకార మగుటను జూపిరి. సూరి యసంయుక్త మయినగకారమునకు వకారము రా దని కదా చెప్పినది. అట్టి నిర్మూల మని పై యుదాహరణము లెట్లు విశదపఱుచును? (ఉ.202) కా దన్న సంయుక్త మగుగకారమునకు వకారము వచ్చు నన్న ఎగ్గు- ఎవ్వు అగ్గలము అవ్వలము తగ్గు తవ్వు ఇత్యాదులును గావలె. అట్టివి కలవా? (విభాష) కొన్నియెడల ననుదానిచే వీరు వారించుకొందురు గాక! కొన్నియెడల నైనను సంయుక్త మగుగకారమునకు వకారము చూపవలె. అసలు లేనపుడు లే దని స్పష్టముగాఁ జెప్పుట నిర్మూల మె ట్లగును.

'ఆర్వురు' ఇత్యాదులందు సంయుక్త మగు వకారమునకు గకార మైన దందురు. ఇట ముందు సంయుక్తములు చేసి గకారము చేయ నేల? సంయుక్తస్థితి యిట సహజము గాని గమనార్హము. మీ రీరూపముల నింతకు ముందు మూవురు మువ్వురు -- ఆఱువురు (ఉ.197) అని యసంయుక్తములుగనె చూపిరి. అది సక్రమము. ఆఱువురు [మూవురు], నలువురు అనురీతిగ నసంయుక్త స్థితిలో వకారమునకు గకారము చేయఁగా ఆఱుగురు, నలుగురు అని యైన ఉదంత స్వరలోపము చేసిన ఆర్గురు అని అని కాఁగలదు. మూవ్వురు మూగురు, (ప్ర.కీ.6) ముగ్గురు. ఇంతకయి సంయుక్తస్థలములలో వకారమునకు గకార మైన దన నేల? తవ్వెను, నవ్వెను, బువ్వ, త్రొవ్వ, చివ్వ ఇత్యాదులు సహజసంయుక్తస్థలములు. అట తగ్గెను, బుగ్గ అనురీతి నీయర్థమున రూపము లున్నవా? కొన్నియెడల ననుదానిచే సహజసంయుక్తస్థలములలో లే దనుకొనవలెనా? ఏల? ఆఱువురు అనుదానినుండి యార్వురని యగుఁ గాని ఆర్వురు అనుదానినుండి యాఱువురు అని యేర్పడునవకాశ మున్నదా?

కాఁగా వకారమునకు గకార మగు నన్నను సంయుక్త మయినవకారమునకు గకార మగుట లే దని వీరియుదాహరణములనుబట్టి నిస్సంశయముగా గుర్తింప వచ్చును.

దిత్వము నున్నది. సంబోధనాదులయు నింటను విశేషములు గలవు. వి.వి. ననుసరించి వీరే 'వాత్సల్యానీచతాద్యర్థములందుఁ గొన్నినామములతుది నేకత్వంబున ఇగాప్రత్యయము నిల్చును' అని (ఉ.109) 'ఇగా' ప్రత్యయముగాఁ జెప్పిరే. ఇగాప్రత్యయము తోఁడి (ఇ)గాఁడు శబ్దము 'వాఁడు' శబ్దవకారమునకు గకార మగుటచే నేర్పడినదగుట యేమి? అట్టిది గాక 'గాఁడు' అనురూపము గలస్థల మొక్కటి వీ రుదాహరింపలేదే యెచ్చటను.

కాఁగా వాడు- గాడు- వాఁడు- గాఁడు అని వకారమునకు గకార మైన దని చెప్పుట యసంగత మనుట నిశ్చయము. వంకర, గంకర, వాఁగు-గాఁగు ఇత్యాదు లెట్లును లేవు. కాఁగాఁ బదాదిని గూడ వకారమునకు గకార మగుట చేనేరదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

గకారమునకు వకారమును జెప్పుసూరిలక్షణ మెంతయు నుచితము.

ఔపవిభక్తికములు :

'ఇటితికర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు' (28) అనుసూరిలక్షణ మును వీరు విస్తరించి ఇ-టి-ంటి-ఇఁటి-తి-ఇతి-అటి ప్రభృతు లౌపవిభక్తికములు' (ఉ.70 సూ) అని పేర్కొనిరి.

'ఔపవిభక్తికవర్ణాష్టింట్యాదయః' అనుచిం.లక్షణము ననుసరించి వఝలవారు పైరీతి నౌపవిభక్తికములను వివరించుటయే కాక (టింటి ఇత్యాదిగాఁ జెప్పినచిం.ప్రణాళిక సూరి మార్చుట సరి గా దని సంజీవనిలోఁ జెప్పిరి.) ప్రభృతిశబ్దమును గూడ జేర్చి రని తలఁపవచ్చును. 'ఇటితికర్ణంబులు' అని సూరి స్పష్టముగా నిర్ణయింపఁగా వఝలవారు ప్రభృతు లనుటలోఁ గొంత యస్పష్టత. ప్రయోజనము గానరాదు. వఝలవా రౌపవిభక్తికములు పెక్కు పేర్కొనిరి. కాని ముందు బిందాదు లగునట్టివు లయినవమాన్యులు తప్ప సూరి చెప్పిన ఇటితి అనువానికంటె భిన్న మగు నౌపవిభక్తిక వర్ణము వఝలవారు చూపినవానిలో లేవు. వఝలవారు పేర్కొన్నవి సూరి సాధింప నివి గావు. ఇటితి అనువానినుండియే సూరి యన్నిటిని సాధించెను.

నామవిభక్తులలో న ద్వితీయ చేతఁ తోడ తృతీయ, కు షష్ఠి అనుచోట్లని, చే లో, కి అనువానిని సూరి ప్రత్యేకముగాఁ బేర్కొనలేదు. ను మొదలగు వానినుండియే ని మొదలగువానిని సాధించెను. అట్లే ద్రుత సంధియు. ఇట్లు గూడ నట్లు సాధింప వీలవుచుండ వీ రేల మార్చుట. నవ్యలక్షణమునుబట్టి యేమో. సూరిలక్షణమునందలి లాఘవము శాస్త్రీయత రఘులవారిలక్షణమున లేకున్నఁ దప్పు లేదు గదా.

వీ రిట సూరికంటె ంటి, ఇంటి, ఇతి, అటి అనునవి యధికముగాఁ జెప్పిరి. ఇవి వేఱుగఁ జెప్పవలెనా?

నింటు :

సూరిలక్షణమున గూర్చి 'సూరి ఇటితి అని సూత్రించి హ్రస్వముమీఁదిటివర్ణము పూర్ణబిందుపూర్వక మగు నని సూత్రించెను. దీర్ఘముమీఁద నింటు అని కలదే' (ఉ.202) అనిరి. అనఁగా 'ంటి' వర్ణము నామవిభక్తిగాఁ బ్రత్యేకముగాఁ బరిగణింపక టివర్ణమునకు ముందు బిందువు విధించుటతో దానిని సాధించుట యుచితమె. (కావున వీరు ంటిని బరిగణించుట యనవసర మని స్పష్టము.) కాని హ్రస్వముపై ననుటవలన 'నింటు' అని యేర్పడుట లేద! అదె యిబ్బంది అందుకై 'ంటి'వర్ణమును బ్రత్యేకముగాఁ బేర్కొనవలెనా? వీ రిట సూరిలక్షణమును యథాతథముగాఁ జూపలేదు. 'పూర్ణ'బిందువును విధించిన సూరి యిట 'బహుళంబుగా నగు' ననెను. బహుళపదముచే నింటు అనునది సాధింపరాదా? త్రాంటి— మూంటి ఇత్యాదిగా దీర్ఘముపైఁ బూర్ణము సాధారణము కాదు గదా. అట్టి హ్రస్వదీర్ఘములపై సామాన్యముగాఁ బూర్ణము విధించుట తప్పు కాదా? కావున దానికై 'ంటి'వర్ణమును బ్రత్యేకముగాఁ బేర్కొన నవసరము లేదు. వీ రట్లు పేర్కొనుట యనవసరము. పైఁగా సూరికంటె వీరును టివర్ణమునకు ముందు పూర్ణబిందువును విధించుట విశేషము. ఇంక 'ంటి' పరిగణనము కేవలము వ్యర్థము గదా.

'నింటు, అనురూపము సూరి సాధింపలే దన్నవీరు సాధించిరా? అచ్చి.73. సూత్రమున టి. ఇంటి మాత్రమే విధించిరి. 74,75సూత్రములలో సూరివలెనె హ్రస్వముపైనె బిందువు విధించిరి. సూరిసూత్రముచే నేర్పడని 'నింటు, వీరి యదే

లక్షణముచే నేర్పడుట యెట్లు? వీరు బహువచనము ప్రయోగింపక తప్పదు గదా.


ంటిపరిగణనములోని ప్రయోజనము గాంచో లు? 'సౌఖ్యరసంబు నీంట' అనుచోఁ జిం.మతము ననుసరించి 'ంటి' యైన దనియు తేంట్లు ఇత్యాదుల సాధ్యబిందువు పుంటనిది లక్షణవిరుద్ధము గా దనియుఁ జెప్పిరి. (వ్యా.సం.స 936) తేంట్లు అనుచోఁ గలదు గాన దీర్ఘముపై సాధ్యపూర్ణము సాధారణముగ నుండు నందురా. 'నీంట' అనుదాని వంటిదానికై ప్రాంత మూంట ఇత్యాదు లేల లేవు? దీర్ఘముపై సాధ్యపూర్ణము సాధారణమె కదా. 'ంటి' ప్రత్యేకవర్ణ మన్నను నయ్యది హ్రస్వముపైఁ గొన్నియెడల నగు నని చెప్పవలసినదే తప్ప సాధారణముగాఁ జెప్ప వీలు లేదు.

అసలీ 'నీంట' యనురూపమే వివాదగ్రస్తము. 'సౌఖ్యరసంపు నీంట, ఉ.204) అనుచో నిట్ట అసియె కలదు. (సూ.ని.) 'ప్రవాహార్థకనిట్టశబ్దము నిర్వహించునాధార మేదియుఁ గన్పట్ట లేదు. (వ్యా.సం.స 937) 'నిట్ట యపలిదరిని బెట్టువాఁడ' నని సూ.ని. చూపినను నది ప్రవాహార్థమును నిర్వహింపఁజాల దనిరి. (వ్యా.సం.స.937) మఱి యిట నర్థ మేమో స్పష్టము చేయరైరి. తిక్కనయే 'అంత కంతకుఁ బొంగి మిన్నంది వెల్లి,మిగిలి, యనిమిద దిక్కుల మీఁదఁబొరలి జనము లానందమునఁ దేల జగము లెల్లఁ దొట్టి నిండారువెన్నెల నిట్టవొడిచె (నిర్వ.6.55) అని ప్రాసఘటితముగాఁ బ్రయోగించెను. ఇట్లె సౌఖ్యరసంపు నిట్ట —రసప్రవాహ మనురీతిగా నిట నర్థము గుదురుపడుచునె యున్నది. వీరను 'నీంటను— మునం బొంటిరి (హరి.ఉ.బా.7.94) ఉ.204) అను ప్రాసఘటితప్రయోగమును జూపిరి. కాని యిట ముద్రితప్రతులలో 'రసంబు పెన్నింటిలఁ గూర్చు' అని 'నింటల' శబ్ద మున్నది. ద్వితీయాబహువచనాంత మైన 'నింట'శబ్దము వేఱు. ఇది నీరుశబ్దమునుండి యేర్పడినది గాదు గదా. పెన్నింటిం దేలుచు (హరి.6.2?) అని యొక్కప్రయోగమె నింటశబ్దమునకు సూ.ని. చూపినది. శ.ర. సూ.నిలు నింట శబ్దమును జూపినవి. విబుధుల పంట సురతంబులనింట అని సూ.ని. చూపినప్రయోగములో 'నింట' ప్రథమాంతము. ఇట్టు ద్వితీయాబహువచనాంత మగు నింట శబ్దములో రఘులవారు 'నింటను' అనుపాఠము ప్రమాణీకరించుట కవకాశము చాల దయ్యె. అట్లు 'నీంట' అనురూపమె నిరాధారమునఁ దగియుండ దానింబట్టి సూరిలక్షణమును విమర్శించు టుచితమా?

ఇంకను వీరు సూరిలక్షణమును మార్చుటకు 'అనిర్దిష్టబిందువిధానస్థలములలో దీర్ఘముమీఁద ఖండమునె నిల్పవలయు' (ఉ.సం.15) నని నియమించిన వా రగుట స్మరింపవలెను. దీర్ఘముపై నిటఁ బూర్ణబిందు వెట్లు చేయుదురు?

హ్రస్వముపైఁ బూర్ణబిందు వగు నన్నసూరివిధానమువలన "ఈరీతినె క్రిందంటికి, అప్పంటికి నెత్తంటిని మున్నగు—ననిష్టరూపములు దుర్వారము (ఉ.202) లని యుం కొకనష్టమును జూపిరి. ఆసూత్రమునే యట్టే గ్రహించి వీ రట బహుళగ్రహణము చేత నెత్తుటిని క్రిందటిని— మున్నగుచోట్లందుఁ బూర్ణబిందువు రానేర దని యెన్నునది' (ఉ.205) యనిరే. ఇట్లు బహుళశబ్దముచే సాధించుట యొకలోటుగా సం.లోఁ జెప్పిరి. (వ్యా.సం.స.930,941) వీరు గ్రహించిన సూరిసూత్రముచే వీరి కట్టి రూపము లయినవి. కాని యట్లు సూత్రించినసూరిమార్గమున మాత్ర మవి దుర్వారములా?

ఇట్లు వీరు చూపిన యనుపత్తు లసంగతము లై సూరిలక్షణము సముచిత మని నిరూపించుచున్నవి. 'ంటి' పరిగణనము వ్యర్థ మని సారాంశము.

ఇంటి :

'ఇంటి' అనున దొకటి వీరు విశేషముగాఁ జెప్పిరి. టి,ంటి, అనువానివలె నిందును 'టి' వర్ణమె. కాని ముందు పూర్ణబిందువుతోపాటు దానికి ముం దిత్వము విశేషము. 'పదియుంటి' (ద్రోణ.3 224) —మున్నగురూపము లితనిపక్షమున లభింపనేరవు. గదా' (ఉ.202) యనిరి. మున్నగురూపము లనిరి గాని యవి యేవి? అంతయుంటిని ఇంతయుంటిని ఇత్యాదు లందురా? 'ఇంటి-పదియుంటి అనునది యొక్కటే' (ఉ.205) చూపిరి. తొమ్మిదియుంటఁ బన్రెండు మేలు కాత్రుఁడు (సిం.10.8) అనియుఁ గలదు. వీరు వీనిని సాధింపఁగలరా?

అసలు 'ఇంటి' యని స్వరాదిగా గ్రహించిన నిది యపదము గావున సంధి.11 సూ.చే నిత్యసంధి యై మఱలఁ బదింటికి అనియే యగును. 'యింటి' అని గ్రహించుట మేలు. విధానసామర్థ్యము నాశ్రయింపవలసినయవసర ముండదు.

సూరి యుఁకను స్పష్టముగా 'సంఖ్యాయాఃతిష్టికి వా' అనుసూత్రాంత్రధమున  పడియుంటికి అని యుదాహరించెను. (సంఖ్యామీఁదిటీఁటిపృల కిడాగమం బగు' శ.ల.సం.3.211 అనియు పేర్కొనెను.) బాల.లోఁ జెప్పిని పంచుండి గ్రహింపుమని ఈవ్యాకరణంబున మూలం బయినకృతిని బోలఁగనగున్' అని సూరి పేర్కొనుట గమనింపఁదగును. కాఁగా పరభులవారు చూపినపదియుంటికి సూరి దృష్టి కెక్కనదే. ఇంక నిట్టియొండు రెండుప్రయోగములకై ముం దిత్వము విశేషముగా విధింప నేల? సూరి అచ్చి 32సూత్రమునందలిబహుళపదముచేఁ బూర్ణబిందువుతోపాటు ముందు 'యి'త్వ మన్యకార్యముగా వచ్చుటను గుర్తింపఁదగును.

అటీ-ఇతి :

వీ రిద్దే అటీ- ఇతి- అనువానిం గూడఁ బ్రత్యేకముగాఁ బరిగణించిరి. టీ,తిపరకత్వమున నిత్వము (అచ్చి.36) అత్వము (అచ్చి.37) చెప్పుకొనుటద్వారమున నీరూపములు సాధించుటలో లాఘవము గలదు.

ఉ.అచ్చి.76సూత్రముచే టిపరకత్వమున నిత్వము చెప్పి ఇటి సాధించినవీరు తిపరకత్వమునను నట్టె యిత్వము చెప్పక ఇతి ప్రత్యేకప్రత్యయ మనుటలో దాని వైశిష్ట్య మేమియో స్పష్టము చేయలేదు. ఉత్వంబున కిత్వంబు ఇత్యాదిగా నావిధి స్పష్టతర మైయున్నది.

అన్ :

అన్ అనున్ది యుపవిభక్తి యగు నని సమ్మతించునపు డింక దానికి మూలము 'నన్' అనున్ది యుపవిభక్తి గా దను టెట్లు?' (వ్యా.సం.స.984) అనుటలో పరభులవా రించుకపొరపడి రని చెప్పవలె. విభక్తినిమిత్తకము లయి యాదేశాగమాత్మకము లైన ఇటితిపర్ణము లౌపవిభక్తికములు. అవి చేరుశబ్దములు నౌపవిభక్తికములే. కాని వానిపైని విభక్తులే యుపవిభక్తు లగు టెట్లు? ప్రోలికి అనుచో ఇత్వమును, అది చేర్చుప్రోలుశబ్దము నౌపవిభక్తికములు. కాని పైనున్న 'కి'విభక్తి యౌపవిభక్తికము గాదు. 'నన్' అనునది మాత్ర మె ట్లగును? అసలు 'అన్' అను

నది యౌపవిభక్తిక మనుటయు సరి కాదు. సప్తమి కాదేశ మైన అత్వము రూప మగు నీయది సప్తమీవిభక్తియే. (నీరునన్ అనుచో 'ఉన్' లోప మగుటచే మిగిలిన దన్నను నీయత్వము నపర్ణకమునకు సంబంధించినదే కావున నప్పుడును 'అన్' సప్తమి విభక్తియె. ఈప్రకరణమునఁ జెప్పినవర్ణవికారము లెల్ల నౌపవిభక్తికములే యని భ్రాంతిపడి వీరు ఇతి, అటి ఇత్యాదిగఁ జూపిరా యని సందేహము.

సూరిసూత్రమునందలివక్ష్యమాణంబు లనుదళమును వీరు దొలఁగించిరి. ఈ సూత్రమునకుఁ బూర్వమునం దుక్తము లయినయిత్వమునకు నౌపవిభక్తికసంజ్ఞ వారించుటయు నిఁక పై నీపరిచ్ఛేదమునఁ జెప్పఁబోవు ఇటి, తి అనువానికి మాత్రమె గల్గుటయు నన్ప్రయోజనముల నిది సాధించుట నుచితమె యైయున్నది.

పిదప వివరణమున వీరు "కొన్ని జడవాచకత్రిసమనామములు విభక్తులకుఁ బూర్వమున నాగమములుగాను గొన్నియెడల నాదేశములుగాను ఇ,టి ప్రభృతులు నిల్చు" (ఉ.202) ననిరి. ఆదేశములు (విభక్తులకుఁ గావు నామాంత్యవర్ణముల కని గ్రహింపఁదగు. సూరిఇవర్ణమును) వలెనె వీరును ఊరు మొదలగువాని కిత్వం బగు' అనియు చెప్పిరి. కాఁగా 'ఇ'వర్ణ మెప్పుడు నాదేశమె కాని యాగమ మగుట లేదు. సూరి 'విభక్తినిమిత్తకంబు లయి యాదేశాగమాత్మకంబులయిన, —అనువివరణమునభిప్రాయమును సంగ్రహించుట వీరియుద్దేశ్యము గావచ్చును, కాని యట ఇవర్ణ మాగమ మవు నేమో యనుసందేహమున కవకాశము లేదు, (ఇటితి —అన్పక్రమములో ఆదేశాగమాత్మకము లని సూరి యాదేశము నాదియందు చెప్పుటను గమనింపఁదగు. 'ఇ' వర్ణ మాదేశము గానే వచ్చు నని వ్యాఖ్యాభిప్రాయము చెప్పరాదు, కాని వాక్యరచనాక్రమము విశిష్టమని చెప్పుటలో దోషము లేదు గదా.)

జడవాచకముల కగుట పైసూత్రమునఁ జూతము,

ఔపవిభక్తికస్థలములు :

ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు (29)ననుసూరిలక్షణమును వీరు "ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పర మగునపుడు మాత్రమె యాచ్ఛికత్రిసమజడవాచకములకు బహుళముగా నగును" (ఉ.71,సూ)అని చూపిరి,

'మాత్రమె' యన్నది మనమునూ సూరికంటె నధికముగాఁ జేర్చిరి. మాత్రమె యనకున్న నితరస్థలములం దగునా? మమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు (ఉ.తత్స.23.సూ) అనుచో 'మాత్రమె' యనలేదు. నిగాగమ మితరస్థలములం దయినదా? ఇది నేల? అనవసరము. గొతులు అనురీతియితరస్థలములందం తిపర్ణ మౌపవిభక్తికము గా దని చెప్పుట వీరియుద్దేశ్యము గాఁబోలును— మాత్రమె యనుపద మాయర్థమును జెప్పునా? ఎట్లు? ఈపదము త్యాజ్యము.

పిదప 'ఆచ్ఛికస్త్రీసమజడవాచకములకు' అనిరి. సూరిసూత్రమందలి 'నామంబులకుం గొన్నింటికి' ననుదాని కిది వివరణమా? రా దనవలె.

వీరు సంస్కృతసమము లగునులలు మొద లగు వానిం గూడ స్త్రీసమములుగా వ్యవహరింతురు. అందువలన నిది నాచ్ఛికస్త్రీసమము లని యుండవలె. కాని అచ్ఛికంబుతోడ స్త్రీసమంబు (ఉ.సమా.89) మొదలగుస్థలముల నిట్లు చెప్పలేదు. సూరి ననుసరించిరి. సూరి చిం.వలె స్త్రీసమము లాచ్ఛికములుగనె చెప్పె. సూరిమతమున స్త్రీసమము లనుచో నాచ్ఛికము లని వేఱ చెప్ప నక్కఱ లేదు.

చిం.,వి.వి.లు గాని సూరియుఁ(స్త్రీసమ) జడవాచకములకె యగు నని చెప్పలేదు. వీ రట్లు నియమించుటవలనఁ బ్రయోజన మేమి?

ప్రాణివాచకములు ;

అలు-అరిని (కూఁతురు—కూఁతురిని) మొ న్నగునవి జడములందలి యుత్వమును బ్రత్యేకముగాఁ జెప్పవలసివచ్చుటయు. సూరి వీరివలె నియమింపకపోవుటచే వాని యుత్వము వేఱ చెప్పనవసరము లేకపోయినది. (ఉ.203) ఊరు మొద లగువానికి వలె నాల్గింటికిని ద్వితీయాద్యేకవచనపరకత్వమందు యుత్వ మగుచున్నది. కీఁ పేనిం జూచి పేనితో (94పుట, అని సూరి నీ.చం.లోఁ బ్రయోగించెను. ఇట 'పేనన్' అని తృతీయాసప్తమునం దత్వ మున్నదా? అ(ఆచ్ఛి.31)సూత్రమందలి బహుళపదముచేఁ గొన్నింటికి (ప్రాణివాచకముల కెల్ల) నత్వమున కప్రవృత్తి చెప్పుకొనఁ

దగదా? కావునఁ ప్రత్యయమునకు ప్రత్యయము లేదు కావున వినా విభక్తికత్వమునకు బాధకము గాదేమి.

అల్వాదుల కిత్వము సూరి చెప్ప మఱచె నేమో. అంతమాత్రమున నిప్పటి యువర్ణ మౌపవిభక్తిక మను టెట్లు? అను వీలు లేదు. సూరి యింతకుముందు 'కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతురి నిత్యాదిరూపములు గ్రామ్యము (ఆచ్ఛి.౭) అనెను. రువర్ణము రా దని చెప్పుసూరి రువర్ణము వచ్చినచో బాల.చే నేర్పడురూపములను మాత్రమే యటఁ జూపుట గమనింపఁదగును. సూరి యవి గ్రామ్యము లనుటకు మూలము తె.వ్యా. 'కూఁతురు శబ్దమునకు వికల్పము కూఁతురు కూఁతురి. ప్రథమాంతబహువచనము- కూఁతురులు కూఁతుండ్లు కూఁతుళ్లు కూఁతులు' (తె.వ్యా.147) ఇట రుగాగమము వచ్చినను గూఁతుండ్లు అని యేర్పడుట యసంభవము గావునఁ దన్మూలక మైన గ్రామ్యతయు విశేషముగా నుండుటచేతనె సూరి కూఁతుండ్లు అనుదాని నిటఁ బ్రస్తావింపలేదు. కాఁగా రుగాగమము (రాదు గాని) వచ్చినచోఁ గూఁతురిని అని యగు ననియె సూరిమతము గమనింపఁదగును. తె.వ్యా. అటనే 148 సూత్రమున ఆలిని ఇత్యాదిగా నిందలియిత్వ మౌపవిభక్తికముగాఁ దత్ర్పకరణముననే నిరూపించెను. అది యౌపవిభక్తికము గా దని సూరి తలఁచినచో నరుఖులవారినలెఁ బ్రాణివాచకము లౌపవిభక్తికములు గా వని యెంచినచో (కూఁతురిని ప్రదర్శింపకుండుటయే కాక) ఆలియిత్వమును బ్రత్యేకముగా సూత్రించెడివాఁడే యనుటలో సందేహము లేదు గదా. తె.వ్యా. అభిప్రాయము లట నట సందర్భోచితముగా సూరి విమర్శించెను.

ఇఁకనె ద్వితీయైకవచనము పర మగునపు డౌపవిభక్తికములు రా వను కొందఱ యభిప్రాయమును సూరి తిరస్కరించెను. దీనిగూర్చి నరుఖులవారు 'ద్వితీయైక వచనపరకత్వమున నుపవిభక్తులు రా వని కొందఱు వక్కాణించినట్లు సూరి వ్రాసెను. కాని య ట్లెవ్వరు వక్కాణించిరో తెలియకున్నది' (వ్యా.సం.స.931) యనిరి. అట్లు చెప్పిన వితెలుఁగువ్యాకరణకర్తయు. ఇతఁడు 'తటవిభక్తు లనఁగా త్యత్తయమొదలుగాఁ గలవిభక్తులు' (93సూ) అని యొకసంజ్ఞ నేర్పఱుచుకొని 103సూత్రమున 'తెలుగు భాషయందు కొన్నిశబ్దములందు నున్న వర్ణమునకు వి.భక్తియందు టి,ంటి అనునవి మొదలుగాఁ గలవర్ణములు వచ్చును" అని చెప్పెను. దీనిచే ద్వితీయైకవచనమున

నౌపవిభక్తికములు గా వని తె.వ్యా. చెప్పినట్టులుండి కదా. కానీ సూరి అత్యవిరుద్ధ మని తిరస్కరించెను.

మొత్తముమీఁద నాల్వాదులద్విత్వయాదేశకపదసంపర్కతయుండఁ యుత్వము నౌపవిభక్తికముగా సూరి యంగీకరించినట్లు గుర్తింపఁదగును.

ప్రాణివాచకము నౌపవిభక్తికములు నందుట గలదు, లేటిపిండు గ్రోల్చిరి గనినట్టు (దశ 8.25) లేటికలలును మేటికుందేటికలలు (యయా.1.110) వహ్ని పొట్టేటివాదుసంబును గదల్చ (నిరం.3.36) లేటిపొట్టెలు (హర 1..3) పులి దైన బైఁబడి పొట్టేటికలెను (హరి.ద్వి.1.479) తోఁడేటిపిల్లలు (హరి.ద్వి.2.964) కుందేటి కొమ్ము సాధింపవచ్చు. తె.వ్యా. ఔపవిభక్తికములలో నిట్టిప్రాణివాచకములను గూడఁ జూపినది. ఇవిఁ గూడ లేటన్, పొట్టేటన్, తోఁడేటన్ అని యత్వము రేదు. అల్వాదులయిత్వమువలె వీని 'టి'త్వమును గూడ వేఱుగ సూత్రింపవలెనా?

ప్రాణివాచకము నౌపవిభక్తికము లగుటఁ గని ప్రయోగానుసారముగా గుర్తింపవలసియే యున్నది గావున వరుఖలవారు 'జడవాచకము' అని నియమించుట సరి కాదని గుర్తింపఁదగు.

ఇఁక సూరిసూత్రమందలి 'నామాంబులకుం గొన్నింటికి' ననుదానికిఁ గొన్నిస్త్రీసమ నామముల కనురీతిగా వివరణము చేసినఁ దప్పు లేదు.

ఈయౌపవిభక్తికములు ప్రాయికముగా నగు నని సూరి పేర్కొనఁగా వీరు బహుళముగా నగు ననిరి.

“ఔపవిభక్తికత్వము బహుళ మని సూరి చెప్పకుండుట సరి గాదు. నెత్తురు కొంపి — నెత్తుటఁ జొత్తిల్లె. మొదటిటి— మొదలన్— నీరన్— నీటను లంతరంపు— అంతటికంటె” (పు.203) సూరి బహుళ మని చెప్పకుండుటవలన సిద్ధ్యవిధ్యను సూరిమతమున సాధింపఁబడుట లే దనియే వీరు తలంచినట్లు తోచునది పొరపాటు పడిరి తోఁచును. ఇట్టి వన్నింటి వీరు ఔపవిభక్తికము సంబంధించినయుదాహృతులే చూపిరి. 'ఔప్వంబు అచ్చి 31 సూత్రముచే సూరి ప్రాయికముగా విధించెను. ప్రస్తుతసూత్రమునను ప్రాయికశబ్ద మెట్లును గలదు.

ఇటఁ 'గొన్నిటి' కనుటచేఁ గొన్నిశబ్దము లౌపవిభక్తికములు గాకుంట సిద్ధించినదే యున్నది. ఇంకను నిటఁ బ్రాయిక మనుటవలన నౌపవిభక్తికము లైనశబ్దముల కును నీయవి నియతములు గావు. తఱుచనుచోఁ గొన్నియెడల వైకల్పికస్థితి (సంధి.10) యున్న ట్లిటి నాయర్థము గ్రహింపఁదగియే యున్నది. ఊరిని, ఊరును మొద లగువిధముగా వైకల్పికస్థితి ప్రసక్తము గాదు గదా.

నోటన్, నోటున్ అని కొన్నియెడల రెం డౌపవిభక్తికములు గావచ్చును. అది బహుళశబ్దముచే సిద్ధించు నని వీరు తలఁచిరా? ఈసూత్రమునందలి ప్రాయికశబ్దముచే నూరు మొదలగువానిలో నుండి యిత్వమును (బొందుటయు) బొందనిపక్షమున అచ్చి 31సూత్రముచే టివర్ణమును బొందు నని గ్రహించుట సక్రమము గదా

కాఁగా బహుళ మనకుంటవలన సూరిమతమునఁ గలుగునిబ్బందులు లేవు. వి.వి. బహుళ మనుటఁబట్టి వీరు నట్లు చెప్పి రేమో. కాని చిం.,వి.వి.లకంటె సమగ్ర మగు ప్రణాళికతో నున్న సూరియౌపవిభక్తికవిధానమున నది యవసరము గాదు. ఇంకను 'బహుళ'స్థలములలోఁ బ్రసిద్ధ మైయుండువైకల్పికస్థితి యౌపవిభక్తికములయెడ నరు దగుటంబట్టి బహుళ మనుటకంటెఁ బ్రాయిక మనుటయే లక్ష్యానుగుణ మని గుర్తింప వచ్చును.

కాఁగా నీసూరిలక్షణ మెంతయు సూక్తము,

ప్రోలున ;

ఇట్టిప్రయోగముల ననుసరించి వరుఁబవారు 'ఇవిదిత్వతీయేత్యాది (29)సూత్రము లోనిప్రాయికశబ్దముచేఁ గొన్నియౌపవిభక్తికము లనౌపవిభక్తికములు నగు నని సమర్థింపఁదగు' (వ్యా,స,ప,913) ననిరి, ఇంతమాత్రముచే నివి యనౌపవిభక్తికము లనుట తగదు, ఔపవిభక్తిక మనునేశబ్దమునకు 'స'ప్తగ్రకపరకతలో నౌపవిభక్తికములు లేవు, కావునఁ బ్రాయికశబ్దముచే సప్తమీనర్థకపరకత్వమున నౌపవిభక్తికములు రానేర వని గ్రహించుట యుచితము, నీటన్ ఇత్యాదు లందుప్రత్యయముతో సాధింపఁ బడును గాన బాధ లేదు,

ఊరు మొదలగువాని కిత్వం బగు (80)టివర్ణంబు గొన్నిం టియంతాకరంబున కాదేశంబునగు గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు (81) ననువాని నట్లు గ్రహించిరి. (ఉ.72,78సూ) టీకర్తలమున "కొన్నిటికి ఇంటి అనునది యాగమ మగును" అని అధికముగాఁ జేర్చిరి. పది యింటిని అనుదాని (ఉ.200)నుద్దేశించియే వీ రిట్లు చెప్పి రనుట స్పష్టము.

చెప్పఁదలఁచినవారు 'యింటి' యని చెప్పినఁ గొంతనయము. అగను మయిన 'ఇంటి' అపదము గావున అంద్వగాగమాదిసూత్రముచే నిత్యసంధి జరుగఁగా పది + ఇంటి కి– పదింటికి అనియె యగును. సూరివలె సంద్వగాగమను లనిరే కాని యీ యింటి నందుఁ జేర్పలేదే వీరును. విధానసామర్థ్యము నాశ్రయించి యిట సంధి లే దన వలె. పిదప యడాగమము చేయవలె. ఇంతకంటె 'యింటి' అని యకారాదిగా విధించుట లాఘవము గదా.

కొన్నింటి కని సామాన్యముగాఁ జెప్పుటకంటె (సూరివలె) సంఖ్యావాచకముల కని స్పష్టముగానే చెప్పఁదగు. ఇంకను పది తొమ్మిది శబ్దములకు మాత్రమె యిది వేయి గానవచ్చు (ఇదంతసంఖ్యావాచకముల కనఁ దగు నేమో.) అట్లు స్పష్టముగనె నియమింపఁదగు.

ఇంటిప్రత్యయమునుగూర్చి యింతకుముందు గమనించితిమి. (వ్యా.సం.స. 941) సూరిలక్షణము సూక్తమె కదా.

వీ రిట నుదాహరణములలో నీరు నీటిని 'నీంటిని' అనియుఁ జూపిరి. 'నీఁటిని' అనురూప మెట్లయ్యెడి. ప్రస్తుతసూత్రమున టి, ఇంట్లు నిర్ధించిరి. నీ-టి అనుచో ఇ-టి అగునదా?

'టి ంటివిధానముచే టీకర్తకము ఖండపూర్వకము కానేర దని యెఱుంగునది' (ఉ.205) అనిరి. సూత్రమున 'ంటి' ఇట విధింపఁదలఁచినాః అట్టియెడలఁ బిదప,

64,75సూత్రములలో టివర్ణమునకు ముందు బిందువు చెప్పనేల? ఆసూత్రము లన వసరములు. 'ంటి' ప్రత్యేకముగా నౌపవిభక్తికముగాఁ జెప్పునప్పుడు 'టి'వర్ణమునకు ముందు బిందువిధాన మేల? 'అటి' ప్రత్యయ మన్న వీరు టివర్ణమునకు ముం దత్వము చెప్పిరా? 'ంటి' విధింపఁ దలఁచిన నది యసంగతము. కానిచో 'నీంటిని' అని యుదాహరింపుట సరి కాదు. టింటివర్ణకము లనురీతిగా విసరణమున 'ంటి'ని వేర్కొనుటయు సరి కాదు



'టివర్ణకము' అని యౌపవిభక్తికములను పెరుంలవారు వర్ణకము లనఁగాఁ బ్రత్యయములుగాఁ జెప్పిరి. కాని 'ఇవి వర్ణములే కాని వర్ణకములు కావు. కొందఱు ఔపవిభక్తికవర్ణకములు ఔపవిభక్తికప్రత్యయములు నని వ్యవహరింతురు. ఆవాడుక అలాక్షణికము- (రమ,310) అనుట దీని నుద్దేశించియె యగు నేమో? ఏ మయినను సూరి యౌపవిభక్తికములను బ్రత్యయములుగా నెప్పుటను వ్యవహరింపలేదు.

### హ్రస్వముపైఁ బూర్ణము :

బాల.అచ్చి.32,33సూత్రములను వీ రట్లె గ్రహించిరి. (ఉ,74 75) వీరు విశేషముగా 'టివర్ణకము'గాఁ జెప్పినదిమాత్రము సూరిమతమునకు విరుద్ధ మని పైని స్పష్టము.

ఈవిషయములను "టి, ంటి, అటి అనునౌపవిభక్తికములు" అని సూచించిరి, ఇట విధించిన 'ఇంటిని' వీరు సూచనలోఁ జేర్పలేదు. సూచికయం దున్న 'ంటి' ఆట విధింపఁబడ లేదు. (అటి పిదప మఱల సూచింపఁబడి విధింపఁడుచున్నది.) ప్రస్తుత సూత్రములచే ముంచు పూర్ణమును బొందిన'టి'వర్ణమునే 'ంటి' వర్ణముగా నిర్దేశించిరా? అయిన 'ంటి' యనునది ప్రత్యేకముగా లే దన్నమాటయే కదా. దానిని వీ రేల ప్రస్తావింతురు. 'అటి' ప్రత్యయ మనుచో టివర్ణమునకు ముం దత్వము విధింపలేదు కదా. ఔపవిభక్తిక మగుటివర్ణమునకుఁ బూర్ణ మగు ననఁగా 'టి'వర్ణమె గదా యౌపవిభక్తికము. సూరిమార్గము సరిగా ననుసరింపమివలనర్థముగా దీనిని గుర్తింపఁనియపను,

నెత్తుటిని మొద లగుచోట్ల బహుళపదముచేఁ బూర్ణము లే దనిరి. 'ంటి'వర్ణము ప్రత్యేకముగాఁ జెప్పుచో 'అట్లు కొన్నింటికి 'ంటి' బహుళంబుగా నగు' అని సూత్రమునఁ జెప్పుకొనవలె. పూర్ణస్థితి యెడ సూరిలక్షణమునకు లె నందు స్పష్టతాసమగ్రతలు గలుగునా? 'ంటి' ప్రత్యేకముగాఁ బేర్కొన్నను ప్రత్యేకముగా రఘునాథవారు విధింప కుండుటవలనఁ గొంత యే నిష్ఠార్థమునకు బాధ తగ్గినది.

సం.లో నొకవిశేషము "ఖండబిందువు హ్రస్వపూర్వకత్వమున వికల్పముగాను నుడితొలివర్ణ(హ్రస్వ)ము మీఁద నిత్యముగాను నిల్చుటచే వానితో నిండుసున్న నిలువని పక్షమున నర్ధబిందువు నిల్చు నని భ్రమింపరాదు. ఇట్టిసందేహము గల్గకుండుటకే చింతామణి 'టింటి' అని పూర్ణబిందువుపూర్వకత్వము పృథక్కరించి యుపదేశించె' (వ్యా.సం.స.940) ననిరి. చిం. పూర్ణబిందుపూర్వకముగా నిర్దేశించుట గుణవిశేషమే. కాని సూరిలక్షణమునెడల వీరు 'ఖండబిందువు' అని సామాన్యముగాఁ జెప్పిరి. సూరి మాత్రము స్పష్టముగా 'పూర్ణబిందువు' అనియే యుచ్చరించెను. పూర్ణబిందువు వచ్చునని లక్షణము చెప్పుచుండఁగా నర్ధబిందువు వచ్చునని భ్రమించుటకే నవకాశ మేది? వర్గయుక్సరళపరకత్వమునఁ బూర్ణబిందు వగు నన ఖండబిందువు వచ్చినదా? (సంధి19) 'బిందు' వని సామాన్యముగా రఘునాథవారు చెప్పుకొనుటచేఁ దమవాక్యము వలన ఖండబిందుప్రసక్తి గల్గిన దను కొనిరేమో. సూరి పూర్ణబిందు వని పూర్ణమునే నిర్దేశించెను. కాన నిట ఖండబిందుప్రసక్తి లేదు. కావున సూరి చింతామణిప్రక్రియను మార్చుటచే బాలవ్యాకరణప్రక్రియలో నట్టిఖండబిందుశంక యంకురింపవలసె' (వ్యా.సం.స.940) నని రఘునాథవారు పేర్కొనుట కేవల మసంగతము. చిం.ప్రక్రియను మార్చుటచేత టివర్ణమునకు ముందు పూర్ణబిందువు (ంటి) పదాదిహ్రస్వముపై (నాయాస్థలముల)నిత్యముగా నుండుట కొన్నియంశములు స్పష్టముగా నిరూపింపఁబడినవి.

ఇంకను నిట నెత్తుటికి ఇత్యాదులలోఁ బూర్ణబిందువు వచ్చు నేమో యనుసందేహమును, వారించుటయు, పడియుంట్లి అనురీతిరూపము లసాధ్యము లగుటయు నెన్ని, వీనికయి 32సూత్రములోని బహుళపదమును, 29సూత్రములోని ప్రాయికశబ్దమును సూరికి శరణము లగుచున్న వనిరి. (వ్యా.సం.స.941) అట్టిప్రయోజనమును బహుళాదిశబ్దములచే సాధించుకొనుటలో బాధ యేమి? అట్టిప్రయోజనము లేకున్న సూత్రము

లం దాపదము లేల? బహుళగ్రహణముచేత నెట్టిదిని– మున్నగుచోటులందుఁ బూర్ణబిందువు రానేరదు' (ఉ 205) అని వీరు తమగ్రంథమునఁ జేసినపని యదియే.



పదింటికి ఇత్యాదులలో ఖండబిందువు గల్గుశంకయే (వ్యా.సం.స.941) నిరాధారము గావునఁ దన్నివారణార్థము బహుళపదము నాశ్రయింపవలె ననుట యసంగతమె.

ఇఁక 29సూత్రమునందలిప్రాయికశబ్దము దేనికి శరణము కావలె. 'పదియింటికి' అనురూపము నది సాధింపఁజాలదు. ఎప్పుడ నైన లేకుండుటయో, వైకల్పికముగా నగుటయో, నిత్యముగా నగుటయుఁ జెప్పుట యుచితము. అంతే కాని యాపవిభక్తికములలోఁ బరిగణింపనివర్ణ మగుట యెట్లు? సూరి టివర్ణమునకు ముందు బిందువు ఇత్వము. మున్నగుతీరుగాఁ బ్రక్రియను జెప్పియుండ ఇంటి అని యగు ననుట యెంత మాత్రమును సూరిమార్గము కానేరదు. ఇఁకను పదిఁటికి అనుచో 32సూత్రమునందలి బహుళశబ్దముచేఁ బూర్ణబిందువు వచ్చునపు డరుదుగా ముందు 'యి'త్వ మనవశ్యకార్యముగా వచ్చుట గల దని చెప్పుట యుక్తము.

వీరిట 28సూత్రమునందలిప్రాయికశబ్దమును ప్రస్తావింపవలసినయవసరమున్నతా వొక్కటియుఁ జూపలేదు.

'ఎఁడుప్రత్యయాంతములకు నిత్యము. బారెంటను జుట్టెంటిలో' (ఉ.208) నను నటి పదార్థం బగు హ్రస్వముమీఁదిస్థలముగాఁ జూపుట సరి కాదు. ఎఁడు ప్రత్యయము నపదము కావున నిందలిపూర్ణము అచ్చిలి32సూత్రముచే నవునది కాదు.

ఆ ట్లని హ్రస్వము మీఁది–అను32సూత్రముచే నవునదిగాను జెప్పఁ బని లేదు. ఎఁడుప్రత్యయమున ఖండబిందువు గలదు. అంత్యాక్షరమునకు టివర్ణ మాదేశ మైనను ముందఱిబిందు వే మగును? "రెంటిని, రెంటన్ మూఁటిని మూఁటన్ (ఉ.200) ఇట్టి సిద్ధఖండబిందుస్థలములలో టివర్ణకము ఖండబిందుపూర్వక మగుటలో నెట్టియవరోధమును లేదు. (ఉ.205) ఇది సాధ్యఖండమ యయ్యును టివర్ణము వచ్చుటకు ముందే యున్నది. కావున నది లోపించు ననుట కాధార మేది? హ్రస్వముమీఁదిఖండము వైకల్పికముగాఁ బూర్ణ మగును. (సం.14) కావున బారెఁటు, బారెంటు అని యగును.

బారెటు ననురీతిరూపములు వారింపవలసియే నమ్ముచో నిప్పటిలెనిసూత్రమునందలి బహుళపదము నాశ్రయించు టే నుచితము. కాఁగా వరుసులవారు దీనిని కిలెసూత్రము క్రిందఁ జూపుట సరి గా దని నిశ్చయింపఁగగును.

అటీతిని

'అజ్ఞు మొదల లగుశబ్దంబుల కంతాగమంబు తిసర్గంబును రేఫంబున కొక్కెడికి లోపంబు నగు' (84)ననుదానిని వీరు అజ్ఞు మొదల లగుశబ్దంబుల కంతాగమంబు ఇతి పర్గంబును శకటంబున కొక్కెడికి లోపంబు నగు' (ఉ.79సూ) నని చూపిరి. వీరి సూత్రమున 'శకటంబున' కనఁగా శకటరేఫమున కని యర్థము. వ్యాకరణము గదా సూరి 'రేఫంబున' కనుటకంటె శకటంబున కన్న స్పష్టతర మైయుండు నని వీ రధి పడియుందురు. సూరివచనము సముచితమే.

ఇతి వీరు విశేషముగాఁ జెప్పినది. తిసర్గ మొదఁ టున్నది. ఇత్వము వేఱుగ జెప్పరాదా? ఔపవిభక్తిక మగుటిపర్గమునకు ముం దిత్వమును సూరివలెనె వీరును జెప్పి 'ఇటి' సాధించిరి. 'ఇతి' మాత్ర మ ట్లేల సాధింపరాదు? సూరిప్రణాళిక విశిష్టము. 'ఇతి' అనుట యనవసరము.

వీనికి అచ్చి.80.సూ.చెప్పిన అత్వము నిల్చునపుడు 'ఱు' అనునది నిల్చును. అజ్ఞు- అఱుతన్- (ఉ.207) ఔపవిభక్తికమె 'ఇతి' అయినపుడు విసర్గము నిల్చుట యెట్లు సంభవము. 'ఇతి' పర్గమున నిత్వము లోపించిన దనవలె నేమో. ఔపవిభక్తికము 'ఇతి' అనుటయనే కదా టిసర్గపరకతలో నిత్వము 'బహుళము'గాఁ జెప్పిరి. తిసర్గ మును గూడ నటఁ జెప్పియున్నచో నీస్థలముల నిత్వము రాకుండుట బహుళశబ్దముచే సిద్ధించెడిది గదా. (సూరిమత మట గమనింతము.) వరుణునికార్యంబు పఱితిపోయెగఁ జేసె (భాస్క.యు1394వ్యా.సం.స.944) అనుచోఁ బొరపా టేమో?

ఇంతకును అజ్ఞుప్రభృతిశబ్దము లాఱింటియందుమాత్రమె యీకార్యము. కావునను 'ఇతి' భిన్న మగువే టొక్కెడిగా నిరూపింపవలసినంతటి ప్రచురమును గాదు.

ఉత్వమునకే యిత్వమని చెప్పినసూరిప్రజ్ఞాశక్తియే యెంతయు నుచితము గదా.



గోతులు :

'విభక్తి పరంబగునపుడు గోయిప్రభృతులతుదియక్షరంబు తివర్ణం బగు' (35) దీనిని వీరు 'గోయిప్రభృతులతుదియక్షరంబున కాదేశముగా తివర్ణంబు నిల్చును' (ఉ,78.సూ) అని పేర్కొనిరి. 'తుదియక్షరంబునకు' ననుచో నున్నషష్ఠీవిభక్తిచేతనే 'తుదియక్షరము స్థానమున' వచ్చు ననునర్థము సిద్ధ మగుచుండుటంబట్టి 'ఆదేశముగ' ననుట సూత్రమం దనవసరము.

సూరిసూత్రమందలి 'విభక్తి పరంబగునపు' డనుదశమును దొలఁగించిరి. బహుత్వపు 'తి' ఔపవిభక్తికము గా దని (ఉ.206) వీరినిర్ణయము. దీనింగూర్చి యింతకు ముందు గమనించియుంటిమి. కావున నిది తొలఁగించుట సరి గాదు. సూరి లక్షణ ముచితము.

జాయి :

జాయి- 'గోయిప్రభృతులలోఁ జేరనపుడు జు అనునది తుదిని లేమింజేసి అజ్ఞు ప్రభృతులందును జేరనేరు' (వ్యా.సం.స.346) దనిరి. జు అనునది యంత మం దున్నశబ్ద మైన నెల్లవానిని అజ్ఞుప్రభృతులలోఁ జేర్చుటకు సూరిసమ్మత మనుటకు వీలు లేదు. అట సూరి 'ఇవి యజ్ఞుప్రభృతులు' అని యవి నియతగణముగఁ జెప్పెను. ఆకృతిగణము గామి నందుఁ జేర్పరాదు గదా.

ఇంకను గోయిప్రభృతులను బేర్కొనుచో నిత్యాదు లనెఁ గాన నంతుఁ జేర్ప నవకాశము గలదు. కాని వజ్ఝలవారు 'గోయిప్రభృతు లనుచోట ప్రభృతిశబ్ద మున్నను (ఆజ్ఞు మొద లగుశబ్దము లనెఁ గదా యని యందుఁ జేర్ప వీ లగు నేమో యని యంతకు ముం దనుకొని రేమో. కాని యజ్ఞుప్రభృతు లన్నను గోయిప్రభృతు లన్నను నాగణమును విస్తరించినతీరునుబట్టి యాగణమున నుండ వీ లగుటయు లేకుండుటయు గు ర్తింపవలెను.) జాయిశబ్దమును గోయిప్రభృతులలోఁ జేర్చి జాలు అని

యుదాహరించి సూరి జాలు అని యుదాహరింపమిచేత దీనిని గోయిప్రభృతులలో సైతము గణించె ననుట విశ్వసనీయము గా' (వ్యా.సం.స.947) దనిరి. 'జాతులు ముష్నగుబహువచన తిపర్ణప్రయోగము జాయి శబ్దమునకు లభింపమింజేసి (వ్యా.సం.స.946) సూరి జాతు అని యుదాహరించుట యెట్లు సంభవించును? కావున నట్టిరూపము సూరిసమ్మతము గాదు. రేయిప్రభృతులలోఁ జేర్చినమాత్రమున గోయిప్రభృతులలోఁ జేర్చుటలో బాధ యేమి? గోయిప్రభృతులలోఁ జేర్పఁగా జాతిని, జాతన్ ఇత్యాదు లగును. గోయిప్రభృతిత్వముచే గోతు లనుతిరుగా జాతు లనుతిరుగాఁ గావలెఁ గాని గోయిత్యాదులకు భిన్నముగా నీజాయిశబ్దమును రేయిప్రభృతులలోఁ జేర్చుట నట నంత్యాక్షరము లోపించుచున్నది. అంత్యాక్షరము లోపింపఁగా నిఁక 'తి'వర్ణము ప్రాప్తించుట కవకాశము లేదు. కావునఁ బ్రయోగములం దున్న జాలు, జాతిని అనురూపములు సాధింపఁబడుటయుఁ బ్రయోగములలేని జాతు అనురీతి వుపేక్షింపఁబడుటయు సూరిమతమున సముచితముగ సిద్ధించె. కావున "జాయిశబ్దోపరితికీక రూపము బాలవ్యాకరణముచే సిద్ధింపఁబడకుండుట యనునదర్థము దుర్వార మగుచున్నది" (వ్యా.సం.స.947) యనుపరుబివారియభిప్రాయము సరి కాదు.

ఉత్వమున కిత్వము ;

'జితివర్ణంబులు పరం బగునపు డుత్వంబున కిత్వం బగు' (37) ననుదానిని 'టివర్ణంబు పరం బగునపు డుత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు' (ఉ.76.సూ) నని చూపిరి. 'ఇటి ప్రత్యయ "మునకు టివర్ణపరకత్వమున నిత్వము చెప్పుట కొంత నయమె. తివర్ణ మిటఁ జేర్పక వీ 'రితి'వర్ణ మనుటనుగూర్చి గమనించి సూరిమార్గము నందలియౌచిత్యము గుర్తించితిమి.

సూరి యిత్వం బగు ననఁగా వీరు 'బహుళంబుగా నగు' ననిరి. అయ్యు సూరి "కొన్నియెడల నీయిత్వము గలుగదు. నెత్తుటికి (ఎదుటికిన్, పురుటికిన్) అని పేర్కొనె వీరికయితే వీరు బహుళ మనిరా? సూత్రాంధ్రమున సూరి నుదుటికి నన్నదియుఁ జూపె. ఇందుకయి బహుళ మనుట తగదు. 'బహుళస్థలమున వైకల్పికస్థితి ప్రచుర మైయుండుట ప్రసిద్ధము. కాని యిట నిత్వము వికల్ప మగుట లేదు. పెక్కెడల నిత్యముగనె యగుచున్నది. కొన్నియెడల నన నగుటయె లేదు.

కావున వరుఖులవారు బహుళ మనుట సరి కాదు. ప్రాయిక మనఁదగు(క్రియా.87)నేమో పరిశీలింపవలె. అయ్యెను క్రియా.87 సూత్రస్థలము నిట స్మరింపఁదగును. (ఊ.క్రి.89).



టి_అత్వము :

'టివర్ణంబు పరం బగునపుడు క్రిందుమీఁదుముందువర్ణంబుల కత్వం బగు' (87) ననుదానిని వీరు క్రిందుమీఁదుముందువర్ణంబులకు అటి అనునది బహుళముగా నిల్చును' (ఉ 77.చూ) అనిరి. వీరు 'అటి'ప్రత్యేకముగాఁ బరిగణించుట యనవసర మని మొదటనే గ్రహించితిమి. సూరిప్రణాళికలో నౌచిత్యము గలదు. 'అటి'వర్త మనుటవలన సంధి చేయవలసిన యవసరము వరుఖులవారిపక్షమునఁ గల్గ, టివర్ణము వేఱుగఁ జేసి ముం దత్వమును జేయుట (సంధిప్రసక్తి లేక) సూరిమతము.

కాని 'అటి' అని చెప్పుకొనుటవలన వీరు సూరికంటె భిన్నముగా 'బహుళముగా' నని చెప్పుకొనవలసివచ్చినది. బహుళం బనుటచే [సేవునకున్ అనియుఁ గలదు. (ఉ.206) సూరి టివర్ణము పర మగునపు డనుటచేఁ బ్రాయిక మగుటివర్ణము రాక సేవు నకుఅనుచో నత్వప్రసక్తి లేదు గదా. బహుళపదమును వీరు ధారాళముగ వాడుచుండిరి. కాని యిటఁ గూడ వైకల్పికస్థితి గానరాదు. ఒకటి రెండుచోట్ల అట్టి కాన రావున్న మాత్రమున బహుళ మనుట యవసరమా? తత్స.66సూ. నట్లు గదా వీరు విమర్శించిరి.

ఏ మైనను స్పష్టమును సమగ్రము నగుసూరివిధాన మెంతయు సూక్తము.

అత్వము :

ఔపవిభక్తికములత్సృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు, (88) ననుసూరిలక్షణమును నట్లు గ్రహించిరి (ఉ.80 చూ).

బహుళగ్రహణముచేత ,ఊరను ఇంటను మేనను మున్నగునవి సప్తమ్యర్థక ములు మాత్రమే యని గ్రహింపవలయును, (ఉ 207) కాఁగా ఊరు చోటు మొన్నాదు లన్నిఁగ్విషయంబు లను, పౌర్థ.లక్షణము వ్యర్థమె యని వీరు సూచించిన ట్లయినది. ఇట్లు వీరు కేసొక్కొచ్చుదుదన్నానా, మ్మనుచిం.విధానము సైతము విడిచిపెట్టఁదగినదిగాఁ దలఁచు

టుచితమె. కావున చింతామణికర్త న ప్రత్యయాంతమునుండి యేర్పడెడి అన్ అను దానితోఁ గూడినయౌపవిభక్తికశబ్దములు సప్తమ్యర్థమును మాత్రము బోధించు ననియు' (వ్యా.సం.స.933) మొదలుగా సమర్థించినతీరు సరి గా దనియు స్పష్టము. (చూ.త్రి.శే.) ఊరన్ ఇంటన్ అనువాని కెప్పటను దృతీయార్థమునఁ బ్రయోగము లేదు. కాన నీవిషయమును రెండువిధములుగా సూత్రించుట యనవసరము. కావుననె చింతామణికర్త కేషాఞ్చిదిత్యాదిసూత్రమును, నౌపవిభక్తికేత్యాదిసూత్రమును నుపదేశించిన వాఁ డయ్యె' (వ్యా.సం.స.948) ననుట సరి కాదు. పై రీతి నొకసూత్రముగనె చెప్పి యాయభిప్రాయమును మార్చుకొను టుచితమే. బాణంబునఁ గూల నేసె (కార.23) ననురీతిఁ దృతీయయందును నపర్థకము గలదు.

కాని పై రిట్టియెడల 'ఊర్వాదులఅత్వము సప్తమ్యర్థకము మాత్రమె' (ఉ.204) అనుట సరి కాదు. ఊరుచోటుమేను ప్రభృతులకు సప్తమ్యర్థమున మాత్రమె అత్వము వచ్చు' (ఉ.204) ననుట కొంతనయము. సప్తమి కైనయత్వము సప్తమ్యర్థకము మాత్రమె యగు. తృతీయ కైనయత్వము తృతీయార్థక మగును. నీట మునిగె ననుచో నత్వము తృతీయార్థకమగునా? నీట నగ్ని గల దనుచో సప్తమ్యర్థక మగునా? కావున నూర్వాదులపై నున్నతృతీయ కత్వము రా దని బహుళశబ్దముచేఁ జెప్పుకొనఁ దగును.

అసలు 'ఊరిచేత' ననుతీరుగా నిటఁ దృతీయావిభక్తి యున్నదా? తృతీయార్థమున కిట నవకాశము లేమిఁ దృతీయయే లేకుండఁ దృతీయ కత్వము వచ్చుప్రసక్తి మాత్ర మే మున్నది? అని సందేహము. ఊరిచేత ననురీతిప్రయోగము లభించి యెట నత్వము లేకున్న నపుడు వీనిపైఁ దృతీయ కత్వము రా దనియు (సప్తమికి యగు, ననియు) బహుళపదముచే గ్రహింపవచ్చును.

ఇది అచ్ఛికపరిచ్ఛేదము

# కారకపరిచ్ఛేదము

## ప్రథమ

'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' (1) ననుసూరిలక్షణము నట్లు గ్రహించిరి.

ఇట విశేష మిది. ఉక్తార్థప్రథమోదాహరణములు. రాముఁడు రావణుని జంపెను — పైవాక్యమున నాఖ్యాత మనఁగా ధాతువుమీఁదిలిట్టు (ఎనుప్రత్యయము) కర్త్రర్థకము — కానఁ బునరుక్తముగాఁ గర్త్రర్థమున రావలసినతృతీయ రానేరదు. ఇఁకఁ గేవలప్రకృతి ప్రయోగయోగ్యము కాదు గావున — పదత్వపుసిద్ధికయి ప్రాతిపదికార్థప్రథమ వచ్చు నని గ్రహింపవలయు (ఉ.209)(వ్యా.సం.ప.857) ననుపరులవారి సమన్వయ ముచితముగాఁ దోఁపదు. పైవాక్యమునందు 'రాముఁడు' అనుచోటిప్రథమ ప్రాతిపదికార్థమునం దయిన దని వీరు సమన్వయించుచుండిరి. కాని సూరి దీని నుక్తార్థమునందలిప్రథమకుఁగా నుదాహరించెను. వీరు నట్లే యిది యుక్తార్థప్రథమోదాహరణముగా వివరింప నారంభించి తుదకిఁ బ్రాతిపదికార్థమునం దయిన దనుట యెట్లు సమన్వయించునో తెలియకున్నది. ప్రాతిపదికార్థమునందు సంబోధనార్థమునందు నెట్లో యట్లే యుక్తార్థమునందుఁ బ్రథమను బ్రత్యేకముగా సూరి విధించెను. సూరి లక్షణము నట్లు గ్రహించి వజ్ఝలవారును నుక్తార్థమునందుఁ బ్రథమ ప్రత్యేకముగా నగుట చెప్పియేయుండిరి. వీ రెల్లయెడల నుక్తార్థమునందలిప్రథమను ప్రాతిపదికార్థమం దయినట్లు సమన్వయించిరి. ఇట్టియెడల నుక్తార్థప్రథమ కుదాహరణము లేవి? లేకుండఁగా నుక్తార్థమునం బ్రథమ విధింప నేల? పైస్థలమునఁ బ్రథమ ప్రాతిపదికార్థమునంద యైయుండినచో నీసూత్రమును 'ప్రాతిపదికసంబోధనార్థంబులం బ్రథమ యగు' నని మాత్రమె చెప్పిన నష్ట మేమి?

వర్ధులవాతియీసమన్వయము పాణినీయానుగుణము కావచ్చును. కర్మణి ద్వితీయా- అనుక్తే కర్మణి ద్వితీయా స్యాత్. అభిహితే తు ప్రాతిపదికార్థమాత్రే ఇతి ప్రథమా ' (వ్యా.సం.స.958) కాని యట ప్రాతిపదికార్థలింగపరిమాణవచనమాత్రే ప్రథమా, సంబోధనే చ యని యుక్తార్థమునఁ బ్రథమ చెప్పఁబడకుంట గమనార్హము. ఇంకను నట 'అనభిహితే' యనునధికారసూత్రము ననుసరించి కర్మాదులకు ద్వితీయాదు లవి క్రియచే నభిహితములు గానపుడే యగు నని చెప్పఁబడె. సూరి గాని వీరు గాని యట్లు చెప్పలేదు. ఉక్తార్థమునఁ బ్రథమ ప్రత్యేకముగాఁ జెప్పుటచే సూరి అనభిహితత్వ మనునధికారసూత్రముతోడివిధానము చేయ నవసరము లేక పోయినది.

రాముఁడు రావణుని జంపెను. రాముఁడు కర్త కదా. దానికి 'చేతపర్ణకంబు కర్త కగు' ననుసూత్రముచేఁ జేతవిభక్తి రావలసియుండఁగాఁ గ్రియచే నుక్త మయినది గావునఁ బ్రస్తుతసూత్రముచేఁ బ్రథమ యైన దనుసూరిమతము సుస్పష్టము.

ఇట బా.సా.పే. వివరణము (వ్యా.సం.స.958) సూరిమతానుగుణము గావున నది సరి గా దను టుచితము గానేరదు.

ఉక్తార్థస్థలములందలి ప్రథమ ప్రాతిపదికార్థమునంద యయిన దగు నని తలఁచిన వీరు 'ప్రాతిపదికార్థప్రథమ సామాన్యముగాఁ గోశాదిప్రసిద్ధ' (ఉ.209) మనుట విశేషము.

కూర్చి :

కర్మంబున ద్వితీయ యగు (2) ననుదాని నట్ల గ్రహించిరి.

'సంస్కృతవ్యాకరణప్రసిద్ధము లగుకర్మప్రవచనీయార్థములలో నొక టగు నిత్థంభూతాఖ్యానార్థమునఁ దెలుఁగునందుఁ గొన్నియెడలఁ గూర్చివిభక్తి నిల్చును. (గురించి గురించి మున్నగునవియు విభక్త్యర్థాభిధాయకశబ్దములు) —కూర్చివిభక్తి పరమగునపుడు ప్రాతిపదికకు నుగాగమ మగును. (ఉ.211)' కర్మప్రవచనీయకేకూర్చిః

అనుచిం. లక్షణమును సమర్థించుటకై వీ రిట్లు కూర్చని ప్రత్యయము చేసి రేమో. కాని

చిం. కూర్చిలనునయోఘవేద్ద్వితీయాతు' అనికూర్చిని ద్వితీయావిభక్తిగాఁ జెప్పఁగాఁ దమ యూగ్రంథమున వీరు సూరి ననుసరించి 'సువర్ణంబు ద్వితీయావిభక్తి' (తత్స.2) యని సువర్ణము నొక్కదానినే ద్వితీయావిభక్తిగాఁ బేర్కొనిరి. దీనింబట్టి తెలుఁగున 'కూర్చి' యనువిభక్తిప్రత్యయమె లేకుండఁగా నిటఁ గూర్చివిభక్తి యగు నని చెప్పుట వారిలక్షణ మునకె విరుద్ధము కాదా? ఇది విభక్తి యవుటకు నది పర మయినవుడు నుగాగమ మగుటకును వీరియీవివరణము తప్ప మఱేక నెట్టిలక్షణప్రమాణమును వీరిగ్రంథ మునఁ గానరాదే. సూరి షష్ఠీప్రత్యయమును జెప్పి నుగాగమము విధింపలే దని విమర్శించినవారు నుగాగమమే కాక కూర్చి ప్రత్యయమునే చెప్పకుండుట సమంజసమా? ఈవివరణమునుబట్టియె యట్లు గ్రహింపవలయు నన్న 'జ్ఞానముఁబట్టి' యనునుదాహ రణమునుబట్టియె సూరిమతమునను బట్టి పరకనుగాగమమును గ్రహింపరాదా?

పిదప 'గుఱిచి గుఱించి మున్నగునవియు విభక్త్యర్థాభిధాయకశబ్దము' లనిరి. 'మున్నగునవియు' అనుచోట సముచ్చయ మేల? పూర్వోక్త మగుకూర్చియు విభక్త్యర్థాభిధాయకశబ్దమా? కాని విభక్తి యనిరే. డుము ఇత్యాదిగా విభక్తులు విభక్త్యర్థాభిధాయకశబ్దములందురా? విభక్తులు విభక్త్యర్థాభిధాయకశబ్దము లభిన్నములా?

ఇంతకు ముందు వీరే "కూర్చి గుఱిచి, గుఱించి, యనునవి ద్వితీయకుఁ (కార.2.సూ) బరముగాను నన్ప్రయుక్తము లగు (ఉ.95) ననిరి. ప్రస్తుత సూత్రము కూర్చి గుఱిచి గుఱించి యనువానిలో దేనిని గాని యన్ప్రయుక్త మనుటను విధింపదు. కాఁగా నిచ్చటివివరణమునుబట్టి యగు నని వీరియుద్దేశ్య మేమో. పఱ్ఱులవారివివరణములను సూత్రములవలె 'విధానము'లె యనియు సూత్రవివరణము లకు భేదములే దనియు వీరిమత మేమో. కాని యట్టివానిని సూత్రములచే విధించుటయె యుచిత మనిపించును.

ఇఁక నీవివరణమునఁ గూర్చి యనునది విభక్తియే యనియు, గుఱిచి గుఱించి యనునవి విభక్త్యర్థాభిధాయకశబ్దము లనియుఁ జెప్పిరి. ఇంతకుముం దివి 'ద్వితీయ కన్ప్రయుక్తము' లనిరి. అట్లె యగుచో కూర్చి గుఱిచి గుఱించి మఱల ద్వితీయా విభక్తులో విభక్త్యర్థాభిధాయకశబ్దములో యగుట యెట్లు? విభక్తులు గాని, విభక్త్యర్థాభి

ధాయకశబ్దములు గాని తత్త్వభక్త్యర్థమునఁ ప్రాతిపదికముపై నగును గాని విభక్తు లపైఁ జేరవు గదా.

పూర్వపువీరి వ్రాఁత ననుసరించి 'అంజనసంధవుఁగూర్చి' యనుచోఁ గూర్చికి ముందఱి 'ను' ద్వితీయావిభక్తి యనవలయును. ఇది నడి యోగము మనుచున్నారు. ఇట్టి రెండు వ్రాఁత లెల్లవిషయములఁ బరస్పర విరుద్ధము లగుచున్నవి.

ఇట్లు గూర్చివిభక్తి పర మగునపుడే ప్రాతిపదికమునకు నుగాగమము చెప్పిరి. గుఱిచి, గుఱించి యనువిభక్త్యర్థాభిధాయకశబ్దములు పర మగుచో నుగాగమ మగునా కాదా? ఇంతకు ముందు గుఱిచి గుఱించి యనునవియుఁ గూర్చి వంటి ద్వితీయ కను ప్రయుక్త మగు నన్నదానినిబట్టి వానింగూర్చి, యనుతీరున వాని గుఱిచి వానింగుఱించి యనుతీరుగా నుండుట సాధింపఁబడుచున్నది. ఇది ననుసరించిన ప్రాప్తపద్ధతిలో గుఱిచి, గుఱించి పర మగునపుడు నైతము నుగాగమము చెప్పవలసినది. మఱచి యుందురు.

ఇఁక నివి విభక్తులా విభక్త్యర్థాభిధాయకశబ్దములా? "సంస్కృతమునందు వలెఁ గాక నుండవలె నని యిట్లు చెప్పఁబడెనే కాని యివియు నుద్దేశ్యార్థకములు గాకపోవు" (ఉ 212) అని వీరే చెప్పిరి. సంస్కృతమునకు మాఱుగాఁ గే యుండవలె నని నియమ మేమి? గ్రహాదియోగమునఁ ద్వితీయాప్రయోగము సంస్కృతమున లేదు గదా యన మానిరా? (ఉ.215).

ప్రత్యయముగాఁ జెప్పుచుఁ గూడ 'వరుణునాజ్ఞంగూర్చి పలికె' ఇత్యాదులలోని కూర్చి యను ప్రయుక్తమే యనిరి. ఇట్టిభేదకల్పన మేల? 'కూర్చి' ప్రత్యేకపదముగా నియ్యర్థమున నుండుట స్పష్టమే. (గుఱించి— వ్యా.సం.స.866) కావునఁ బ్రౌఢ. (కార.2) చెప్పినట్లు, వీరును లోఁగడ చెప్పినట్లు, కూర్చిప్రభృతులు ద్వితీయ కనుప్రయుక్త మగు ననుటయ యుచితము. నన్నుఁగూర్చి మిముగుఱిచి మొ॥ (చూ. త్రి.శే.)

 

చేతవర్ణకంబు కర్త కగు (3) ననుదాని నట్ల గ్రహించిరి. (ఉ.6సూ) చేతవర్ణకంబు హేతుకిరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' (4) ననుసూరిలక్షణమును మార్చిరి. "చేతతోడవర్ణకంబులు కరణంబునకుఁ బర్యాయంబున నగును. హేతుమాత్రమునకు చేతవలనవర్ణకములు పర్యాయమున నగును. గ్రహ్యాది యోగంబున చేతవర్ణకంబును నగును" (ఉ.6సూ) సూరిప్రణాళిక ననుసరింపఁబోవుటచేత మాత్రము వీరిసూత్రి మిట్లయిన దని గ్రహింపవచ్చును.

సూరి యంతకుముందు తాను జెప్పిన (తత్స.) తెలుఁగువిభక్తుల నావరుసలో నొక్కొక్కటి యేయేయర్థములం దగునో క్రమముగా నిపరిచ్ఛేదమున సూత్రించెను. అందుకే సూరి ప్రథమ,ద్వితీయలపిదపఁ దృతీయలో మొదటి దగు చేత ఏయేయర్థములం దగునో యీసూత్రమునఁ జెప్పెను. కరణార్థమునఁ దోడ ప్రత్యయ మగుటను 'తోడప్రత్యయ మేయేయర్థములం దగునో తెలుపుతరువాతిసూత్రమునఁ జేర్కొనెను. గ్రహ్యాదియోగమున సంస్కృతానుసారముగాఁ బంచమి రాఁగా దాని కొకపక్షమునఁ జేత యగు ననె సూరి. "ఇందలితృతీయాప్రయోగము సంస్కృతమున లేదు." (ఉ.215) కదా. అందుకే సూరి పంచమికే తృతీయ విధించెను. కించెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు (ఉ.16సూ) మొదలగుచో వఝులవారు సూరి యిట్టిపద్ధతి ననుసరించియే యుండిరి

ఇఁక వీరు విభక్తులను గాక యర్థములను మూలము చేసికొని ఆయాయర్థములలో నేయేవిభక్తులు వచ్చునో చెప్పుమార్గము నెన్నుకొనిరి. అర్థము లొకక్రమములో నిర్దేశించుటకంటెఁ బూర్వోక్తము లగుటచే విభక్తులను క్రమము ననుసరించి విధించుటలో స్పష్టత గలిమి సూరిమార్గ ముచితముగా నున్న దనుటలో సందేహము లేదు.

వజ్ఝలవా రిట్లు మార్పు చేసినయెడల బాల.లక్షణము దురుక్త మేమో యను సందేహమున కవకాశము గల్గును. సూరిలక్షణమున దురుక్తి లేమి గమనింపఁదగును.

ఇంక వీరిలక్షణమున మొదటిరెండువాక్యములందును 'బర్యాయంబున' ననుట స్పష్టతకై యనవలె. అవి లేకున్నను రెండుప్రత్యయము లొకేసారి వచ్చుప్రమాదము

లేదు. కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బువు లగు ననుచో పుంపులు రెండు నొకసారి యగుట యె ట్లసంభవమో. ఇటను రెండువిభక్తు లొకేసారి యగుట యట్ల యసంభవము. (కార.8) కావునను వీరిలక్షణమునఁ 'బహ్వాయంబున' నన నున్నను బాధ లేదు.



సూరి తనమార్గమున కనుగుణముగా 'బహుళ'శబ్దముచే హేతుప్రవను సాధించిన వలనను వీరు సూత్రమునందు చెప్పిరి. ఇ ట్లీతరుల బహుళసూత్రము సూరిలక్షణమునకు వివరణాత్మక మై (బహుళపదమునవసరము లేక) యుండుట గుర్తింపఁదగును. సూరిలక్షణము సూక్తము.

### తోడ :

'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' (5)నను సూరిలక్షణమును దనమార్గము ననుసరించి వీరు 'సహార్థ ప్రథమార్థయోగంబున తోడ వర్ణకం బగు. తుల్యార్థయోగంబున తోడకువర్ణకంబు లగును' (ఉ.8) అని సూత్రించిరి. కరణార్థమం దిట సూరి చెప్పిన తోడను వీరు పూర్వసూత్రమునందు చెప్పియుండుట మఱల నిటఁ జెప్పలేదు.

పృథగర్థమును వీ రధికముగా లక్షణమునఁ జెప్పిరి. దీని కిం సుదాహరణము ప్రత్యేకముగాఁ జూపలేదు. సూరి పేర్కొన్న సహార్థతుల్యార్థయోగములందలివానినే చూపిరి. (ఉ.216)

పాండవులతోడఁ గృష్ణుఁడు వేఱగునె యన్నది కానరె. (వ్యా.సం.స.990) కి రిట వినార్థకను చెప్పకుంట విశేషము అన్యార్థకాములలోని దీవేఱుశబ్దము. పాండుసుతులకంటె వేఱు అనుచో కార.21.సూ.చేఁ దోడ యైనది. కానఁ బృథగర్థము నిట ప్రస్తావింప నక్కఱ లేదు.

తుల్యార్థయోగమున తోడకువర్ణకము లగు ననిరి. సూరి సూత్రమునఁ దుల్యార్థ యోగమునఁ దృతీయకుఁ దోడను జెప్పి తృతీయ కనుటఁజేసి కువర్ణక మగుటను వివరించెను. కాఁగా సూరిలక్షణమున దురుక్తి లేదు. ఇటఁ దుల్యార్థయోగమున షష్ఠియు

సంస్కృతవ్యాకరణసిద్ధ మగుటంజేసి(వ్యా.సం.స.988)సంస్కృతలక్షణానుసారముగాఁ దృతీయ యైన దానికిఁ దోడవిభక్తియుఁ గాక షష్ఠి యైన దానికి 'కు'విభక్తియు నగు నను సూరి నిర్ణయ ముచితమె.



సూత్రమున సూరి 'తృతీయ' యనుట గమనార్హము. ఇట్లాతఁడు ఛాయాస్థలము లం దాయావిభక్తులు సంస్కృతానుసారముగా సిద్ధింపఁగా వానికిఁ దెలుఁగున నేవిభక్తు లగునో చెప్పెను. సంస్కృతమందు వలెఁ గాక తెలుఁగున నాయావిభక్తులయందుఁ బ్రత్యయము లనేకములు గలవు. కావున నాయావిభక్త్యులయందలి ప్రత్యయము లన్నియు నాయాయర్థములందు (ఉన్నయెడల ప్రథమ యగు, చతుర్థి యగు ననురీతిగనె చెప్పె) రానిస్థలములం దిట్లు తెలుఁగున విశేషవిధాన మవసర మైనది. (తోడ సహార్థే టాసః మున్నగురీతిని బా. చెప్పినది. అట్లె సూరియు తృతీయకుఁ దోడ, పంచమికి కంటె షష్ఠికిలోపల- నిత్యాదిగాఁ జెప్పెను. కంటెనర్థకవిధానము మున్నగుస్థలములలో వరుసల వారు నీసూరిమార్గమునె యనుసరించిరి. ప్రస్తుతసూత్రమునఁ 'దృతీయకు' నని చెప్పలేదు. ఇట్లు వీరివిధానములు గొంత యటునిటుగా నడచినవి. -- ప్రథమ యగు కర్తృంబునఁ ద్వితీయ యగు ననురీతిని సమగ్రతకై తెలుఁగునఁ జెప్పఁబడిన యీ సూరి మతమును గ్రహింపవచ్చు. సూరిప్రణాళికను మార్చ నేల? అది యుక్తమె కదా.

### తోడ-అవ్యయము :

తోడకుఁ బ్రత్యేకప్రయోగమును బెక్కెంటి కొక్కటి తుదిదానికిఁ బరముగా నిల్చుటయుఁ గలదు. తోడరా- అనకుల హీనులతోడ- కంటెనర్థకమునకు నిట్టి ప్రయోగము గలదు. సూనులతమ్ములకంటె— తోడుతన్ అనుశబ్దప్ర(?)యోగ మును గలదు. ఆకఁడుం తోడుత మనికి (ఉ.310) అనుచు సూరి గాని ప్రౌఢ. వ్యాకర్త గాని యిట్టిప్రయోగములను సంగ్రహింపలే (ఉ.216) దనుట విశేషము ప్రౌఢలక్షణమును వీ రిట స్మరింపలేదు గాని తోడకుఁ బ్రత్యేకప్రయోగ మనటఁ జెప్పఁ బడియె యున్నది (కార.6) పెక్కెంటి కొక్కటి వాలు ననుచో (ప్రౌఢ కార.7) సశబ్దప్రయోగముచేతఅధికులహీనులతోడ ననురీతి దందు సంగ్రహింపఁదగియే యున్నది. (వ్యా.సం.స.993) కంటెవిషయ మనుక్త మని యిచట వీరియుద్దేశ్య మైన నట్లు స్పష్ట

ముగాఁ జెప్పఁదగును. ఇంక నథస్సూచికను నిర్దేశించుటలో నప్పుపొరపా టను కొనవలెను.



ప్రౌఢ వ్యాకర్తలైన వీరును 'తోడ' విభక్తికిఁ బ్రత్యేకప్రయోగము గల దనుట యుచితముగా లేదు. ప్రత్యయాదు లగుపదములకు స్వతంత్రప్రయోగార్హత గల దనుట యేల? ప్రత్యేకముగాఁ బ్రయుక్త మగుచున్న 'తోడ' స్వతంత్ర మగువే లొక పదమె కాని తృతీయావిభక్తి కానేరదని గ్రహింపఁదగును.

ఉ.సంధి.26 సూత్రమునొద్ద వీరు తోడంబుట్టువు, తోఁబుట్టువు అనుచో తోడను తోను అనునవి ద్రుతాంతావ్యయములు (ఉ.65) అనిరి. అట్టి యవ్యయ మగుతోడ పదమే 'తోడరా' మొద లగుస్థలములలోఁ బ్రయుక్త మైనట్లు గ్రహింపఁదగదా?

వీరు 'తోడనె' ఇటఁ జేర్చుకొనిరి. కాని విద్వజ్జనులును దో, జనుదేరఁగ (సభా. 2.158) కానన భూములైనఁ దో నెక్కెయు (శల్య 1.207) (సూ.ని) అనుచో తోశబ్దమును నిట్లు ప్రయోగింపఁబడుచున్నది గదా.

శ.ర. తోడ, తో అనువానిని ద్రుతాంతావ్యయములుగాఁ జెప్పుటచే నట్టి వీరు నట్లు చెప్పియుందురు. సూ.ని. వీనిస్వతంత్రప్రయోగములను జూపియు నవ్యయములుగాఁ జేర్చుకొనలేదు. శ.ర.కుఁ బిదపఁ బ్రౌఢ.లో తోడకు స్వతంత్రప్రయోగము చెప్పఁబడి యుండకుండుటచేసి గాఁబోలు నాయభిప్రాయమునే సూ.ని. ఉద్ధరించినది. ప్రత్యయము (అపదము)లకుఁ బ్రత్యేక ప్రయోగార్హతను జెప్పుటకంటె నివి యవ్యయములుగాఁ జెప్పుట కొంత మేలని నయము.

సం.లో తోడ అనుతృతీయకుఁ బ్రత్యేకప్రయోగము గల దనుటకుఁ దోడిదయై (ఆను 1.88) అన్నుప్రయోగమును జూపుచు గురుబాలప్రకృతివారు 'తోడన్-ఆది తోడన్ + ఇ + అది తోడిది. బాం.సమా.9 సంధి 43 45. (వ్యా,సం.స 998) అనిరి. అపద మగు తోడకుఁ బ్రత్యేకప్రయోగము చెప్పుటచేఁ బ్రత్యేకముగాఁ బ్రయుక్త మగునీయది పద మగునా? పదమె యగుచో నట్టిపద మొకటి చెప్పవచ్చుఁ గదా. ప్రత్యయమె ప్రయుక్త మగుచున్న దన నేల? ప్రత్యేకప్రయోగమె విలక్షణ మైయుండఁగా దీనిపై సంబంధార్థ విగ్రహయు దన్నబ్ధముతోడిసమాసము నగుట యెట్లు? సంధి.48సూత్రముచే దీని కిత్వ

మగుట యెట్లు? (ద్రుతము పై ఇత్వము చూపుట విశేషము) ఇట వీరు ఇచ్చవిభక్తిని మస్య —తథాతోడవిభక్తౌ చ యనునన్నయాధర్వణులమతమును ప్రస్తావింపక 'చేతతోడ పలనలకు' అనుసూరిలక్షణమును ప్రస్తావించుట యందు విభక్తుల కనుదళము లే దని యేమో. ఇంతకు నీయది పదమో ప్రత్యయమో స్పష్టము చేయరైరి.

తెలుఁగునఁ దోడుశబ్ద మొకటి కల దని యౌపవిభక్తికము దానినుండి యీ రూపము సాధింపఁదగును. తోడిది తోడివారు అనుచోటియిత్వ మౌపవిభక్తికమె గాని సామాసికకార్యము గాదు.

వీరు "ఇపుడు తోడుశబ్ద మౌపవిభక్తికమె కాదు." (వ్యా.సం.స.449) అనిరి. వానితోడివైర మిత్యాదుల (వ్యా.సం.స 397) సామాసిక మగునిత్వమె. కాని యింత మాత్రమున నిది యౌపవిభక్తికము గా దనుట యెట్లు? "తోడుశబ్ద మౌపవిభక్తికాంత మనుట కవిసమ్మతము గాదు. అడుతోడునను బుట్టవె '(మను.4.87)' (వ్యా.సం.స. 397) బౌపవిభక్తికము గా దనుటకు సవర్ణకాంతరూపమును జూపరాదు. అట్లు యైనఁ దెలుఁగున నౌపవిభక్తికములె లే వనవలెను. ప్రోలున, పేరున, నీరున చోటున మున్నగురీతిగా నవర్ణకము పర మైనపు డౌపవిభక్తికము రానేరదు. అయిన తోడియందు తోడిని, ఇత్యాదిగను రూపములు లేవు. కాని తోడునందు, తోడును అనురీతిగను గానరావు గదా. అయిన నిది యౌపవిభక్తిక మనుటకు మాత్ర మాధార మేమి యన వచ్చును. తోడికోడలు, ఇత్యాదిగా సమాసములం దీయిత్వము గలదు. ఇంకను తోడుతనను అనుచో నౌపవిభక్తికముల (తృతీయ) కగునత్వ మయి 'తోడను' అను రూపము నేర్పడును. 'తోడుతో' ననియె కదా యర్థము.

సూ.ని. తోడఁబుట్టు వనుదాని నితోడుశబ్దమునొద్దనె చూపుట గమనింపఁదగును. తోడుశబ్దజన్యముగా 'తో' అనుదానిం జూపి తోఁబుట్టు విత్యాదులు సూ.ని. చూపినది.

కాని దీని కితరవిభక్తివచనములఁ బ్రయోగము గానరాదు. కావుననె శ.ర. వీని నవ్యయములుగా నంగీకరించిన దేమో. కాని యౌపవిభక్తిక మగుతోడుశబ్దము నెట్లు నంగీకరింపక తప్పదు. (తోడివారలు-తోటివారలు) దానికి నితరవిభక్తివచనములలో రూపములు లేవు గదా. కాన నట్టియెడల దత్తద్విభక్తులు వచ్చుటకు నాయావిభక్తుల

యర్థము వివక్షయే కుదురుటలే దనవచ్చును. (తోనన్-లోన్ అనురీతిగా తోడన్ తోన్).



కావున 'తోడు'శబ్ద మొక్కటి, తోడ నవ్యయ మొక్కటి ప్రత్యేకముగాఁ జెప్ప వలెనా యని సందేహము. ప్రయోగములం బరిశీలించి లాఘవముగ నింకను నిర్ణయింపవలసియున్నది. (చూ.త్రి.శే.)

ఏ మైనను తోడ-తో -అను విభక్తులు స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుట లే దనియు నట్లు చెప్పుస్థలములఁ బ్రత్యేకముగాఁ బ్రసిద్ధ మై యున్నపదమే యిది యనియు నిశ్చయింపఁదగును.

అముఖ్యకర్మము :

'పచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడకువర్ణకంబులు ప్రాయికంబుగ నగు (6) ననుసూరిలక్షణమున —— పర్యాయంబునఁ బ్రాయికంబుగ నగు' (ఉ.9సూ) నని యించుక మార్చిరి. 'పర్యాయంబున' నన్నది యధికముగాఁ జేర్చుట స్పష్టతకే యగును. సూరిలక్షణమున దురుక్తి లేమి స్పష్టము. పర్యాయంబున ననని మాత్ర మునఁ దోడకువర్ణకములు రెండు నొకేపర్యాయ మగుట యసంభవము గదా.

"అముఖ్యకర్మమును ద్వితీయాంత మగునపు డివి ద్వికర్మకము లగును" ఏ మంటి వుపేంద్ర నన్ను (ఉ.226) అనుటయు స్పష్టతకే కావలెను. అముఖ్యకర్మము నకుఁ దోడ,కువర్ణకము లగునపుడు మాత్రము ద్వికర్మకము గాదా? తోడ,కువర్ణకము లయినను నవ్వది యముఖ్యకర్మమె గాని కర్మేతరము గాదు గదా. (వ్యా.సం.స. 995) ఇ ట్లను నాతనిన్ మొ॥

ఉపయోగము-తోడ

'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు (టి) ననుదాని నట్ల గ్రహిం చియు (ఉ.10సూ) ని ట్లనిరి.

'ఇట్టియెడల సంస్కృతమందుఁ బంచమి యగును. తెలుఁగున షష్టీపంచమి మిక్కిలియరుదు. భూసురులవలన వేదంబులు గఱచుచు' (ఉ.217) నని చెప్పి

పిదప 'సూరి పంచమియు వచ్చు నని తలంపక తోడవర్ణకము నిత్య మని తలంచె' (ఉ.217) యనిరి. సూరి యట "సాందీపనితోడఁ జదివిరి సాందీపనివలన నని యర్థము" అని వివరించె. సూరి యర్థవివరణమునందలి 'సాందీపనివలన' ననునది యసాధు వనవలెనా?

'తోడవర్ణకం బగు' ననుటచే తోడ నిత్య మని యర్థము చేయవచ్చును. అయిన వీరును సూత్రమున నట్లు చెప్పిరి తప్ప విభాష యని గాని ప్రాయిక మని గాని పేర్కొనిరా? సూరిసూత్రముచే నిత్య మన్న నదే సూత్రమును గొన్న వీరిమతమున మాత్రము తోడ యనిత్య మగు టెట్లు?

సూరివివరణము ననుసరించి యిట వలన కల దని గ్రహింపఁదగును. ఇది మిక్కిలి యరు దని వీరే స్పష్టము చేసిరి. క్రియా.37 మొదలగుసూరిలక్షణముల ననుసరించి 'యగు' నన్నను నరు దగువిభక్తిస్థలములు ప్రస్తావించుట గానవు. ఇది యట్టిద యనఁదగు.

తోడ 'ప్రాయికంబుగ' నగు నని చెప్పిన బాగుండెడి దేమో. 'తోడ' కాని పక్షమునందు గ్రహణార్థమున నపాయభయేత్యాదిసూత్రముచే వలనవర్ణక మయి, గ్రహ్యాదియోగజ మగునీపంచమికి చేతయు నయి, సాందీపనివలన, సాందీపనిచేత ననియు నవుట సరుదుగా గుర్తింపవచ్చును. సూరివివరణముచేతను నీయర్థమును సాధింపవచ్చును.

తవ్యాదియోగము :

వీ రీసందర్భమున నిం కొకలక్షణ మిట్లు చేసిరి. 'సంస్కృతతవ్యాదిప్రత్యయయోగంబునఁ దృతీయాషష్ఠులు పర్యాయముగ నగును. సహితము, సయితము, సైతము అనునవి సముచ్చయార్థమును బోధించును. (ఉ.11)

ఇందలిమొదటియంశమును ప్రౌఢ. (కార.13)పై కృదంశములతో స్పష్టము చేసెను. (చూ.త్రి.శే.) ఇంకఁ బైసూత్రమునందలి రెండవయంశ మిటఁ జెప్పనవసరము లేదు. శబ్దములయర్థమునుగూర్చి చెప్పుట నిఘంటువులపని. కేవల మర్థమును

చెప్పుట వ్యాకరణమున కేల? ఇంకను 'వానితో సైతము' ఇత్యాదులలో సహార్థము వింత గాదు. వీ రిట 'సహితము' (వ్యా సం.వ.999) శబ్దమును గూడఁ జూపుట విశేషమె.



### చతుర్థి :

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' (8) ననుసూరిలక్షణమును విస్తరించి వీరు 'త్యాగంబునం దుద్దేశింపఁబడినది సంప్రదానంబు-దానికిం జతుర్థి యగు ననుట సంస్కృతసంప్రదాయము. ఉద్దేశమాత్రమునఁ జతుర్థియు షష్ఠియు నగును. (ఉ.13) అని చూపిరి. ఇట్లు విస్తరించి చెప్పుటవలన సూరిలక్షణమునం దెంత యసక్తి గలదో యని భ్రమించుటకవకాశ మేర్పడినది.

వీరిలక్షణమునఁ బ్రథమవాక్యము సంప్రదానమును వివరించునది. ఉపయోగము (18), నిర్ధారణము (17) మున్నగునితరస్థలములలో నాయావానిని సూత్రమునందే వివరించిరా? ఇట్టి ప్రాతిపదికార్థాదులను. 'సంప్రదానమునకు' అని సూత్రమునఁ జెప్పి యట నేమో వివరణమునఁ జెప్పుట యుచితము గాదా?

పిదప సంప్రదానమునకుఁ జతుర్థి యగుట సంస్కృత సంప్రదాయ మనిరి. అనఁగా దెలుఁగునఁ జతుర్థి లేదా? అనఁగా సూరి 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' ననుట దోషమా? సంస్కృతమునకు మాఱుగా నుండవలె నని వీరు తెనుఁగున నరిపదని 'కొఱకు'ని విభక్తిగాఁ గల్పించుట యుచితమె. కాని సంప్రదానముతోపా టితరస్థలములనున్న చతుర్థిని సంప్రదానమున కగు నని సూరి చెప్పుట దోష మైనదే.

ఇంకను సూరి "చతుర్థికి మాఱుగా షష్ఠియే తఱుచుగాఁ బ్రయోగములం గానం బడుటను" వివరించి తెలుఁగులోని ప్రత్యేకతను స్పష్టము చేసెను. వీ రిట నాయంశము మును జెప్పలేదు, చతుర్థియు, కుఱి'షష్ఠియు' నగు నని కు,చతుర్థులను సామాన్యము గనె విధించిరే.

ప్రథమ, ద్వితీయ, చతుర్థియు, సప్తమీవిధానములలో సూరిలక్షణము కొంత భిన్నముగాఁ గన్పట్టును. మిగిలినచోట్ల నాయావిభక్తులు సంస్కృతము ననుసరించి సిద్ధించుచున్న ప్రత్యయము గల్గుచుండ నివి మాత్రము తెలుఁగుననె విధించుచున్నట్లు గన్పట్టును. అంతమాత్రము యిది సంస్కృతసంప్రదాయ మని చెప్పఁబూనిరా? అయిన మిగిలినప్రథమ-ద్వితీయావిభక్తిస్థలములందు నీ రీతిసంప్రదాయమును సూత్రింపలేదే.

ప్రథమ, చతుర్థి సప్తములలో విభక్తు లనేకము లైనను నాయాయర్థములందవి యెల్ల సమానముగనె యవుచున్నవి. మిగిలినచోట్ల చేతతోడలు తృతీయ యైనను జేత వచ్చుకొన్ని యర్థములందుఁ (హేతువు॥) దోడ రాదు. తోడ వచ్చుకొన్ని యర్థము లందుఁ (సహార్థయోగాదులు) జేత రాదు. ఇట్లు యితరములు. కావున నిటఁ బ్రథమ యగు ననురీతిని సామాన్యముగఁ జెప్పనగును. ఇంక నీయవి సంస్కృతానుసారముగ సిద్ధించు నన్నఁ దెలుఁగున వీనిప్రసక్తి లేకుండఁబోవు. సమగ్రత ననుసరించి సూరి వీనిని దెలుగున విధించుట యుక్త మైయుండె.

ఇఁక నిట సంప్రదానమునకుఁ జతుర్థి యగుట సంస్కృతసంప్రదాయ మని సూరి యెఱుఁగక పోలేదు. దానికిఁ జతుర్థికి మాఱుగా షష్ఠియు వచ్చుచుఁ బ్రయోగమునం దుండుటను గుర్తించినవాఁడు షష్ఠినే సూత్రమున విధించి యరుదుగా నున్న చతుర్థిని వివరణమునఁ జెప్పఁడా?

ఇంక వీరు 'ఉద్దేశమాత్రమునఁ జతుర్థియు' నిత్యాదిగాఁ జెప్పఁబోవుటంబట్టి సంప్రదానమునకు మాత్రమె యగుట సంస్కృతసంప్రదాయ మైయుండఁగాఁ దెలుఁగున నుద్దేశమాత్రమున కగుట విశేష మని, కావున సూరి 'సంప్రదానమునకుఁ జతుర్థి' యగు నని సూత్రించుట సరి గా దనియుఁ జెప్పఁదలఁచిరా? ఆ ట్లయినఁ దెనుఁగువిభక్తుల నుపదేశించునపు డది సంస్కృతసంప్రదాయమునకు భిన్న మైయున్నపుడు మాత్రము సంస్కృతసంప్రదాయమును సూత్రమునఁ బ్రస్తావింపవలసినయవసర మేమి? సూరి లక్షణమును విమర్శింపఁదలఁచినను నయ్యది వివరణమునఁ జెప్ప సరిపోదా? కాన వీరిసూత్రమున మొదటిరెండువాక్యములు సూత్రమునఁ దొలఁగించి వివరణమునఁ జెప్ప దగినవి. గ్రహ్యాదియోగమునందు సంస్కృతసంప్రదాయమునకు భిన్నముగాఁ దెలుఁగున (చేత) తృతీయాప్రయోగము గలుఁగగా చేతనే విధించి తెలుఁగుప్రత్యేకతను వివరింపలేదా? అట్లు యిటఁ జెప్పనగును. సూత్రమును బెంచ నేల?

'కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబున కగు' ననుసూరివివరణము గమనింపఁదగు. చరుఖలవారు సూత్రమునఁ జెప్పినయంశము సూరిచెప్పినది గాదు. వివరణమునఁ దెల్పినదే. సూరివివరణమును సూత్రమునఁ జేర్చుటయు సూత్రమున విధింపవలసిన యంశములు వివరణములోఁ దెల్పుటయు సద్యోతమున గుర్తించుమనే యున్నారము.



కొఱకు— షష్ఠి (కు) అనువాని ప్రయోగములందలి భేదమును గుర్తించి సూరి తదనుగుణముగా లక్షణము చేసెను. సంప్రదానమునకే 'కొఱకు' అరుదు. ఉద్దేశ్యమాత్రమున కిందును 'గొన్నియెడల' నగునది. ఈరెంటి నేకము చేసి చరుఖలవారు సామాన్యముగా సూత్రించుట లక్ష్యానుగుణ మని చెప్పఁజాలము కదా.

సూరిలక్షణ మెంతయు సుచిత మని గుర్తింపవచ్చును.

తమసూత్రమున వీరు 'కు-కిషష్ఠియు నగు' ననుచో 'కి' వర్ణమును ప్రత్యేకముగాఁ జేర్కొనుట యనవసరము. 'అథలోపలకికారా క్కాన్యా' యని చిం. కి-కు వర్ణములను ప్రత్యేకముగా షష్ఠీవిభక్తులుగాఁ బరిగణించినను వీరిగ్రంథమున సూరివలె 'కుయొక్కడవిలోపలషష్ఠి' అని (తత్స.6) 'కి'ని ప్రత్యేకముగాఁ బరిగణింపలేదు. 'కు' అనునదే యిత్వముతో కివర్ణ మగును. కావున 'కుషష్ఠియు నగు' నని మాత్రమె చెప్పుకొనఁదగు. ఇట్లె ఉ.12సూత్రమునందును.

ఇట వివరణములో వీరు "చతుర్థియందు కై-కొఱకులే కాక కు- కి- మొదలగునవియు వాడఁబడును. ఇవి విభక్త్యర్థాభిధాయకశబ్దము లననగును' (ఉ.218) అనుట వింత. ఇందులో కున్నై కుఁగాన్ మొదలగునవి విభక్త్యర్థాభిధాయలశబ్దము లనుటంగూర్చి తత్సమపరిచ్ఛేదారంభమున గమనించితిమి.

'కు-కి' అనునవియు విభక్త్యర్థాభిధాయకము లని వీరివివరణమున కర్థ మగుచున్నది. చరుఖలవారియుద్దేశ్య మది కాదేమో? సూత్రమున కికులు షష్ఠులుగాఁ జెప్పిరి గదా. ఇవి షష్ఠీవిభక్తులైయుండుటచే నితరము లగుచెవర్ణములఁ బోలె నిటఁ జతుర్థ్యర్థమునను (కిను) షష్ఠియైన దనుట సత్రమము మైయుండఁగా నివి చతుర్థ్యర్థాభిధాయకశబ్దము లనుట కేవల మసంగతము గదా.

ఇంకను వింత వివరణపాఠిసూత్రమున గమనింపవచ్చును.  సూరి సంగ్రహింపని యంశ మనుచు పర్యులవా రిట్లు సూత్రించిరి. "రుచి, క్రోధము సహనము మున్నగునవి దేనికో యచటఁ జతుర్థి యనఁగా కు-కివర్ణకము లగు. ఆశ్లే కుశలము స్వస్తి నమస్కృతి హితము ఇష్టము దూరము సమీపము సామర్థ్యము నేర్పు ప్రవేశము కాలము గమనము మున్నగువానియర్థములు గలశబ్దములయోగమునఁ జతుర్థి యనఁగా కు కివర్ణకంబు లగు' (ఉ.13.)

కు–కి– అని రెండిని వేఱుగాఁ జేర్కొన నవసరము లే దని పైని స్పష్టము. ఇంక వీరిటఁ "జతుర్థి యనఁగా కు — కి వర్ణకంబులు" అని రెండుపర్యాయములు పేర్కొనిరి. కికులు చతుర్థిప్రత్యయము అని వీ రెట్లు చెప్పిరో యర్థము గాకున్నది. ఇంతకు ముందటిసూత్రమున చతుర్థియు, కుకిషష్ఠియు నని కికులు షష్ఠివిభక్తులుగాఁ జెప్పిరి. ఆసూత్రవివరణమున (చతుర్థి) విభక్త్యర్థాభిధాయకశబ్దము లనిరి. ఇటనిం కేల యని కికులు చతుర్థీవిభక్తులే యనిరి. కాక చతుర్థీవిభక్తులను జెప్పుచో 'సూరి వలెనె' కొఱకు కయి చతుర్థి యనిరే కాని కికులు చతుర్థీవిభక్తులుగాఁ జెప్పలేదు. పొరపా టనుకొందమా? ఒకేయాకారము గలవాని ననేకవిభక్తులయందుఁ బ్రత్యయములుగాఁ జెప్ప నేల? అనుచోఁ బూర్వసూత్రమునను జతుర్థి యగు నన్న మాత్రము సరిపోదా?

'కొఱకుకయి అనుచతుర్థి కువర్ణకమూలికి మె— కొఱ—కార్యము. కొఱకున్-కార్యమునకున్ కు(న్) + అయి = కయి—కై' (ఉ.218) యనిరి. ఒకవేళ నీవరిత్రను దృష్టియం దుంచుకొనియె యిట్లు చెప్పిరా? అయినఁ దెలుఁగునఁ కువర్ణ మొక్కటి చతుర్థీవిభక్తిగాఁ బరిగణింపక కొఱకు- కయి యనువాని నేల పేర్కొనిరి. కు షష్ఠిగా నేల చెప్పిరి. షష్ఠీకువర్ణమూలక మన్నఁ దెలుఁగునఁ జతుర్థీవిభక్తియె లే దనవలెఁ గదా. ఇంక నిట కికులు చతుర్థ్య లనుటయుఁ బొసఁగదు. చరిత్రను నడుమ నడుమ సమన్వయించుచుపోవలన శబ్దశాస్త్రమున నిట్టి యనర్థములు గలుగును.

ఇట్టిషష్ఠీవిభక్తిని సూరి సంగ్రహింపలే (ఉ.219) దనిరి. పిదపనే ఇట్లు కికులు చతుర్థీవిభక్తులో షష్ఠీవిభక్తులో కాక విభక్త్యర్థాభిధాయకములోఁ దెలియకుండ వీలు లేకుండ యుతేష్టముగాఁ బేర్కొనిరి

ఈవిధిని సూరి సంగ్రహింపమే దరుదు విశేషము. "యస్మైదిత్సాసూయా—" మున్నగుముగ్ధబోధలక్షణము ననుసరించి వీ రీలక్షణమును జెప్పిరి. (వ్యా.సం.స. 1006).

కాని యటు వీరు "దేనికొఱకసూయాదులో యది సంప్రదానసంజ్ఞ గల దగు ననువిషయము మాత్రమె తెలుఁగున ననుసరించును. అసూయ క్రోధము- అనునవి యెవ్వనికొఱకో యట్టివానిని దెల్పుశబ్దము చతుర్థ్యంత మగు (వ్యా.సం.స.1006) ననిరి. కాఁగా నుద్దేశ్యమాత్రమునకె కొన్నియెడల నీతాదర్థ్యము గల దన్నసూరిలక్షణముచే నీయవి బాలవ్యాకరణముచే సంగ్రహింపఁబడునవే యున్న వనఁదగునే. వీరిటుఁ జూపినలక్ష్యము లెల్ల నట్లు సమన్వయింపఁదగియే యున్నవి.

ఇటు నుదాహరణములలో కొఱకు- కయి యనుచతుర్థీవిభక్తులు చూపకుంట గమనింపఁదగియున్నది, అట్టియెడలఁ దనుసూత్రమునఁ జతుర్థి యనుటయు తగ దని నిశ్చయింపవలసియున్నది.

అపాయము-వలన :

'అపాయభయజుగుప్సాపరాజయప్రమాదగ్రహణభవనత్రాణవిరామాంతర్ధివారణంబు లెద్దాన నగు దానికి పంచమ్యర్థకం బగు' (8)ననుసూరిలక్షణమున 'అపాయ'శబ్దమును దొలఁగించి మిగిలినది యట్లు గ్రహించిరి.

'వృక్షమువలననుండి పర్ణము పడెను అనుచో వృక్షము నిల్చిపోయినది. పర్ణమున కపాయము కల్గెను గాన వృక్షశబ్దము పంచమ్యంత మగు నని సంస్కృతవైయాకరణులయాశయము. (వృక్షాత్పర్ణం పతతి) (ఉ.219) —సూరి యిట్టిసంస్కృతవ్యాకరణపద్ధతినే యనుసరించి అపాయము అనుదానిని చైతము సూత్రమున నిల్పి యపాయస్థలములను నపాదానపంచమీస్థలములుగా సూత్రించి యుదాహరించె (ఉ.219) సంస్కృతసంప్రదాయమును బ్రస్తావించుటలో దాని ననుసరింప రా దని వీరి యభిప్రాయము గాకపోవచ్చును కూర్చివిషయమున వీ రట్లు పేర్కొనుట గమనార్హము "కాని యట్టియర్థమునఁ దెలుఁగున వృక్షమునుండి పర్ణము పడె నని వాడఁబడు" (ఉ.219) ననిరి. ఇంతమాత్రమున వలనతోఁ బ్రయోగము లే దనరాదు,

వీరే 'వృక్షమువలనఁ బర్ణము పడె ననుచోట సంయుతము 'వలనన్' అనునది యుప విభక్తికవలన(దిక్కు)శబ్దసప్తమ్యంతరూపమే యనియు వృక్షమువలననుండి పర్ణము పడె ననియె వాడుక యనియు నందలియుండిశబ్దము లోపించి యధ్యాహార్య మగునపుడు వృక్షమువలనఁ బర్ణము పడె ననువాక్యము సిద్ధించు ననియు నెఱుంగునది' (ఉ.219) యనిరి.

కాఁగా వలన- కలదు గాని యిది ప్రత్యయము గా దని వీరిసిద్ధాంతము. ఇది ప్రత్యయము గా దనుటకుఁ గారణ మేమి? ఉండిపదానుప్రయోగము మున్నగుతరువాతి సూత్రములు రెండును వ్యర్థము లని ప్రతిపాదింపఁబోవుటయే యనవచ్చును.

వృక్షముఁ దుండి పడె ననఁగా వృక్షమువలననుండి పడియె ననియే యర్థము. కాని వృక్షమందుండి కాక వృక్షముదిక్కునుండి పడె ననియే యర్థము చెప్పవలెను. అపుడు 'వలన' ప్రత్యయమె కాదన నేమి? చోరునివలన భయపడియె నిత్యాదుల మాత్రము 'వలన' వలను శబ్దసప్తమ్యంతరూపముగా నేల సమన్వయింపరాదు? వృక్షము దిక్కునుండి పడె నన్నట్లుగనే చోరుని దిక్కునుండి భయపడె నని సమన్వయింపరాదా? ఇట్లే మైత్రుని వలన ధనంబు గొనియె నిత్యాదులమాత్రము 'వలన' ప్రత్యయమే యన నేల?

అపాయార్థమందలివలన ప్రత్యయము గాకుండుటకును, భయాదులందలివలన ప్రత్యయమే యగుటకును నాలెంట భేద మేమి?

ఇంక నిట్టియెడల వృక్షముయొక్క వలన (వృక్షపువలను అని పుంపులు నియతముగా రావు.) అనురీతిగా సమాసము నియతముగా నగు ననవలె నేమో. వ్యస్తతలోప యొక్క నిత్యముగా లోపించు నందురు గావున నట్లని జెప్పుదురు. ఇట్టియెడల 'వృక్షముయొక్క వలననుండి' పర్ణము పడె ననురీతియర్థ మెంతసహజమో? పై నింకను స్పష్టము గాఁగలదు.

వసులవారియర్థసమన్వయము సహజముగా లేకుండుటనుబట్టియు నది సరి గా దనియుఁ, జోరునివలన భయపడియె నిత్యాదులందు లెనె 'వృక్షమువలనఁ బర్ణము పడియె ననుచోను వలన ప్రత్యయమె యనియు, నపాయార్థమున సూరి సంస్కృతసంప్ర

దాయము ననుసరించియే యీసూత్రమునుండి పంచమి (పలన) విధించుట యుచితమె యనియు నిశ్చయింపఁదగును.

సీరెని పెదతె ననుచో సం.లో సహాయమునఁ బంచమికి ద్వితీయ యైనట్లు వీరు చెప్పిరి.

ఉండి :

'ఉండిపదఁ బొకానొకచో పలనపర్యకంబున కన్వప్రయుక్తం బగు' (10) ఉండిశబ్దము పరం బగునపుడు పంచికు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' (11) ననుసూరిలక్షణములు సరిగా లేని వీరియభిప్రాయ మందు కీసూత్రములు తమ గ్రంథమునఁ దొలఁగించిరి. "సూరి ఉండిశబ్ద మనుప్రయుక్త మని సూత్రించెను. అది వాక్యమునం దర్థవంత మగుపదము గాన ననుప్రయుక్తము గానేరదు. పదమందుండి వచ్చెను'. (ఉ.221) అని వివరించి యూరుకొనక వీ రింకను దార్ఢ్యమునకుఁ గాఁబోలు వే తొకసూత్రము వ్రాసిరి. "ఉండి–ఉంచి అనెడిశబ్దములు కూర్చి గుఱిచి గుఱించి– చేసి– అనువానివలె ననుప్రయుక్తశబ్దములు కావు. అవి వాక్యావయవము లగుపదములు' (ఉ.15.సూ) ఇది యొకసూత్రముగాఁ జెప్పుటయే పరుఖలవారివ్యాకరణ రచనలోనిప్రత్యేకత.

ఈపరిచ్ఛేదమున నింతకు ముందే వీరు కూర్చివిభక్తి యనియు గుఱిచి, గుఱించి విభక్త్యర్థాభిధాయకశబ్దము లనియుఁ జెప్పిరి. అంతకు ముందు తత్సమపరిచ్ఛేద ములోఁ జెప్పినట్లుగా నిట నీయవి యనుప్రయుక్తము లనిరి. ఇది యుక్తము.

"ఏది లోపించినను సంబంధంగము కిల్గదో యది యనుప్రయుక్త మనఁబడును." (ఉ.212) (కొన్ని యనుప్రయుక్తములు లోపింపకపోవచ్చు. ధా.వి,లపై విభక్తి వివక్షలో ననుప్రయుక్త మైనతచ్ఛబ్ద మిట్టిది) కావున నిట నుండి వాక్యమునందర్థవంత ముగా నన్వయించునట్టిది గావున ననుప్రయుక్త మనరా దని వీరినిర్ణయము. కాని యట్లు ప్రత్యేకముగా నన్వయము గలపదమె యైనపుడు వానినిగూర్చి వీరు సూత్ర మునఁ జెప్పుట యేల? తమసూత్రము వ్యర్థ మని తామే నిరూపించుకొనిరి. ఇంత

కంటెను "ఇవి (ఉండి—ఉంచి) వాక్యములోని సప్తమి, ద్వితీయ అనువిభక్తులు గల పదములతో నన్వయించును (వాక్యగతపదములై యు)ండును" అనువివరణమును సూత్రముగాఁ జెప్పిన కొంత తేలి దగును గదా యనిపించు.

ఉండి ఉంచి యనునవి సప్తమీద్వితీయాంతములతో నన్వయించుననుటకంటె 'పరేష్వాండ్యాదిశబ్దేషు సప్తమ్యాద్యే విభక్తయః' అనువి.వి.లక్షణము స్ఫురించునట్లుగా వీనితోడియన్వయమున సప్తమీద్వితీయ లవు నని చెప్పఁదగు (నిజమునకు సప్తమీద్వితీయాంతము లగుపదములకే వీనితో నన్వయము గలదు. కాని వీనిపై సప్తమీద్వితీయాంతము లగుపదము లుండ వానితో నన్వయించు ననరాదు గదా. ఇవి పరమగునప్పుడే సప్తమ్యాదివిభక్తు లగు నని వి.వి. కాని వీరు లోపింపఁజేసి (యెట్లో) అధ్యాహారము చేయుదురు. సప్తమీద్వితీయలు వి.వి విశేషముగఁ జెప్పె. వీర ట్లన లేదు. కారికార్థము గ్రంథాంతరము స్పష్టమగు.

ఇఁక ఉండి యనునది యన్వయించు ప్రత్యేకపద మనుట పరిశీలింపవలయును.

'దేవపథమునందుండి చనుదేరవలయును' అనుచో దేవపథమునందుఁ గొంతసే పుండి చనుదేరవలయునని యర్థము చేయుదురు.' (ఉ.222, ఇది సహజమా? దేవపథమునుండి చనుదేరవలె నన నింత రావలయు ననియే కాని కొంచెముసే పుండి యటు పిదపనే రావలె నని యర్థమా? ఇక్కడనుండి వెంటనే పొమ్ము' అనుచో నిక్కడ నింతసు ఉండి అపిదప పొమ్మనుటీతి(ప్రార్థనము?) యర్థ ముండునా? దీనిని వాక్యముం దన్వయింపఁజూచుట సరి కా దనక తప్పదు. ఇక్కడ నుండి పొమ్ము అనుచో నీప్రదేశమును వీడి (అపాయార్థము) పొమ్ము అనియె కాని యుండుధాత్వర్థముతో నన్వయము కుదురదు. అందులకే సూరి ఉండి 'పద' మని చెప్పెయు (ఉండుధాతువు, క్త్వార్థకరూప మనమాట.) సముపయుక్తముగనె విధించెను. ఇటనుండి పొమ్మనుచో 'ఇట నుండి చదువుము' ఇత్యాదులందువలె ఉండుధాతువుక్త్వార్థము గోచరింపదు గదా.

'ఘాసురుండువలన వేసంగులు గలిచిరి. ఇట్టియెడ ఉపాధ్యాయాదధీతే అనురీతి



నపాదానపంచమి యనుట యుక్తము గాన వలనశబ్దము పంచమీవిభక్తిరూప మనుట యుక్తము కాదు. ——(వ్యా.సం.స.298) మఱి యట్టియెడల (విష్ణుపదమువలన— విష్ణుపదము దిశయందు—— ఉండి. ఉద్భూదై —— సంచరదై ——యనునర్థము మాత్రము యుక్త మెట్లగునది? (ఉపాధ్యాయాదధీతే యను దానివలె) వృక్షాత్పర్ణం పతతి యనురీతిని (వృక్షమువలనఁ బర్ణము పడె ననుచో) నపాదానపంచమి యనుట యుక్త మేల కాలేదు. సంస్కృతసంప్రదాయ మది కాక యిదియె యైనదా?

వీరిస్థలాంతరసమన్వయమునుబట్టియు యిది 'వలన' పద మనుట యుక్తము గాదనియు నపాదనపంచమి యనియు గుర్తింపఁదగును.

వలనకు సప్తమి :

"సూరి పయిరూపములను సాధించుటకు వలన నుండి యనుప్రయుక్త మగు ననియు నట్టివలనకు ద్వితీయాసప్తము లాదేశము లగు ననియు.సూత్రించెను. ఉండి శబ్దానుప్రయోగము గలవలనన్ అనునది సప్తమ్యంతము. అది యపాదానపంచమీ విభక్తి కాదు." (ఉ.221)(వ్యా.సం.స.1021).

సప్తమి ఉండితో నన్వయించు ననుటచేతను, వలనన్ అనునది సప్తమ్యంతము యనుటచేతను సప్తమీవిధాన మనునది మఱి వీరు చెప్పుచున్నారు. కాని సప్తమి పూర్వ నెల్లయెడలఁ గుదురదు.

నాయం దధికధనము గొనిపొమ్ము అనుచో 'నందు'మీఁదియుండి లోపించు నని వీరు చెప్పిరి. నాయందధికధనంబు గొనిపొమ్ము అపి.2.198 (ఇది గ్రహ్యాదియోగము బగుపంచమి) (వ్యా సం.స.1019) అందువిభక్తిమీఁదిఉండికి లోపము లే దను ప్రౌఢవ్యాకరణము ప్రామాదికము' అని యింకను (ఉ.22)నిర్ణయించిరి. గ్రహ్యాదియోగమున వలనను వీరును జెప్పిరి కదా. మఱి యిచ్చటిసప్తమి వలన కయినదా? లేదా?

వలనకు వీరు సప్తమిని విధింపలేదు గావున ఉండితో నన్వయముండదు. వీలుగా సప్తమియే సహజముగా నైన దని చెప్పవలయునా? (సప్తమి ప్రత్యయంతో నిలుచు నని తే దని యుండి లోపించిన దేమో.) అట్లయినచో ఉండినద మిక లేదు గావునఁ బ్రస్తుతపువీరివివరణము ననుసరించియును ఉండి నధ్యాహారము చేసికొనవలె. (లోపింపక ఉండి యట్లే యున్న దనుకొందము. ఆపక్షమునను) అన్వయ మెట్లు? నాయందు నుండి ధనము గొనుము అనునొ గొంచెమునేవు నాయందు (నీవు) నిలిచి పిదప ధనము గొనిపొమ్మన రీతిగా నుండి పద మన్వితమగునా? కాదు. మఱి సప్తమి యట్లయినోద్వి సం.లో వీరిది గ్రహ్యాదియోగజం బగు పంచమి యని చెప్పుటయు గమనార్హము.

ఇట్లే 'పదయుము నాయం దపత్యము' 'నాయందు' గొంతసే పుండి యపత్యమును గొందు మని యర్థమా? ఇట్టిచోట్ల సప్తమిని పంచమికి విధింపక తప్పదు గదా

అపాయస్థలమున ననహజముగ నైనను నుండి యన్వయించు నేమో కాని యితరస్థలములం దసంభవము. అందుకే వీరపాదానము మాత్రమె యని (కార.9) సూత్రమును దొలఁగించిరి.

అపాయస్థలమున సైత మీయుండి కొన్నియెడల నేరీతిగను సమన్వయింపదు.

'సప్తమిమీఁద ఉండిశబ్దము (లోపించి తల్లోప మెట్లో? వాక్యన్యాయసిద్ధ' మందురేమో) యధ్యాహార్య మగుటయుఁ గలదు. ముఖనేత్రనాసికారంధ్రములందు వెడలె (అర.6.361) నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె (అని.3.144) ఒడలన్ వెలువడి (ఆర.2.178) వీపు(న) వెడలిన (అశ్వ.4.64) ఈసప్తమ్యంతములపైని ఉండిశబ్దము నధ్యాహారము చేయనిచోఁ గారకమునకుఁ గ్రియాన్వయభంగ మగును. (ఉ.222) కాని కొందొకచో నుండిశబ్దము నధ్యాహారము చేసినపుడే యన్వయము కుదురుచున్నది. నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె' ననునట్టి ప్రయోగములో నుండి నధ్యాహారము చేయఁగా నూతిలోనుండి వెలువడ నని యర్థ మగును. దిగిచె నను దానికి (ప్రయోజక) కర్త యయాతి. ఉండుటకును గర్త యయాతియె కావలె. వీరిపద్ధతిలో యయాతి నూతిలోపలనుండి కోమలిని వెలువరించె నని చెప్పవలె. నిజమునకు యయాతి నూతి వెలుపలనె యుండి కోమలిని వెలువరించినాఁడు గాని తాను నూతిలోనికి దిగనె లేదు.

ప్రయోగము లేదు. (ఉ.280) ఇది కవిప్రయోగాధారము గాకుండఁ బోయిన దనఁగాఁ గవిప్రయోగము లే దని నిశ్చయింపఁబడిన దనఁగా వజ్ఝలవారియే దేని సిద్ధాంతమున కది విరుద్ధ మైన దగ్రాహ్యము.

ద్వితీయ యైనచో నది ఉండితో నన్వయింపనేరదు. వనమును అనుద్వితీయాంతమునకు ఉండి యనుదానితో నన్వయ మెట్లు?

'వనమునుండి వచ్చె ఊరినుండి వచ్చె ననురీతిని ద్వితీయమీఁద నుండిశబ్దము నిలిచి యపాదానపంచమ్యర్థమును దెలుపు ప్రయోగములు ప్రాచీనమహాకవిగ్రంథము లందుఁ గన్పట్టవు. ఏవో యర్వాచీనప్రయోగములలో వనమునుండి వచ్చె ఊరి నుండివచ్చె ననురీతిని ప్రయోగింపఁబడినను తృతీయార్థమే కాని యపాదానపంచమ్యర్థకము గా దని యనుటచే నుండిశబ్దముతోడి యన్వయము విరుద్ధమగునని (వ్యా.సం.స.1022, 1053) వ్రాసిరి. అర్వాచీనప్రయోగములే యేమి? ప్రాచీనమహాకవిగ్రంథములందు నిట్టిప్రయోగములు గన్పట్టుచునే యున్నవి.

"ద్వారవతినుండి జగదాధారుఁడు కృష్ణుఁడు వచ్చి (సభా.1.278) సకలభూముల నుండి వచ్చినరాజన్యవరుల (సభా.2.1.5) అమరావతినుండి అమరేంద్రుఁడు వచ్చె (ఆది.8.184) కలువకొలనునుండి వచ్చినవాహినులు (ఉద్యో.1.225) దివినుండి రా (అను.2.118) చరమగిరినుండి వడిమెడుతరణికరణి (కర్ణ.3.362) దివినుండి నిర్గమించునట్టి (రామా.3.92) మొ॥

ఇంత వివరించినవీరే 'ఏది ప్రథమాంత మగునో యనునదిసంస్కృతవ్యాకరణములనుండి తెలియనగు' (ఉ.224) ననిరి. వీరియీవాక్యమునం దుండిశబ్దముతో నన్వయ మెట్లు? మనము కొంతసేపు సంస్కృతవ్యాకరణములందు (నిలిచి) ఉండి తెలియవలయు ననియా? సూరిలక్షణమును తిరస్కరించినను వీ రావిధముగనె ప్రయోగించుట యాసూరిలక్షణము భాషాసహజ మగుచుండుటచేతనె యనవలెను.

ఇట్టిచోట్ల సప్తమి కైనద్వితీయగాఁ ప్రాచీనమహాకవిగ్రంథములందును సమన్వయింతము. అర్వాచీనములం దట్లు చేయవలె నని వీర చెప్పిరి కదా. కాని యేప్రయోగమునం దైనను నిట్టిసమన్వయము గొన్నిచోటుల సరిపడదు. వజ్ఝలవారే

యిట 'వనమునుండి' (గృహమునుండి వాహనమునుండి) యని చూపిరే. 'వనమున్ వనమందు ఉండి అవలనుండి వచ్చెను (వ్యా.సం.స.1021) అని ద్వితీయకు సప్తమ్యర్థమును జెప్పి యనిరి.

కాని జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ చెప్పి (కార.22) సూరి యాకారాద్యుదంతములకు బహుత్వమందె యని నియమించెను. ఇతరత్ర చ ద్వితీయా యను సూత్రవివరణమున వీరును "–"బహువచనమునందె యంతటను ద్వితీయ నిల్చును. ఏకత్వమున ననుదంతములకు మాత్రమె తృతీయాసప్తములచోట ద్వితీయ నిల్చును. ఉదంతముల కన్నిచో తృతీయాసప్తములచో నన్ అనునదియె నిల్చును' (వ్యా.సం.స. 1054) మఱి ఇతరత్ర చ ద్వితీయా యనుసూత్రమునకు వీరు చేసినయర్థము ననుసరించియె వనమందున్ అనుచోటిసప్తమికి ద్వితీయ యగుటకు వీలు లేదే. అట్లు వచ్చు నని చెప్పుట ప్రమాదము. వనమున్ –అనుదానికి వనముచేతన్ వనమందున్ ——అనియు నర్థములు లేవు. (వ్యా.సం.స.1055) అని స్పష్టముగాఁ జెప్పిరి. మఱి యిట వనమున్ అనుదానికి వనమందు అనున సప్తమ్యర్థ మెట్లు గల్గినది. ఉద్యోతమున 'ఉదంతైకవచనేతరములయు నొపవిభక్తికైకవచనేతరములయు జడములతృతీయాసప్తములకు ద్వితీయ వైకల్పికముగ నగు' (ఉ.25సూ) ననిరి. అందుకే యిట 'ఇతరత్ర చ ద్వితీయా' యనుచిం.లక్షణముచేఁ జేసిరా. అదియు నసంగత మని పైని గుర్తించితిమి.

ఇట్టివియుఁ గవిప్రయోగములం బ్రసిద్ధములే. ఆకాశంబునుండి యొక్కదేవదూత యి ట్లనియె (ఆప్ర.1.150) ఏను గాంభోజదేశంబునుండి వచ్చితి (భోజ.1.99) ఏదేశంబునుండి యెచటి కేఁగుచున్నాఁడ వనిన (సిం.4.40) మొ॥

ఇట్లె రాజునుండి ధనము గొనియె. మృత్యుదేవతనుండి రక్షించె మొ॥ "అజడవాచకముల ద్వితీయాబహువచనంబులకును నీవిధి వర్తిల్లదు. మనుజుల విప్రులం (ఉ.23 ) అనిరి. ఏకత్వమున సప్తమికి ద్వితీయ యగుట యెట్లు

ద్వితీయయే యగుటయుఁ గాకుండుటయు నట్లుండ ముందటి నున్న సప్తమికి ఉండితో నన్వయము పొసఁగుచున్నదా ? వనమునుండి రప్పించె, ఇంటినుండి పంపించె నిత్యాదులం దసంభవ మగుట స్పష్టమే కదా.

టయు నెట్లు? కొన్నియెడల ద్వితీయ సప్తమి కయిన దనుట లక్షణవిరుద్ధ మగుటయు గుర్తించితిమి.



పరుషు వారియాసమన్వయము (వారివచనములకును భిన్నమై) సముచితముగా లేమి సంగీకార్యము గాదు. సూరి యుండి యనుప్రయుక్త మనుటయు ద్వితీయా సప్తములు విధించుటయు నుచితమె.

ఉంచి :

ఇట నుంచిశబ్దానుప్రయోగము సాధుకవిప్రయోగారూఢము గా దని సూరి పేర్కొనఁగా వీరు దానిని తిరస్కరించి 'ఉంచిశబ్దము పర మైనపుడు ద్వితీయావిభక్తి నిల్చును' (వ్యా.సం.స.1018) ఉంచి అనుదానికి ముందు ద్వితీయ మాత్రమె నిల్చునుసమన్విత మగును (వ్యా.సం.స.1017) అని వీ రుంచిని పేర్కొనిరి. సూరియభి ప్రాయము దుష్టమా?

"ఉంచిశబ్దపువాడుకకుఁ బ్రాచీనమహాకవిప్రయోగము లభించలేదు. కాంచి యమ్మంత్రి యచ్చోటినుంచి వచ్చె' అనుకుమారధూర్జటిప్రయోగము బల మైనది వారికినది" (ఉ.222) యనిరి. సూరి సాధుకవిప్రయోగారూఢము గా దనుట కీవరు వారివాక్యములు వివరణముగా జెప్పఁదగు. బాస్కరకవి మొద లగువారిని సామాన్య కవు లని వారిప్రయోగము లంగీకరించి సుపేక్షించినను సూరిని గుణాకవి మైన వారిం దట నటవ్యవహారికములె ప్రయోగించె నన్నను నిట్టి కుమారధూర్జటి ప్రయోగములు ప్రబలమైనదిగా పరుషులవారు స్వీకరించుటఁ దిరస్కరింపరాదు. సూరియభిప్రాయ మును దిరస్కరించునట్లుఁ గాక యెల్లయెడల గవిప్రయోగములపై నిట్టినమ్మిక యున్న వీరివలన నాంధ్రభాష కింకను బ్రయోజనము సిద్ధించెడిది. ఈప్రయోగ మున వై శిష్ట్యములు వారిమాటలలోనె పైని గమనింతము.

ద్వితీయపై నుంచికి వీరు చూపినప్రయోగ మిది యొక్కటి. ఇంక ఇట్టికవి ప్రయోగము లుండఁగా (బహువచనము గూడను బలహీన మైన నిం కొకప్రయోగమును జూపిన బా గుండెడిది.) ఉంచిప్రయోగమె యసాధు వని సూరి వివరించుట సరి కాదు. (ఉ 222) ఇంత నీప్రయోగముల బల మెంతటిది,

లేనిచో షష్ఠియందు ద్వితీయ కర్మయగుటచేత యద్దక (సూ.222) ననిర• లోపించిన దనియు నధ్యాహారము చేయవలయు ననియుఁ జెప్పుచో నుంచియే యేమి? దీని నైనఁ జేయవచ్చు నన్వయింపవలె నంతె. ఇట్లు లోపించిన దని తెలియక సూరి సాధుకవిప్రయోగారూఢము గా దనె. కనఁబడినఁ గదా.



ఉంచి నధ్యాహారము చేసిన నన్వయ మె ట్లుండును? 'తనువునుంచి రుధిరధార' లొల్కిన దనఁగా తనువు నట్టె యుంచి రుధిరము మాత్రము వెలికి వచ్చిన దనవలెను. పైవాక్యమున కీరీతిగా నర్థము చేయుట లోకమునం దెచ్చటను తే దనవచ్చును.

కాఁగా పరుషులవారిపరిష్కార మిది. సూరి పలనకు ద్వితీయాసప్తము లని చెప్పినచోట సప్తమిమీఁద నండి యన్వయించును ద్వితీయపై 'నుంచి' యన్వయించును' అట నధికరణకర్మార్థములం దయినసప్తమీద్వితీయలె కాని పంచమి కయినవి కావు.

ఈ ఉండి, ఉంచి యనుపదము లెంత యుచితముగా నన్వయించుచున్నవో గమనించితిమి గదా. 'ఉండి' కన్పట్టును గాని యుంచి యెచ్చటను గానరాదు. కావున నుంచి దాదాపుగా నెల్లెడల నధ్యాహార్యము కావలసినదే.

వాఁ డిల్లు వెడలె ననుచోఁ గూడ నిల్లు కర్మార్థమున ద్వితీయ యై యాద్వితీయపుఁ బ్రథమ (కార.24) యై యీవివరణము ననుసరించి 'ఉంచి' యధ్యాహారము కాఁగా ఇల్లు ఉంచి వెడలెను, అనఁగాఁ బోవువాఁడు తనతోపాటు ఇంటిని దీసికొని పోక విడిచియే వెడలె నని సముచితముగా నన్వయించుటకై యుంచి నధ్యాహారము చేయవలె. పురము వెల్వడిరి. నీర్వెడలి మొద లగున వెల్ల నిట్లె యన్వయించుకోవలె.

ఇట్టియసహజప్రక్రియకంటె సం.లోఁ బేర్కొన్నట్లు (ఉండి లేనిద్వితీయాప్రయోగములు— నీరిపంన వెడలి— ఇత్యాదిగాఁ బంచమికి ద్వితీయ యైనస్థలములుగాఁ జెప్పుట యుచితము గదా.

ద్వితీయ సప్తమి కైనదిగా నుండిశబ్దముతోఁ గొన్నిచోట్ల నన్వయించిరి. ద్వితీయ కర్మార్థమందె యైనదిగా నుంచిశబ్దముతో నన్వయించిరి కొన్నిచోట్ల. దీని

కొక్రమము లేదు. ఏచోటంగాని యర్థము సముచితముగా నన్వయించుట లేదు.  ఉంచిశబ్దము ప్రయుక్త మయినస్థలములే గాకరామి నెల్లయెడల నర్థాపేక్ష మనుటయు నటుగూడ నర్థసమన్వయ ముంచిశబ్దముతో మిక్కిలి యసంగతముగా నుండుటయును బట్టి పరుచులవారి ఉండి,ఉంచిసమన్వయ మెంతమాత్రము సంగీకారయోగ్యము కాదు.

నిన్నుండి పీనిరూపము గన్నులం జూడంగ గలిగె (అని.2.137) అనుచో మహాధర్థమున నేకత్వమున ద్వితీయపై నుండిని పీ రెట్లు సమన్వయింతురో.

సం.లో పీరె చేసినసమన్వయము ననుసరించియు, నప్రయుక్త మగునుండిశబ్ది పరకత్వమున పలనకు (సప్తమి) ద్వితీయ విధించుట కవిప్రయోగానుగుణము. కావున నీసూరిలక్షణములను పరుచులవారు తొలంగించుట యసమంజసము. సూరిలక్షణము సూక్తము.

ఈవరుసలో పీరు వాక్యమునం దన్వయించు 'తొట్టి మొద లగుశబ్దములను బ్రస్తావించిరి. కాని యవి యిచ్చోటిఉండి (ఉంచి) శబ్దము వంటివి (ఉ.222) గావని గుర్తింపంగగును.

కంటె:

కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు (12) కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు (13, ననువాని నట్ల గ్రహించిరి. (ఉ.16,17) పైరెండవసూత్ర స్థలమున 'పంచమికి నగు' నని సంధి కానిరూపమును బ్రయోగించుటలో పరుచులవారు సాధించినవిశేషార్థ మేమియు లేదు.

సూనులతమ్ములకంటె నను చో కంటెవిభక్తి పెక్కుటి కొక్కటి నిల్పుటను జేర్కొనిరి (ఉ 228) ఇగి విశేషమె సూనులకంటె తమ్ములకంటె యనుచో కంటె రెండుచోట మాత్రమె యుండి కాని మొదట 'సూనుల' అని బహుత్వమున విభక్తికి రావలసినడాగమును (కంటె) విభక్తి లేకయు వచ్చుట విశేషము, తోడవిభక్తిసంము ప్రౌఢ. 'కొన్నియెడల నుశబ్దప్రయోగంబునం దోడను లోపంబును ష్ఠీసహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి' (కాత.7) నని చెప్పిన ట్లిట మొదటిశబ్దమున కంటె

లోపమును జెప్పు టుచిత మనిపించు. అనుప్రయుక్త మగునది కాదు గదా పెక్కండి కొక్కండి యనునట్లు.

## కన్న :

'కంటె కర్మాదికపర్యాయము కన్నవిభక్తి' (ఉ.228) 'కన్న' అను రూపము నంగీకరించుట లొప్పును (ఉ.95) రూపాంతర మనుటకన్న కంటెనుండి కన్నను నిరూపించుటయో కంటెకుఁ 'గన్న' యాదేశించుటయో కాక కన్నను బంచమీవిభక్త్యర్థాభిధాయక శబ్దముగాఁ జెప్పుటయో యుచిత మనిపించు. దానిం బ్రమాణీకరింపవలసియున్న పుడు లక్షణబద్ధము చేయఁదగుఁ గదా.

## పట్టి :

'పట్టి ద్రకంబు హేతువు లగుగుణక్రియలం దగు' (14) ననుసూరిలక్షణమును మార్చి "గుణవాచకము హేతు వగునపుడు పట్టియు ద్రుతపూర్వకముగ నిల్చును. హేతు వగునట్టి క్రియపైఁద పట్టివిభక్తి మాత్రమె నిల్చును (ఉ.18) అని పేర్కొనిరి.

వీరిలక్షణమున మొదటివాక్యమున 'గుణవాచకము హేతు వగునపు' డనునది 'హేతు వగుగుణమున' ననుసూరిమాటలకు వివరణమె.

సూరి హేతు వగు క్రియకును పట్టిద్రకము జెప్పఁగా వీ రది తొలఁగించిరి. దీనింగూర్చి వీ రిట నేమియుఁ జెప్పలేదు. సం.లో సంస్కృతమునందె గుణవాచకేతర స్థలమునందును బంచమి యంగీకరింపఁబడుటంజేసియుఁ గ్రియ హేతు వగునపుడును బంచమి ప్రయోగదృష్ట మగుటంజేసియు 'హేతువు లగుగుణక్రియలకు' అని సూరిగారు సవరించిరి. కాని దేనికిని మహాకవిప్రయోగము లభింపలేదు' (వ్యా.సం.స. 1029) అనిరి. మహాకవిప్రయోగము దేనికిని లభింపకున్నను గుణవాచకములకు మాత్రము పట్టిని వీ రిట విధించిరి. 'పట్టీతి తు పంచ మీగుణే హేతౌ' యని చిం. చెప్పియుండుటనుబట్టి గావచ్చును. కాని యిపుడునే వీరు 'క్రియ హేతు వగునపుడును

పంచమి ప్రయోగదృష్ట మగుటను పేర్కొనుట సమంజసము. క్రియల నిట్టి దొలఁగించుట నెట్లు సమర్థింపఁగలము. సత్కవులవా రన్నట్లు వీనికిఁ బ్రయోగములు వెదుక వలసియున్నది.

'షష్ఠ్యర్థకం బగు' నని సూరి చెప్పఁగా వీరు 'షష్ఠియు నిల్చును' అనిరి. ('నిల్చును' అని వ్యాఖ్యానమునఁ గాక యగు నని విధించుసూరిలక్షణ ముచితమె కదా.) సముచ్చయార్థకము విశేషము. వీరే "(కార.6సూ) జ్ఞానముచేత జ్ఞానము వలన- హేతుతృతీయాపంచములు నగు (ఉ.224) నని వివరించిరి. ఇటఁ బంచమి యనఁగా వలన పంచమి యని లక్ష్యమునుబట్టి గ్రహింపఁదగును. ప్రస్తుతసూత్రవిహిత మగు 'షష్ఠి'యును బంచమియే కదా. ఇంక వీరలె "సూరి తృతీయాపంచము లగు నని యేల వచింపలేదో తెలియకున్నది." (ఉ.224) యనిరి. సముచ్చయార్థకమును బ్రయోగింపమి నివి సూరి సాధింపలే దని వీరియభిప్రాయము గావలెను. కాని సూరి యిప్పటనె 'ఇచట నధికరణషష్ఠి యగు, జ్ఞానమువలన ముక్తుం డగు' అని వలన పంచమి యగుటను పేర్కొనియే యుండెను. ఇంక హేతుతృతీయ (చేత) ఇతఃపూర్వమె విధింపఁబడియున్నది. (కార.4) హేత్వర్థమున సాధారణముగఁ జేత విధింపఁబడియె యున్నది గాన దానిని విశేషముగాఁ జెప్పఁ బని లేదు. 'వలన' విహితము గాదు గానఁ బేర్కొనియుండును. వీ రింతకు ముందు కలదాని విధించుకొను సూరివలెనె (ఉ.16సూ) (సముచ్చయార్థకశబ్దవిరహితముగ) చెప్పియును "ఇట్టియెడల షష్ఠికిని (కిప్రత్యేకపరిగణన మనవసరము) ప్రత్యయప్రయోగము తఱచు" అని చెప్పుట గమనింపఁదగును.

కాన నిట సూరి చేతవలనలు చెప్పె ననుట స్పష్టము.

'ప్రయతపూర్వకముగ నిల్చును' అని వీరు విశేషముగఁ జెప్పిరి. "ఇందు జ్ఞానముంబట్టి యని యుదాహరించుటకు సూరికి ప్రయత మెట్లు వచ్చెనో" (ఉ.224) సూరి యీవ్యాకరణంబునకు మూలం బయిన వికృతి యగుసూత్రాంధ్రవ్యాకరణములో 'నుక్తషష్ఠి విభక్త్యా' యని పేర్కొనెను. కాని యిందుఁ గూడ నాయంశమును జెప్పిన బాగుండెడిది.

జ్ఞానముంబట్టి వచ్చుటంబట్టి యని యుదాహరించినసామర్థ్యము ననుసరించి షష్ఠీ పరకత్వమున నెల్లెడల నుగాగమ మగు నని గ్రహించుట యొకమార్గమె యయ్యును విధించిన బా గుండెడిది కదా?

కాని వీరివిధానమున విశేషము గమనింపవలె. ద్రుతపూర్వక మనిరి. ద్రుత మన నేమి? 'పదాంతసువర్ణంబు ద్రుతంబు' (సం.11) అని కదా వీరు చెప్పిరి. ఇట నేపదాంత సువర్ణము గ్రహింతుము?

వీ రెట్లును, నీవ్యాకరణమున కూర్చి, గుఱిచి మొద లగువానిం బ్రస్తావించిరి. కావున నవ్వానిం గూడఁ గలుపుకొని వానియన్నింటిపరకత్వమున నుగాగమమును బ్రత్యేకముగఁ జెప్పఁదగును. (చూ.ఇందు.కార.2సూ) కాక యవి ద్వితీయ కనుప్రయుక్త ము లని నిర్ద్వంద్వముగా నంగీకరించుచో నుగాగమప్రసక్తి యట లేదు.

'హేతు వగునవ్యంతక్రియమీఁద షష్ఠీవిభక్తిమాత్రమె నిల్చు' నని పిదప నిం కొకయంశమును వీ రీసూత్రమునఁ జేర్చినిరి. ఇది బాల.లో ననుక్తము. ప్రౌఢ (హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకం బగు' నని చెప్పె (కార.12) సూరి సూత్రింపలేదు. కాని తీర్థముమీఁద సౌధ్యపూర్ణము లో' దనుచో (సం,15) కాఁబట్టి యని యుదాహరించెను. "న్యజ్యంతముమీఁదిషష్ఠిని సూరి సూత్రింపకుండుట సరి కాదు. (ఊ.224) సూరి బాల. సమగ్ర మనెనా? అను క్తములంగూర్చి చర్చ యేల?

షష్ఠీవిభక్తిమాత్రమె యనుటలో నితరవిభక్తులు రా వని వరుఖులవారు చెప్పఁ దలఁచుట స్పష్టమె. న్యజ్యంతము లవ్యయములు గావున వానిపై నేవిభక్తియు నిలు వదు. మాత్రమె యనకపోయినను నిట విశేషవిధి ననుసరించి షష్ఠీప్రత్యయ మొక్కటి మాత్రమె యయి యితరవిభక్తులు గాకుండుట సిద్ధించెడిదే యనవచ్చును.

గుణవాచకములపైఁ బట్టి ద్రుతపూర్వకము నగును. న్యజ్యంతములపై నెట్లె యవునా? (కలుగంగనుబట్టి) ఇం ద్రుతపూర్వకత్వ మనవసరము. 'మాత్రమె' యను టలో ద్రుతపూర్వకము కాక కేవలము షష్ఠిమాత్రమె వచ్చు నని యుద్దేశించిరా? కాని (వ్యా.సం.స.1029) వివరణమును బరిశీలించిన నట్టియుద్దేశ్య మున్నట్లు గానరాదు.

ఇటఁ గూడ నీ రట్లు వివరింపలేదు. షష్ఠీతరవిభక్తులు రా వనియు 'మాత్రమె' యను దానిచే నీ రుద్దేశించి రనవలె. ఇట 'ప్రుతపూర్వకముగ' ననకుండుటచేతఁబట్టియె 'షష్ఠి' మాత్రమె వచ్చు నని చెప్పవచ్చును.

ఏ మైన షష్ఠి ప్రుతపూర్వక మనుటకంటె, షష్ఠీపరకత్వమునఁ బ్రాతిపదికకు నుగాగమము చెప్పిన బా గుండెడి దనుటలోఁ దప్పు లేదు.

యొక్క :

శేషషష్ఠికి యొక్కయు నగు (15) ననుసూరిసూత్రమును మూలము చేసి వీరు విస్తరించి విశేషలక్షణమును జెప్పిరి. వస్తులవారిలక్షణమును సౌకర్యమునకై విభాగించి క్రమముగాఁ బరిశీలింతము.

1. స్వస్వామిభావాదిసంబంధములందు స్వామ్యాదివాచకములకు యొక్క వర్ణకం బగు— — ———

2. కొన్ని యెడల యొక్క అనుదానిచో కు—కువిభక్తి నిల్చుటయుఁ గలదు.

ఈ రెండంశములను సూరిసూత్రమునకు వ్యాఖ్యానప్రాయములుగా గుర్తింపఁ దగును. సం.లో (వ్యా.సం.స.1030) శేషమును వివరించిన యంశమునే (స్వస్వామిభావాదిసంబంధశ్శేషః ఇత్యాది.) ఇట మొదటియంశమునఁ బేర్కొనిరి. శేషషష్ఠికి అని సూత్రించుటయు శేష మన నేమో వివరించుటయు వ్యాకర్తృమార్గము. 'స్వస్వామిభావాదిసంబంధము' అనుచో నాదిశబ్దమునర్థమున కెట్లును వివరణము నాశ్రయింపవలసి నదే కదా. కాఁగా వ్యాఖ్యానప్రాయముగా నున్న వీరిలక్షణముకంటె సూరి 'సూత్ర' రచన సముచిత మనుటలో వివాదము లేదు. ఇంక నిది దానికి సంగ్రహవ్యాఖ్యయు యగుటచే సూరిలక్షణమున దురుక్తియు లేదు.

సూరి 'యొక్కయు నగు' నని సముచ్చయార్థకనుశబ్దమును బ్రయోగించి దాని చేత 'కు'విభక్తిని సాధించెను. (కువిభక్తియు యొక్కవలెనె షష్ఠి గావునను దానిని ప్రత్యేకముగా విధింపకపోవుటచేతను నిటఁ జార్థకమును సూత్రమునఁ బ్రయోగించె నని గ్రహింపవచ్చును.) వీ రట్లు గాక 'యొక్క వర్ణకం బగు' అని యొక్కచొక్కదానినె

పకుఁ జిం. యొక్క-లోపమును విధింపలేదు. (వరుఖులవా రెట్లో పశబ్దమునకు ముడి వెట్టిరి.) ఏ మైన నహో. యొక్క-ప్రయోగము ప్రాయికముగా లే దన్నను ప్రౌఢ-'బహుళము'గా లోపము చెప్పుట సమాసములందు దప్పకుండుటచేతనే యని యూహింపవచ్చును. వీరు నట్లు చెప్పఁదగు ననవచ్చును.

ఈపక్షమున మాత్రము వ్యస్తతలో లోపించు నన్నపుడు సమాస (విగ్రహ)మున నిల్చియుండు నన నేల యనవచ్చును. 'సమాసవిభక్తికిఁ బ్రత్యేకముగాఁ జెప్పినలోపమే విశేషవిధి యగుటఁ బ్రవర్తించును. వరుఖులవారిద్వితీయాతుల్యతలో ద్రుతలోపరూప మైనప్రక్రియాగౌరవ మింకను నధిక మగుట నది యనవసర మని యేపక్షమునను నిర్ణయింపవచ్చును.

మొత్తముపై యొక్క-కు లోపము బహుళ మగుట ప్రౌఢ.లక్షణ ముచితము గాన నట్లు చెప్పఁదగు నని సారాంశము.

ది___వి :

8. అట్టియెడల యొక్క-చోట నేకత్వంబున దిఙర్థకంబును బహుత్వమున విఙర్థకంబును వైకల్పికముగా నిల్చును" —అనునది వీరియీసూత్రమునందలి మాఁదటియంశము.

'అట్టియెడల' ననఁగా యొక్క- లోపించినయెడల (లోపింపకుండుటకు వీ రవకాశ మీలేదు.) 'యొక్క-చో' అనఁగా లోపింపకముందు ఏచోట నుండెడిదో యాచోట నన్నమాట. ముందుగా యొక్క-ను లోపింపఁజేసి దానిచో దివి(దు) చెప్ప నేల? లోపింపకయె యొక్క-కు దివి(దు) ఆదేశించుట లాఘవము గదా ('కొన్నియెడల' నన వలె. అపుడు వైకల్పిక మని యుఁ జెప్పనక్కఱ లేదు.)

అసలు యొక్క-కుఁ జేయ నేల? సూరి 'కుయొక్క-లోపలషష్ఠి' యనఁగా వీరు కు యొక్క- ది వి లోపల షష్ఠీవిభక్తి' (తత్స 6) అని 'ది వి' యనువానిని (ప్ర)'త్యేకముగా షష్ఠివిభక్తులుగాఁ జేకొనిరి. అనఁగా (కు.లోపల) యొక్క- అనుదాని ది. యనునవి ప్రత్యేకముగా షష్ఠీవిభక్తులే, కాఁగా యొక్క-విభక్తి యెట్లు ప్రాతి

పదికపై నరానరి యగుచున్నవో యట్లే 'డివి' విభక్తులును బ్రాతిపదికపై నగును. అట్టి యెడల 'యొక్కచోఁ' జేయవలసినయవసరమేమి? (వీరు కిఱుంను గూడ నిట్లయొక్కచోఁ జెప్పుట గుర్తించితిమి.) ఇది కేవలము బ్రక్రియాగౌరవము.

ఇంక 'డుముప్రవది అనునవి యేకవచనంబులు' (ఉ.తత్స.11) అని దివర్ణ మేకవచన మనియు "లు — ల్-వి లోపలవర్ణకంబులు బహువచనంబులు' (ఉ.తత్స.12) అని విఁ ర్ణకమును బహువచనముగను జెప్పియే యుండిరి. అట్టియెడల నిట 'డి'- ఏకత్వంబున, "వి- 'బహుత్వంబున' నగు నని చెప్పుట యనవసరము. 'పులింగ మగు మహద్వాచకమునకు డు జగు' (ఉ.తత్స 22) నని వీరు విధించినట్లు బహుత్వమున నవుచున్నదా? అటు'నేకత్వంబున' నని చెప్పిరా? ఇది మాత్ర మేల? 'కొన్నియెడల నీయర్థమున 'దివిశర్ణకము అగుటను' సూత్రించిరి గాలదా?

ఇంక నీడి-వి,వర్ణములు షష్ఠీవిభక్తు లను టుచితమా యన్నది పరిశీలింతము.

ఇది వీరు చెప్పినవిశేషాంశము. అందుకే కాఁబోలును దివులను షష్ఠీవిభక్తులుగాఁ బరిగణించియు నట నట 'దివిదుప్రత్యయములు షష్ఠ్యర్థకములే' (ఉ సమా.77) మొదలుగాఁ బెక్కుసార్లు పేర్కొనిరి. షష్ఠీవిభక్తు లన్న నీయవి షష్ఠ్యర్థకములు గాక యే మగును?

ఇట వీరు బాల.సమా.8,9, సూత్రములను సూచించిరి. సమా.9సూత్రార్థమును సూత్రముగాఁ జెప్పకున్నను వీరు పిదప వివరించిరి. (ఉ.389) 'వచ్చినది వచ్చినవి' అనురీతి నమహదర్థకరూపము లిట సంగ్రహింపఁబడుచున్న వని వీరియాశయము గాఁబోలును. కాని యిది సరి కాదు. వీనిని గర్మధారయాభాసములుగా వీ రటఁ జెప్పిరి. (ఉ.389) వచ్చినదానిన్ వచ్చినవానియందు ఇత్యాదిగ నట నితరవిభక్తులలో రూపము లుండును. వీ రిట విధించినషష్ఠీవిప్రత్యయములపై నట్లు రూపము లుండునా? ఆసమా.9.సూత్రము నిటఁ బ్రస్తావించు టసంగతము. వీరె యవి (యాభాస) సమాసము లని యటఁ జెప్పియు నిట వర్ణ్యాంతరూపస్థలమున బ్రస్తావించు టెట్లు కుదురును.

సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు' నను సమా. 8.సూత్రమునర్థ మిట్టి వీరు డివిప్రత్యయములచే సాధించితి మనుకొనియుందురు.

“సూరి డివిప్రత్యయములను చెప్పనే లేదు. అదిఅవిశబ్దములసమాసమునఁ (బా.సంధి.45) నట్టివి సాధ్యము లగు నని సూరితలంపు. (ఉ.225) అది సరి గాదనియు నవి షష్ఠీవిభక్తి లనియు వీరినిశ్చయము.

ఆసూరిసూత్ర మనుమహదర్థమునె ప్రస్తావించునదికాదు. మహదర్థమునను దచ్ఛబ్దముతో సమాసము గల్గఁగా నావాఁడుఇంటివాఁ డనురీతివానిని గూడ సమా.8.సూత్రము సాధించుచున్నది. డివి షష్ఠీవిభక్తి యన్నవీరిలక్షణ మట్టివానిని సాధింపఁగలదా? 'ఇంగ్లీషునందలి **My,Mine** శబ్దములవలెనె దానిది, అది శబ్దాంతములు నగు ననుట యుక్తము. నాది. నావి మున్నగురీతిని అది, అవి అనుశబ్దములసమాసములు నిర్బాధములు' (ఉ.226) అనిరి. అట్లుగాఁ దచ్ఛబ్దముతో సమాసము విధింపఁ బని లే దని యర్థము గావలె. నాయొక్క యేది నా యేది నాయొక్క ఇతఁడు నా యితఁ డనురీతి సర్వనామోత్తరపదము లగుసమాసములు సాధారణములు గాకుండఁ దచ్ఛబ్దాంతములు తఱు చగుటచేతనె సూరి దానిని ప్రత్యేకముగా ప్రస్తావించె నని గుర్తింపవలయును.

ఇంకను ఇది నాయది, వీరు నావారు ఇంటిది యేది ఇంటివారొక్కరు లేరు· ఇత్యాదులం దుత్తరపద మగుతచ్ఛబ్దమునర్థము ప్రధాన మగుచున్నదా? ఇటుఁ దదర్థమె లేదు. నాయది యనుచో సంబంధార్థవిశిష్ట మైనయమహద్వస్తుమాత్రము నది బోధించును. 'నావాఁడు' అనుచో నట్టిమహత్పదార్థమాత్రబోధక మగుచున్నది.

“సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు” (సమా.8) అనువిధానమునుబట్టి యిట సంబంధమే కాని తచ్ఛబ్దమునర్థమునకుఁ బ్రాధాన్యము లేకుండుట స్పష్టము. (వ్యా సం.స.1:74) అని పెద్దలవారు నియమమును స్పష్టము చేసియేయున్నారు

ఇక్లీతరసర్వనామములలో సమాస మప్రసిద్ధము గాఁగాఁ దచ్ఛబ్దములోఁ బ్రమరమై యుండు (సమాస) శబ్దస్వరూపమునుబట్టియే కాక యర్థమునందలివైశిష్ట్యము నను

సరించియు సూరి సమా.౭.విధాన మాసశ్వరి పైయుండ దానిని సరసులవారు దమగ్రంథమునఁ దొలఁగించుట సరికాదు. అది సాధారణముగా సిద్ధించునంశము యని తీసివేయరాదు. అట్టియెడల నుత్తరపదార్థప్రధానముగావలసిన యీసమాసమున వివక్షితార్థసిద్ధియె యసంభవము.

కాన. బా.సమా.౭. సూత్రము సూక్తము. దానికిని షష్ఠీప్రత్యయములుగాఁజెప్పని 'దివి'ప్రత్యయములు చివర నుండి సాధించువీరియాలక్షణమునకును [illegible] లే దని గుర్తింపఁదగును.

నాయొక్క—అది నా(నాయది) (**Mine**) అనుచోఁ దచ్ఛబ్దము నాయొక్క— నా— నాది (**My**) యనుచో 'ది'షష్ఠీవిభక్తి యని వీరిసమన్వయము. షష్ఠ్యంత మగునాది, దానిది, దానివి యనురీతిరూపములు సూరి సాధింపలే దన్నమాట.

ఇంగ్లీషుతో వీరు తెచ్చినపోలిక విశేషము. వీరు సాధించిననాది— యనుదానికి **My** అనుదానియర్థ మున్నదా? నాది = నాయొక్క నా(యొక్క)వస్తువు అనవచ్చును. అట్లె కాని వస్తువు నా(యొక్క) అని సంబంధివస్తువాచకమునకుఁ బరముగా యొక్క ప్రత్యయాంతము ప్రయోగింపఁబడదు. 'వస్తువు నాది' యనుచో దిప్రత్యయాంతము ప్రయుక్త మగుట లేదా? అయిన నిది యదిశబ్దముతో సమసించినరూపమె కాని దిప్రత్యయాంతము గా దనవలె. అట్టియెడ నాది వస్తువనురీతిగాఁ బూర్వప్రయుక్త మైనపుడు మాత్రము దిప్రత్యయాంత మన నేల? అదిశబ్దములోదిపమానమైన దగరాదా. అన్వయమునఁ గొంతవిశేషము గలదు. అందుచే యట్టి(దానిదికలరూపు) ప్రయోగములును నరుదుగా విశేషముగనే ప్రయుక్త మగుచున్నవి. కాని నావస్తు వనురీతిని సామాన్యములు గా నని గుర్తింపవచ్చును.

ఇట్లె వీరు "రాముఁడయొక్క—రాముఁడన్— ది (శక్తి) రామునియొక్క రాముని దన్— వి— రామునివి (గుణములు) (వ్యా.సం.న 1085) అని చూపినట్లును శక్తి రామునిది గుణములు రామునివి యనుచో సమస్తరూప మనవలె. రామునదిశక్తి, రామునవి గుణము లనుచో దివులు ప్రత్యయము లనవలె స్వీకృతము. లేనిచో శక్తి రామునిది యనురీతిగా శక్తిరామునియొక్క యనియు వ్యవహరింపవలసివచ్చును. యొక్కస్థాన

మునసే కదా వీరు డివులు చెప్పిరి. వీరి సమన్వయము దివులు ప్రత్యయములు గా వినుటకై యుపకరించును. ఇందలి యనౌచిత్యము దిట్లు గుర్తింపవచ్చును.


రాముల—ది యనుచో 'ది, ఏకవచనము. కాని ముందటిలవర్ణము బహుత్వము నం దగునది. 'వనములను' అని సప్తమ్యేకవచన మగునవర్ణము లడాగమముపై నుండునా? ముందసలు లడాగమ మెట్లు వచ్చును. ఇట వీరిప్రక్రియనే యనుసరింతము. 'రాములయొక్క' అనుచో యొక్కబహువచనము గదా. (అందుకే ముందు లడాగమ మైనది) కావున నిది బహుత్వమునం దున్నదే కదా. బహుత్వమునందు వి'ప్రత్యయము గదా వీరు విధించినది 'రాములది' యని యేకత్వమునఁ జెప్పిన ది ప్రత్యయ మిట బహుత్వమున నట్లయినది?

అట్లె రామునివి (గుణములు) అనుచో రామునియొక్క అనుచో యొక్క యేకత్వమునం దున్న దని ముందటినిగాగమము స్పష్టము చేయుచున్నవి. కావున నేకత్వమునందుఁ జెప్పిన'ది' ప్రత్యయ మిట రావలసియున్నది. మఱి బహుత్వమునం దగునన్న 'వి' ప్రత్యయ మేకత్వమున నెట్లయినది. ద్విపర్ణ మేకవచనము వివర్ణము బహువచనము నని వ్రాసి రింతకుముందును (తత్స.11,12) స్పష్టము చేసిరి. ఇట్టి దారాపరుగ నయ్యె నేమి?

దీనింగూర్చి వీరు సం.లో "సంబంధివస్తువులయేకత్వమున ది ప్రత్యయమును, బహుత్వమున వి ప్రత్యయము నగును". (వ్యా.సం.స 10౩౫) అనిరి. యొక్క స్థానమునఁ గదా వీరు దివులు చెప్పిరి. యొక్క యి ట్లగుచున్నదా.

'రామునియొక్క గుణములు, అనుచో సంబంధివాచకము (గుణములు) బహుత్వమునం దున్నది. కావున 'యొక్క, బహువచన మయి బహుత్వ మగుటచే లడాగమములో రాములయొక్క గుణములు అని యగుచున్నదా? ఇట్లే రామకృష్ణుల యొక్క శక్తి యనుచో సంబంధి యగు శక్తి యేకత్వమునం దుండుటచే యొక్క యేకవచనమయిన ముందు నిగాగమమై రామకృష్ణుని(యొక్క)శక్తి యని యగుచున్నదా? ఇట్లే సీతారామునిపర్ణశాల మున్నగువింతరూపము లేర్పడవలదా?

కాఁగా 'స్వస్వామిభావాదిసంబంధములందు స్వామ్యాదివాచకములకు యొక్క- స్వామ్యాది వాచకముల యేకత్వబహుత్వముల ననుసరించి యేకవచనముగను బహువచనముగను నగుచుండ నీడివిసర్గకములు స్వామ్యాదివాచకములకే యగును గాని స్వాదివాచకములయేకత్వబహుత్వముల ననుసరించి యగు నన్నమాట. (రాముని గుణములు, రాములవి శక్తి యని యుండదు గదా.

దీనినిబట్టియు ది,వి ప్రత్యయములు యొక్క-ంటివి గా వనియు నవి షష్ఠీవిభక్తులుగాఁ జెప్పరాదనియు స్పష్టమగుచున్నది గదా.

వీరె యింకొకభేదమును గూడ సం.లో. ప్రస్తావించిరి. ''సంబంధి స్త్రీపు లమహత్తు లైయున్నపుడే యీప్రత్యయము లగు నని యెఱుంగునది.' (వ్యా.సం.స. 1035) ఇది యుచితము. రామునిది భార్య, రామునివి కొడుకు అని యుండదు గదా. కాని యిట్టిభేదం యొక్క-చో నెప్పుడును వీ రెట్లు విధించిరి? యొక్క- యనుమాద్యము నంబంధమాత్రమె యగును గాదే. రామునియొక్క-, సీతయొక్క-, వనముయొక్క- అని యెల్లెడల నగుఁ గదా.

ఇఁక నీయమహత్త్వము నైతము (విశేష్యము) సంబంధ(సంబంధి)వాచకముల ననుసరించియు గ్రహింపవలయునియు నమ్మార్గము.

'రామునివి శక్తి' యనుచో 'ది' ప్రత్యయము సంబంధవాచకమగు మహత్తు విశేష్యము (శక్తి) అమహత్తగుటచే దానియమహత్త్వమునుబట్టియు 'రాము' అను మహద్వాచకముపై ది వర్ణక మగుచున్నది.

అట్లే ఎనుములయొక్క-వాఁడు అనుచో 'వాఁడు' మహత్తగుటచే 'ది' ప్రత్యయము చేర్పవలసినయెడ్డ మహత్తుయగు విశేష్యము రాదు. ఎనుములవి వాఁ డని కాదు గదా.

ఇట 'రామునిది' యనుచో బోధింపఁబడునది మహత్తా యమహత్తా? రామశబ్దము మహత్త్వయు యుండఁగా నదియమహద్వాచక మగు టెట్లు? ఇట్టిస్థితి భాష్యయం చెప నేర గలదా?

కాఁగా విశేష్యము (స్వాదివాచకము)ననుబట్టి యమహత్త్వముతోను ఏకబహు వచనములుగా నగు ననుటనుబట్టియు. ఇవి ప్రాతిపదికమునకు సంబంధించినవి గా వని స్పష్టము. విశేష్యార్థమును సంగ్రహించు అది, అవిశబ్దములనుండి సమాసముతో (రామునియొక్క అవి—— గుణములు) రామునివి గుణములు (సీతారాములయొక్క అది- పర్ణశాల) సీతారాములది పర్ణశాల యనుతీరుగా నేర్పడు నని గ్రహింపవలయును. కాఁగా నిట్లు చెప్పుసూరిమతమె యుచిత మని స్పష్టము.

ఇవి ప్రత్యయము లనుటలో నిం కొకయిబ్బంది వీరివచనములలోనె గుర్తింప వచ్చును. ది,వి అనునవి ప్రత్యయము లనునపుడు వానికి అనుధాతువుతో నన్వయ ముండదు. రామునియొక్క అనుదానికి అగుధాతుజన్యవిశేషణములతో నన్వయ ముండదు గదా. అది విశేష్యముతో నన్వయించును. దానిది కలరూపు (ఆది.4.30) వారివి + అ వారివ పుష్పదామములు (అర.3.156) (ఉ.225.)

యొక్క ప్రత్యయముతో సామ్యమును షష్ఠీయంశమునను పరిశీలించిరి. కాని యింతకు ముందు పేర్కొన్న తావులను దోఁచిన వీరు నివి ప్రత్యయములే కా దనెడివా రేమో. సం లోఁ జేసినయింతకుఁబూర్వపువివరణ మిట ఉ.లోఁ బ్రస్తావించినట్లు లేదు.

ఎక్కడత అవియవులతో సమాసమో ఎక్కడ ద్వివిప్రత్యయముతో, విచారించు బాధ లేకుండ నిట పద్యులవారే యుదాహరించుటంబట్టి దీనిచేతనె యివి ప్రత్యయములు గా వని నిర్ణయింపవచ్చును.

దానిది కలరూపు, వారివ పుష్పదామములు అనుచో నగుధాతుజన్యవిశేషణము లతో (యొక్క-వలె) నన్వయింపక సరాసరి విశేష్యములతోనె యన్వయించుననుచు నిట దివి'(ద్వి-వి')ప్రత్యయము లనిరి. వీరు కాని యట "వారివ- వారివె యైన" (ప్రౌఢ.కార. 16) అని ప్రౌఢవ్యాకర్త అగుధాతుజన్య మగు'అయిన' అనువిశేషణరూపముతో నన్వ

యుంచి చూపెనే? అం దసంగతి యున్నదా? దానిది కలరూపు అనుచో నిక్కే దానిది యగుకలరూపు అని యన్వయించుటలో బాధ యేమి? రామునిశక్తి, రామునివి గుణములు అని చూపినచోట్లమాత్రము రాముని దగుశక్తి రాముని వగు గుణములు అని యన్వయించుటలో నే మేని బాధ గలదా?



నాదుమనోరథము మొ॥ షష్ఠీసమాసము అని భ్రమింపరాదు. జనంబుల దయిన (సభా.2.71) మున్నగుస్థలములందువలెనె తన దైనదస్యదీప్తి (అర.1.348) మున్నగుస్థలములందును తన్ద్వారా అనియె పదచ్ఛేదము— మున్నగుస్థలములందును తనదు—తనయొక్క అనునది విశేష్యములో నన్వయించునే కాని అయిన మొదలగు ధాతుజవిశేషణములతో నన్వయింపదు. తనయొక్క అయిన ద్యస్యదీప్తి అనురీతి ప్రయోగము లసంభవములు గదా." (వ్యా.సం స.1036) ఇది జనంబులది (తన్ద్వ) సమాసమా? అయిన 'దాన్ని కలరూ' పనుచో 'దానిది' అన్నది సమాస మని యేల యనరాదు? కవిప్రయోగమునందే 'అయిన' అని యుండుటచేతనా?

'దానియొక్క యగుకలరూపు' అనరాదు కాని రాముని దగుశక్తి దాని దగు కలరూ పనురీతిగా నగుధాతుజన్యవిశేషణముతో నన్వయము సులువుగా నుండుటను బట్టి యీయొక్కకారణముచేతనే యీ డ—వి—ప్రత్యయములు షష్ఠీవిభక్తులు. యొక్క స్థానికములు— కానేర వని నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును గదా. వరుణధనేశ్వరుల దైనవైభవయుక్తిన్ (కవిశ.572) (సభా.1.270.)

కాఁగా దాన్ని కలరూపు మున్నగువానిలో 'డి' అనున్ది ప్రత్యయ మనుటయె యుక్తము' (పు.226) కాదు. దానియొక్క— దాన్ని అనువాని కర్థస్ఫూర్తియందు భేదము స్పష్టము వీరినిశ్చయమునకుఁ దగినయాధారము లేదు.

'ద్విసాత్వసంబంధార్థే సర్వనామ్న' త్రసుబిం.లక్షణమును బరిశీలించి లక్ష్యానుగుణముగ విస్తరించి సూరి సమాస సూత్రము చేసెను. అది యుచిత మైయుండఁగా వీరు దానిని బరిహరించుట యసంగతము. పైచి.సూత్రార్థము గ్రంథాంతరమున స్పష్ట మగును.

కాఁగా పరుములవారు చెప్పినయీసూత్రమునందలిమూఁడవయుదాహరణ మనర్థక మై త్యాజ్య మనఁదగియున్నది.



ది-వి-ప్రకృతి :

5. ద్వివిప్రత్యయములు పర మగునపుడును తన అనుతద్ధితప్రత్యయము పర మగునపుడును బూర్వాంశయున మగుప్రకృతి (షష్ఠీతత్పురుషపూర్వాంశయము మునుల) ద్వితీయావిభక్తిరూపమున నిల్చును. అన్నది యీసూత్రమునఁ బిదప వీరు చెప్పిన యింకొకవిశేషాంశము.

ఇది పూర్వవిరుద్ధముగా నున్నది. ఇంతకు ముందు చెప్పినదానినిబట్టి స్వామ్యాది వాచకములకు వచ్చిన యొక్క-ప్రత్యయము (లోపింపఁగా దాని) స్థానమున ద్వి,వి వచ్చు ననవలెను. అట్టిచోటను ఏ విపరకత్వమునఁ బ్రకృతి ద్వితీయాకారమున నిల్చుట యేమి? వివరణమందును 'యొక్కార్థకద్వివిప్రత్యయములు షష్ఠి ద్వితీయాయాకారమున నిల్చుట' (ఉ.225) యని పేర్కొనిరి. దీనిచే 'ద్వివి'పర్ణకములకుఁ బూర్వమునందలిశబ్దము షష్ఠ్యంతము కాఁగా నది ద్వితీయాతుల్యాకృతి నందు నని చెప్పవలెను. సమా.72 సూత్రమున షష్ఠ్యర్థకద్వివిదుప్రత్యయపరకత్వమందును (కార.19.సూ) ద్వితీయయు నిల్చు' (ఉ,230) నని షష్ఠికి ద్వితీయను జెప్పిరి.

ఇందు 'దు'ప్రత్యయమును బ్రస్తావింపలేదు. ఈసూత్రమును జూపించి రట. (సమా.72) 'నీనాతామునశబ్దములచోటిషష్ఠి ద్వితీయాకారము నందదు' (వ్యా.సం.స. 1095) అని యంతకు ముందు పేర్కొనిరి. అట్టిచో నీదు, నాదు మొదలగువానికి బదులుగా నిన్నుదు నన్నుదు అనుమొద లగురీతినరూపపము లేర్పడును. అందుకే దుప్రత్యయపరకత్వమున ద్వితీయ లే దనిరి. అది యుచితమె. ప్రస్తుతసూత్రమునను 'దు'ప్రత్యయమును బ్రస్తావింపకుండు టుచితముగనే యున్నది. కాఁగా సమా.72 సూత్రము 'దు' పేర్కొనుట యసంగతము అను నిది గమనింతము.

ఇంతవఱకు బ్రస్తుతస్థలమున మూఁడుపద్ధతులు చెప్పిరి. 1. 'యొక్క'చో ద్వివు లగుట 2. ద్వివిపరకత్వమునఁ బ్రకృతి ద్వితీయాంతరూపమున నిల్చుట 3. ద్వి

పరకత్వమున షష్ఠికి ద్వితీయ యగును. ఇం దేది యనుసరింతుము. 'వార. 19.సూత్రమునఁ జెప్పఁబడునను గుర్తింపుమనెను' సమా.72సూత్రమున మఱల నీకార్య మేల చెప్పిరో వారికే తెలియవలె.



ఇకఁ బ్రకృతి ద్వితీయాంతరూపమున నిల్చును. 'ప్రకృతి' యనుటచే రామ+యొక్క — అని యుండ యొక్క లోపించి దానిస్థానమున ఇ(వి)ప్రత్యయము చేసి రామ+ది(వి) అని యుండఁగా నిప్పుడు ముందటి రామ అనుప్రకృతి ద్వితీయాంతము వలె నుండు ననవలెనా? (ద్వితీయావిభక్తిరూపమున ననఁగా ద్వితీయావిభక్త్యంతరూపమున నని స్పష్టము.) దానివలనఁ బ్రయోజన మేమి? దివి— షష్ఠీవిభక్తు లనిరి గదా. రామ + ది అని యుండఁగా 'రామునియొక్క' యన్నపుడు యొక్క విభక్తి పర మగుచుండఁగా నె ట్టిత్వము నిగామ మయినవో యట్టి నట్లు గావా? దివి షష్ఠీ విభక్తులలోఁ బరిగణించుటను వీరు మఱచి రేమో.

కానిచో ద్వితీయ నిల్చు ననుటవలన వీరు సాధించిన దేమి? 'దానిది' యనురీతి నేర్పడుటయె కదా కావలసినది. ద్వితీయాతుల్యత్వము లేకయె దానియొక్క యను రీతిగా దానిది యేర్పడుచుండఁగా ద్వితీయావిభక్తిరూపమున నిల్చు నని చెప్ప నేల? అట్లు చెప్పుటవలన నొకయనర్థమును. "దానిది — . సామాసికద్రుతలోపము (సంధి. 28సూ) (ఉ.225) అని దానిన్+ది అనుచో సామాసికద్రుతలోపము చేయవలసివచ్చినది. 'దానియొక్క' యనుచో నీద్రుతలోపప్రసక్తి యున్నదా? ద్వితీయాతుల్యత్వము ననవసరముగాఁ దెచ్చిపెట్టుటవలనఁ గాదా యీప్రక్రియాగౌరవము గల్గినది. దీనిని బట్టియు నిది యొక్కకు భిన్న మనవలెను.

కాఁగా నీయనుచితకల్పనవలన 'దాన్ని' మొదలగునవి షష్ఠ్యంతములే కాని (దానియది దానిది) సమాసములు గా వన్న వీరిందును సామాసికద్రుతలోపమును జేర్చి సమాసకార్యములను బొందఁజెప్పిరి. అయిన నివి సమాసములు గా దనుట యొక్కటె మార్పు. ఏల? దానియొక్క+అది దానిన్—అది దాని అని సాధించుట సులువు గాదా?

ఏ మయినను షష్ఠీదివివిభక్తులు పర మగుచుండఁగా యొక్కప్రత్యయపరకత్వమునవలెఁ బ్రకృతి కార్యాకార్యము లయి యిష్టరూపము సిద్ధించుచుండఁగా - వీరు

ద్వితీయావిభక్తిరూపమున నిల్చునని చెప్పుట యనవసరమే కాక ద్రుతలోపావసరమును గల్పించుచు ననర్థకము నైనది (ఇంతను షష్ఠీవిభక్తు లగుదివులు పర మగుచుండఁగా బ్రకృతి ద్వితీయాంతరూపమున నిల్చు ననురీతి ప్రక్రియ సంప్రదాయానుగుణమును గా దనఁదగు. ఒకవిభక్తి పర మగుచుండఁ బ్రకృతి యింకొక(అదే యైనను) విభక్త్యంత మునతె నుండు టేమి?

కాఁగా ద్వితీయావిభక్తిరూపమున నిల్చు ననుట యసంగత మై తిరస్కరింప వలసియున్నది.

ఇంకఁ దరువాత షష్ఠికి ద్వితీయాకారము గల్గు ననువివరణమందలియభి ప్రాయము నసంగతమె. ద్వితీయాకారము గల్గుటకు ముం దది షష్ఠ్యంతము గావలెను గదా) దానియొక్క (లేదా అ+జన్. వివి పరకత్వమునఁ బ్రకృతి షష్ఠ్యంత మగుట యెట్లు? షష్ఠ్యంతములపై షష్ఠీవిభక్తులా? అసలు పదముపై విభక్తు లగుట యేమి? "నామవిభక్తులు ప్రాతిపదికముపైఁ గదా నిలువవలసినది' (ఉ 58) ఇటు షష్ఠ్యంతముపై నెట్లు నిల్చినవి. ఇవి (షష్ఠీ)విభక్తు లనుట మఱచి యిట్లు పేర్కొనియున్నచో వీరే విభక్తులు గా వని నిరూపించి నట్లగుచున్నది.

ఇంక వీ రీసూత్రమున నింతకు ముందు (లుప్త మగు) 'యొక్కచో' దివు లగు ననిరి. యొక్కస్థానమున నగుచుండఁగా వీనిపరకత్వమునఁ బూర్వశబ్దము షష్ఠ్యంత మగుట యేమి? ది ప్రత్యయముతోఁ గూడఁ గదా యీశబ్దము షష్ఠ్యంత మగునది.

షష్ఠీవిభక్తులు గా దనుకొన్నపక్షమునను వీ రివి యిటనే యొక్కార్థకములుగా వివరించిరే. యొక్కవష్ఠిపై మఱల యొక్కార్థమునఁ బ్రత్యయము లగుట యేమి? హానిది మొత్తము షష్ఠ్యంతము. దీనికి ద్వితీయాకారము గల్గిన దానిన్ అని అగును. ఇట్లేని వారు తలఁపలే దనవచ్చు.

వారివివరణమునుబట్టి దానియొక్క (లేదా అ + జన్) +ఇ అని యుండ షష్ఠికి ద్వితీయ యై దానిన్+ఇ అగు కాఁగా సామాసికద్రుతలోపమునే దానిది అని యైన దన వలె. (వ్యా.స.స 1035) ఇటనే పేర్కొన్నతనము షష్ఠ్యంతముపైనె యుండునది.

(రామ+జస్+తన)యొక్కార్థక(యొక్కస్థానిక) ద(వి)వర్ణము పర మగుచుండఁగా ముందటిశబ్దము షష్ఠ్యంత మగుటయే యసంభవము గావున నట 'షష్ఠి ద్వితీయాకారమున నిల్చుట' యను ప్రసక్తి లేదు. వీరివివరణమును బొరపాటే యని గుర్తింప వచ్చును.

సమా.72సూత్రమున వీరు "షష్ఠ్యర్థకదివిదుప్రత్యయపరకత్వమందును ద్వితీయయే నిల్చు" ననుచో షష్ఠికి ద్వితీయ యగు నని తలఁపలే దందమా? అయినచో నట నీయంశమును బ్రస్తావింప నవసర మేమి?

అట్లు గా దన్నను 'ద్వితీయయే నిల్చు' ననుట యింకను నసంగతము. షష్ఠీవిభక్తులు దివులు పర మగుచుండఁ బ్రకృతి ద్వితీయాంత మగుట యేమి? ద్వితీయపై షష్ఠీవిభక్తి యున్న దనవలెనా?

ఇటఁ గూడ 'షష్ఠ్యర్థక' అనుటచే ది—వి షష్ఠీవిభక్తులుగాఁ దామ పరిగణించిన సంగతి మఱచి రనవలె.

ఇవి విభక్తులుగాఁ జెప్పుటయు పొరపాటందము. అప్పు డయిన నీవిధులు సరిపడునా? అట్లు గాకయు వీరీసూత్రమున (లుప్తముగ)'యొక్కచో' విధించిరి కదా. 'యొక్కచో'నె విధించిన కిపరకత్వమున ద్వితీయాకారము నిల్చు నని చెప్పిరా? ఇట నేల చెప్పవలె?

'యొక్కచో' అనుటయుఁ బొరపాటె యనవలెను. అట్టియెడల యొక్కప్రత్యయాంతములపై దివి వర్ణము లగు ననవలె. అప్పుడైనను షష్ఠ్యంతముపై షష్ఠ్యర్థము ననే చేయవలెనా? షష్ఠ్యర్థకము లనుతలఁపుచేతఁ గాదా వీరు సూరి వీనిని విధింపలే దని విమర్శించుట. కానపుడు వీరు విధించి ప్రయోజన మేమి?

దానియొక్క+ది దానిది యని యగు ననుప్రక్రియకంటె దానియొక్క+అది దానిది అని యగు నన్నసూరిప్రక్రియ యెంతయు సమంజసము గదా.

కాఁగా దివిపరకత్వమున వీరు ప్రకృతిని మార్చి చేసిన లక్షణ మెల్ల దోషగ్రస్త మైయుండుటచే నంగీకరింపరాకున్న దనుట నిస్సంశయము.

టి-వి ప్రత్యయములు, ఇవి సాధింపవలసిన పనులేరియభిప్రాయము నిరాధారము కావున దివిప్రత్యయప్రసంగమె తిరస్కరణీయ మగుడదు.

తనపరకత :

ఇక వీ రిచ్చటనే తన యనుతద్ధితప్రత్యయపరకతయందును బూర్వాపదము నగుప్రకృతి ద్వితీయావిభక్తిరూపమున నిల్చు ననిరి. రామునియొక్క భావ మనుచో రామ+ఙస్, తన్+ను ఆనురీతిగా నంచి సంస్కృతవిభక్తులే లోపించు నని తలంచినవా రగుటచే 'రామతన' అని కావలసి యుండ(గా నట ద్వితీయావిభక్తిరూపమున నిల్చు టను పేర్కొనవలసివచ్చినది. షష్ఠికి ద్వితీయాతుల్యతను జెప్పునమా 72సూత్రమున నిద్దానిని పేర్కొనలేదు. బహుశః 'తన' అని వీరు చెప్ప నట నచ్చుపొరపాటున 'ము' అని పడిన దేమో. ఇటనే 'ము' అచ్చుపొరపాటున తన అయినదో. తన నిట నుదాహరించినజాడ లేదు. అట 'ము'ను లక్ష్యము చూపిరి. మఱచిరా? రామునితనము సమా.72సూత్రముచెప్పున షష్ఠికి ద్వితీయ (ఉ.300) అని చెప్పిరి. కాగా నీవిష యము సమా.72సూత్రము కడ సూక్త మయ్యుండుటచే నిట( జెప్ప నక్కఱ లేదు. మొత్తముపై నీమొదటియంశము చెప్ప నవసరము లేనిది' చెప్పరానిది.

ఇట సూరి షష్ఠికి ద్వితీయాతుల్యరూప మైనయనుపసర్గప్రక్రియను గ్రహింపక తెలుగువిభక్తులకే లోపము చెప్పుటచే రామునియొక్క+తన... రామునితనము అను రీతి సూరిమతమున నీయవి సులువుగ సిద్ధించును. సూరి కిట్టిలక్షణమువసరమె లేదు.

ము ;

4. 'నీనాతామనశబ్దముల "యొక్కచోట ముపర్ణకము వికల్పముగ నిల్చును. అని యీసూత్రమున నిం కొకయంశమును జెప్పిరి.

"యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరం బగునపుడు దుగాగ మంబు విభాష నగు" (సమా.11) ననుసూరిలక్షణము సరి గా దని తొలగించి యా యంశమును వీ రిట నిట్లు పేర్కొనిరి.

'ఈది-వి-దు ప్రత్యయములు సమాసగతము లని గ్రహింపరాదు' అని వీరు దమ పైసూత్రమునకె కుండలీకరణములం గూర్చిరి. ది-వి-ప్రత్యయములె. ఆశబ్దమున కమహాదర్థమునందలి ప్రథమైకబహువచనములు. (అది-అవి) ఇవి దానియొక్క-అది, దానిది వారివి అనురీతిచోట్ల సమాసగతము లనుటలో భ్రాంతి లే దనియు నట్లు చెప్ప వలయు ననియుఁ బైని గుర్తించితిమి. ఇంక 'దు' చిం. ప్రత్యయ మనెఁ గాని సూరి యాగమ మనెను. ఇది సమాసగత మనుటలో భ్రమ యేమి?

'దు' సామాసికాగమ మని సూరి సూత్రించెను. అది సరి గాదు. నీహ్వాద యము నాదుచొప్పునకు (శాంతి.6.201) ఇత్యాదులు దాని 'యొక్క' యనునర్థమును షష్ఠీస్తతను స్థిరపఱచును గదా. (ఉ.225) యనిరి. యొక్క యనునర్థమునకు సూరిమతమునను బాధ లేదు. వీరు (ఉత్తమగు) యొక్క-కాదేశము చేసిరి. సూరి దానికె యాగమ మనెను. తమయొక్క శక్తి — తమశక్తి అనుచో తమయొక్క షష్ఠ్యర్థవిశిష్టమే కదా. కొత్తుగా 'దు' దానికే యాగమ మైనది గానఁ దపనయాం బై యుండును.

'నాదుచొప్పున, యనుచో నది షష్ఠీస మనుటకుఁ బ్రమాణ మేమి? అది సమాస మేల కాదు? నాయొక్క-చొప్పున యనుచో సమాస మై నాచొప్పున నాదుచొప్పున యని యగు నందు బాధ లేదు. 'భంగపుఁజప్పుడు' (ద్రోణ.3 52) ఇందు ముకర్ణము నకు 'పు' అనునాదేశము కాలేదా? ఇది షష్ఠీస్తమా? (ప్రాంచత్పూర్వపుఁజలికంటె న కర్ణ.3.358) ఇట్టే 'నాదుచొప్పున' సమాస మనుటకు బాధ యేమి? అది షష్ఠీస్తమే యనవలసినయవసరము లేదు దీని బట్టి 'దు' షష్ఠీస్తరలో, గల దనుట విశ్వసింపరాదు.

"దు సామాసికప్రత్యయ మన్నచో (సూరిప్రత్యయ మనక దాగమ మనిరి) నది ప్రకృతిపైని నిల్వఁ జెను.' (ఉ.226) ఇది వీరిమార్గమున (సం.వ్యాఖ్యలోను) చెప్పఁబడినయట్లుండి. సూరిమతమున సమాసముఁ జెలుఁగునిషష్ఠే లోపించును. తన యొక్క + గుణము అనుచో యొక్క లోపించి 'తన' అనుదానికె దుగాగమ మై తనదు గుణ మని సులువుగనె యేర్పడును. తాగుణ మని కానేరదు. వీరు తద్భిన్నముగా

కాఁగా సామాసికాగమ మన్నసూరిలక్షణ మెంతయు సమంజస మైయుండుటచే వీరు దానిని దొలఁగించుట సరి గా దని నిశ్చయింపవచ్చును

ఇంక వీరిలక్షణమును బరిశీలింతము.

'సీనాతామనశబ్దములయొక్కచోట' దువర్ణకము నిల్చు ననిరి. వానివలెనె యీ'దు'వర్ణమును యొక్కస్థానముననె విధించుట గమనింపఁదగు. ఇదియొక్కార్థక మనియె యిట్లు చెప్పిరి. అట్టియెడల'దివి' యనునవి షష్ఠీవిభక్తులుగాఁ బరిగణించి దువర్ణకము నేల చెప్పలేదు? (సంబంధిపదమునుబట్టి ప్రయోగింపఁబడుట లేదు గావున నిది షష్ఠి యనుట గొంతేలి సరిపడు నేమో యని కాఁబోలును.)

'యొక్కచోట' యనుటచే నిట యొక్క లోపింపక దానిస్థానమున నగునా? దువర్ణకము వైకల్పికము గాన నది కానిపక్షమునందు సీయొక్క యనురీతిగాఁ బ్రయోగింపఁబడునా? ఆపక్షమున లోపించు ననవలె.

ఇటఁ బ్రకృతి యె ట్లుండును? దివితసపరకతయందే ద్వితీయాకారమును జెప్పిరి. 'సీనాతామనశబ్దములచోట నైతము షష్ఠి ద్వితీయాకారముతో నిల్చును. కాఁగా యొక్క విభక్తిలోనె వానికి దుప్రత్యయము చేరును." (వ్యా.సం.స.1169) నాయొక్క = నా + దు (గుణము) ఇచటియొక్కస్థానమున దుప్రత్యయము నిల్చెను. ద్వితీయాకారము (నన్నున్) రాలేదు. (వ్యా.సం.స.1035) ఈప్రక్రియ యుచితమె. కాని వీ రిదే తీరుప్రక్రియను దివులయెడ నేల యనుసరింపరు? నాయొక్క యనుచో యొక్కస్థానమున దువర్ణక మై 'నాదు' అని యైనట్లే దానియొక్క యనుచో యొక్కస్థానమున దువర్ణక మైన 'దానిది' అని కాదా? ఇట్టి 'దానివి మొ॥ అట్లు చెప్పిన నట ద్వితీయాతుల్యత్వము చెప్పుటకు నవకాశ ముండ దని యేమో. ఇట ద్వితీయాతుల్యత్వము చెప్పిన నిప్పుడు అనురీతి గావలసివచ్చును గాన యొక్కస్థానముననే 'దు' చేసిరి. దీనింబట్టి వీరు దివిపరకత్వమున 'ద్వితీయావిభక్తిరూపమును' జెప్పుట యసంగత మని వారిమాటలచేతనె నిశ్చయింపవచ్చును.

కాని వీరు సమా. 72సూత్రమున 'ద్విరుక్తటకారపరకత్వాభావమున (కార.19 సూ)ద్వితీయయె నిల్చు' ననిరి. ప్రస్తుతసూత్రముచే వచ్చు ననిరి. (ఒకసూత్రముచే నగు నని వేఱొకసూత్రమునఁ జెప్పుట సూత్రరచనావైశిష్ట్యముగా నెన్నఁదగదు.) కాని ప్రస్తుతసూత్రమున (5వఅంశము) 'ద' పేర్కొనలేదు. ఇపుడీ 'తన' అందు లేదు. అప్పౌరవా ఉనియు 'తన' అని యుండవలె ననియుఁ దలఁతుమా? కాని వీ రిచ్చట తనవర్ణకాంతము నుదాహరింపకుండఁగా (ఇచ్చటితనయే యప్పౌరవా యేమో) అచ్చట వివరణమున ది–వి–దు = దానిదికలరూపు— వారిద నీదుకొడుకులు (నీయొక్క కొడుకులు) అని దువర్ణమునకుఁ బ్రత్యేకముగా నుదాహరణ మిచ్చిరి. కాని వా రచ్చటఁ గూడ 'నీనాతానుశబ్దములకు ద్వితీయాకారస్థితి ప్రయోగవిరుద్ధము గాన' —నీనాతా ఇత్యాదిగా నిల్చు నని వివరించిరి. (ఉ.280) మఱి నీదుకొడుకు లని చూప నేల? అది సమాసమా? అయినఁ బ్రయోగానుసారముగా నీనాతా—అనురీతి నిల్చు ననువ్యాఖ్య చేయుటచే (దీనికి వెంటనే యుదాహరణము లిచ్చిరి.) 'నీదు' అని నిల్చుట యెట్లు? పయిఁగా 'దు'వర్ణకస్థలము సమస్తము గా దని గదా వీరియభిప్రాయము. దానిది వారిద యని యంతకుముందు వారు చూపినవి వ్యస్తములే యని వీరినిశ్చయము. కాఁగా నీదుకొడుకు అన్నదియు వ్యస్తమె. అట దీనిప్రసక్తి యేమి? అనఁగా దివులతోపాటు 'దు' కూడ నాసూత్రమునఁ బ్రస్తావింపఁబడిన దనవలె. మఱి ద్వితీయ యేది. ద్వితీయయె నిన్నుదుగుణములు అని కదా చూపవలె.

కావున వ్యాఖ్యలవా రచ్చట మిక్కిలిగాఁ బొరపడి రని చెప్పవలె. దువర్ణకపరకత్వమున ద్వితీయ ప్రయోగవిరుద్ధము గాన వా రంగీకరింపరు.

యొక్కస్థానమున 'దు' చేసినప్రక్రియయె తగును. దివు లట్లు చేయఁదగు. కాఁగా దివిపరకత్వమునను బ్రకృతికి ద్వితీయాప్రసంగ మసంగతము.

అహో. "భిన్నావస్థాయాం దివర్ణకస్య ప్రయోగే న కశ్చిద్విరోధః న చ విశేషవిధినా బాధకత్వం సమాసవిషయకత్వాత్' (కీర్తిపిద). '(కవిశి.578) దివులు సమస్తవిషయకము లనియు 'దు' వ్యస్తవిషయక మనియుఁ దలఁచినట్లు తోఁచుచున్నది. దివర్ణకసందర్భమునఁ జేసిన ద్వితీయాతుల్యప్రసంగము (కవిశి.572) దువర్ణసందర్భమునఁ జేయలేదు. ఇది సరి గాదు గనుక సూరి 'దు' సామాసికముగా

జెప్పెను. 'కీర్తి నీది' యనుచోటగా 'గీర్తి నీదు' అని యుండదు. కీర్తి నీయొక్క-యని యుండదన్నట్లే. కాని యింతమాత్రమున నిది వ్యస్త మని చెప్ప నవసరము లేదు. సమాసమె యన్నను నిట్లు యుండవలెం గదా.

పరుఖులవా రట్లు గాక యెల్లశబ్దములకు ది,వి ప్రత్యయములు చెప్పి నీనామసలకు దుప్రత్యయమును జెప్పిరి. అహో! వలె దివులు సమాసములందరి వని తలపమిచే వీరి మతమున నీరెండువిధానములకు భేదము లేమి విశేష మగు 'దుగర్ణక'విధిచే దివులు బాధింపఁబడి 'నాదిశక్తి' యని యేర్పడుటకు వీరిమతమున వీలు లేదు. కాఁగా నట్టియెడల 'నాది' సమస్తము మాత్రమె కావలె. అట్టియెడల 'దానిది' (సమస్తమును) వ్యస్తము నగు నని వీరు చెప్పుట విశేషమె.

మొత్తముపై 'దు' వ్యస్తవిషయక మని యు యొక్కార్థానిక మని యు పరుఖుల వారు పేర్కొనుట సరి గాదు. కావున వీరియీసూత్రమందలినాల్గవయంశమును గ్రాహ్యముగా లేదు.

సూరిసమా.11.విధి సూత్రము.

'యుష్మదస్మదాత్మభ్యో ద్వితీయార్ణకః' అని చిం. నీ,నా,తాశబ్దములు మూఁడింటికె 'దు' విధించినది. తదనుగుణముగ సూరియు 'యుష్మదస్మదాత్మార్థకంబుల' కని యామూఁటికె దుగాగమమును జెప్పెను. కాని పరుఖులవారు వీనితోపా టుభయార్థక మగుమనశబ్దమునకును దుగర్ణకమును జెప్పిరి. కవిప్రయోగములందే కాక స్వోదాహరణములందును వీరు మనశబ్దముపై దుగర్ణమును జూపలేదు. సం.లోను చిం. సూత్రమును వివరించుచో 'యుష్మదస్మదాత్మభ్యః = నీనాతామనశబ్దములకంటె (వ్యా. సం.స.1034) నని మనశబ్దమును జూపిరి. దానికి మూలమున నాధారము లేకుండఁగా నటును వీరు 'మనదు' అనుదాని నుదాహరింపలేదు. విశేషమును వివరింపను లేదు. 'మనదురాక (శృం.శా.2.9) అని యొకప్రయోగము గానవచ్చె నది.

ఇట సం.లో "బాలవ్యాకర ణ యీవిషయమును సంగ్రహింపలేదు" (వ్యా.సం. స.1088) అనుట వి.త. వీనిని (దానిది=నీదు =మొ॥) సూరి సముచితముగ సంగ్రహించెను.

మొత్తముపై పరవస్తువారి యీ (కారక.19) సూత్రమును ఆఱంశములుగా విభాగింపఁగా నందు 1,6 అంశములు "శేషషష్ఠికి యొక్క యను నగు" ననుమూలబాల.సూత్రమునకు వ్యాఖ్యానప్రాయములు గాఁగా రెండవయంశమును (వీరిచిం.వ్యాఖ్యననుసరించి పై బాల.సూత్రమునకే వ్యాఖ్య యనఁదగియున్నను నది సరిగాఁ దోఁపదుకాన) ప్రౌఢ. కార.16 సూత్రము సంగ్రహించునది కాఁగా, మిగిలిన 3,4,5 అంశము లసంగతములై యట్లు చెప్పఁదగ కున్నవి. ఇందలి ప్రధానాంశము సూరి సమా.8.11 సూత్రములచే సముచితముగాఁ జెప్ప నవి యట్లు పరవస్తువారు గ్రహింపకుంట యసమంజస మని తెలినది.



ప్రథమ — యొక్కషష్ఠి ;

ధాతుజవిశేషణభావార్థకాదిప్రత్యయములచే నభిహిత మగుకర్తృపదముయొక్క ప్రథమచోట సంబంధార్థవివక్షచే యొక్కషష్ఠియు వచ్చును. అట్టియొక్కవిభక్తి లోపించును. యొక్కషష్ఠి యర్థవిశేషబోధకము నగు (ఉ.20.సూ)

"సంబంధార్థవివక్షచేత" ననుట యనవసరము గాదు. యొక్క సంబంధార్థముననే గదా పూర్వసూత్రముచే విధింపఁబడినది. స్పష్టతకుఁ జెప్పి రేమో. రాముఁడు చంపెను అనుచో నుక్తార్థమునఁ బ్రథమ. ఇది కర్తృవాచకము కదా. అట్లె యిచటను యొక్కషష్ఠిని విధించినసూత్రముచేతనె సంబంధార్థము స్పష్టము,

ఇఁక "ప్రథమయందు షష్ఠి" (ఈసూత్రవిషయసూచిక) యనుట యేమి? కర్త్రర్థకప్రత్యయములచే నుక్త మగుట ననుసరించి ప్రథమ యైన దన్నమాట. ప్రథమ చేసినపిదప సంబంధార్థమును వివక్షించుట యెట్లు? ఇట్టి నాయాప్రత్యయములచే నభిహిత మగుచున్న దని తలఁచినను ప్రథమస్థానమునఁ జేయ నేల? — —అభిహిత మగుకర్తకు సంబంధార్థమున యొక్కయగు నని చెప్పినఁ జాలదా?

వీరు "సంబంధార్థవివక్షచే యొక్కషష్ఠియు నగు" ననిరి, కాని సంబంధార్థవివక్షలో యొక్క యనుట మాత్రమె యుండును, సముచ్చయార్థకనుశబ్దముచే యొక్కరాక ప్రథమ యుండుట నుద్దేశించి రనవలె, ప్రథమ నుదాహరించిరి. కాని యయ్యది

సంబంధార్థవివక్షలోనె 'యొక్కషష్ఠియును' అనుటచేత యొక్క-రానిపక్షమునఁ బ్రథమ యట్లై యున్న దని తలఁపరాదు,

"బాహుకుఁడు రథంబు గడుపు నేర్పున" కని ప్రథమ యున్నపుడును సంబంధార్థ మున్నపుడు పీ రీసూత్రమున "సంబంధార్థ వివక్షచే" ననుట మిక్కిలివ్యర్థ మన వలసియుండును

కాఁగా నిట్టిసందేహమునకుఁ దావు లేకుండ "సంబంధార్థవివక్షచే" నని యుంచు నపుడు "యొక్క-షష్ఠి యగు" నన్నఁ జాలును, "సంబంధార్థవివక్షచే ననుటచే నట్టి వివక్ష లేనపుడు యొక్క — రాక ప్రథమయె నిల్చును. ప్రథమయు సంబంధార్థ మున నున్న దేమో యనుసందేహమునకుఁ దావుండదు,

అయ్యు "సంబంధార్థవివక్షచే" నన్నదే చెప్పక 'యొక్కయు నగు" నని చెప్పుటలోనె లాఘవ ముండు ననుట గుర్తింపఁదగును.

(తిఙ్ఙుచే మాత్రమె యభిహితత్వము గల దనియు భావార్థకాదులచే నభిహితత్వము లేమింజేసి (వ్యా,సం,స,958) అనుసూరియభిప్రాయము ననుసరించిన నిట నభిహితత్వమును పేర్కొనుటయు విశేషమె కాఁగలదు.)

బాల,కార,82సూ, "కర్తృపదంబునకు" అను సరి కా దని చైత్రునిచేతఁ బాఠము చదువఁబడుట మైత్రునకు వినఁబడలేదు" అనుచోఁ గర్మకు నట్లు ప్రథమ యైన దనియు (వ్యా.సం.స.958) పేర్కొనిరి. ఇటఁ సూత్రమునఁ గర్తృపదమునకె యొక్క-విధించిరి. ఇట్లె రావణుని చంపఁబడుట యని యుండరాదా?

నాచేతఁ జేయఁబడినపని యనుచోఁ గర్త "నేను" ఇట నభిహితము గాకుండుటచే గర్తకుఁ దృతీయయ యై నాచేత నని యున్నది. ప్రథమ లేదు గావున నేను జేయఁబడిన పని యని యుండదు, కాని యిట్టియెడల నాచేయఁబడినపని యనుట దుష్టమా? ఇట్లే నాచేయఁబడుపని మొ॥

వసులవా రుదాహరించిన "చైత్రునిచేతఁ బాఠముచదువఁబడుట మైత్రునకు వినఁబడలేదు అనుచోఁ గూడఁ జైత్రునిపాఠము చదువఁబడుట యని యుండుట దుష్టమా? ("చైత్రుని పాఠము చదువుట యన్నది సాధ్య మగుట స్పష్టమె)

రామునిచేత రావణుఁడు చంపఁబడుట యనుచో రామునిరావణుఁడు చంపఁబడుట యనురీతి నుండదు కాని 'చైత్రునిపాకము వచనఁబడుట' యుండ దనుటకుఁ ప్రయోగ ములం బరిశీలింపవలె.

ఇంక వీరిసూత్రాభిప్రాయమును ప్రౌఢ.కార.16.సూత్రము స్పష్టము చేయుచునే యున్నది. అం చెట్టియవసిద్ధాంతమును వీరు నిరూపింపలేదు దాని నట్లె గ్రహించు టుచితము కాదా? అదియె యుచిత మని తోఁచును.

'అట్టియొక్కవిభక్తి లోపించు' నని యీసూత్రమునను జెప్పిరి. పూర్వ సూత్రమున యొక్కలోపమును జెప్పిరి. ఇటఁ ప్రత్యేకముగాఁ జెప్పనేల? యొక్క నిల్చు నని సందేహము గల్గకుండుటకా మఱల లోపము చెప్పిరి. అయినఁ ప్రౌఢ. లో(కార.16)వలె యొక్కలోపమును ప్రత్యేకముగా నొకసూత్రముగాఁ జెప్ప చే నుచి తము. అంతే కాని యొకకార్యమును రెండుచోట్లఁ జెప్పుట కేవలము గౌరవము గదా.

యొక్క యుల్లెడల లోపించు నన్నవీ రీసూత్రమున 'కర్తృపదముయొక్క ప్రథమచోట' నని యొక్కను ప్రయోగించుట విశేషము. ఇది యసింద్య గ్రామ్య మేమో? (ఉ.సంజ్ఞ.24.సూ)

ఇఁక వీరు సూత్రమున విశేషముగాఁ జెప్పినయంశము 'యొక్కషష్ఠి యర్థ విశేషబోధకము నగు' నన్నది. "బాహువీర్యమ్ములవారు — (ఆది.7.180) బాహు వీర్యములు గలవారు" పట్టుపుట్టముదొర-(ఉ.22),

ఈయుదాహరణములనుబట్టి యీలక్షణము పూర్వోక్త మగు ధా.వి భావార్థకా దులతోడిసంబంధము గలది కా దని గుర్తింపవచ్చును. దీనిని ప్రత్యేకముగాఁ జెప్పక యిందుఁ గలుపుటచే ధా.వి.భావార్థకాదియోగమునఁ బ్రథమకు వచ్చిన యొక్కషష్ఠియే యర్థవిశేషబోధక మగు నేమో యనిపించును. వీరు చూపినయుదాహరణములనుబట్టి యట్లు గా దని వీరిసూత్రాభిప్రాయము నెన్నవలయును.

'షష్ఠీతత్పురుషసమాసమున బహువ్రీహ్యర్థము భాసించును. అట్టివి — బహువ్రీహ్యాభాసములు — — మూఁడుకన్నులవాఁడు — — మూఁడుకన్నులు కలవాఁడు (ఉ 295) అని స్థలాంతరమున వీనిని వీ రాభాసబహువ్రీహులుగాఁ జెప్పుట దీనివలన ననవసర మని స్పష్ట మగుచున్నది.

ఇప్పటియొక్కవిభక్తికి యస్త్యర్థమును గ్రహింపఁగా నీయవి షష్ఠీతత్పురుషములే యగును. వీరు యొక్క యెట్లు లోపించు నందురు గావున వీరిమతమున నివి సమాసము లనుకున్నను బాధ గానరాదు.

ఇట నర్థవిశేష మస్త్యర్థముగనె చూపిరి. నీవు ఎగుభుజముల(యొక్క) వాఁడవు పట్టుపుట్టమువాఁడు మున్నగువానిచే నిది బాల.సమా.8సూత్రమునకు లక్ష్యము లగుటయుఁ గలదు. కావున యొక్క విశేషార్థక మనుటయె యుచిత మనిపించు చున్నది.

అస్త్యాద్యర్థవిశేషములందు విధించుట యుక్త మేమో పరిశీలింపఁదగు. ఇతరార్థములు వెదుకవలె.

లోపల :

'నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు (16)నసుదానిని వీరు "సముదాయమునం దేకదేశమును బృథక్కరించునపుడు సముదాయవాచి లోపలషష్ఠ్యంతమును, సప్తమ్యంతమును బర్యాయముగ నగును' (ఉ.21) అని పేర్కొనిరి. ఇది సూరిలక్షణమునకు వ్యాఖ్యారూప మగుసూత్రముగా నెన్నవచ్చును.

చిం., బాల.లు 'నిర్ధారణషష్ఠికి' నని చెప్పఁగా సంస్కృతానుసారముగా షష్ఠి (దానికిఁ దెలుఁగున 'లోపల'యును) చెప్పనేల యని భావించి రేమో. కాని 'కంఠోపవర్ణకం బన్యార్థాదియోగజం బగుబంధమి కగు' (ఉ.కార.16) మొద లగుచోట్ల వీరును సూరి ననుసరించి 'సంస్కృతవిభక్తిని' పేర్కొని యటఁ దెలుఁగుప్రత్యయమును జెప్పియే యుండిరి. ఒక్కొకచో నొక్కొకమార్గ మేల?

ఈసూత్రవిషయమును "నిర్ధారణషష్ఠీసప్తములు'గా సూచించిరి. కాని యిది నిర్ధారణ మని వీ రీసూత్రమున సూచించియుండలేదు. ఇంక సూత్రమున నిర్ధారణ మునె కొంతవఱకు విస్తరించి రనవచ్చును. 'ఏకదేశంబును బృథక్కరించునది' యను టలో నాపృథక్కరణము జాతిగుణక్రియాసంజ్ఞల నాశ్రయించియుండు ననునంశము వీరిసూత్రవివరణములం దెటఁ గానరాదు. కాన వీరియీలక్షణము సూరి చెప్పినట్లుగా సమగ్రముగను, స్పష్టముగను లే దనవచ్చు.

'నిర్ధారణ' మని సూత్రమునఁ జెప్పి దానిని వివరణమున వివరించుటలో సూరి లక్షణమున లాఘవము స్పష్టము. సంజ్ఞల ప్రయోజన మిదియెఁ గదా. ప్రథమ లాదికచటతపలకు గసడదవ మీ పదాంతసుకర్ణంబుమీఁది కచటతపలకు గజడదబ లగు ననురీతిగా సూత్రించుచోఁ బరుషాదిసంజ్ఞలను విధింప నేల? సంజ్ఞాప్రకరణము ప్రయోజనము కొంత నష్ట మయినట్లు గాదా? అధికరణంబునకు సప్తమి యగు (ఉ.కార.22) ననురీతిగా వీరును జెప్పియేయుండిరి కదా. అట్లె యిటఁ గూడఁ నిర్ధారణ మని మాత్రమె సూత్రమునఁ జెప్పుట యుక్తము గాదె. ఈవిషయమునను నొక్కొక్క చోట నొక్కొక్కమార్గ మేల?

'—శబ్దము లోపలషష్ఠ్యంతము సప్తమ్యంతము నవు' ననఁగా నట్టి ప్రాతిపదికమునకు లోపలషష్ఠియు, సప్తమియు నగు నని యర్థము. 'విభక్త్యంతస్వరూపమును వర్ణించుటకంటె 'లోపలషష్ఠియు సప్తమియు నవు నని యావిభక్తులను విధించుట యుక్తము. ప్రథమాదివిభక్తివిధు లిట్లే కదా. అటఁ బ్రథమాంతము లగు నిత్యాదిగాఁ జెప్పిరా?

సప్తమ్యంతము నగు నన్న యంశమును వీరు సూత్రముననే చేర్చిరి. 'సూరి, ఇట సప్తమియుం గలదు. మనుష్యులయందు క్షత్రియుండు శూరుఁ' డని వివరణమున స్పష్టము చేసెను. సూరి విభక్తివిధానము ప్రణాళిక యిటు ననుసరించెను. కాఁగా నిందు దురుక్తియు లేదు.

వీ రీసూత్రమునఁ 'బహ్వాయమున' ననుట స్పష్టతకే అది లేకున్నను లోపలి షష్ఠీసప్తమ్యంత మొక్కసారి యగుట యసంభవము గదా.

వీ రిట లక్ష్యములందు ధాతువులలోన సుత్తనము పసిండి' (అశ్వ.2.161) చూపిరి. ఇది సప్తమికి లక్ష్యము గానగును. ఈ 'లోన' అనునది విభక్తియా విభక్త్యర్థాభిధాయకశబ్దమా? దేనిగను వీ రీగ్రంథమునఁ బేర్కొనలేదు. (చూ.త్రి.శే.)



చింతామణ్యనురోధమున (సంస్కృతవ్యాకరణముచొప్పునను) లోపలన్ అను నది షష్ఠి యనఁబడెను గాని యా(నో?)పవిభక్తికము లగు లోపలన్ లోనన్ అనుశబ్దము లును సప్తమ్యంతములే. లోన్ అనునదియు సప్తమ్యర్థకమె' (ఉ,227) ఇ ట్లనుటలో లోన షష్ఠియో సప్తమియో వీరు స్పష్టము చేయలేదు.

లోపలవిభక్తి యనుటలో సంస్కృతవ్యాకరణసంప్రదాయమును గూడఁ బ్రస్తా వించినను (పృష్ఠాత్పర్ణం పతతి) దానికంటెఁ జింతామణ్యనురోధము ప్రధానముగాఁ జెప్పుట గమనార్హము. చిం. చెప్పఁబట్టి సరిపోయినది కాని కానిచో సూరి పేర్కొన్నను సంస్కృతవ్యాకరణానుగుణమే యని వీ రంగీకరించెడువా రని చెప్పలేము. (కూర్చి సూరి చెప్పమి సంస్కృతసంప్రదాయము ననుసరించి రేమో. ఉ.211) కాని వీరు సప్తమీస్థలమునఁ జింతామణ్యనురోధమును బ్రస్తావింపలేదు. (ఉ.228)

కాని లోపల, లోన, లో అనునవి సప్తమ్యంతపదములుగాఁ గాక కేవల మధి కరణార్థకములు మాత్రమె యగుటయుఁ బ్రసిద్ధమె. (వ్యా.సం.స.1044)

బ్రాహ్మణికడుపులోపలనుండి వెలువడినప్పుడు (హరి ఉ.5.71) ఇట వలనకు సప్తమిగా లోపల యైనది. కడుపులోనుండి నిర్గమించె (మౌస.12) ఇట వలనకు నాద్యక్షరము శేషించిన లోపల (లో) సప్తమిగా నైనది. నీరిలోననుండి నెగయుఁ దెంచె (ఆది 5.5.173)పురములోననుండి పోవుచున్నవాఁడ (దశ.11.30)వరుఖుల వారు వీనిని మార్గాంతరమున సమన్వయింతురు.

భూమిలోనఁ దడవుచు (నిర్వ.1070) వింధ్యములోన మము డించి (దశ.5.3) ఇత్యాదులలో 'లోన' కేవల మధికరణార్థకము. మిత్రధనంబులలోన మిత్రుఁడ యెక్కుడు (శాం.3.526) కౌరవులలోన నెవ్వ డెవ్వారితోడ ననిఁ గడఁగుదునో (భీష్మ.1.179) రాజులలోన నీయుధిష్ఠిరుఁడు (సభా.2.12) ఇట నిర్ధారణమున లోన

అయినది. వసుధలోపల నిరువురు వాసుదేవులు (హరి.ఉ.6.102) తలఁచెన్ హృదయంబులోపలన్ (ఆది.7.173) అధోముఖాఖ్యనరకంబులోపల నుండు (వి.పు.8-121) మొదలగుచోట్ల లోపల కేవల మధికరణార్థకము. పురుషులలోపల నెవ్వఁడు (సభా.2.11) మునికోటిలోపలఁ బ్రసిద్ధుఁడ నైతి (పం.3.260) ఇత్యాదులలోఁ గేవలము నిర్ధారణమున నైనది లోపల.



భూమిలో నిల్చియున్నవి (భాగ.12.14) మొదలగుచోట్ల 'లో' కేవల మధికరణార్థకము మునీశ్వరసంఘంబులో నెల్ల సత్యదర్శి (స్వర్గ.80)

ఇట్టి పెక్కింటి నివి పదములుగా నన్వయింపవు. కావునఁ (జిం. చెప్పిన దని మాత్రమె కాక) గవిప్రయోగానుగుణముగా 'లోపల' విభక్తి యనియు నది షష్ఠిగాఁ బరిగణింపఁబడినను సప్తమ్యర్థమునందు నగు ననియు గుర్తింపవలయును. 'లోన' అందు స్థానమున నాదేశింపఁదగినది.

సప్తమి :

'అధికరణంబునకు సప్తమి యగు' (7)ననుదాని నట్లు గ్రహించిరి (ఉ.22.సూ.

సంస్కృతవ్యాకరణసిద్ధ మగునిమిత్తార్థజసప్తమియు విషయసప్తమియె యనఁదగును. చర్మణి ద్వీపినం హన్తి చర్మనిమిత్తముఁ (విషయమున) బులిని జంపుచున్నాఁడు (ఉ 228)అనుటలో వరుఖులవారియభిప్రాయ మస్పష్ట మైయున్నది. 'చర్మణి ద్వీపినం హని' యనుదాని ననుసరించిన "చర్మమునందు ద్వీపిని జంపుచున్నాఁ డని తెలుఁగున సప్తమి యుండదు. 'నిమిత్తాదిజసప్తమి —చర్మమందు ద్వీపిని జంపెను అనురీతిసంస్కృతానుసారప్రయోగములు తెలుఁగు కావ్యములందు లభింపలేదు' (వ్యా.సం.స.1644) అని వీరును స్పష్టము చేసిరి. తెలుఁగు కావ్యములందే కాదు, తెలుఁగువారివ్యవహారములోను నిట్టివి వినఁబడవు. ఇట విభక్తియె యవుచో 'చర్మముకొఱకు ద్వీపిని జంపె' నని తెలుఁగున నుండు. ఉ.లో నిమిత్తశబ్దమును బ్రయోగించు టేల? అది 'విషయసప్తమియా? తెలుఁగున నిమిత్తాదిజసప్తమి లే దని చెప్పఁదగును.

### విశేషణలింగవిభక్తివచనాలు :

'విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు' (19) నను సూరిలక్షణమును '—ప్రాయికంబుగ లింగవిభక్తి వచనంబు లగు (ఉ.26) నని మార్చిరి. ప్రాయికం బనునది మార్పు. దీనివలనఁ గొన్నియెడల విశేష్యలింగవిభక్తి వచనములు విశేషణమునకుఁ గాకపోవుటయు సిద్ధించును. కావున వీరు 30.సూత్రముచే జెప్పినవచనవ్యత్యాసము 31,32సూత్రములచేఁ జెప్పిన విభక్తి వ్యత్యాసము స్పష్టత కనవచ్చు.

"పైది సామాన్యవిధి ఇది వర్తిల్లనివిశేషస్థలములును గలవు. రాముఁడు నా మిత్రము. హనుమంతుఁడు దూత. సురలు మహాత్ములు. ఉన్మత్తవేషిణి యైనలచ్చి తల్లి విదుషి. తంత్రి విద్వాంసుఁడు. మొ॥" (ఉ.234)

ఇట్లనుటవలన నీరూపము లీసామాన్యవిధి ప్రవర్తింపనికోటులుగాఁ జెప్పవలెను. ఇంక విశేషవిధులచే సాధ్యము గావచ్చును. అయిన నిందుఁ బ్రాయికశబ్ద మేల? ప్రాయికశబ్దము లేనిచో విశేషవిధులు సామాన్యవిధులను బాధింపవా? ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' ననుచోఁ బ్రాయికశబ్దము లేదు. వీ రింకను నిత్య మనియుఁ జెప్పిరి. ఇమ్ము + ఇమ్ము అనుచో (ములోపాభావపక్షము) నుత్వ సంధిని బాధించి యామ్రేడితస్వరపరకసంధి వర్తిల్లుట లేదా? ఇట విశేషవిధియందే ప్రాయికార్థకతఋుమశబ్దము గలదు. కుట్టుసుదు అనుచో ద్విరుక్తటకారమును కఱకుటమ్మ ఇత్యాదులలో టుగాగమమును, చేయునతఁడు, రాజునాజ్ఞ ఇత్యాదులలో నుగాగమమును బైనిత్య మగునుత్వసంధిని బాధించి వచ్చుట లేదా?

కాఁగా లింగవిభక్తివచనములు విశేష్యముకంటె భిన్నముగా విశేషణముల కగుచోట్ల వట్టివానిని సాధించునదెట్లు నాయావిశేషవిధులే. అట్టియెడలఁ బ్రాయికశబ్దమున్నను లేకున్నను విశేష్యవిధిచే నీసామాన్యవిధి బాధింపఁబడక తప్పదు. కాఁగా నిందు కెయయిన నీసూత్రమునఁ బ్రాయికదళము వ్యర్థము. ప్రయోజనాంతరమును వీరు వివరింపను లేదు.

మొత్తముపై సూరికంటె వీ రధికముగాఁ జేర్చిన 'ప్రాయికంబుగ' ననుదళము వ్యర్థమె యగుటచేత నది లేనిసూరిలక్షణము సూత్రము యగుచున్నది.

ఇట వీరు సూపినవిశేష్యస్థలములలో నాయవి అచ్చి.శి.సూత్రమునొద్ది గమనింపఁ దగును.

బహువచనమున కేకవచనము :

'స్త్రీసమంబు లగువిశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు' (20) ననుసూరిలక్షణమును సవరించి వీ రిట్లు పేర్కొనిరి. 'అప్రాణివాచకము లగుస్త్రీసమంబు లయినవిశేషణంబులయు, మువర్ణకాంతవిశేషణములయు బహువచనంబున కేకవచనంబు వికల్పముగా నగు' (ఉ.30. సూ.)

సూరి స్త్రీసమము లన వీ రవి 'యప్రాణివాచకములు' గావలె ననుట యొక మార్పు. "అప్రాణివాచకము లనుటచేత పంద్యము లగుదైవతములు జితసింహము లగునేనుంగులు మున్నగుచోట్ల నేకవచనము నిల్వదు (ఉ.235) అని ప్రయోజనమును వివరించిరి. ఇట మువర్ణకాంతవిశేషణములే చూపుటంబట్టి వీరిసూత్రమందలి "అప్రాణివాచకంబు లగు" అనుదళము మువర్ణకాంతవిశేషణంబులయు ననుదానితోఁ గూడ నన్వయింపవలె. ఇది విశేషమె. స్పష్ట మగునట్లు చెప్పవలసినది.

సూరి అప్రాణివాచకముల కని చెప్పకుండుటచేత నివియే కాక 'ఆపన్న యగు మానిసులు మున్నగునసిష్టరూపములును దుర్వారములే యగు' (ఉ.235) ననిరి. ఆపన్నయగు మానిసు అన్నది యచ్చుపొరపాటా? ఇది ప్రాణివాచక మగుట తరువాతి సంగతి కాని ముం దస లీయాపన్నశబ్దము స్త్రీసమము గాని మువర్ణకాంతము గాని కాదు. ఇది ప్రస్తుతసూత్రమునకు లక్ష్య మగుట యెట్లు? మానిసులందలిమహత్త్వమునుబట్టియు ఆపన్ను లగుమానిసు లనియె యుండవలె. స్త్రీత్వమున 'నాపన్న లగునాడుమానిసు లని యుండవు. ఇట మహతీవిశేషణ మై యాపన్నశబ్దము మహతి యైనను స్త్రీసమ మగుట కిది యాచ్చికము గాదు. ఒకవేళ సంస్కృతసమ మయ్యును స్త్రీలింగకార్యమునుబట్టి (స్త్రీలింగమే) స్త్రీసమ మని వీరు దలఁచిన నది కేవల మసంగతము.

ఈసందర్భమున సం.లో 'అన్న యగుమానుసులు" (వ్యా.సం.స.1074) అని చూపిరి. అది యుచితమే. "అన్న" యన్నది "యాపన్న" యని యిట నుంట ముద్రణ ప్రమాద మనవలె. అదియు విశేషమె. సం.లో జగద్భర్త యగుసురలు" (వ్యా.సం.స.1074) కావలసివచ్చు ననుట యిట్టె యసంగతము.

అహో.వ్యాఖ్యయు నాతఁడు చూపినవి.వి.పాఠమును సరి గా దని .తద్విశేష్య కయోః" అనుచో సద్విశేష్యకయోః అని మార్పు చేసి (క.మం.కర్తకువలె వీరికి నిం కొకవి.వి.గ్రంథము దొరుకలేదు. కాన నిది మార్పె) ప్రాణివాచకములకును నిట్టియేక వచనమును జెప్పిరి. (వ్యా.సం.స.1072)అట్టియపుడు వీ రట సాధించిన ఇం పయిన జవరాండ్రు ఇం పయినప్రియురాండ్రు (వ్యా.సం.స.1073) అనురీతి వీగ్రంథమున వీరిలక్షణముచే నెట్లు సిద్ధించును? అట్టియపుడు 'అప్రాణివాచకము' లని సూరికి భిన్న ముగాఁ జెప్పుట యుచితము కాదు గదా. సూరి యుంచినబహుళశబ్దమును గూడఁ దొలఁ గించి స్త్రీ రిట వికల్ప మనిరే. కాఁగా వీ రప్రాణివాచకము లనుట వీరివివరణమునకె విరుద్ధము.

ఆ ట్లయిన నన్న యగుమానిసు లని కా నక్కఱ లేదా? అట్టిలోపము వీరు సవరించినవి.వి.పాఠమునందు లేదా? వీ రట 'అన్న తండ్రి మున్నగువిశేష్యస్త్రీసమ ములు విశేషణములుగా వాడఁబడునపు డీవిధి వర్తిల్లనేర" (వ్యా.సం.స.1072) దని యట సమర్థించినవిధముగా సూరిలక్షణమున నేల సమర్థింపరాదు?

ఇంకను నవసర మైనయర్థ మైనను దానిని సలక్షణముగా గ్రహించుటకు సూరిసూత్రమున 'బహుళ'పదము గలదు. బహుళపదముచేఁ బ్రాణివాచకములకుఁ బ్రయోగానుసారముగనే యగు నని యర్థము చేసిన నీయంశము లక్షణసిద్ధ మగునే.

అపరూపములను వారించుటకు సాధక మగు బహుళపదమును వీరు సూత్రమునఁ దొలఁగించి యవి సూరిమతమున నేర్పడుచున్న వనుట యుక్తమా? దీనింబట్టి వీరు బహుళపదమును దొలఁగించి వైకల్పి మనుట సరి కా దని స్పష్టము.

ఇంకను 'ఏనుంగులు పెక్కు ,ఇం పైనప్రియురాండ్రు' మున్నగురూపము లెల్ల నసాధువులు కావలసివచ్చు[వ్యా.సం.స.1075)టను వారింపవలె నన్న వీరు తమ సూత్రమునన ప్రాణివాచకము లని చేర్చుట యంగీకరింపరాదు గదా.

ఇక మూర్ధన్యాంతముల విషయము. వి.వి.లో 'సిద్ధమ్ము స్త్రీశబ్దమునకు నాచ్ఛిక క్లీబసమము' అని యర్థము చేసిరి. ఇట్టి యాచ్ఛికస్త్రీసమము లనియు, స్త్రీసమము లాచ్ఛికములే యయినసూరిమతమున నవి సంస్కృతసమములు గ్రహింపఁబడవు గావున నాచ్ఛికస్త్రీసమము అని విశేషముగాఁ జెప్ప నక్కఱ లేదు. మూర్ధన్యాంతము లాచ్ఛిక ములె కాఁ బని లేదు. కాని సంస్కృతసమములు గ్రహింపఁబడకతప్పదు. (వి.వి.లో వీరివ్యాఖ్యానమందలి విశేషమే యాచ్ఛిక క్లీబసమము అన్నది.)

దీనివలన 'తెరె యితరుల్ సిరిలందం బాత్రము' అని (వ్యా.సం.స.1074) యుపయోగ మగు ననిరి. కాని వీరే పాండవు లరయఁగఁ గూరిమిఁ బాత్ర మగుదురు యైనన్' (వ్యా.సం.స 468) అని స్థలాంతరమునఁ జూపిరి. ఇట (పాండవులు) పాత్రము అనుచో ప్రాణివాచక మగుటతోపాటు సంస్కృతసమము నగుట గమనార్హము. దీని నసాధు వందురా? ఇట్టి 'గోవులు పవిత్రములు, గోవులు మంగళములు' (కాశీ 2.17)

సీత నలిగిన నట్టిమె పురహరాజకేశవు లైనన్ (ఆది.4.199) అను ప్రయోగము విశేషముగా వీ రెంతకు ముందే చూపిరి. ఇందు 'ఉత్తము' ప్రాణివాచకము గాదా?

'వంద్యు మగుదురై పతకులు, జితసింహ మగునేనుంగులు' అనియు మందుఁ లో బాధ లేదు. ఇట్టి ప్రయోగములు లే వందురా? వీనికై యప్రాణివాచకము లట్లుఁ ప్రాణివాచకముల కేవలపద ప్రయోగము లెట్లు? అందు మై సింహరాజులు, మన్మథ ప్రాయ మనుష్యులు మొ॥ దుష్టములా? కావున సూరిసూత్రమున నప్రాణివాచకము లనుటం టుచితము. వీని చేర్పుటు లక్ష్యవిరుద్ధము. వయిఁగా వికల్పమనిరి.

వంద్యు మగుదురై పతకు లిత్యాదిగాఁ గానరాకుండుటచే సూరిసూత్రమునందలి బహుళపదముతోఁ బ్రాణివాచకముల కీకార్యము వ్వాదిక్క మని(సూరి యట్టి పదాహరింప కుండుటబట్టియు) ప్రయోగానుసారముగా గుర్తింపఁదగును. ఇట్లు బహుళపదమును సార్థక మైయుండఁగా వరుఁలవారు సాధారణముగా వై కల్పిక మనుమాట్ప లయుటనాదు

కాఁగా సూరిలక్షణము సూక్తము.

ఒకవిభక్తికి మఱొకటి:

'ఒకానొకచో నొకవిభక్తికి మఱియొకవిభక్తియు నగు' (21) ననుదాని నట్లు గ్రహించిరి. (ఉ.24)

పేరోలగంబుండు (పేరోలగంబు: దుండు) (ప్రౌఢ.కార.20) చెప్పిన జడముల సప్తమికిఁ బ్రథమయు నీ రీతినే సాధించు టుచితమె. (వ్యా.సం.స.1053)

'వాహనమును దిగెను వాహనమునుండి యని యర్థము' అనుసూరియిచ్చటివిస్తరణమును దిరస్కరించి వాహనమునుంచి దిగెను అనుచోట ఉంచి అధ్యాహార్యము— వాహనమునుండి దిగెను అనువాక్యమె సాధువు కాదు అట్టిప్రయోగము మృగ్యము' (ఉ.230) (వ్యా.సం.స.1023) అనిరి. ఇట్టిప్రయోగములు లే వనుట సరి కాదు. చరమగిరినుండిపడియెడుతరణికరణి(కర్ణ.362) 'అంబరసీమనుండి— మలయాద్రి శిఖాస్థలిద్రావి (సిం.5.209) ద్రుమానిపైనుండి పడుటయు (దశ.8.70) పయినుండి ఘోరనారాచములు పడుచున్నవి (రామా.8.12)తల్పోధమున్ డిగ్గి (కళా.6.137) ఐరావతమున్ డిగెన్ (విజ.3.104) మున్నుగా నీయది ప్రయోగములం బ్రసిద్ధమె. ఇట్లై అరదమున్ వెస డిగి (హరి ఉ.10-121) కన్నులం నిప్పులు వెళ్లఁ గ్రాయుచున్ (హర.7.44) దాని వెల్వడ నేరక (రామా.2.272) దీనిని దిగవలయు నని— —దాని డిగి (కళా.5.114) మొ॥ ద్వితీయయుఁ గలదు. (సూ.త్రి.శే.812) ఇట వీరి ఉండి ఉంచి యన్వయము నధ్యాహారములంగూర్చి గమనించియుంటిమి కావున పరుషులవారు దీనిని దిరస్కరించుట సహజమైనను నది యంగీకరింపఁదగినది కాదు. ఉండికిఁ బ్రయోగము లున్నను లే వందురు. ఉన్న నెట్లో సమన్వయింతురు. ఉంచి లేకున్నను నధ్యాహార్య మందురు. అన్వయమా యసంగతము. వారివచనములలోనె పరస్పరవిరోధ ముండ నంగీకరించు టెట్లు?

తృతీయాసప్తములు- ద్వితీయ :

'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' [22] ననుసూరి సూత్రమును విస్తరించి పరుషులవారు "ఉదంతైకవచనేతరములయు నొపవిభక్తికైక

వచనేతరములయు జడములతృతీయాసప్తములకు ద్వితీయ పైకల్పికముగ నగు" [ఉ.25] అని పేర్కొనిరి,



బాలగుళకంబుచే ——మున్నుగా సూరి చేసినవివరణమును సూత్రమందే చేర్చి 'ఉదంతైకవచనేతరములయు'— అని పేర్కొనిరి, కాన నిందు సూరిలక్షణమున దురుక్తి లేదు. సూరిరచన 'సూత్ర"లక్షణముతో నుండ వఝులవారు వివరణాత్మక ముగఁ జెప్పిరి,

ఔపవిభక్తిక[జడ]ములకును నేకత్వమునం దీకార్యము లే దని వీరు విశేష ముగాఁ జెప్పిరి, సూరియు సూత్రాంధ్రములో 'ఉపవిభక్తేరనేకార్థాత్తృతీయాసప్తమ్యోః' అని యీయంశమును ప్రస్తావించెను. ఇందు నౌపవిభక్తికములతృతీయాసప్తముల కత్వము చెప్పఁబడినది. [అచ్చ.38] కాన నవు దీద్వితీయకుఁ బ్రసక్తి లేదు. కాని బహుళ మగునాయత్త్వము రానిసందర్భమున గోటిచేత గోటియందు ఇత్యాదులలో నీ ద్వితీయావిధి ప్రవర్తించుట కవకాశము గలదు. సూరిమతమున నీయంశమును బహుళ పదముచే సంగ్రహించుకొనవచ్చును. వీరు బహుళపదమును దొలఁగించిరి గావున నాయర్థమును సూత్రముననే వివరించుట యవసర మైన దని గుర్తింపవచ్చును.

"ఔపవిభక్తికైకవచనేతరముల' కనుటచే నౌపవిభక్తికములకును బహుత్వమున నీకార్య మవు నని వఝులవారియభిప్రాయము స్పష్టమే... త్రాడులన్ అని చూపిరి.

కాని బహుత్వమునమాత్ర మీవిధి యౌపవిభక్తికముల కవసరమా యని సందే హము. "ఔపవిభక్తికంబులతృతీయాసప్తముల కత్వం బాదేశంబు" [అచ్చ.38] అను నది తృతీయాసప్తములలో నేకవచనములకు మాత్రమె యత్వము చెప్పుచున్నట్లు చెప్ప నాధార మేమి? త్రాటిచేతను అనుచో నేకవచనమున నెట్లత్వ మగునో త్రాడులచేతను అనుచో బహువచనమునకు నట్లే యత్వ మగును త్రాడుల+అను— అపదాదిస్వర పరకసంధిచే త్రాడులను అనియె యగును గదా.

ఈయత్వ మౌపవిభక్తికము గాదు. విభక్తిపరకత్వమున నదునదియుఁ గాదు. కాఁగానౌపవిభక్తికములు ద్వితీయామంలలో 'నేకవచన"పరకతతోనెయగుట యా'తృతీయా

సప్తముల 'యత్వవిధానమునకు నియామకము గానేరదు. కావున నిది తృతీయాసప్త(ఏకబహువచన)ములకగును.

కాఁగా విశేషముగా నౌపవిభక్తికములకుఁ బైని దృతీయాసప్తముల కత్వము విధించినచోఁ బహువచనమునకు నత్వమై యిష్టరూపసిద్ధి యగుమనే యున్నది. కావునఁ బ్రస్తుతసూత్రముచేఁ దృతీయాసప్తమునకు ద్వితీయ యగు నని చెప్ప నవసరము లేదు.

కావున నౌపవిభక్తికశబ్దములకీకార్యమున కప్రవృత్తిని బహుళపదముచే సాధారణముగఁ జెప్పఁదగును.

మొత్తముపై వసుధులవారియీలక్షణము వికల్పాత్మకమైయుండ సర్వార్థసాధకమగుమనె సూరిసూత్రము లాఘవముతో నున్నది. ఇందపసిద్ధాంత మేమియు లేదు.

వసుధులవారిలక్షణమును బరిశీలింతము. "ఉదంతైకవచనేతరములయు, నౌపవిభక్తికైకవచనేతరములయు జడముల— తృతీయాసప్తములు"— అనుచో ఏకవచనేతరము లన్నది "తృతీయాసప్తము"లతో నన్వయింపవలె. ఉదంతములు నౌపవిభక్తికములు నన్నది 'జడము'లతో నన్వయింపవలె. జడవాచకము లగుశబ్దములతృతీయాసప్తములకు ద్వితీయ— ఇవి ఉదంత[జడ]ములకును ఔపవిభక్తికములకును నేకత్వమునరాదని యర్థమును వీరియీసూత్రమందలిపదము లెట్లు ఈయఁగలవో యన్వయమును గుర్తించుటకు మిక్కిలి శ్రమపడవలసివచ్చుచున్నది. అయ్యు సాధ్యమా? జడములకౌపవిభక్తికములకు, నుదంతములకు బహుత్వమునను నితరముల కెల్లయెడలను దృతీయాసప్తములకు ద్వితీయ వైకల్పిక మని చెప్పిన బాగుండెడి దేమో. ఇందు దర్శనమయ్యెడిది.

ఏమైన నింతటి క్లిష్టాన్వయము సూరిసూత్రమున లేదు. బహుళపదమును దొలఁగించుటకై వీరు తెచ్చిపెట్టి రనవచ్చు. వైకల్పిక మనియు 'అజడవాచకములద్వితీయా బహువచనంబునకును నీవిధి వర్తిల్లును' (ఉ.231) అనిరి. ఈయర్థమును సాధించుటకు సూత్రమున నాధారము లేదు. వీరివివరణమె సూత్ర మనుకొనవలె. ఈవిశేషార్థము నిరాధారముగఁ జెప్పుటకంటె నిందు కవకాశము సూత్రమునఁ గల్పింప నవును గదా. క్రొత్తగాఁ గల్పింప నక్కఱ లేదు. మూల

మగుసూరిసూత్రమందర్ బహుళపదము నట్లయుండినఁ జాలు. వీరు వైకల్పిక మనుట సరి గా దని స్పష్టమే కదా.



ఇంక నీవివరణమునను 'ద్వితీయాబహువచనమున' కీవిధి వర్తించుట యేమి. సూత్రమున ద్వితీయయే విధింపఁబడినది గాని ద్వితీయ కేమియు విధింపఁబడలేదు గదా. కావున బహుత్వమునఁ దృతీయాసప్తములకు ద్వితీయ' యగు నని సూత్రానుగుణముగ వివరింపఁదగును.

వీ రి ట్లేల చెప్పిరి? అంతను మందజీవికృద్వివరణములనుబట్టి (త్రాడులన్ అను ద్వితీయాబహువచనమునకుఁ దృతీయాసప్తమ్యర్థములు గలవు. ఉ.231)ఇట ద్వితీయాబహువచనము తృతీయాసప్తమ్యర్థక మగు నని వీరి యుద్దేశ్యము. కాని చక్రవాకముల చేత— ననుచోఁ దృతీయకు ద్వితీయ యైన (చక్రవాకములన్) నచటిద్వితీయ తృతీయార్థకము మాత్రమె. అట్లె మనుజులయందు... మనుజులన్ — అని సప్తమి కైన సప్తమ్యర్థకము మాత్రమె. తృతీయాసప్తమ్యర్థక మగు నని సామాన్యముగాఁ జెప్పుట కంటె ని ట్లను టుచితము.

ఇనుపముక్కులకాకులం గఱపించి (కాశీ.3.56)— కాకులం గఱపించి యనఁగాఁ గాకులచేత ననియె యర్థము. కొండఱతో ముచ్చటాడు కొండఱ నవ్వున్ (భాగ.8-374) ఇటఁ గొండఱన్ అనఁగాఁ గొండఱతో నని తృతీయార్థమె.

వీరు చూపిన 'పురుషులను దృష్టిఁ బొందుట పురుషులచేత ననుచో పురుషుల వలన— (పొందుట) (గహణార్థకపంచమి) ననుచో వాహనమును దిగెను అనురీతిగా ద్వితీయ యైనట్లును జెప్ప వీలు గలదు.

మొత్తముపై నిట్టియర్థములును లక్షణసిద్ధము లగునట్లుగా సూరి చెప్పినట్లు సూత్రమున బహుళపద ముంచు టుచితము. అట్టిచోద ఉదంతములు కేకత్వమున రాకుండుట ముఖ్యసూత్రమువారు సూత్రమునఁ జెప్పనియంశము లీబహుళపదసిద్ధము లగుట సూత్రమునందు వివరింపఁబడి లేదు.

తృతీయ—న :

'ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు' (23)ననుదాని నట్ల గ్రహించిరి.

'ఆజడోదంతతృతీయకును నవర్ణక మేకత్వంబునఁ గలుగు నని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను (కార.17) గాని దానికి బల మైనకవిప్రయోగము లభించలేదు 'ఏనుఁగున నేనుఁగు వైచుచు —అని యాతఁ డిచ్చినప్రయోగమున ఏనుఁగుల నేస్గుల వైచుచు అనునది కవిప్రయుక్త మనవచ్చును. ప్రయోగాంతరము లే దని యాతఁడే వ్రాసెను.' (ఉ.281) ప్రయోగాంతరము లే కున్నను నిరాధారముగా నున్నదానిని గా దన నేల? వాజి వాజిచే నిత్యాదిగా నీషద్యమునం దితరస్థలముల నెల్లెడ నేకవచనాంతములె ప్రయోగింపఁబడుట ననుసరించి యయ్యదియు నేకవచనాంతముగనె కవి ప్రయోగించె నని గుర్తింపఁదగును. కావున నున్నదానిని యథాతథముగ గ్రహించి యది విశేషస్థలముగాఁ బ్రత్యేకముగా గుర్తించు టుచితము (చూ.త్రి.శే.)

చే—చేతవర్ణకమునకు మాఱుగా—— ఉదంతజడవాచకముల పై నేకత్వమున నవర్ణకమును (ఇది చింతామణిమతమున సప్తమీప్రత్యయము కాన 'అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా' యనుచింతామణిసూత్రముచే వచ్చును) —(వ్యా.సం.స.936) ఈ:రఘువారి వివరణముచే నవర్ణకము చింతామణిమతమున సప్తమీప్రత్యయ మనుటతోఁ జిన్నయమతమున నవర్ణకము తృతీయావిభక్తి యగు నని భ్రమింపరాదు. బాల.కార.28సూత్రముచేఁ దృతీయకు నవర్ణక మగుచున్నది. కాని సూరియుఁ జిం.వలెనె నవర్ణకమును సప్తమీవిభక్తిగనె చెప్పెను గాని తృతీయావిభక్తులలోఁ బరిగణింపలేదు.

బాణమునన్ — బాణముచేత, బాణముతోడ

'ఇట్లు నవర్ణకము వచ్చుట వైకల్పిక మనియె యెఱుఁగునది' —— నన్ ప్రత్యయము రానపుడు బాణముచేతను బాణముతోడను అనురీతి చేత చే తోడ తో ప్రత్యయములు వచ్చును'— (వ్యా.సం.స.1058) అయ్యు నిట నేలకో వీను వైకల్పిక మనక సూరివలెనె '——నవర్ణకం బగు' నని చెప్పిరి.

సూరి యేని 'సవర్ణకంబు నగు' నని సముచ్చయార్థకము నుప్రయోగించిన బా గుండెడిది గదా యనిపించు.

"బా.కా.22సూత్రమునందు బహుళగ్రహణముచే నుదంతములతృతీయాసప్తముల చోట ద్వితీయ రానేర దని వివరింపఁబడుటంజేసి యట్టియుదంతములకుఁ ప్రకృత సూత్రముచేతను బా.కా.16సూత్రముచేతను సవర్ణకము పాక్షికముగా వచ్చు నని వివ రింపఁబడినది. (వ్యా.సం.స.1059) వరుసలవారియీవివరణ ముచితముగాఁ దోఁపదు. ఉదంతములకుఁ దృతీయాసప్తముల ద్వితీయ రా దనుటచే నక్కడ నేది వచ్చునో చెప్ప వలెఁ గాన కార.23,18సూత్రములచేఁ దృతీయాసప్తములందు సవర్ణకము చెప్పఁబడిన దనియుఁ దృతీయాసప్తములకు ద్వితీయ రా దన్నది యేకవచనముననే కాన నేకవచనము నందే యీ23,18సూత్రములు ప్రవర్తించును గాని (ఉ.229) "ఈయుదంతములకు బహుత్వమున సవర్ణకము రానేరదు —బా.కా.22సూత్రముచొప్పునఁ దృతీయాసప్త మ్యర్థములందు ద్వితీయయే వచ్చు" (వ్యా.సం.స.1059)ననియు వీ రభిప్రాయపడి రనవలె.

కాని కార.21సూత్రస్థలమున నుదంతములపైఁ దృతీయాసప్తములకు ద్వితీయ రా దనఁగా నాతృతీయాసప్తము లట్లే యుండును. ఇం కొకటి వచ్చు నని చెప్ప నవ సర మేమి? ద్వితీయ వచ్చువానికిని రానిపక్షమున కోలతోడ, లంకయందు నని తృతీయాం సప్తము లట్ల యుండును గదా. వీనికిఁ బాక్షికముగాఁ గూడ ద్వితీయ రానిచో 'బాణ మును' అనురీతి నుండక బాణముచేత బాణమునందు అని యట్లే యుండును.

ద్వితీయ రాదన్నందుకుఁ బరిహారముగా సవర్ణకము విధించె నని తలఁచు టెట్లు?

ఇంక నట (కార.22) ఏకత్వముననె నిషేధించుటకు నిట సవర్ణక మేకత్వము ననె వచ్చుటకు సంబంధము లేదు. 'స'వర్ణకము తత్స.11.సూత్రముచే నేకవచన మగుటవలననే యేకత్వమం దయినది డుముపు లిట్లు గాదా.

ఇఁక నట నుదంతముల కేకత్వమున మాత్రమె ద్వితీయ నిషేధించుటంజేసి బహుత్వమున ద్వితీయ యగు ననియే యర్థ మగు. కావున 'బాణంబులన్' ('బాణముల

చేత— బాణములయందు') అని బహుత్వమున సూత్రము(కార.22)చే ద్వితీయ యగుటలోను విశేషము లేదు.

ఇఁక బాల.28సూత్రముచే సప్తమియందు నవర్ణకము విధింపఁబడినది. నవర్ణకము సప్తమియె సప్తమి యందు సప్తమి యగునవర్ణకము నః విధింపఁగా నిట సప్తమికి ద్వితీయ రా దనెఁ గాన నట నవర్ణకము చెప్పవలసివచ్చిన దనుటయు నసంగతమె. ఏకవచన మగు నవర్ణక మేకత్వమునను నుదంతపదములపై మాత్రమె యగుచున్నది గావున సప్తమీనవర్ణకము ప్రత్యేకముగాఁ జెప్పఁబడిన దనుట స్పష్టమే.

పరుచువారికిఁ బైని మన మనుకొన్నదృష్టి (లే దని వారివివరణమునుబట్టి చెప్పలేము.) లేకున్న బాధయె లేదు.

ద్వితీయకుఁ బ్రథమ :

'జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' (24) అనుసూరిసూత్రమును వీరు 'సహజ మగుజడంబుద్వితీయకుం బ్రథమ వైకల్పికంబుగా నగు' (ఉ.27) నని సవరించిరి. సూరి బహుళపదవివరణమును సూత్రమునఁ జేర్చి బహుళపదమును దొలఁగించి (వైకల్పిక మిత్యాదిగా) చెప్పుట వీరు పెక్కుడుగఁ జేసినపని. ఇట నదియే

'సహజ మగుజడంబుద్వితీయకు' ననుచో జడమునొక్క 'సహజ మగుద్వితీయకు' నని యన్వయించుకొనవలె. అసహజజడములును గలవా? సందేహమునకుఁ దావు లేకుండ జడంబుసహజద్వితీయ యనియో యింకెట్లో స్పష్టముగాఁ జెప్పిన బాగుండెడి దేమో.

సూరి 'తృతీయాసప్తములకై నద్వితీయకుఁ బ్రథమ రా దన వీరు సహజద్వితీయ కావలె ననిరి. ఇం కొకవిధముగా వచ్చినద్వితీయకుఁ బ్రథమ యగు నవకాశము సూరిలక్షణమునఁ గలదు. సూరి చూపిన 'ఇల్లువెడలె' నన్నది యిట్టిదే. ఇచట ఇంటినుండి అనుచోఁ బంచమికి వాహనమును దిగె ననురీతిగా కార.21సూత్రముచేఁ బ్రథమ యైన దని సూరిమతము గుర్తింపవచ్చును. తృతీయాసప్తమునకైకద్వితీయకె ప్రథమ లే దనుటవలన నిటఁ బంచమి కయినద్వితీయకుఁ బ్రథమ యగుట సాధువె.

పాఠము — కూర్మము నీటిలో నుండి విక్రమింపలేదు గాన అను.1.232పద్యములోని నీటిలోను వెడలకుండి అనుపాఠము సరి. (ఇందు వీరిసిద్ధాంతములకు బాధ లేదన్నమాట.) అను.1.235పద్యములో నీర్వెడలి అనుపాఠము కవిప్రయుక్తము కాదు. నీర్వడసి అనునది తిక్కయజ్వప్రయుక్త మనఁదగును (ఉ.232) వీరిసిద్ధాంతముతోపాటు సం.నుండి ఉ.నాఁటికిఁ దిక్కనప్రయోగమును కవిప్రయుక్త మను పేరితో మాటినడి. నిజమునకు నీగ్రంథమున నైనయథాపూర్వము నీటినుంచి వెడలి నీటి నక్కడనే ఉంచి (తనతోఁ దీసికొని పోక) వెడలి అని యుంచిపద మధ్యాహారము చేసి యన్వయింపవచ్చును. (సహజద్వితీయకుఁ బ్రథమ వచ్చు ననిరి గదా. వీటిని-నీరు) కాని వీర ట్లేల చెప్పలేదో.

ఇఁక నిట వీరియభిప్రాయము కూర్మము నీటినుండి వెడలి విక్రమింపలేదు గావున 'నీర్వడసి' నీటిని పొందియే (నడుమ నెటకో పోయి వచ్చికాదు. అందే యుండి) విక్రమించె నని. కాని యిది సరి కాదు.

గజకచ్ఛపములు (ఇటఁ బాము గానరాదు.) రెండింటి నొకేసారి పట్టుకొనవలయు నని యుపదేశించుకశ్యపునితో గరుడుఁడు "ఒకటి గొలనిలోన నుండు నొకటి గొండమీఁద సంచరించు మీరు రెంటిని నడఁగ నొక్కమాట యడరి పట్టుట కృత్యమని యెదరు పఱంచె యట్లు చేయ' (అను.1.225) అని యడిగెను. అనిన నది యట్టిద యుపాయంబు సెప్పెద నని' యతఁడు

చ॥ కరపతి నీవు ప్రాపుకముగాఁ జనుదెంచినఁ గూర్మరాజు సం
గర మొనరింపుచుండి తమకంబున నీళులఁ బాసి వీఁకమైఁ
దరి నడరంగఁ బట్టునది తత్సమయంబున రెంటిఁ గూడ నీ
వెఱపున యూఁది చిత్తమున వేగిరపాటు లేకపొందుమీ

(అను.1.227) అని చెప్పెను. సరిగా నట్లే మొదటఁ గూర్మము నీరిలోను వెడలకుండియు పోరినది. కశ్యపుఁడు చెప్పినట్లుగనె పిదపఁ దమకముతో నీరు పాసి వచ్చినది.

ఉ॥ ఇమ్మెయిఁ బోరి పోరి మది నేపును  గ్రహించి యాగా
ర్మమ్ము గడంగి నీర్వెడలి మత్తకరిన్ పడి నాక్రమింపఁగాఁ
గ్రమ్మన రెంటినిం బొదివి, కచ్ఛపము న్వలకాల వామపా
దమ్మున వారణంబును ముదమ్మునఁ బట్టి తగిర్చె గోపబన్ —

(ఆను.1.287) అని కోపముతో నీరు విడిచి రాఁగా గరుడుఁడు రెంటిని బట్టి కొనెను. కాఁగా నిటఁ గూర్మము 'నీరువెడలి' రావలసినదే. పరుఖలవారు చెప్పినట్లు విక్రమించుటకై 'నీరుపడసి' యున్నఁ గర్త్యపునివాక్యము వ్యర్థము. (అసలు అది మొదటి నుండియు నీరియందే యుండఁగాఁ గ్రొత్తగా నీరుపడయు టేమి?) అనఁగా 'నీర్వెడలి' యనునున్న పాఠమె సమంజసమనియుఁ గవిప్రయుక్త మని పరుఖలవారు పేర్కొన్నది సరిగా దనియు నిశ్చయము గదా. ఇఁక గవిప్రయుక్తము అని పరుఖలవా రూహించినట్లు నిట్టియిబ్బందులు లేనిచో నదియె కవిప్రయుక్త మనుకొనవలెనా? కవిప్రయోగములవిషయమున పరుఖలవారిదృష్టి ప్రామాదయోగ్యము గా దనక తప్పదు.

ఇట్టిస్థితిలో నిఁక పీను 'ఉంచి' నధ్యాహారము చేసి నీటిని అట్లే యుంచి కూర్మము తానొక్కఁతెయె వెలుపడిన దని యర్థము చేసి యుఁ చున్నది సహజద్వితీయయే యనియు దానికిఁ బ్రథమను చిక్కయజ్వ శాస్త్రిగుణ మనుద్యష్టిలోనే ప్రయోగించె ననియు నందురు గాఁబోలును.

అయిన నిట సూరిమార్గమె యుచితమా? అని సందేహము గల్గవచ్చును.

వాహనమును దిగె ననురీతిగా పంచమికి ద్వితీయ (కార.21.సూ.చే) ఉండి యను ప్రయుక్తము గాకున్నను గలదు. [సప్తమిపై నుండి లోపించిన దనుస్థలములందు నిట్లె కార.21.సూ.చేఁ బంచమికి సప్తమి చేయవచ్చును.] ఆయ్యుఁ బంచమికిని దాని కగు ద్వితీయాసప్తములకును నుండి యనుప్రయోగమును జెప్పుటకంటె వలన నుండి నను ప్రయుక్తము చేసి యట ద్వితీయాసప్తములు చెప్పుట లాఘవము. కేవలద్వితీయాసప్తములకంటె ద్వితీయాసప్తములపై నుండితోఁ బ్రయోగము ప్రసిద్ధము గావున నట్టియట్లు చెప్పఁదగును.

కాలాధ్వములు–ప్రథమ :

'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు' (25) ననుదాని నట్లె గ్రహించిరి. (ఉ.23.సూ)

ఇచ్చోఁ బ్రౌఢ.కార.20సూత్రము బాల.కార.24సూత్రమునకు సవరణముగా "ఒక్కొక్కచో నుదంతదేశవాచకములకు సప్తమికిని బ్రథమ వైకల్పికముగ నగు– అని సూత్రించుట యుక్తము' (వ్యా.సం.స.1065) అనురీతిగాఁ జెప్పియున్నను నిట "పేరో లగం బుండు మొదట లగువానిని దీనిచొప్పున 'దేశవాచకములకు సప్తమికిని బ్రథమ యగు నని సూత్రింపరాదా యని శంకింపరాదు. (ప్రౌ.కార.20) సూర్యుఁడు తూర్పున నుదయించె ననుచో తూ ర్పుదయించె అనరాదు గదా. సం.లో నిదియుఁ జూపిరి. (వ్యా.సం.స.1065) అట్టి వెల్ల కార.24సూత్రమునకు లక్ష్యము లనుటయె యుక్తము. (ఉ.233) అని తమపూర్వాభిప్రాయమును విడచు టుచితముగా నున్నది. వెలసి యాప్రౌఢ.లక్షణ మనుసరర మని వీరును స్పష్టము చేసిన ట్లయినది.

ద్విత్రియాదులు–ప్రథమ :

"సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపం బడు దానిద్విత్రియాదులకుం బ్రథమ బహుళంబుగా నగు' (26) ననుసూరిలక్షణమును 'అన్నిప్రభృతులయు సంఖ్యావాచకములయు వాడుకలో మొదట వాడఁబడుదానికిఁ బ్రథమయుఁ దర్వాతిదాని కితరవిభక్తియు బహుళముగ నగును. ఇట్టియెడలఁ గొన్ని యెడల షష్ఠీసమాసమాత్రమె వర్తిల్లుటయుఁ గలదు' (ఉ.31,సూ) అని చూపిరి. వీరి లక్షణమును బరిశీలించిన సూరిలక్షణమె సూక్త మగుట గుర్తింపవచ్చును.

'అన్నిప్రభృతులు సర్వనామంబులు' అని సూరి చెప్పినసర్వనామసంజ్ఞ నిట వీ రంగీకరింపలేదు. అయ్యుఁ సంఖ్యావాచకములతోఁ గూడ సూరి సర్వనామము లని పేర్కొన్నయన్నింటిని అన్నిప్రభృతులలోఁ జేర్చి చూపిరి. అది తప్పదు. కాఁగా సర్వనామసంజ్ఞను జెప్పుకొనమింజేసి సూరి సర్వనామము లన్నచోట నెల్ల వీరు 'అన్ని ప్రభృతు' లనక తప్పదు. అమార్పున విశేషము లేదు.

"తెలుఁగున" సంఖ్యావాచకి మెల్ల సర్వనామము లైనను సంస్కృతమున నట్లు గామింజేసి తత్సమసంఖ్యావాచకములందును నీవిధి స రిలుటకై ' (వ్యా.సం.స.1076) సూరివలెనె 'సంఖ్యాభిధానము'లను (సంఖ్యావాచకములుగా) వీరును వేఱుగాఁ జేర్కొనిరి.

'తద్విశేష్యంబు'లను సూరి పేర్కొనఁగా వీ రదిఁ దొలఁగించిరి. కాని లక్ష్యము లను మాత్రము సూరి ననుసరించియె గ్రహించిరి. ఈవిశేషణవిశేష్యములలో నేది 'ముందు' ప్రయోగింపఁబడునో దానిద్వితీయాదులకుఁ బ్రథమ యగు ననుసూరిలక్షణము సమగ్రమై సర్వనామసంఖ్యాభిధానములవిశేష్యమునకును బూర్వము ప్రయుక్త మగుచో బ్రథమ యగును. గుజ్జము లన్నింటికి. వీరు నుదాహరించినయీ రూపము వీరి సూత్రము సాధించుచున్నదా?

'అన్నిప్రభృతులయు, సంఖ్యావాచకములయు వాడుకలో మొదట వాడఁబడు దానికి'— అనఁగా దేనికి మొదట వాడఁబడునది? ఈరెంటిలో నొకదానికి ముందు వాడఁబడినరెండవది యని చెప్పవలె. రెండు నాలుగులకు— నాలుగురెండ్లకు. అను విధముగనా?

ఇఁకఁ బూర్వలక్షణము ననుసరించి విశేషణము లని గ్రహించినచోఁ బూర్వ ప్రయుక్తము లగువిశేషణములకే ప్రథమ యగును. (మొదట వాడఁబడుదానికి' ననుచో గుజ్జములకు లక్షకు ననురీతి నివి పిదపఁ బ్రయుక్తము లగుచోఁ బ్రథమ లే దనవచ్చు.) కాని వీనివిశేష్యములకుఁ బ్రథమ యవు ననునర్థ మెట్లు? గుజ్జములు లక్షకు ననుచో మొదట వాడఁబడినగుజ్జ(ములకు) అనుశబ్దము విశేష్యము. ఇది యన్నిప్రభృతులలోనిది గాదు. (సంస్కృతమె కాదు.) ప్రథమ యె ట్లగును. వీ రె ట్లుదాహరించిరి.

కావున పరుషులవారు సూరిలక్షణమందలి 'తద్విశేష్యంబు' లనునభిప్రాయమును విడిచి పుచ్చుట లక్ష్యవిరుద్ధ మని నిర్ణయింపఁదగును.

'వానివిశేష్యంబులయు' నని వీరు చేర్ప ముద్రణమునఁ బోయినదా?

ఇట వీరు షష్ఠీసమాస మగు ననుట వింతగా నున్నది. షష్ఠీసమాసము చేయు టకు ముందు మొదటిపదము షష్ఠ్యంతము గావలయును గదా. ఇతఃపూర్వము వీరు? ప్రథమ చెప్పిరే కాని యొక్క-షష్ఠి చెప్పలేదే. షష్ఠి రానిదే షష్ఠీసమాస మగుట యెట్లు షష్ఠీసమాసవిధానసామర్థ్యముచేతనె పూర్వప్రయుక్తమునకు షష్ఠి యవు నని వ్యాఖ్యా నించుకొనవచ్చును. అట్టియెడల యొక్క-షష్ఠినే విధించినఁ జాలదా? సమాసము చేయ రాదా?

వీరిపద్ధతిలో షష్ఠీసమాసమును జెప్పుటయె యనర్థకము. వీరు సమాసమునకు సూరివలె (తెలుఁగు)విభక్తిలోపమును జెప్పలేదు. ఇంక షష్ఠితత్పురుషమునందును షష్ఠికి ద్వితీయాతుల్యత్వమును జెప్పుకొనిరి. ఇట షష్ఠీసమాసమును విధించుటచేఁ దత్సామర్థ్యమునఁ బూర్వప్రయుక్తమునకు షష్ఠీవిభక్తి కాఁగా సమాసమున దానికి ద్వితీయాతుల్యత యయి మమ్ము నిరువురను (నుగాగమము రానున్న మ మ్మిరువురను) అనరీతిగ నవునే కాని మాయిరువుర కని కాదు. అందుకే యిట్టి ద్వితీయ ప్రయోగవిరుద్ధము గావున సీనాతామున ఇత్యాదిగాఁ బూర్వపదము సర్వ యుండు నని వీ రటఁ బేర్కొనిరి. (సూ.౨౬౦) ఇటఁ గూడ నట్లె చెప్పకొని మాయిరు వురకు నని సాధింపవలెను.

షష్ఠీసమాసమును జెప్పి యిందువలన నపరూపము అగునందఁ బ్రయోగము సాధువుగ గ్రహింపవలె ననుకల్పనము ననుసంధించుటకంటె నిట యొక్క-షష్ఠిని విధించుకొనఁదగును గదా. అంతమాత్రమున మాయొక్క-యిరువుర కని యుండఁ బని లేదు. యొక్క- కెల్లయెడల లోపము చెప్పుచునే యుండిరి కదా. లాఘవ మగునట్టి మార్గ మనుసరింపక పెక్కు-క్లిష్టకల్పనలతో నున్న సమాసవిధాన మేల?

ఇవి సమాసములే యని నిర్ణయించుటకుఁ దగినయాధారము నిందు కీ దనవచ్చును మాయిరువురతో ననుచో ఇరువురతో నన్నది విశేషణమును నన్మదర్థకము విశేష్యమును ఇట విశేష్యము పూర్వప్రయుక్త మైనది. విశేషణవిధిచే సమాసము సిద్ధింపకపోదు గాని యట్లే చెప్పవలెనా? విశేషణముగనె విశేషిత మైనను సమాస మనియె చెప్పవలెనా?

'మాయిరువురకు' అన్నది సమాస మగుట యెంతను నిశితముగాఁ బరిశీలింపవలసి యున్నది.

'షష్ఠీసమాసముమాత్రమె' యని చెప్పుటవలనను, 'మే మిరువురతో— అను రీతిగల ప్రయోగములు లే' (పు.285)వనుటలోను, షష్ఠీసమాసము నిత్యమె యని వీరు తలఁచిరని తోఁచును. ప్రథమ లేనిమాట నిజమె యగుఁ గాక. 'మా కిరువురకు' అను రీతిని షష్ఠి యుండుటకు వీలు లేదా? ఇట్లు మమ్ము నిరువురను ఇత్యాదు లసాధువులా?

వీనియన్నింటికంటె (శృం.శా.4.146) వీని కన్నింటికిని (భాగ.10:పూ.405)

"సూరి యట్లు సూత్రించెనే కాని కొన్నియెడల నీవిధి ప్రవర్తిల్లనేరదు. మా యిద్దఱలో, మాలో నిద్దఱలో అనుచో మే మిద్దఱలో అనురీతిప్రయోగములు గన్పట్టలేదు. ఇట్లె మనయందఱలో మనమందఱలో అని సిద్ధింపనేరదు. (లక్షణముచే సిద్ధించును గాని యట్టిప్రయోగములు లే వని భావము) (వ్యా.సం.స.1077) ఇట మాయిద్దఱలో ననుదానితోపాటు మాలో నిద్దఱలో ననియుఁ జూపుట గమనింపఁదగును. షష్ఠీసమాసము నిత్య మని యెట్లు చెప్పి రిట. మాలో నిద్దఱలో నని వీరు చూపినది యసాధువా?

కాఁగా ప్రథమ మాత్రము రా దనియు విశేషణమునకు విశేష్యవిభక్తి యయి విశేషణవిశేష్యములలో ముందు ప్రయోగింపఁబడినదానికిఁ దాత్త్వికముగ యొక్కషష్ఠి యగు ననియుఁ జెప్పు టుచితము. వారు పదుగురిలో ననురీతి యసాధువులె యని సిద్ధయించుటకుఁ గవిప్రయోగములను బరిశీలింపవలసి యున్నవి.

ఇఁక నిత్యస్థలములను సాధించుటకు సూత్రమందలిబహుళపదము చక్కఁగా నుపయోగించును.

'సూరి యిట్టిషష్ఠీసమాసమునకు జూచికొన్నట్లె యగపడదు.' (పు.285) అనిరి వీరు.

విశేషణషష్ఠి-ప్రథమ :

'ఒకాదొకటో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు' (27) 'భవత్యర్థవ్యతిహాతంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు' (28)ననుసూరిసూత్రములు రెండింటిని

బాల.కార.28 సూత్రమును దృష్టియం దుంచుకొనియె వీరు దమసూత్రమున మొదటియంశమును జెప్పి రని గుర్తింపవచ్చును. ఇదియొత్తము సూత్రమునకు మూలభూతముగాఁ బరిశీలింపఁదగినది.

ఖ్యాద్యర్థవ్యవధానే తు భేదస్స్యాత్స్ఫులం భవే త్తను వి.వి.వచనము ననుసరించి వీరీ మొదటియంశమును జెప్పిరి. పూర్వసూత్రము (ఉ.కార.31)న నేర్పడినయిబ్బందులే కొన్ని యిచ్చటను నేర్పడుచున్నవి.

'ప్రథమాంతమును, ఇతరవిభక్త్యంతము నగును' అనురీతిగా విభక్త్యంతముగాఁ జెప్పుటకంటెఁ దత్తద్విభక్తు లగుటను జెప్పుట విధానమున కనుగుణము. 'ప్రథమాంత మగును' అనువర్ణనాపద్ధతికంటె దానికిఁ 'బ్రథమ యగు' ననురీతిని విధానము చేయుట యుక్తము గదా అవకాశము లేకున్నఁ దప్పు దేమో. ఇది నినవసరము.

విశేషణము ప్రథమాంతమును, విశేష్య మితరవిభక్త్యంతము నగు నని చెప్పుటలో విశేష్య మెప్పుడును బ్రథమాంతము గా దనునర్థమున కవకాశము గల్గుచున్నది. 'సుగుణాభిరాముఁ డగురాముఁడు' అనురీతిగా విశేషణము ప్రథమాంతము కాఁగా విశేష్యమును బ్రథమాంతమె యగుట దుష్టమా?

కర్తృత్వాదుల ననుసరించి విశేష్యమున కాయావిభక్తు లాయాశాస్త్రములచే సామాన్యముగా సిద్ధించును. కావున నిట విశేష్యముయొక్క విభక్తినిగూర్చిన ప్రసంగ మనవసరము.

ఇంక విశేష్యము ననుసరించి విశేషణమునకు నదే విభక్తియుఁ గావలసియుండఁగా నిట నట్లు గాక ప్రథమ మాత్రమె యగుటయె విశేషము. ఈయంశవిషయమును "ఖ్యాద్యర్థవ్యవధానమున విశేషణము ప్రథమాంత మగును" యని సూచించుటలో వరుసలివా రీయంశమును గుర్తించియే యుండిరి. అట్టియెడల విశేష్య మగువిశేషణము యొక్క విభక్తిమాద్పునుగుఱించి మాత్రమె యుపదేశింపఁదగియుండఁగా విశేష్యవిభక్తిని

గలిపి వీ రిట్లు విస్తరించిరి "భావద్యర్థకషష్ఠ్యర్థప్రధానమున విశేషణము ప్రథమాంతమును విశేష్య మితరవిభక్త్యంతము నగును. భావద్యర్థప్రత్యయప్రధానము లేకున్నను (అధ్యాహారము గావచ్చును.) నట్టికార్య మగుట కలదు. ఈవిధి షష్ఠీస్థలమునఁ దఱచుగ నగును" (ఉ.32.సూ)

ఈసూత్రమున మూఁడవయంశమున "ఈవిధి షష్ఠీస్థలమునఁ దఱచుగా నగు" ననిరి. —ఇట 'షష్ఠీస్థలమున' అన నేమి? వీరు సూరిగారి విశేషణవిభక్తులకుఁ బ్రథమ చెప్పినవారు గారు. ఇక విశేషణము ప్రథమయం దుండుట విశేష్య మితరవిభక్త్యంత మవుట అనునీవిధి షష్ఠీస్థలమునఁ దఱచు. కావున సూరిసూత్రము (కాల.27) ననుసరించి విశేష్యము షష్ఠ్యంత మయియుండఁగాఁ దదనుగుణముగా విశేషణమునకు షష్ఠి రాఁగా దానికిఁ బ్రథమ తఱచుగా నగు నని చెప్పకొనవలయును. విశేష్య మితరవిభక్త్యంత మన షష్ఠ్యంత మని యర్థము చేసికొనవలె. సూరిలక్షణమునందలిస్పష్టత వీరిలక్షణమున లే దనుట మాత్రము స్పష్టమె.

రెండవయంశమునబట్టి భావద్యర్థప్రత్యయసహితము గానపుడే యని వీరియభిప్రాయము గుర్తింపవచ్చును. భావద్యర్థప్రత్యయసహిత మయినపుడు ప్రథమ యెట్లు నిత్య మనక తప్పదు. ఇట భావద్యర్థప్రత్యయసహితము గాకున్నను నయ్యది యధ్యాహృత మగు ననిరి. రెండవయంశమున, ఇటఁ దఱ చనుటచేఁ దఱచుగా షష్ఠీస్థలమునఁ దఱుచుగా నధ్యాహృత మగు ననవలెనా? ఎల్లప్పుడు నధ్యాహృత మగునపు డెల్లయెడలఁ బ్రథమ రావలసి యుండఁగా నిటఁ దఱచుగా ననుట యెట్లు? షష్ఠ్యంతములు మొదలగుచోట్ల షష్ఠియే తఱచుగాఁ గానవచ్చుచున్నది.

సూరిలక్షణము సూక్తమె.

పరులవా రీసూత్రమును మూఁడంశములుగాఁ జెప్పియు నుదాహృతు లాక్రమములో నీలేదు.

'అతిదుష్కర మయినకేశవార్జునకృతిన్' అను వీరిమొదటిలక్ష్యము వీరి సూత్రమున మొదటియంశమునకే. కాని యాతరువాత నిచ్చిన 'ఆచార్యుఁడు ద్రోణునకున్' అనునది మూఁడవయంశమునకు లక్ష్యము. మఱియుఁ జివరి 'దగు'శబ్దవ్యాప్తము నిమ్మంచ

కొండకు 'మూఁడవయంశమునకు లక్ష్యము. ఉదాహరణపద్ధతిలోఁ జూపిరేమో. ఆచార్యుఁడు ద్రోణునకున్ అనునది చివరఁ జూపిన గ్రమముగా నుండెడిది.



'భుజాటోపభయంకరుఁ దర్జునకోపానలము అనుచో నయ్యది యొక్కవిభక్తి లోపించినవ్యస్తపదవ్యూతపదము'(పు.339)గా నిశ్చయించుచు వీరు ప్రౌఢ.కార 21 అనవసర మనిరి. "విశేష్యస్యాభిన్నత్వేఽపీదం విశేషణమే ప్రఫలదుఁ ద్వైనయొక్క- తులపాంసనుచేసి' దాన— ఇత్యాచార్యోక్తిరత్ర మానమ్. (కవిశి.) అని యహో. వాక్యములను ప్రౌఢ.లక్షణమున కాధారము గానచ్చును.

సమాస మనుటకు వీలు లేనియెడల వ్యస్తతలో యొక్కలోపించిన దనఁదగును' కాని యెల్లయెడల వ్యస్తము లని యెందుమూలమునఁ బ్రౌఢ.లక్షణ మనవసర మను చేలః ఆది తగదు కూడ. రామునిబాణము నీగుణములు ఇత్యాదులును వ్యస్తము లని వ్యస్తతలోనె యొక్క లోపించు నన్న షష్ఠికి ద్వితీయాతుల్యత మొద లగుసమన్వయ మేలః 'రామునాజ్ఞ' ఇత్యాదులనుబట్టి యవి సమాసములే యందురాః సమాసమునకే కదా నుగాగమము చెప్పఁబడినది. (సంధి.?4) అట్లే యిటఁ గూడ నుందురుఁ దమ్ముతునాన నము ఇత్యాదిగాఁ బ్రయోగించుట విరుద్ధమాః ఇట్టిప్రయోగములు పరిశీలింపవలె.

ప్రౌఢ.కార.12లక్షణమును బ్రత్యాఖ్యేయ మనిరి వీరు. "నన్నుఁ గొన్నివెడ మాటలాడుమ నతఁడు చెట్టపట్టెకన్ అని వాక్యన్యాయసిద్ధముగా నన్వయింపవచ్చును గదా." (పు.239)(మూ.త్రి.శే.)

రాముతమ్ముఁన్ లవుండు— చాపముం దునుమ— నరసూను సహుడు ఎద సించిన— అనున వాసూత్రమునకు లక్ష్యములె. ఇట యొక్కవిభక్తి లోపించిన దనియు (ఎట్లును లోపించు ననియె వీరు చెప్పుదురు.) అర్థవిశేషబోధకముగా నుశబ్ద ప్రయోగము కల్గిన దనియు (వ్యా.సం.స.1080, వీరు సం.లోఁ జేసినసమన్వయము సముచితముగాఁ గానరాదు. ఇట్టియసహజకల్పనము చేయు టేలః వానిని సాధించు లక్షణము నిరాధార మన నేలః

గూర్చి చెప్ప నేల? అందుకే సూరి వి.వి.లక్షణము ననుసరింపక విశేషణము ప్రథమనే సూత్రించెను.

సూరి 'యగు' (కార.28) ననఁగా వీరు వికల్పముగా నగు ననుట యిం కొక విశేషము. దీనిచే సుగుణాభిరాముఁ డగురాముఁ డనురీతిగా విశేష్యము ప్రథమాంతమైయుండుట వైకల్పికముగా సాధు వగు నేమో. పక్షాంతరమున నెట్లు? ఇది మూలమగువి.వి.లక్షణమునకును విరుద్ధమే. దీనివలన భ్వాద్యర్థవ్యవధాన మున్నపుడు గూడ విశేషణము వికల్పముగాఁ బ్రథమాంతము గాకుండుట కవకాశము గల్గుచున్నది. 'సుగుణాభిరాముని నగురాముని' ననురీతిగా విశేష్యమువలెనె విశేషణము నితరవిభక్త్యంత మగును. ఇంకను బ్రథమేతర మయినఁ జాలును. విశేష్యవిభక్తియే యుండఁ బని యేమి? అపుడు సామాన్యవిధి (ఉ.కార.29) నాశ్రయింపవలెను. అటఁ గూడ వీరు ప్రాయిక మనిరి. విశేష్యము విభక్తిని గూడఁ (విశేషణవిభక్తివలె) బ్రస్తావించిరి గాన సుగుణాభిరాముఁ డగురాముఁడు జోహారు సేసెద' నన్న వీరియాలక్షణమునకు విరుద్ధ మనరాదు.

ప్రథమాంత మగుట సార్వత్రిక మని (వ్యా.సం.స.1078) వీర చెప్పిరి.

కాఁగా సూరి 'విశేషణంబులకుం బ్రథమ యగు' నని చేసినవిధానమె యెంతయు సమంజసము. సూరి(28)సూత్రము సిద్ధాంతానువాదక మను(వ్యా.సం.స.1084)నభిప్రాయము సరి కా దని వీరియీసూత్రములోనిమొదటియంశమె నిరూపించుచున్నది. ఇది విశేష మనియె కదా వీరు చెప్పినది.

సూరి భవత్యర్థక మనఁగా వీరు భ్వాద్యర్థక మనిరి. భూధాతువును శ్తిబంతముగా సూరి 'భవతి' యని నిర్దేశించెను. వీరు భూ + అడి... భ్వాది యని వి.వి.ననుసరించి భవతీతరార్థకవ్యవధానమును జేర్చిరి. ఆదిశబ్దమునకుఁ బ్రయోజనమును వారె యిట్లు పేర్కొనిరి. "భ్వాద్యర్థవ్యవధాన మనుచోటియాదిశబ్దముచేత సుగుణాభిరాముఁ డని యొప్పఁబడిన రాముఁడు —పుణ్యశ్లోకుఁ డనఁగ యజ్ఞనిరతుఁ డనఁగఁ దనరినవాలు భార్యను ——దమయంతి మున్నగుస్థలములు సంగ్రహింపఁబడుచున్నవి' (ఉ.238)

ఇందు మీరు చూపినస్వీయోదాహరణ మిటఁ జూపఁదగినదే కాదు. 'సుగుణాభి రాముఁ డని యెన్నఁబడినరాముఁడు' అనుచో విశేష్య మగు'రాముఁడు' అనునది ప్రథమాంతమె యగుటచే 'అని యెన్నఁబడిన' అనుదానితో వ్యవధానము లేకున్నను విశేషణ (సుగుణాభిరామ)శబ్దము ప్రథమాంతమె కావలసియున్నది. కాన నిది ఉ.కార.29 సూత్రమున కుదాహరణముగా మీరు చూపుకొనఁదగు. సుగుణాభిరాముఁడు (అని యెన్నబడిన) రాముఁడు. కావున నిట 'నాది'శబ్దముచేఁ బ్రథమ యైన దనుట ప్రమాదము.

'పుణ్యశ్లోకుఁ డనఁగఁ ——నలుభార్యను' అను రెండవయుదాహరణమున -'నలుయొక్క-భార్యను' అనుచో నలుయొక్క యను (సమాసగత?)షష్ఠ్యంతవిశేష్యము ననుసరించి విశేషణమునకు షష్ఠి యగును. కాఁగా నిటఁ బ్రథమ షష్ఠి కైన దనవలె. విశేషణములషష్ఠికి భావత్కర్తృముతో వ్యవధానము లేకున్నను బ్రథమ యగును గదా. ఆయంశము నిటనె మీరు పైని పేర్కొనియున్నారు. అట్టియెడల నాప్రథమమాత్ర మాది శబ్దముచే సంగ్రహింపఁబడినట్లు చెప్పుట యెట్లు? ఇట్టిదే నిర్మలయశుండగుధర్మతనూజు పాలికిన్ (వ్యా.సం.స.1082)అన్నదియు. ఈయుదాహరణములకొఱకె యైన 'నాది శబ్దము వ్యర్థమే '—మున్నగున' వెట్టివో?

దీనికి మీ రుదాహరింపవలసినతీ రిదిగాదు. 'సుగుణాభిరాముఁ డని యెన్నఁబడిన రామునిచేత- పుణ్యశ్లోకుఁ డనఁగఁ దనరిన నలునికొఱకు అనురీతిని జూపుకొనవచ్చును. కాని యివియు నిట లక్ష్యములు గానేరవు.

'సుగుణాభిరాముఁడు' అని యెన్నఁబడిన- అనుచో "అని" యనున దనుకరణ మనుట స్పష్టము. పుణ్యశ్లోకుఁ డనఁగ ననుచోఁ గూడ నిట్టే కదా. ఇట ననుకరించు నపు డనుకృత మవుశబ్ద మీవిభక్తిలో నుండవలె నని నియమ మెట్లు? జనులు రాముని 'సుగుణాభిరాముఁడు' అనియె యెన్నుదురు. కావున ననుకరణమున నది యట్లే గ్రహింపఁబడవలెను. లేనిచో ననుకరణ మెట్లు కుదురును?

ఇట్టిది కానిది వే జొకటి మీరు వ్యా.సం.స.లోను జూపలేదు. ఇంకను నట 'అది శబ్దముచే అనుధాతువుమున్నగునవి గ్రాహ్యములు' (వ్యా.సం.స.1081) అనిరి. 'అను'

అనుకరణమందలిది. అట ననవసరము. మున్నగునవి యని యట నిటను పేర్కొనిరి. వివరింపలేదు. ఉదాహరింపనులేదు. ఇఁక నాదిశబ్ద మేల?

ఇంక నిట నిం కొకయనర్థమును. వీ రీసూత్రమున 'వికల్పముగ నగు' ననిరే, వైకల్పిక మవుటచేఁ బ్రథమ రానిపక్షమున "సుగుణాభిరామునిచేత నని యున్నఁబడు రామునిచేత నని యుండునా? వికల్ప మనుట యెట్లు ననర్థకమె.

కా గా 'ఆది'పదగ్రాహ్యము లైనవి యేవియుఁ గానరావు. కాఁగా సూరి ష్యాద్యర్థవ్యవధానే తు అనుచోటియాదిశబ్దమును బరిహరించి భవత్యర్థకములను మాత్రమె పేర్కొనుట యుక్తమె కదా.

అమధాతుజరూపములతో వ్యవధాన మున్నపుడు ప్రథమ విధించుట యవసరమె ఏ లన నవి బాల.29,31సూత్రముల ననుసరించి యనుప్రయుక్తము లైనవి. (వీని లేకున్నను నర్థభంగము లేదో యనుప్రయుక్తము లగును గదా (ఉ.212) అందులకే యట్టివ్యవధాయకము లైనయనుప్రయుక్తశబ్దములను దొలఁగింపఁగా విశేషణమునకు విశేష్యవిభక్తి యవుట విరుద్ధము గాలేదు. సుగుణాభిరాముఁ డగురామునిఁ గొల్తు ననుచో సుగుణాభిరాముని రామునిఁ గొల్తు ననవచ్చును గదా.

ఆదిశబ్దముచే గ్రహింపఁదగు నని వీరు చూపినయనుకరణస్థల మట్టిది గాకుంట గమనింపవచ్చును. పుణ్యశ్లోకుఁ డనఁగఁ దనరిననలునికొఱకు అనుచో పుణ్యశ్లోకుని కొఱకు, నలునికొఱకు అన్నఁ బై వాక్యము నందలియర్థము సిద్ధించునా?

దీనితోపాటు భవత్యర్థకమును వాక్యమున నన్వయించుపద మని తలఁచియుండు టచేఁ గాఁబోలు వీ రనుకరణమును గూడ నిందుఁ జేర్చిరి. భవత్యర్థక మనుప్రయుక్తమె యని పైని గమనింపఁగలము.

మొత్తముపైని భవత్యర్థవ్యవధానమును మాత్రమె చెప్పి విశేషణముల ద్వితీయకుఁ బ్రథమ నిత్యముగాఁ జెప్పినసూరిలక్షణమే సమంజసము.

